# చిత్‌శక్తి విలాసము

ఆధ్యాత్మిక ఆత్మకథ

స్వామి ముక్తానంద పరమహంస







స్వామి చిద్విలాసానంద

ప్రస్తావన సహితము



చిత్‌శక్తి ప్రకాశనము

చెన్నై (తమిళనాడు) భారతము

మొదటితెలుగు ప్రచురణ 1999, చిత్‌శక్తి పబ్లికేషన్స్, చెన్నై ద్వారా, కాపీరైటున్న ప్రకాశకుల అనుమతితో.

ముద్రణ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్, హైదరాబాదు, ఆం. ప్ర.


Published by Chitshakti Publications, Chennai, T.N. under license from copyright holders.
Printed at Kala Jyothi Process Ltd., Hyderabad, A.P.
First Edition : March 1999

Rs. 125/-

ISBN :81-85501-04-1

# విషయసూచిక

## ద్వితీయ ఖండం - సిద్ధాను శాసనము

# చిత్ర సూచిక



భగవాన్ శ్రీనిత్యానంద

# సిద్ధపరంపర

ప్రాచీనకాలం నుంచి ఈనాటి వరకు, అజ్ఞాన–మోహ అంధకారాన్ని నాశనం చేస్తూ ఉన్న మణిదీపాల హారం ఒకటి ఉంది. ఈ మణిదీపాలు నిజానికి ఏమిటి?

అనంతకోటి సూర్యుల ప్రకాశానికి సమానమైన తేజస్సు కలిగిన సర్వజ్ఞులు, ఎటువంటి పనినైనా చేయగల సామర్థ్యంకల యోగులు. వారినే సిద్ధులు అని వ్యవహరిస్తారు.

సిద్ధుల పరంపర ఒకటి ఉంది. భుక్తిని ముక్తినికూడా ప్రదానం చేయగల ధార. పరమ శివుడినుంచి ఆరంభమై, అనేక మంది సిద్ధుల ద్వారా ప్రవహిస్తూ, ఈ నాడుకూడా వరాలను ప్రదానం చేస్తూ ఉంది. సిద్ధుల ఈ అఖండ పరంపరలో భాగంగా శ్రీ గురువు, తన శిష్యుడికి ఈ పరంపరకు చెందిన శక్తిని లేదా అధికారాన్ని అందచేస్తూ వస్తున్నారు.

ఒకనాడు ఆత్మతృప్తుడు ఆత్మమగ్నుడు అయిన ఒక సిద్ధ మహాపురుషుడు, మహారాష్ట్రలోని ఒక గ్రామంలో ప్రవేశించాడు. సర్పాలు, అడవులు బురదతో నిండిన గణేశపురి అన్న గ్రామంలో ఆయన నివాసం ప్రారంభించాడు. కొన్నిరోజులలోనే ఆ గ్రామం, పరశువేది తగిలినట్లు, పూర్తిగా మారిపోయింది. ఈ మహాపురుషుడు, అవధూత నిత్యానంద. ఆయన సమక్షంలోకి వచ్చే ప్రతి ఒక్కరి సమస్య, తీరిపోయేది; కోరికలు తీరేవి; మనస్సు శాంతపడేది; భగవాన్ నిత్యానందుడి శిష్యత్వమేర్పడేది. భగవాన్ నిత్యానంద దర్శనార్థం వెళ్లే అసంఖ్యాకమైన భక్తుల్లో ఒకరోజు, ఒక సన్యాసి, స్వామి ముక్తానందకూడా ఉన్నారు. ఆయన భగవాన్ నిత్యానంద శరణు పొందడంతో, ఒక్క భారతదేశానికే కాదు, మొత్తం ప్రపంచానికే ఒక కొత్త స్వర్ణయుగం ప్రారంభమైంది.

స్వామి ముక్తానంద, మంగళూరు దగ్గర ఒక పల్లెలో 1908 లో జన్మించారు. చిన్ననాటినుంచి, సాధు–సన్యాసుల కథలు వినడంలో, సత్సంగంలో ఆసక్తి ఉండేది. సంపన్న కుటుంబం. ప్రేమించే తలిదండ్రులు. అయినప్పటికీ ఆయన వీటన్నిటికీ



స్వామి ముక్తానంద పరమహంస

విముఖంగా ఉండే వారు. సుఖ సంతోషాలు ప్రేమాభిమానాల బంధనాలు బలహీనమై తెగిపోయాయి. ఆయనకొకటే ధ్యాస. భగవంతుడిని సాక్షాత్కరింప చేసుకోవడం, ఆత్మసాక్షాత్కారం చేసు కోవడం. ఆ విధంగా ఉంటూ, 15 సంవత్సరాల వయసులో, తనను తాను తెలుసుకునేందుకు ఇంటి నుంచి బయటపడ్డారు.

మొదటి మజిలీ సిద్ధారూఢస్వామి ఆశ్రమం. అక్కడే ఆయనకు సన్యాస దీక్ష, ''ముక్తానంద'' అన్న పేరు లభించాయి. ఆ తర్వాత 20 సంవత్సరాలపాటు ఆయన భారతదేశమంతటా పరిభ్రమించారు. అరవైమందికి పైగా స్వాములను కలుసుకున్నారు. కఠోర తపస్సు చేసిన రోజులవి. ఎన్నో పరీక్షలు. అంతరాత్మ పరిశుభ్ర పడిన రోజులవి. ఆత్మ సాక్షాత్కారం చేసుకోవాలన్న తపన నానాటికీ ఎక్కువవుతూ ఉంది. ఈ యాత్ర అంతిమఘట్టంలో, బంగారాన్ని పోలిన, తపస్సు చేత పవిత్ర మైన హృదయంతో స్వామి ముక్తానంద, గణేశపురిలో భగవాన్ నిత్యానంద శరణు పొందారు. చిన్ననాడు, ఆయన భగవాన్ నిత్యానందను క్షణకాలం దర్శనం చేసుకున్నారు.

సిద్ధ యోగంలో, సిద్ధగురువు, దృష్టి – శబ్దం – స్పర్శ లేదా సంకల్పం ద్వారా శిష్యుడిలో నిద్రాణంగా ఉన్న కుండలిని శక్తిని జాగృతం చేయగల శక్తి సంపన్నుడు. దీనిని ''శక్తిపాతం'' అంటారు. ఆ తర్వాత ఈ మహాయోగం, స్వయంగా క్రియాశీల మౌతుంది. దీనికి గురుకృప అవసరం.

భగవాన్ నిత్యానంద యొక్క అనుగ్రహకారిణి శక్తి, స్వామి ముక్తానందకు దివ్యమైన శక్తిపాతాన్ని కలిగించింది. బయటి ప్రపంచంలో అంతవరకు జరిపిన యాత్రలు ముగిశాయి. అంతరంగంలో దివ్యమైన యాత్ర ప్రారంభమైంది. సంవత్సరాల తరబడి, అనేక రకాలైన అలౌకికమైన అనుభవాలు, ఊహించరాని, ఇంద్రియాతీతమైన అనుభూతులు, ఆయన్ను ఆత్మసాక్షాత్కార ద్వారానికి చేర్చాయి. 1956 లో ఆయన తన సాధన అంతిమ ఘట్టాన్నికూడా పూర్తిచేశారు. దూరంలో తమ నివాసంలో కూర్చుని ఉన్న సర్వజ్ఞులైన భగవాన్ నిత్యానంద, ఆనందం పట్టలేక, లేచి నాట్యమాడసాగారు: ''ముక్తానంద పరమహంస అయిపోయాడు'' అంటూ. 1961 లో మహాసమాధి పొందేముందు భగవాన్ నిత్యానంద, స్వామి ముక్తానందకు, తన గొప్ప దైన విభూతిపూర్ణమైన ఆధ్యాత్మిక శక్తిని, సిద్ధపరంపరాగత అధికారాన్ని ప్రదానం చేశారు.

గణేశపురి ఆశ్రమానికి శంకుస్థాపన జరిగింది. దేశ-విదేశాల నుంచి వచ్చే భక్తజనుల పంక్తులు, మాలలుగా మారేవి. 1970లో బాబా ముక్తానంద మొదటిసారిగా విదేశయాత్రకు వెళ్లారు. ప్రపంచవ్యాప్తంగా ధ్యానక్రాంతికి అంకురార్పణ చేశారు. ఆయన అత్యంత శక్తివంతమైన ఆధ్యాత్మిక అయ స్కాంతం. ఈ భూమండలంలోనే సర్వశ్రేష్ఠమైన గురువు కాగలడని ఆయన నుదుట వ్రాసే ఉన్నది. అందుచేత దానికిగాను ప్రత్యేకంగా ప్రయత్నం చేయవలసిన అవసరం లేకపోయింది.

బాబా ముక్తానంద అసమానమైన సాధన సంపన్నుడు. దానికి తోడు, గురువు యొక్క ఆదేశ బలం ఉంది. ఆయన ప్రతి శబ్దము, ఆలోచన,చర్య అన్నీ గురువు యొక్క ఆజ్ఞను పాలించేవే. ప్రపంచవ్యాప్తంగా ధ్యానక్రాంతి చక్రగమనం ప్రారంభమైంది. అనేక ఆశ్రమాలు, వందలాది ధ్యానకేంద్రాలు ఏర్పాటయ్యాయి. ప్రపంచవ్యాప్తంగా ఒక కొత్త ఆధ్యాత్మిక చిత్ర పటం రూపొందడం ప్రారంభమైంది.

గణేశపురి ఆశ్రమంలో భవిష్యత్తుకు సంబంధించిన కార్యకలాపాలు ఎంతో సంభ్రమంగా జరుగుతున్నాయి. అక్కడ అతి ముఖ్యమైన సంఘటన ఒకటి జరుగుతూ ఉంది. అయిదు సంవత్సరాల లేత వయసునుంచి, తేజస్వి మేధావి అయిన ఒక బాలిక ఆశ్రమానికి వచ్చేది. బాబా ముక్తానంద పాదాల దగ్గర కూర్చుని ఉండేది.

ఆమె, బాబా ముక్తానంద యొక్క అలౌకికమైన ఆధ్యాత్మికమైన రూపకల్పన. ఆమె గురించి బాబా ఒక సారి ఈ విధంగా అన్నారు: ''ఈమె ఒక జ్యోతి: ఒకరోజు యావత్ ప్రపంచాన్నీ తేజోమయం చేస్తుంది.''

పరమ సౌభాగ్యవతి అయిన ఈ శిష్యురాలికి తన ప్రియతమ గురువుయొక్క సంపూర్ణమైన ప్రేమ, మార్గదర్శనం, సంపూర్ణమైన అనుగ్రహము లభించాయి. బాబా ముక్తానంద ప్రేమ ఎంతో మృదు మధురమైనది. అదే సమయంలో క్రమ శిక్షణ – ఆజ్ఞా పాలనం – దైనందిన అభ్యాసాల విషయంలో కఠినంగాను గమనిస్తూ ఉండేవారు. గొప్ప గురువుకు తగిన గొప్ప శిష్యురాలు. కఠిన పరీక్షలన్నిటికీ తట్టుకుని, తన తపస్సు – గురు ప్రేమ– పట్టుదల బలంతో పూర్ణత్వాన్ని సాధించ కలిగింది. 1982 లో మహాసమాధి పొందేందుకు కొంత ముందు బాబా ముక్తానంద, తన శిష్యురాలిని శాస్త్రోక్తంగా స్వామి ''చిద్విలాసానంద'' నామంతో అలంకరించారు. ఆ తర్వాత సిద్ధపరంపరానుగత శక్తిని అధికారాన్ని, పూర్తిగా ఆమెకు ప్రదానం చేశారు.

## ౧౨. చిత్‌శక్తి విలాసము

1982 అక్టోబరు 2వ తేదీన బాబా బ్రహ్మలీనమైన తర్వాత ఆదిశక్తి రూపమైన గురుమాయి చిద్విలాసానంద యొక్క బహుముఖమైన శక్తి అతి త్వరితంగా క్రియాశీలమైంది. ఆమె సిద్ధపీఠానికి ఆధిపత్యం వహించి, సిద్ధయోగ బాధ్యతను స్వీకరించిన తర్వాత కొత్త ఆశ్రమాలు కొత్తగా వందలాది ధ్యానకేంద్రాలు ఆవిర్భవించాయి. లక్షలాది జిజ్ఞాసువులు భక్తుల జీవితాలు పూర్తిగా పరివర్తన చెందాయి.

శ్రీ గురుమాయి, గురువునుంచి లభించిన ధ్యానక్రాంతి ధ్వజాన్ని చేత ధరించి ముందుకు సాగుతున్నది. ఇది ప్రశాంతమైన క్రాంతి. క్రాంతికాని క్రాంతి. అంతరంగ అన్వేషణ. గురుకృపా శక్తి సహాయంతో భగవంతుడిని తన అంతరంలోనే దర్శించుకోవడం. సంఘర్షణలతోకూడిన ప్రస్తుత యుగంలో శ్రీ గురుమాయి ఒక అచలమైన ఆలంబనం; అతలకుతలమైన జీవనసాగర మథనంలో గట్టి స్తంభం; అలసిపోయిన మానవాళికి చల్లటి ఆశ్రయం; ముముక్షువులకు ముక్తిద్వారం.

# ప్రస్తావన

గ్రంథనామమే గ్రంథ విషయాన్ని సూచిస్తుంది. చిచ్ఛక్తి విలాసము! శక్తి యొక్క స్వేచ్ఛ విహారానికి రంగభూమి. చిచ్ఛక్తి యొక్క ఆహ్లాదకరమైన సంగీతం. బాబా ముక్తానందకు పరమోత్కృష్టమైన స్థితిని ప్రదానం చేసి ఆయన జీవిత పర్యంతం ఆ ఉన్నత స్థితిలో ఆయన్ను ప్రతిష్ఠింప చేసిన ఆయన అనుభవాలు అనుభూతులతో కూడిన గాథ, ఈగ్రంథం.

ఋషులు -మునులు, సాధు-సన్యాసులు, మహాపురుషులు, ఆత్మ-పరమాత్మ, సాధన, గురువు-శక్తిపాతం, వంటి ఆధ్యాత్మిక -విషయాల గురించి విపులంగా విస్తారంగా వ్రాసి ఉన్నారు. వాటి అధ్యయనం వల్ల సాధన గురించి, సాధనవల్ల ప్రాప్తమయే స్థితిగురించి పూర్తిగా తెలుస్తుంది. కాని, దుర్లభమైన పుణ్యక్షేత్రం యొక్కచిత్రపటంచూచినంత మాత్రంచేత లేదా అక్కడికి చేరుకునే మార్గం గురించి పూర్తిగా తెలుసుకున్నంత మాత్రం చేత, ఆ పుణ్యక్షేత్రాన్ని చేరుకునేలోపున, చేరుకున్న తర్వాత యాత్రికుడి అంతరంలో కలిగే అనుభూతులు, ఎదురయే పరిస్థితుల గురించి మనకు తెలియదు. అందుచేత, సాధన చేసేకాలంలో ఆత్మసాక్షాత్కారమయే క్షణాల్లో, యోగి యొక్క అంతర్ స్థితి ఏవిధంగా ఉంటుంది, స్వానుభవం ఏవిధంగా ఉంటుంది అన్న విషయం గురించితెలుసుకోవాలని జిజ్ఞాసువులకు బలవత్తరమైనకోరిక ఉండడం సహజమే.

సిద్ధ సద్గురువు భగవాన్ నిత్యానంద నుంచి లభించిన శక్తిపాతం ఫలితంగా స్వామి ముక్తానంద సాధన, అత్యంత అద్భుతమైన లోకాలకు దారితీసింది. ఆశ్చర్యకరమైన అనుభవాలు ఇంద్రియాలకు అతీతమైన అనుభూతులు, స్వయంగా ముక్తానంద స్వాములవారికే ఊహించరానివిగా ఉండేవి. అందు చేతనే, తమ సాధనా కాలంలోని అనుభవాలను, జరిగిన వాటిని జరిగినట్టుగా తు.చ. తప్పకుండా అక్షరబద్ధం చేయడం, ఆధ్యాత్మిక మార్గంలో సాధన చేస్తున్నవారికి వరదానం. ఈ దృష్ట్యా ఈ గ్రంథం, ఆధ్యాత్మిక సాహిత్యంలోనే విలక్షణమైన, శక్తి సంపన్నమైన ఒక గొప్ప రచన.

౧౪ చిత్‌శక్తి విలాసము

''చిత్‌శక్తి విలాసము'' లో బాబా ముక్తానంద, తమ స్వానుభవాలను వర్ణించారు. అందుచేత ఈ గ్రంథం, ప్రాచీన శాస్త్రాలు–మతసంబంధమైన గ్రంథాలకు పూర్తిగా భిన్నమైనది. సాధకులకు అందరికీ ఆధ్యాత్మిక అనుభవాలు ఒకేరీతిగా ఉండవు. అన్ని జల ప్రవాహాలు ఒకటిగా ఉండవు. రెండు అగ్ని జ్వాలలు, రెండు అలలు లేదా రెండు మేఘాలు, ఒకదానిని పోలి మరొకటి ఉండవు. సిద్ధ యోగ సాధన, చిచ్ఛక్తియొక్క స్వతహాగా జరిగేక్రియ. బాబాకు సాధన కాలంలో జరిగిన అనుభూతులుకూడా, చిన్మాతనృత్యంలో క్షణక్షణం కొత్త ముద్రలు కనిపించేవిధంగానే, ఆశ్చర్యకరమైనవి. విశిష్టమైనవి. శివ సూత్రాలలో చెప్పిన విధంగా. **''విస్మయో యోగ–భూమికా...''** ధ్యానయోగాభ్యాసంలో ప్రతి ఒక్క స్థితి, ఎంతో ఆశ్చర్యకరమైనది.

సాధనలో ఒక్కొక్క ఘట్టము పరమసత్యంలో ఒక భాగము లేదా ఒక కళ. సత్యానికి అనేక రూపాలున్నాయి. అందుచేత సాధకుల అనుభూతులలో భిన్నత్వం గోచరిస్తుంది. ఈ గ్రంథంలో వర్ణించిన అనుభూతులే సాధకులందరికీ కలుగుతాయని భావించరాదు. చాలామందికి ఈ అనుభవాల్లో ఒకటి కూడా ఉండక పోవచ్చు. అంతమాత్రంచేత తమ సాధనలో ప్రగతి లేదని అనుకోరాదు. ఒక్కొక సాధకుడి అవసరానికి తగినట్టు అనుభవాలు కలుగుతాయి. జాగృతమైన కుండలిని శక్తి సాధకుడిని శుభ్రపరుస్తుంది; సాధకుడి పురోగతికి అవరోధంగా ఉన్న పురాతన సంస్కారాలను, మలదోషాలను నాశనం చేస్తుంది. ఒక్కొక్క సాధకుడి సంస్కారాలు మరొక సాధకుడి సంస్కారాలకన్న భిన్నమైనవి. అందుచేత శుభ్రంచేసే ప్రక్రియ కూడా భిన్నంగా ఉంటుంది. ఉదాహరణకు ప్రతి ఒక్కరికి అత్యంతవేగంగా జరిగే శారీరిక క్రియలు అవసరం కాకపోవచ్చు. శక్తి పూర్తిగా చైతన్యమైనది; ఒక్కొక్క సాధకుడి అవసరానికి తగినట్టు అనుభవాలను ప్రదానం చేస్తుంది. భోజనం విషయంలో రుచులు విభిన్నంగా ఉన్న విధంగానే, బాబానుంచి ఈ ప్రసాదం లభించినవారందరికీ విభిన్నమైన అనుభవాలుంటాయి.

మనదేశం ప్రాచీనకాలం నుంచి ఋషులు మహర్షులకు ప్రసిద్ధం. ఇప్పుడు కూడా అటువంటి మహాత్ములున్నారు. ఇకముందుకూడా ఉంటారు.

కృష్ణభగవానుడు గీతలో చెప్పాడు :

**యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత,**
**అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానమ్ సృజామ్యహమ్॥**

''ఓ అర్జునా! ఈ ప్రపంచంలో ధర్మం నశించి అధర్మం విజృంభించినపుడు నేను అవతరిస్తాను. (స్వయంగా దేహాన్ని ధరిస్తాను.)''

**పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతాం,**
**ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

''సజ్జనుల సంరక్షణకు దుర్జనుల వినాశానికి, ధర్మసంస్థాపనకు, నేను ప్రతి యుగంలో అవతరిస్తాను''.

ఇదే జరుగుతూ వచ్చింది. మానవ హృదయంలో చిమ్మచీకటి అలుము కున్న ప్రతి సందర్భంలోనూ భక్తుల ఆర్తనాదాన్ని మన్నించి, మహాత్ములు అవ తారమెత్తి వారికి మార్గాన్ని చూపించారు. మనదేశంలో చాలామంది సిద్ధ పురుషులు తాము పొందిన దివ్యమైన అనుభూతులను ఆనందాతిరేకంలో అభంగాలలోనూభజన కీర్తనల్లోనూ వర్ణించి ఉన్నారు. స్వామి ముక్తానంద పరమహంస ఇరవయ్యోవ శతాబ్దానికి చెందిన ఇటువంటి మహాత్ములలో ఒకరు. బాబా తమ ప్రపంచ పర్యటనల్లో, సంత్‌తుకారామ్–జ్ఞానేశ్వర మహరాజ్, కబీర్‌దాస్‌ల అభంగాలను భజనలను పాడి వినిపించి శ్రోతలను మంత్రముగ్ధ లను చేసేవారు.

శ్రీజ్ఞానేశ్వరమహారాజ్ తమ ఆత్మసాక్షాత్కార అనుభవాన్ని ఈ విధంగా వర్ణించారు.

**ఆజి సోనియాచా దిను ।**
**వర్షే అమృతాచా ఘను ॥**
**హరి పాహిలారే హరి పాహిలారే ।**
**సబాహ్యాభ్యంతరీ అవఘావ్యాపక మురారీ ॥**

''ఈవేళ శుభదినం. అమృతం వర్షిస్తూఉంది. ఈవేళ హరి దర్శనమైంది. శ్రీహరి (మురారి) సర్వవ్యాపకుడు''.

శక్తి భరితమైన ఈ పదాలను చదివినపుడు శరీరం గగుర్పొడుస్తుంది. ఈ గ్రంథం ద్వారా బాబా మనకు, ఒక సువర్ణ దినాన్ని ప్రదానం చేస్తున్నట్టు మనం భావిస్తున్నాం. నిజానికి గురుకృప యొక్క కిరణాలు, లోపలా వెలుపలా ఉన్న అంధకారాన్ని తొలిగించి, చైతన్యమైన, ముక్తిమార్గానికి ద్వారాన్ని తెరుస్తున్నాయి.

''గురుబిన కౌన్ బతాయే బాట్'' అన్నారు కబీరుదాస్

గురువుతప్ప అన్యులెవరు చెప్పగలరు మార్గం?

ఇది సత్యం. గురుకృపతోనే సాధన ప్రారంభమౌతుంది, గురుకృపవల్లనే సాధన స్థిరపడుతుంది, వృద్ధిచెందుతుంది, చివరకు గురుకృపవల్లనే సాధన పరిపూర్ణమౌతుంది.

1969వ సంవత్సరం వేసవిలో బాబా, కొంతమంది భక్తులతో కలిసి మహాబలేశ్వర్ వెళ్లారు. అక్కడ అంతరశక్తి ప్రేరణతో ఈ గ్రంథ రచన ప్రారంభమైంది. బాబా, చెబుతూ ఉండగా భక్తులు వ్రాసుకున్నారు.

చిచ్ఛక్తి విలాసము, బాబాయొక్క అత్యద్భుతమైన జీవితం గురించి మనకు తెలియచేస్తుంది. ఇది ఆయన మనకు ఎంతోకరుణతో ఇచ్చిన ప్రసాదం. ఆయన రహస్యమయమైన మహనీయమైన జీవితంలోని కొన్ని ఘట్టాలను మనం ఈ గ్రంథం ద్వారా చూడగలగడం మన భాగ్యం.

మరొక ముఖ్యమైన విషయం: గ్రంథంలో వర్ణించిన తమ అనుభవాలు, ఇతరులకు సాధ్యం కాదని బాబా ఎన్నడూ చెప్పలేదు. ఆయన ఎప్పుడూ అనేవారు: ''గురు ప్రసాదం లభించిన తర్వాత సాధకులకు ఈ అనుభవాలు స్వతహాగా జరుగుతాయి'' అని. బాబా ఒకగొప్ప సద్గురువు. ఆయన అమృతవాణి, ఆయన మహనీయమైన జీవితగాథ సాధకులకు నిరంతరం అండగా ఉంటాయి, వారి సాధనకు తోడ్పడతాయి. అటువంటి మహా పురుషుడి దర్శనం చేసుకోవడం మన సౌభాగ్యం. ఈ నాడుకూడా ఆయన్ను దర్శనం చేసుకో కలుగుతున్నాం. అసంఖ్యాక భక్తుల హృదయాల్లో ఆయన విరాజమానమై ఉన్నారు.

– స్వామి చిద్విలాసానంద.

# మంగళవచనము

తన కృపాకటాక్షముచేత సకల అరిష్టములను తొలగించి,సర్వ శుభములను అనుగ్రహించు పరమ గురువు నిత్యానంద చరణకమలములకు నా నమస్కారము.

పరిశుద్ధము, సంపూర్ణము, నిర్మలము, పరబ్రహ్మ స్వరూపము అయి, తన సాహచర్యము చేత బ్రాహ్మీస్థితిని అతి సునాయాసముగా ప్రసాదించు నటువంటి శ్రీగురు చరణారవిందములను ధ్యానించుచున్నాను.

సిద్ధ జనుల ధ్యానమునకు లక్ష్యమై, వైరాగ్యముతో నిండిన జ్ఞానమునకు పరమ సాక్షియై, వేదాంతమునకు ఆధారమై ఉన్న శ్రీనిత్యానంద, మనకు సంపూర్ణ శుభ ములను ప్రసాదించు గాక !

ఏ పరమ గురువు యొక్క కృపా ప్రసాదమువలన మానవుడు చైతన్య పూరితమైన ఒక కొత్త స్థితిని పొంద కలుగునో, ఎవరు శక్తి పాతము ద్వారా తన ఆత్మ శక్తిని శిష్యు లలో ప్రతిష్ఠించి, వారిని కూడా తన వలెనే పూర్ణత్వములో స్థిరముగా ఉంచునో, అట్టి శ్రీనిత్యానంద ఈ గ్రంథరచనలో పూర్ణ సాఫల్యమును ప్రసాదించుగాక.

సిద్ధలోకవాసి అయనప్పటికీ, సర్వవ్యాపియై, చైతన్య ఆత్మస్వరూపుడు, శిష్యజనులకు పారమేశ్వరీ అనుగ్రహమును ప్రసాదించు శక్తిసంపన్నుడు, జీవ బ్రహ్మైక్య బోధను తన కృపా మాత్రము చేత అనుగ్రహించగల పరిశుద్ధమైన స్వరూపము గలవాడు, నా హృదయేశ్వరుడు అయిన శ్రీగురు నిత్యానందను, శుభములను ప్రసాదించవలెనని వేడుతూ వందనము చేయుచున్నాను.

సిద్ధ విద్యార్థులలో ప్రవేశించి వారి హృదయములలో నివసించుచున్న అసంఖ్య రూపములతో క్రియాన్వితమగుచున్న సిద్ధ విద్యార్థుల ప్రాణవల్లభుడైన శ్రీగురు నిత్యానందను, ఈ గ్రంథమును పూర్తి చేయించవలసినదని వేడు చున్నాను.

నా పరమపిత, భేదా భేదములకు అతీతుడు, సర్వ ఆత్మలను సమానముగా చూచువాడు, సునాయాసముగా సిద్ధావస్థను ప్రసాదించువాడు, సిద్ధమార్గమును

చూపించువాడు అయిన ప్రియతమ గురుదేవునికి, ధ్యాన పరిపూర్ణత్వము కొఱకు నమస్కరించుచున్నాను.

ఓ కృపాదాత, సద్గురు! నీవు ప్రసాదించిన సిద్ధ విద్య స్వయముగా నీవే. నీ పరిపూర్ణమైన స్వరూపము సర్వత్ర వ్యాపించి ఉండుటచేత సిద్ధ విద్యార్థులకు నీ సాక్షాత్కారము నీలేశ్వరిలో నిరంతరము లభిస్తూ ఉన్నది. ఓ నీలమణిదేవా! భగవాన్ నిత్యానంద! నీ చరణకమలములకు మ్రొక్కుచున్నాను.

నేను - నాది అన్న సిద్ధ విద్యార్థుల యొక్క అజ్ఞానము నశించిన వెంటనే నీలమణిలో ప్రత్యక్షమగు నిత్యానందునికి పూజ, ఆత్మ ధ్యానమే. ''సోహం'' జపానుసంధానమే, ఆయనను స్మరించు సాధనము. ఆత్మార్పణమే ఆయనకు నైవేద్యము. ధ్యానానంతరం కలుగు పరమానంద స్ఫురణయే ఆయన పరిశుద్ధమైన స్వరూపము. సిద్ధ విద్యార్థుల సహస్రారములో చిన్మయకాంతిపుంజ మధ్యస్థ నీల పీఠములో శాశ్వతముగా నెలకొని ఉన్న ఆరాధ్యదైవము ఆయనే. ''తత్త్వమసి'' పదమునకు లక్ష్యము, ముక్తానందుని హృదయనివాసి, గణేశపురివాసి, సర్వాత్మ స్వరూపుడు అయిన శ్రీనిత్యానంద, సిద్ధ విద్యార్థులకు పరమానందామృతవర్షమును చిరశాంతిని నిత్యతృప్తిని ప్రసాదించుగాక!

# గురుదేవ ప్రార్థన

శ్రీ గురుదేవ ఇదే నా ప్రార్థన, ఈ లోకము స్వర్గధామమగునట్లు దీవించుము
అహంకార మమకారములు తొలగి మా హృదయముల
చిత్‌జ్ఞానముదయించుగాక
జీవులందరు సమతతో ప్రేమతో నిత్యపూజలు మీకు సల్పుదురుగాక
శ్వాస నిశ్వాసములలో 'సోహం' మంత్ర జపము మాప్రాణాపాన ప్రక్రియలగునుగాక. 1

సర్వాత్మ భావనతో మిమ్ముగొలుచునట్లు, మీకృపనాపై ప్రసరింపరే
జాతి మత భాషా విభేదములు తొలగి నామనసున నిర్మలత నిండుగాక
చిన్నపెద్ద, దీన దుఃఖిత, మూఢ సజ్జన వర్గములలో గురునాథ
నిన్నేదర్శింతుగాక
నిరహంకారము సరళము ఐన చిత్తమును, విద్యనీయగల
ఉదారమైన హృదయమును నాకనుగ్రహింపుము. 2

హృన్మందిరంబందు నిరతము మీ రూప ధ్యానమే నిండి యుండునట్లు
గురువరా! నాకు వర మీయరే
సర్వత్ర వ్యాప్తమైన జ్యోతితో హే సర్వాత్మ ! నాకు సాన్నిధ్యమేర్పడునుగాక
నీయందు భక్తి, జ్ఞాన యోగ ధ్యానములలో దృఢబుద్ధి,
ఎన్నటికీ నాలో నిలుచుగాక
సిద్ధ విద్య పూజారిగనే ఇలలోన సదామనుదుగాక,
చిత్తంబు చిత్‌శక్తిలో లీనమై యుండుగాక, 3

శ్రీ రామకృష్ణులను, శివశక్తులను, ఎల్లవేళల నీలోనే చూతుగాక
ఏతావున నీ సిద్ధయోగము విలసితమో, ఆగణేశపురియందు
నేను నిరతము వసియింతుగాక

దేశభాష జాతి మత బంధములనుండి విడిపించి,
సమదృష్టిని నాకు ప్రసాదించుము నిత్యానందుని స్ఫురణతో నామదిని నింపుము,
నిత్యానందతత్వమే నాజీవ తత్వమగునుగాక. 4

సత్యము సరళత వీరత ధీరత నీతి తేజస్సు, సకలజనులకు ప్రాప్తములగునుగాక
కల్పవృక్షము కామధేనువులతో కూడా,
విశ్వమంతయు ఒక ఆనంద వాటిక యగునుగాక
సిద్ధ విద్యాభ్యాసకులు జితేంద్రియులై, క్రియాయోగ తత్పరులగుదురు గాక
హేగురునాథ! హృన్మందిరములలో మీనిత్యదర్శన భాగ్యతృప్తులై సుఖింతురుగాక.5

ప్రాణమున్నంత దనుకనీ అఖండస్మరణతో స్వకర్మనిష్ఠ నాలో నిలుపుము
స్వధర్మాచరణ వృత్తిలో, నీధ్యాసలో స్వతంత్ర జీవి నగుదు గాక
ఇంతైన తప్పక నన్ననుగ్రహించు గురుదేవ, నిరతము నీలోన ఐక్యమైయుండునట్లు
వర్ధిక్కులందు సర్వత్ర నిత్యము నిన్నే దర్శింప నిండు. 6

అలఖ్ నిరంజన, పరాశివ, సచ్చిదానంద స్వరూపములన్నియు మీరే
విశ్వమందు మీరు, మీయందు విశ్వము, అనుపమ అభేద్యులై యున్నవారు
శ్రీగురునాథ సిద్ధ విద్యను నాలోన పూర్ణముగ ఫలింప నిండని
అనుగ్రహమునకై అర్థించుచున్నాడు ముక్తానందుడు
మాధ్యానము క్రియాశీలమగునుగాక నీలమణి యందె విశ్రాంతి లభించుగాక.7

సుఖభరితుడనై నేను విశ్వమంతయు చరింతుగాక
సతతము మా అంతరంగముల మీరే కొలువై యుందురుగాక
ముక్తానందుని ప్రార్థన ఇది, ఓ గురుదేవ!
మా జీవితములు సంవిద్విలాసంబులగునుగాక. 8

# సమర్పణ

నా తల్లికి నేనొక్కడినే సంతానం కావడం చేత, ఆమెకు నామీద అమితమైన ప్రేమ. ఆమె పరమశివుడిని, ఆరాధించేది. శివశక్తి పూజలు చేసి ప్రసాద రూపముగా నన్నుకన్నది, నాతల్లి. అటువంటి నా ప్రియమైన తల్లిని నేను ఏ విధంగాను సుఖ పెట్టలేదు, సంతోషపెట్టలేదు. పైపెచ్చు చిన్నతనంలోనే ఇల్లు విడిచిపెట్టాను. ఆమె ఎంత దుఃఖించినదో! పుత్రశోకంతో, నన్ను తలుచుకుంటూ, కృశించి, చివరకు దేహత్యాగం చేసినది.

తల్లికి పిల్లలు ఎంతో ఋణపడి ఉంటారు. తల్లి బిడ్డకు పాలిచ్చి పెంచు తుంది. బిడ్డ సుఖమే తన సుఖంగా భావించి సంతోషిస్తుంది. నా తల్లి నా కెంత చేసినదో! ఆమె నా గురించి ఎన్ని కలలు కన్నదో! ఏమేమి ఆశలు పెట్టుకున్నదో! నా పిల్లవాడు సుఖసంతోషాలతో తులతూగాలని ఎంతమంది దేవుళ్లకు మొక్కుకున్నదో! ఎంతమంది జ్యోతిష్కులను పిలిపించి అడిగినదో! నా బిడ్డ పెరిగి పెద్ద వాడై ఏమౌతాడు? మంచి భార్య దొరుకుతుందా? పిల్లలెంతమంది? పేరు ప్రతిష్ఠ లుంటాయి కదా? విదేశాలకు, వెళతాడుకదా? ఇక్కడ మా ఊళ్లో ఎన్ని కర్మాగారాలు పెడతాడు? నా బిడ్డకు నా వల్ల సుఖసంతోషాలుంటాయా? ఇటువంటి ప్రశ్నలు ఎన్ని అడిగినదో. తల్లులు తమ బిడ్డలను అంతగాఢంగా ప్రేమిస్తారు. జ్యోతిష్కులు ఏదైనా చెపితే చాలు, అందరు దేవుళ్లకు మొక్కుకొని పూజార్చనలు చేయిస్తారు. గురువారం, శుక్రవారం, శనివారం- ఒకరోజుకాదు, అన్ని రోజులూ ఉపవాసాలు చేస్తారు. పిల్లవాడు బడికి వెళ్లినప్పటినుంచి ఒకటే ఆలోచన, 'బడినుంచి ఎప్పుడు వస్తాడు? ఇంకా రాలేదే?' ఇంటిలోపలికీ బయటికీ తిరుగుతూ గడియారం చూస్తూ, 'ఇంత ఆలస్యం ఎందుకైంది?' అనుకుంటూ బండి చప్పుడుకోసం ఆలకిస్తారు. తల్లికి బిడ్డమీద అంత మమకారం. అయినప్పటికీ, తల్లిప్రేమ గురించి తెలియని కఠినుడు బిడ్డ. తల్లిని విడిచిపెట్టి ఇంటినుంచి వెళ్లిపోతాడు. మాతృప్రేమకు అది గొడ్డలిపెట్టవుతుంది!

నా వ్యవహారం కూడా అటువంటిదే. పదిహేను సంవత్సరాలు నిండిన కొంత కాలానికి ఒకరోజున, ఇల్లు విడిచిపెట్టాను. తలిదండ్రుల ప్రేమకు దూరమయ్యాను.

నేను ఆవిధంగా చేయవలసిందికాదు. కాని ఏం చేయను? నా జీవితంలో ఆ ఘటన అంతకఠినంగా జరగవలసి ఉండినది, జరిగింది. జరగవలసినది జరిగింది. కాలం గడిచి మనస్సు స్థిమితపడిన తర్వాత, తల్లి జ్ఞాపకం వచ్చింది. నేను ఫకీరుగా తిరుగుతున్న రోజుల్లో, ధ్యాన యోగాభ్యాసం చేస్తున్న రోజుల్లో పరమార్థ ప్రాప్తికై సాధన చేస్తున్న రోజుల్లో ఏవ్లా, చాలీస్‌గాంవ్, కసారా, కోకమ్‌ఠాన్, వజ్రేశ్వరి మొదలైన అనేకస్థలాల్లో ఎంతో మంది తల్లులు, అన్నపానాదులు, స్నానానికి అవసరమైన ఏర్పాట్లు, వస్త్రాదులు సమకూర్చి నన్ను సంరక్షించారు. ఎంతో భక్తి శ్రద్ధలతో నా స్వభావానికి తగినట్టు శ్రమకోర్చి, నాకు సేవచేశారు. నాకు ఆ రోజుల్లో కోపం సులభంగా వచ్చేది. ఏమాత్రం ఓర్పు ఉండేదికాదు. పదకొండు గంటలకు తయారుగా ఉండవలసిన భోజనం కొంచెం ఆలస్యమైనట్టయితే విపరీతమైన కోపం వచ్చేది. 'ఎందుకాలస్యమైంది?' అని గర్జించే వాడిని. అయిదు నిమిషాలు ముందు వడ్డించినా అంతే, 'ఏమంత తొందర?' అని అరిచేవాడిని. సాధన చేసేకాలంలో నా స్వభావం అంత విచిత్రంగా ఉండేది. ఆ తల్లులు ఎంతప్రేమగా చూచుకున్నారు! నిజానికి, వారందరూ పూజ్యులైన నా తల్లులే, నాకోసం ఎంత చేశారు! భక్తి శ్రద్ధలతో నిర్మలమైన మనస్సుతో ఎటువంటి ఫలాపేక్ష లేకుండా నా కోపతాపాలను సహించి, నాకు అన్నపానాదులను సమకూర్చడమే కాదు, నన్ను అన్నివిధాలా సంరక్షించారు, ఆ తల్లులు. కొంచెం హెచ్చు తగ్గు అయిందా భోజనం చేసేవాడిని కాదు. భోజనం చల్లగా ఉన్నట్టయితే 'ఎందుకు చల్లగా ఉంది?' అనీ, వేడిగా ఉన్నట్టయితే 'ఇంత వేడిగానా పెట్టేది?' అనీ, వారిని దులిపేవాడిని. ఛీ, ఛీ, ఇంత చిన్న విషయాలను కూడా నేను ఎందుకు సహించలేక పోయే వాడినో నాకు అర్థమయేది కాదు. కొంచెమైనా దయగాని క్షమగాని ఉండేది కాదు. ఇటువంటి ప్రవర్తనకు ఏమాత్రం సిగ్గుపడేవాడిని కాదు కూడా. ఆ తల్లులు తమ ఖర్చుతో శ్రమకోర్చి తమ పిల్లలను కూడా అలక్ష్యం చేసి నాకు సేవ చేసేవారు! అయినప్పటికి దయలేదు నాకు, క్షమ అంతకన్నా లేదు. భగవంతుడు నాకు ఇటువంటి స్వభావాన్ని ఎందుకిచ్చాడో, నాకు అర్థంకాలేదు.

ఈ అమ్మలందరూ ఈ తల్లులందరూ ఢిల్లీకి, బొంబాయికి చెందిన ప్రేమమూర్తులు. ఇప్పటికీ నన్ను ఓర్పులేని పిల్లవాడిగా చూచుకుంటున్నారు. భక్తి శ్రద్ధలతో ప్రేమతో వాత్సల్యంతో తల్లి ప్రేమకు లోటులేకుండా చూచు కుంటున్నారు. యాత్రకు బయలు దేరినట్టయితే కూడా వస్తున్నారు. ఎందుకు? బాబాకు భోజనం

తయారు చేసేందుకు, ఢిల్లీకి బయలు దేరినట్టయితే కూడా వస్తున్నారు. ఎందుకు? బాబాకు వంట చేసేందుకు. దేశవ్యాప్తంగా పర్యటన చేసే సమయంలో కూడా పదకొండు గంటలకు భోజనం చేయ వలసిందే: తల్లులు తెల్లవారు జామున మూడు గంటలకే లేచి భోజనం తయారు చేసి కారులో పెడతారు. బయలుదేరవలసిన సమయానికి ఖచ్చితంగా బయలుదేరవలసిందే నేను. అందువల్ల తెల్లవారేటప్పటికే వంట అయిపోతుంది. మళ్లీ దారిలో భోజనం చేసే సమయానికి భోజనం వేడిగా ఉండవలసిందే. అందువల్ల భోజనాన్ని, 'థర్మస్‌ఫ్లాస్క్' లో పెడతారు. మూడుగంటలకు 'చాయ్' ఉండవలసిందే. .దానికిగాను ఒక స్టౌవ్, కొంచెం పాలు మిగతా సామగ్రిని కారులో సర్దుకునేవారు. సరిగ్గా మూడు గంటలకు దారిలో ఎక్కడైనా ఆగి 'చాయ్' తయారు చేసేవారు. ఈ అమ్మలందరూ మాతృప్రేమను వర్షించారు నామీద. నేను ఎంత విసుక్కున్నా సహించారు. నా స్వభావాన్ని అర్థం చేసుకుని ప్రవర్తించారు. నాకు ఎటువంటి ఇబ్బంది కలుగకుండా చూచేవారు. నా తల్లి అంశం వారిలో లేకుండా అది సంభవమని నేను అనుకోను. ఈ విధంగా ఎంతోమంది తల్లులూ వారి భర్తలూ నాకు ఎంతో సహాయం చేశారు. వారందరిని కృతజ్ఞతతో జ్ఞాపకం చేసుకుంటున్నాను. పెద్ద మనసు చేసుకుని, నన్ను క్షమించవలసిందని వారిని ప్రార్థిస్తున్నాను. ఈ తల్లులందరిలో నన్ను కన్న తల్లినే చూచుకుంటున్నాను. ఆ భావనతోనే ఈ తల్లు లందరికీ హృదయ పూర్వకముగా నమస్కరిస్తున్నాను. నాకు అతి ప్రియమైన చిదంబా భగవతి కుండలినీ మాతను ఈ తల్లులందరిలో చూచుకునేట్టు ఆశీర్వదించవలసిందని భగవాన్ నిత్యానందను ప్రార్థిస్తున్నాను.

ముఖ్యంగా, ఒక తల్లి, నాతోకూడా ప్రయాణం చేస్తూ నన్ను కన్నకొడుకుగా చూచుకునేది. ఆరోగ్యం బాగలేకపోయినా ఓపిక లేకపోయినా, నాకు చేయవలసిన పనులు ఏమాత్రం లోటు లేకుండా శ్రద్ధగా చేసేది. తన ఇంట్లో కాలేజికి పోయే పిల్లల గురించిన ధ్యాసే లేదు. తన ఇంటి పనులు ఎవరు చూచుకుంటారు, అన్న చింతేలేదు. ఒకనెల, రెండునెలలు, ఒక్కొక్కసారి మూడు నెలలు ఉండిపోయేది. విపరీతమైన ఎండగాని, భరించరాని చలిగాని, కుండపోతగా వర్షం పడుతున్నా గాని, బాబాకు వంట చేసేది, క్రమం తప్పకుండా, బాబా యోగ క్షేమాన్ని కనిపెట్టి ఉండేది. మాతృ సమానురాలైన ఆ తల్లికి, నాకు ప్రియమైన శ్రీమతి శారద అమ్మకు, నన్ను కన్న తల్లి శ్రీమతి కుసుమేశ్వరి స్మృతి చిహ్నంగా, ఈ గ్రంథాన్ని అంకితం చేస్తున్నాను.

# ఆముఖము

నేను సిద్ధ మార్గాన్ని అనుసరిస్తున్నవాడిని. సిద్ధకృపచేతనే జీవిస్తున్నాను. నా జీవితము - భోజనము స్నానము ధ్యానము మంత్రము ప్రాణము ప్రాప్తి మోక్షము ధర్మము విశ్రాంతి ఇవన్నీ సిద్ధ కృపవల్లనే జరుగుతున్నవి.

పరాత్పరుడైన శ్రీగురువు సంపూర్ణ సిద్ధయోగేశ్వరుడు, సిద్ధలోకవాసి, అయిన భగవాన్ నిత్యానంద, ముక్తానంద యొక్క పరమ ఆరాధ్య దేవత, అంతరాత్మకూడా. ఆయనకృపా ప్రసాదం వల్లనే నేను జీవిస్తున్నాను. ఆయన కృపాశక్తి ''పారమేశ్వరీ అనుగ్రాహిక శక్తి''. నా శరీరమంతటా వ్యాపించి నా హృదయాన్ని నివాసస్థానంగా చేసుకుని ఉంది.

శుష్కములు రసహీనములు అయిన భోగములు తమ కొఱకు అనీ, ధ్యానము యోగాభ్యాసము వంటివి విరక్తులైన సాధుజనులకు అనీ ఎవరూ భావించరాదు. సామాన్యులందరూ తమ తమ పనులను నిర్వర్తించుకుంటూనే, సిద్ధయోగ మార్గాన్ని సునాయాసంగా పూర్తిగా అనుసరించగలరు. ప్రపంచంలో సిద్ధ విద్యను పూజించేవారు చాలామంది ఉన్నారు. ప్రాచీన కాలములో గృహస్థాశ్రమంలో ఉన్నవారు చాలామంది సిద్ధవిద్యను ఆరాధించేవారు. తమతమ సంసార బాధ్యతలను నిర్వర్తించుకుంటూనే లౌకిక - పారమార్థిక మార్గాలు రెండింటినీ అనుసరిస్తూ ఆదర్శ స్త్రీ పురుషులుగా రూపొందేవారు.

ఈ మార్గం అందరికీ అందుబాటులో ఉన్న మార్గం. ప్రతి స్త్రీలోనూ ప్రతిపురుషుడిలోనూ ఒక దివ్యాత్మశక్తి ఉన్నది. దీని గురించి ''శివసంహిత'' లో ఈ విధంగా పేర్కొన్నారు:

**మూలాధారస్థ వహ్న్యాత్మ తేజో మధ్యే వ్యవస్థితా,**
**జీవశక్తిః కుండలాఖ్యా ప్రాణాకారాథ తేజసీ.**
**మహాకుండలినీ ప్రోక్తా పరబ్రహ్మ స్వరూపిణీ,**
**శబ్దబ్రహ్మమయీ దేవీ ఏకానేకాక్షరాకృతిః.**
**శక్తి కుండలినీ నామ విసతంతు నిభా శుభా।**

- శివ సంహిత

అనగా ఈ శక్తి, పరబ్రహ్మ స్వరూపిణీ అయిన మహాదేవి. ఈ శక్తిని కుండలిని పేరుతో వ్యవహరిస్తారు. ఈ శక్తి, మూలాధార పద్మ గర్భములో తామరతూడును పోలి ఉంటుంది. గుండ్రముగా చుట్టుకుని ఉంటుంది. బంగారపు వన్నె కలిగి మెరుస్తూ ఉంటుంది. పరమశివుడి యొక్క పరమ నిర్భయశక్తి ఇది. ఈ శక్తే, స్త్రీ పురుషులలో జీవరూపిణీశక్తి గా ప్రాణరూపంలో ఉంటున్నది. 'అ'కారం నుంచి 'క్ష' కారం వరకు అన్ని అక్షరాలు ఈ శక్తినుంచి ఆవిర్భవించినవే. మానవుడు తనలోని ఈ శక్తిని గుర్తించి, మామూలు జీవితం గడుపుతూ, ఈ శక్తిని ఉప యోగించుకొనవచ్చును. ఈ ఉద్దేశ్యంతోనే నేను ఈ శక్తి గురించి చెబుతున్నాను. కుండలిని, ప్రణవ స్వరూపమే. ఈ పారమేశ్వరీ కుండలినీ శక్తి జాగృతమైనపుడు, అంతవరకు శుష్కంగా రసహీనంగా ఎండిపోయినట్టు అసంతృప్తిగా ఉన్న జీవితం కళకళలాడుతుంది. జీవితంలో ఉత్సాహం సంతోషం కలుగుతాయి.

ఆహ్లాదాన్ని కలిగించే ఈ శక్తి, విశ్వమంతటినీ ప్రకాశంతోనింపే ఈ శక్తి, పరమేశ్వర శక్తి. ఇదే చిత్‌శక్తి భగవతి. ఇదే కులకుండలిని మూలాధారంలో వర్తులాకారంలో చుట్టుకొని ఉంటుంది. మన శరీరం నిర్వహించే పనులన్నిటినీ క్రమబద్ధం చేస్తుంది. ఈ శక్తి శ్రీగురుకృపచేత జాగృతమై శరీరాన్నంతటినీ చుట్టూ ఉన్న పరిసరాలనూ మన అదృష్టానికి తగిన విధంగా వికసింపచేస్తుంది. మానవులలో ఒకరి పట్ల మరొకరికి, అత్యంత స్నేహ పూరితమైన ''పరస్పర దేవో భవ'' భావాన్ని కలిగిస్తుంది. ప్రపంచాన్ని స్వర్గంగా చూపిస్తుంది. ఈ శక్తి, ప్రపంచంలో అసంపూర్ణంగా ఉన్న ప్రతి ఒక్క వస్తువును సంపూర్ణం చేస్తుంది.

ఈ పారమేశ్వరీశక్తి ఒక మానవుడిలో అనుగ్రహరూపంలో ప్రవేశించినపుడు ఆ మానవుడి జీవితమే మారిపోతుంది. తన అంతరంగంలో శక్తి వ్యాపించడం గురించి పూర్తిగా తెలుసుకున్న వ్యక్తికి తన ప్రియమైన భార్య పట్ల సంపూర్ణమైన ప్రేమభావమూ స్వార్థరహితమైన స్నేహభావమూ కలుగుతాయి. పత్ని, కేవలం స్త్రీకాదు, ఆమె పరమేశ్వరి కుండలినియే అన్న జ్ఞానం ఉదయిస్తుంది. భార్య హృదయంలో చితి ఉదయించి, భర్తపట్ల పరిపూర్ణమైన శ్రద్ధతో కూడిన సేవా భావమూ అత్యంత స్నేహభావమూ కలుగుతాయి. దీనితో, పతి కేవలం మానవుడు కాదు పరమేశ్వర స్వరూపమే అన్న సంపూర్ణమైన జ్ఞానం కలుగుతుంది. గురుకృపాశక్తి తల్లిలో జాగృతమైనపుడు ఆమె సంసారం ఆనందంతో నిండి పోతుంది. ఈ శక్తి యొక్క

ప్రభావం, తల్లిలో వ్యాపించి నపుడు ఆమెకు తన పిల్లల గురించిన సంపూర్ణ జ్ఞానం కలుగుతుంది. వారికి విద్యను వినయవిధేయతలను కళాకౌశలాన్ని నేర్పించగల శక్తి సామర్థ్యాలను పొందుతుంది. శక్తిపాత రూపంలో పరమశక్తి అనుగ్రహం కలిగిన వెంటనే తల్లులకు, తమ పిల్లలను పరమోన్నత మార్గములో తీసుకొని పోగల సామర్థ్యము కలుగుతుంది. ఈ జ్ఞానం కల్పితము కాదు, ముక్తానంద చెబుతున్న ఒట్టి మాటకాదు. రుద్ర హృదయోపనిషత్ మంత్రమొకటి ఈ విధంగా ఉంది:

**రుద్రోనర ఉమానారీ తస్మై తస్యై నమోనమః**

ఆది – సనాతన సత్యము, సాక్షి పరమేశ్వరుడు, జగత్తుకు మూల కారణము, పరమారాధ్యదైవము నిర్గుణ – నిరాకారము, మరియు జన్మరహితము అయిన కేవల పరబ్రహ్మమే నరుడు. 'అతడే నాపతి దేవుడు' అన్న జ్ఞానం కలుగుతుంది స్త్రీకి. కుండలిని ఆ పరమేశ్వరుడి పరాశక్తి తప్ప మరొకటి కాదు. ఆ శక్తికే చిత్‌శక్తి, ఉమ, దుర్గ, ప్రతిభ, మాలతి అన్న పేర్లు. ఆ పరమేశ్వరి వల్లనే జగత్తు నడుస్తుంది. ఆమె, పరమ శివుడి ప్రియమైన రాణి, అర్ధాంగిని. ఆమే రాధ, సీత, సుకన్య, గృహిణి, సతి, పతివ్రత, తల్లి, యోగిని, జనని మొదలైన రూపములను ధరించేది. ఆమే స్త్రీ. 'ఆమే నా భార్య' అన్న జ్ఞానం, చిత్‌శక్తి జాగృతమైనపుడు భర్తకు కలుగుతుంది. ఇటువంటి గురుకృపాశక్తిని పొందినపుడు ప్రపంచం స్వర్గమయమౌతుంది. ఈ ఉద్దేశ్యంతోనే ఈ గ్రంథరచన జరిగింది.

ఈ పరాశక్తి ప్రజలందరిలో వ్యాపించి, అందరూ ఈ కుండలినీ శక్తి ప్రభావంతో వికసించి, స్త్రీ పురుషులు ఈ శక్తిని పొంది పరస్పరము స్వార్థరహితమైన పూర్ణప్రేమ భావముతో సంపూర్ణమైన జ్ఞానమును పొంది, అంతరంగములో వికసించిన చిద్విలాసమును అనుభవించి, తేజోవంతులై ఉందురు గాక! భార్యాభర్తలు ఒకరినొకరు విలాస వస్తువులుగా పరిగణింపక పరస్పరం గౌరవంతో వ్యవహరింతురుగాక! ప్రపంచంలోని స్త్రీలందరు తమలో వికసించిన శక్తిని గుర్తించి, శక్తి యొక్క మహిమను స్వయముగా పొంది, ''నా పతి ఆ పరాశక్తి యొక్క ఒక సంపూర్ణమైన కిరణం'' అని తెలుసుకుని మైత్రీపూర్ణమైన సేవాభావమే నిజమైన ధర్మమని భావించి ఉపాసకులు అగుదురుగాక! ఇదే ముక్తానంద ఆకాంక్ష.

ప్రపంచంలోని స్త్రీ పురుషులందరూ గుర్తుంచు కొనవలసిన సంగతి మరొకటి కూడా ఉంది. ఈ జగత్తు అంతటా చిత్‌శక్తి భగవతి వ్యాపించి ఉంది. చిత్‌శక్తి ఈ

ప్రపంచానికి మూలం. చిచ్ఛక్తి ప్రపంచానికి సహాయకరం. ప్రపంచం చిత్‌శక్తిలోనే వ్యాప్తమై ఉంది. చిత్‌శక్తిని పరమ శివుడుగాను పరమాత్మగాను వ్యవహరిస్తారు. పరమాత్మ విశ్వాతీతుడు, పూర్ణపురుషుడు, నిర్గుణుడు; పరమాత్మ అన్నిటికీ ఆధారము; వేదాంతులు 'ఇదికాదు-ఇదికాదు' అని చేసిన విచారణకు లక్ష్యము; 'అహం బ్రహ్మోస్మి'కి మూలాధారము; అదే చిదాత్మ. చిత్‌శక్తి దీనికి భిన్నమైనది కాదు. ఇది పరమశివుడిలో లీనమైన అభిన్నమైన పరాశక్తి. దీనికి 'శివశక్తి' అని కూడా పేరు. స్థావర జంగమ రూపమైన ఈ జగత్తు, ఈ చిత్‌శక్తియొక్క సౌందర్యముతో నిండి ఉంది. ఇది పరమ శివుడికి భిన్నముకాని శక్తి. దీని ఆత్మ స్ఫురణ రూపము యొక్క బాహ్య ప్రసరణమే ఈ ప్రత్యక్ష ప్రపంచము. అదే మహా చిత్ శక్తి భగవతి ప్రపంచంలో జరిగే అనుకూల ప్రతికూల వ్యవహారాలలోను సాధక బాధకాలలోను అనేక విధాలుగా ప్రకాశిస్తూ ఉంటుంది. **''తన్నానా అనురూప గ్రాహ్య గ్రాహక భేదాత్''**. **(ప్రత్యభిజ్ఞాహృదయం-సూ.3)** ఆ విధంగా ప్రకాశిస్తూ కూడా పరమ స్వతంత్రమైన చిత్‌శక్తి, స్వతంత్రముగా తన స్వశక్తి చేత ముప్పయి ఆరురకాల తత్వరూపాలను పొందుతుంది. స్త్రీ పురుష లేక ప్రకృతి-పురుష రూపాలను పొందుతూ ఉంటుంది. ప్రపంచంలో (సృష్టిలో) ఎన్నో విభాగాలున్నప్పటికీ ముఖ్యమైనవి రెండే; పురుషుడు, ప్రకృతి. లేదా నరుడు - నారి. ఈ రెండు భేదాలు సర్వత్ర వ్యాపించి ఉన్నవి. పశు పక్ష్యాదులలో వృక్షాలలో కూడా ఈ భేదం ఉంది. మిగతా వ్యవహారాలలో కూడా శ్రేష్ఠము-కనిష్ఠము, పుణ్యము-పాపము, బంధము-మోక్షము, ఆనందము-దుఃఖము, వంటి ద్వంద్వాలు సర్వత్రా ఉన్నవి. అయినప్పటికీ ఒకే ఒక చిత్ శక్తి గ్రాహ్యమూ గ్రాహకమూ అయి ఉంది. నేను చెప్పదలచుకున్నది ఇది: ప్రపంచమంతా వ్యాపించి ఉన్నది చిత్‌శక్తి తప్ప మరొకటి కాదు. ప్రపంచమే చిత్‌శక్తి, చిత్‌శక్తియే ప్రపంచము. జ్ఞాన చక్షువుతో చూచినట్టయితే ప్రపంచమంతటా చిత్‌శక్తి తప్ప మరొకటి కనుపించదు.

మానవుడికి ఇది అర్థం కావచ్చు, కాకపోవచ్చు. తన ఆంతరిక శక్తి వికసించక పోయినా ఒక సంగతి మాత్రం గుర్తుంచుకొనడం అవసరం: ప్రపంచంలో మానవదేహం ధరించి ఉంటున్నది పరమేశ్వరుడే. **మనుష్య దేహ మాస్థాయ ఛన్నాస్తే పరమేశ్వరాః (ప్రత్యభిజ్ఞా హృదయం).** మనుష్య దేహం ధరించి ఉన్నది పరమేశ్వరుడే అయినపుడు సిద్ధయోగసాధకులు తమ అంతర్శక్తిని అతిసునాయాసముగా వికసింపచేసుకొనగలరు. వాస్తవం ఇది అయినప్పటికీ,

మానవులకు ఈ చిత్‌శక్తి గురించిన జ్ఞానమే లేదు. ఎంత పొరపాటు! తమలో ఉన్న ఈ శక్తిని చూడరు, పూజించరు. ప్రపంచమంతటా ఈ శివశక్తి వ్యాపించి ఉన్నప్పటికీ సాధారణ మానవుడికి భేదభావం స్ఫురిస్తుంది. కాని, గురుకృపను పొందినవారికి మాత్రం ప్రేమభావంతో నిండిన అభేదమే గోచరిస్తుంది. ఈ ప్రపంచంలో జీవితయాత్ర సాగిస్తున్నవారు, తమ యాత్ర నిర్విఘ్నంగా కొనసాగేందుకు తమ ఆరాధ్యదైవమైన చిత్‌శక్తి-కుండలిని- మహేశ్వరి గురించి తెలుసుకొనడం మంచిది. ధ్యానం ద్వారా ఆమెను జాగృతం చేసుకొనండి. ఆ విధంగా చేసుకుని ఆమె దర్శనమైన తరువాత సంతోషంగా జీవించండి. ఆమె యొక్క ఆనందమయమైన ప్రకాశమే గురుజనుల రూపము. అటువంటి పరబ్రహ్మమయమైన కుండలిని మహాశక్తినే, చిత్ శక్తిగా వర్ణించారు. శ్రీగురు కృపాప్రసాద ఫలితముగా మీలో జాగృతమైన చిత్ శక్తి - కుండలిని, మీ జీవితయాత్రను అత్యంత నైపుణ్యంతో అత్యంత క్షేమంగా పూర్తి చేయించగలదు. ఈ ధ్యాన యోగము, ప్రపంచములో పరమార్థ మార్గమును చూపు మహాయోగము. చిత్ శక్తి యొక్క ప్రసాదము వలన మీరు గొప్పవారు కాగలరు. మీ జీవితము యోగమయమగును. మీ జీవితము, ఉత్సాహ పూరితమూ ఆనందమయమూ శ్రేయస్కరమూ కాగలదు. మీ ఇల్లు కాశీ క్షేత్రమగును. మీ వ్యవహారములు నిత్యనియమములుగా మారును. మీ మిత్రులు దేవతలుగా మారుదురు. మీ భోజనము నైవేద్యమగును. మీరు చేయు సర్వకర్మలు పరమాత్మకు పూజలుగా మారును. ఈ విధముగా జరుగుతూ కాలక్రమేణా చిత్‌శక్తిలో లీనమయే స్థితి మీకు ప్రాప్తమగును.

ఓ మాతృ – పితృరూప పరమేశ్వరీ చిత్‌శక్తీ ! నీవు శక్తివి, నీవు శివుడవు కూడా. అంతః స్ఫురణ రూపమైన ఆత్మకూడా నీవే. నీయొక్క బాహ్య రూపము, ఆత్మరూపము రెండూ పరమానందమయములు, సుందరములు. నీ గురించి పూర్తి జ్ఞానం కలిగేవరకు, అజ్ఞానులైన జనులు, శివ – శక్తి, జగత్ – మాయ, బంధమోక్షములు, భోగ – వైరాగ్యములు, ఐహిక – ఆముష్మికములు వంటి ద్వంద్వభావములను నీకు ఆపాదిస్తూనే ఉంటారు. పరమ ఆదరణీయ మహాశక్తీ, నీవు దయతలచి గురువురూపముతో శిష్యుడి హృదయములో ప్రవేశించినప్పుడు; శిష్యుడిలో కలిగే అంతర్ జ్ఞానం వల్ల వెలుపల జరిగే నీ లీలగురించి కూడా పూర్తిగా అవగతమగును. సిద్ధయోగము, కుండలిని, మహాపూజ, ధ్యానయోగము – ఇవన్నియూ నీరూపములే. వాటి నిండా వ్యాపించి ఉన్నది నీవే. ధ్యాన సాధనను పరిపూర్ణము చేసే నీ స్వరూపాన్నీ స్థానాన్నీ ప్రసాదించుచున్నావు.

వస్త్రం నూలుతో నిండి ఉన్న విధంగా, కుండరూపంలో ఉన్నది మట్టే అయిన విధంగా, జడ - చేతనాత్మకమైన ఈ అఖిల ప్రపంచరూపములో ఉన్నది నీవే. ఈ జ్ఞానం కలిగినపుడు భేదాల మధ్య కూడా అభేదమే కనిపించును. దైనందిన వ్యవహారాలలో కూడా భగవంతుడి దర్శనమగును. ఓ పరమశివుని యొక్క పరాశక్తీ! సాధక జనులు 'నమఃశివాయ' 'సోహం' 'ఓం' అని జపిస్తూ నీ స్మరణలో మునిగి తమను తాము మరచినపుడు, వారి అంతరంగాల్లో ప్రత్యక్ష మగునది నీవేకదా. ఓ స్వతంత్రమైన పరాశక్తీ! అన్ని మంత్రములు నీనామములే, అన్ని తంత్రములు నీ చర్యలే. ప్రపంచము నీరూపమే. ఓ సంవిత్తీ, నానావిధములైన రూపములూ రంగులూ ఆకారములతో నిండి అనంత వస్తుసముదాయరూపమై ఉన్న ఈ జగుత్తు నీ బాహ్య స్ఫురణయే. నీకు అనేకానేక నమస్కారములు.

సూర్యకిరణం సూర్యుడికి భిన్నమైనదికాదు. నీటి మీది తరంగానికీ, నీటికి భేదం లేదు. భూమికీ, మట్టి బెడ్డకూ భేదం లేదు. అదేవిధంగా అనంతరూపాలతో భాసిస్తున్న ఓ చిదేశ్వరీ, నీ కాంతి పుంజములోని అనంత కిరణములలో నీ ఈ ముక్తానందుడు ఒక కిరణమేగాని నీకన్న భిన్నము కాదు. ముక్తానందుడి పుట్టుక నీ నుండియే. అతడి జీవితం నీది. చివరకు లయం కావడం నీలోనే. ముక్తానందుడు, నీవాడైన ముక్తుడు. నీవల్ల ముక్తుడు, నీలోనే ముక్తుడు. నా ఈ గ్రంథాన్ని అనేక నమస్కారములతో నీకు అర్పిస్తున్నాను.

నా సాధన అనుభవములను అక్షర బద్ధం చేయవలసిందని నాకు ప్రియమైన సిద్ధ విద్యార్థులూ విద్యార్థినులూ ఎంతో ప్రేమతో అర్థించారు. ఆ పిమ్మట నాకు ప్రియమైన అమ్మ! యోగిని కుసుమతాయి శర్మ ఎంతో వేడుకున్నారు. అందువలన మహాబలేశ్వర్‌లోని శ్రీ ఆనందభవన్‌లో, 1969 మే నెల 12వ తేదీ సోమవారంనాడు ఈ గ్రంథ రచన ప్రారంభించాను.

ఇది ఒక చిన్న గ్రంథం. నిజానికి దీనిలోని విషయము, రూపకల్పన, ప్రాచీన కాలపు మహాపురుషులు రచించిన గ్రంథాల వంటిది కాదు. ఆ గ్రంథాలు చాలా గొప్పవి. ఈ గ్రంథంలో చిత్‌శక్తి యొక్క విలాసం గురించి మాత్రమే ఉంది. ఈ గ్రంథం చిత్‌శక్తి ప్రసాదమే, చిత్‌శక్తి క్రీడయే. చిత్‌శక్తి భగవతి యొక్క సిద్ధయోగమే. ఈ గ్రంథంలో ఉన్నది చిత్‌శక్తి ప్రాప్తి గురించి. అందుచేత ఈ గ్రంథానికి చిత్‌శక్తి విలాసము అన్న పేరు స్ఫురించింది. ఆలోచించి పెట్టిన పేరుగాదు.



స్వామి ముక్తానంద:
గణేశపురిలో తనగురువు భగవాన్ నిత్యానంద సన్నిధిలో

మొదటి భాగము

# పరమాత్మ ప్రాప్తికి ఉపాయము

పరమేశ్వరుడు సర్వవ్యాపి, పూర్ణుడు మరియు నిత్యుడు. అందరిలోపలా వెలుపలా వ్యాపించి ఉన్నప్పటికీ, అందరి అంతర్యామిగా అంతరాత్మరూపంలో అందరి హృదయ మందిరాల్లో నివాసం చేస్తున్నప్పటికీ, ఆయన గురించి కొంతమందికి మాత్రమే తెలుసును. పరమేశ్వరుడు హృదయంలోనేకాదు ఈ భూమండలంలోనే ఎక్కడా లేడని చాలామందికి భ్రమ. పరమేశ్వర వాదం మిథ్య అని కొందరి భావన.

కొంతమంది నిసర్గవాదులున్నారు. సృష్టికి మూలకారణం 'ప్రకృతి' లేదా 'సహజస్వభావ'మని వీరు భావిస్తారు. అణుపరమాణువుల సంగమం చేత సృష్టి జరుగుతున్నదనీ, సృష్టికర్త అంటూ ఎవరూ లేరనీ వీరి వాదం. భగవంతుడు దూరంగా వైకుంఠంలోనో కైలాసంలోనో లేదా ఆకాశంలో ఎక్కడనో ఉన్నాడని కొందరి నమ్మకం. మన హృదయాల్లో ఉన్నాడని వారు నమ్మరు. మరికొంత మంది ఆధునిక వాదులు, ''భగవంతుడే ఉన్నట్టయితే ప్రపంచంలో ఇంత వైషమ్యం, ఇన్నికష్టాలు, ఇంత దుఃఖము ఎందుకున్నట్టు'' అంటారు. ''ఒకచోట అతివృష్టి, మరొకచోట అనావృష్టి, ఒకచోట దుర్భిక్షం, మరొకచోట సుభిక్షం. ఎందుకీ విధంగా ఉంది? సకాలంలో వర్షాలుండవు, త్రాగేందుకు నీరుండదు, కంటినీరు తప్ప. అన్నంలేదు అందరికీ. ఆకులూ అలాలూ తినవలసిందే. నివసించడానికి నీడలేదు. ఒంటికి చుట్టుకునేందుకు వస్త్రంలేదు. ఎందువల్ల ఇటువంటి దుర్దశ?'' – ఇటువంటి అనేక కొత్తకొత్త శంకలు కుశ్శంకలతో వాదిస్తూ వీరు తమ హృదయాలను శ్రద్ధారహితం చేసుకుని శుష్కింప చేసు కుంటున్నారు.

ప్రపంచంలోని చాలా దేశాల్లో అన్నపానాదులకు లోటు లేదు, సంపద ఉంది. దీనికి కారణం వారి పరిశ్రమ, గట్టి పట్టుదల. జపాన్ వంటి చిన్నదేశం కూడా, అక్కడి భూమి సారవంతమైనది కాక పోయనప్పటికీ, అన్నపానాదుల విషయంలో స్వయం పోషకంగా ఉంది. అక్కడి ప్రజలు ఆహారధాన్యాల ఉత్పత్తి విషయంలో అత్యంత

శ్రద్ధ వహిస్తారు. ''కొండచిలువ చాకిరి చేయదు, పక్షి పనిచేయదు'' అని ఒక సామెత. జపాన్ ప్రజలకు ఇటువంటి అకర్మ వాదంలో విశ్వాసం లేదు. కర్తవ్య శూన్యులై స్తబ్ధంగా ఉంటూ ఆపైన భగవంతుడిని నిందించడం – ''భగవంతుడే ఉన్నట్టయితే మనం ఆకలితో అల్లాడడం ఎందుకు'' అని. ఎంత హాస్యాస్పదం! పరమేశ్వరవాదాన్ని మన స్వప్రయోజనానికీ, మనకు కావలసిన పనులను పూర్తి చేసుకునేందుకూ వినియోగించరాదు. పరమేశ్వరుడున్నాడు. మనం ఆయనకు విముఖులం కావడం చేతనే శ్రద్ధ లేకపోవడం చేతనే ఈ దుర్దశ.

నాకొక కుటుంబం తెలుసు. ఆ కుటుంబంలో ఏడుగురు డాక్టర్లున్నారు. ఒక్కొక్కరు ఒక్కొక్క విషయంలో నిపుణులు. ఆకుటుంబంలో ఒక పిల్లవాడు బాగా జబ్బుపడ్డాడు. నోటి చాపల్యం ఎక్కువ వాడికి. మందు తింటున్న సమ యంలో కూడా పథ్యంగా ఉండలేదు. వ్యాధి ముదిరింది. దానితో, ఆ పిల్లవాడిని మరొక చోటికి తీసుకుపోయి మరొక డాక్టరుకు అప్పగించారు. ఇక్కడ, మొదటి డాక్టర్లు చేసిన వైద్యం సరిగా లేదని వారిని తప్పు పట్ట వచ్చునా? నిజానికి మానవుడు తన కర్మ ఫలాన్నే భగవంతుడినుంచి పొందుతాడు. కర్మకు తగిన ఫలితమే లభిస్తుంది. మంచిది.

భగవంతుడి గురించి అనుమానాలను కలిగి ఉండడం వ్యర్థం. ఆయన ప్రత్య క్షంగానూ సూక్ష్మంగానూ ఉన్నాడు. మనం అంతరంగంలో బాహ్యంలో చేసే పనుల న్నిటికీ ఆయనే క్రియారహితుడైన ఆధారం. మన భారతదేశంలో అద్భుతమైన ప్రదేశాలు చాలా ఉన్నాయి. సిద్ధులు నివసించే ప్రదేశాలున్నాయి. అవి మనకు కనిపిస్తున్నాయా? మనం వాటిని చూడలేము. చూడలేము కనుక అటువంటి ప్రదేశాలు లేవని అర్థంకాదు.

ఆవిధంగానే, ఒకగొప్ప దివ్యశక్తి మన అంతరంగంలో పనిచేస్తూ ప్రత్యక్షంగా విరాజమానమై ఉంది. అటువంటి శక్తి లేదని అనడం తెలివితక్కువే అవుతుంది. పరమాత్ముడు తన శక్తిద్వారా ఈ బాహ్యజగత్తులో దానికి తగినట్టుగాను అంతర్జగ త్తులో దానికి తగినట్టుగాను వ్యాపించి ఈ ప్రపంచాన్ని నివాసయోగ్యం చేశాడు. భగవంతుడు లేడనే అనుకుందాం – అప్పుడు ఈ ప్రపంచంలో ఎవరు జీవించ గలరు? ప్రపంచాన్ని నిర్మలంగా ఉంచేదెవరు? ఈ ప్రపంచం నివాస యోగ్యంగాను సంతోషకరంగాను ఉండేట్లు చేస్తున్నది ఆయనే. భగవంతుడి మహిమ అనంతం.

అనంతుడైన ఆయన ఉనికి వల్లనే మనం, ఆనందస్వరూపుడైన ఆయన తత్వాన్ని ఆస్వాదించకలుగుతున్నాము. పరమానందమయుడైన పరమేశ్వరుడి యొక్క పరమానందం, ఈ ప్రపంచంలో ప్రతిబింబించడం వల్లనే సకల ప్రాపంచిక భోగభాగ్యాల ద్వారా సకల కార్యాలద్వారా మనం కొంతైనా ఆనందాన్ని పొందకలుగుతున్నాము. అన్నం రుచిలో, నీటి తీయదనంలో, స్వర-రాగాల ఆలాపనలో, వికసిస్తున్న పువ్వుయొక్క మధురమైన చిరునవ్వుల్లో, శిశువుల కేరింతల్లో, ఉన్నవి ఆ భగవంతుడి ఆనందపు ఛాయలే. రంగు రంగుల పువ్వుల సౌందర్యంలో పరమేశ్వరుడి తేజస్సు లేకపోయి నట్టయితే మనం పువ్వులపట్ల ఇంత ఆకర్షితులం కాగలమా? వాటి పట్ల మనకు ఇంత ప్రేమ ఉంటుందా? మామిడి, అనాస, దానిమ్మ, జామ లాంటి ఫలాల్లో పరమాత్ముడి సౌందర్యం, మాధుర్యం, రుచి, లేకపోయినట్టయితే అవి ఇంత రుచికరంగా తియ్యగా ఉంటాయా? వాటి మాధుర్యానికీ తియ్యదనానికీ కారణం పరాత్పర తత్వమే. పరి శుభ్రమైన మామూలు నీటిలో ఎంత తియ్యదనం! రంగు రంగులతో మెరిసే సూర్యుని కిరణాలు మనకెంత ఇష్టం! కోమలమైన ఈ కిరణాల స్పర్శ చాలు, తామరలు విచ్చు కుంటాయి, చెట్లు సంతోషంతో తలలూపుతాయి. పక్షులు ఆనందం పట్టలేక గానం చేస్తాయి. నిదానంగా పరికించి చూచినట్టయితే తెలుస్తుంది. ఆ వనలతలు, సూర్యకిరణాలు పరస్పర ప్రేమతో, పరస్పరము అర్పిత భావంతో, యజ్ఞరూపమైన పూజతో, మౌనభాషతో, మాటలాడు కుంటాయి. మంద మలయమారుతంలో ఎంత దివ్యమైన నాదం! ఎంతటి మధురమైన శీతలమైన సుఖదమైన స్పర్శ! ఇదంతా ప్రత్యక్షపరమేశ్వరుడి ప్రేమ ప్రవాహమే. కాని, మానవుడికి పరమాత్మ పరిచయం లేక పోవడం వల్ల, అజ్ఞానంచేత, చైతన్యవంతమైన ఈ ప్రపంచంలో లోటుపాట్లే కనిపిస్తాయి.

ఈ జగత్తు పరబ్రహ్మము యొక్క ప్రతిబింబమే. **'సర్వం ఖల్విదం బ్రహ్మ'** అనే వేదాంతసూక్తి పూర్తిగా సత్యం. ఇది అంతా పరబ్రహ్మమే. అన్ని దేశాలు, అన్ని తీర్థాలు, అన్ని పేర్లు పరమాత్మవే. తరతమభేదాలు, మానవుల దృష్టిలోనే ఉన్నాయి. వస్తుతః భూమండలంలోని అన్ని ప్రదేశాలు భగవంతుడి క్షేత్రాలు. అన్ని నదులు, జలాశయాలు, పరమాత్ముడి తీర్థాలు. జగత్తులోని అన్ని ఆకార రూపాలలో భగవంతుడి నామాలే ధ్వనిస్తాయి. అనంతుడి మహిమ అనంతం, నామాలు అనంతం, లీలలు అనంతం. పరమాత్ముడికి అంతంలేదు. శాస్త్రాలు ఎంత అధ్యయనం చేసినా కొంత మిగిలే ఉంటుంది, పూర్తికాదు. ఎన్ని తీర్థాలు సందర్శించినా కొన్ని ఇంకా మిగిలే

ఉంటాయి. ఎంతదూరం చూచినా ఇంకా చూడవలసినది ఎంతో ఉంటుంది. అదే విధంగా పరమాత్మ తత్వం, ప్రపంచ వ్యాప్తము, విశాలము, దివ్యాతి దివ్యము, మహిమోపేతము, మహోన్నతము. క్షణ భంగురమైనది ఈ శరీరము, ప్రమాదములతో కూడినది ఈ ప్రపంచము – ఈ పరిస్థితిలో పరమాత్ముడిని తెలుసుకొనడం అత్యంత అవసరం. కాని ఆయన్ను పొందే మార్గం ఎంతో కఠినమైనది.

మానవుడికి ఒక పరంపర ఉన్న విధంగా పరమాత్మ తత్వానికి కూడా ఒక పరంపర ఉంది. అనాది అయిన పరమాత్మనుంచే ఈ జగత్తు యొక్క పరంపర ప్రారంభమైనది. ఈ విషయమై సందేహం కలిగి ఉండడం మంచిది కాదు. ఒక బీజం నుంచి పూర్తిగా దానినే పోలిన మరొక బీజం ఉదయిస్తుంది. ముందు ముందు ఆవిర్భవించే బీజంలో కూడా ఇటువంటి బీజమే ఉంటుంది. ఇదే విధంగా, బ్రహ్మనుంచి బ్రహ్మే జన్మిస్తాడు. మానవ మాత్రులందరి ఆత్మ, పరబ్రహ్మ, పరమేశ్వరుడి యొక్క పరిపూర్ణమైన అంశం తప్ప మరొకటి కాదు. పూర్ణం నుంచి పూర్ణమే పూర్ణరూపంలో ఉదయించి పూర్ణభావంలో పూర్ణంగా ఉంటుంది. సత్యం ఇదైనప్పటికీ మనం మానవులం, వెలితితో, అపూర్ణభావంతో, ఛిన్నాభిన్నమై ఎందుకు ఎప్పుడూ శోకిస్తూ రోదిస్తూ ఉంటాము? దీనికి కారణం స్వస్వరూపాన్ని మరిచిపోవడం. ఈ విస్మరణ మిథ్య అయినప్పటికీ బలవత్తరమైనది. ఈ విస్మరణనే అజ్ఞానమనీ అవిద్య అనీ మాయ అనీ మలదోషమనీ వ్యవహరిస్తారు. ఈ అవిద్యే నారాయణుడిని నరుడిగాను, సదాశివుడిని జీవుడిగాను, ముక్తుడిని బద్ధుడిగాను చేస్తుంది. 'నేను – నాది' అన్న భావాన్ని కల్పించి మానవుడిని ప్రపంచంలోని ద్వంద్వయాతనల పాలు చేస్తుంది. నానారకాలైన కష్టాలపాలు చేస్తుంది. వీటి నుంచి తప్పించుకునే మార్గ మొక్కటే ఉంది – పరమాత్మ ప్రాప్తి – అనగా ఆత్మదర్శనం.

ఒకటి

# ప్రాపంచిక సుఖానికి కూడా ధ్యానం అవసరం

ఈ శరీరంలో అనేకరకాల వస్తువిశేషాలున్నవి. మానవుడు ఒక్క సారి అయినా ధ్యానం ద్వారా తన శరీరాన్ని పరికించినట్టయితే నిజంగా ఎంతో లాభం కలుగు తుంది. ఈ శరీరంలో ఏమేమి ఉన్నవో మనకు తెలియదు. శిరస్సులో ఉన్న చక్రాలెన్నో! అమృతరసకుండాలెన్నో! జ్ఞానతంతువుల పుంజములెన్నో. ఎన్నో రకాల సంగీత ధ్వనుల సమ్మేళనం! రకరకాల సుగంధాలు! వివిధరకాల సూర్యుల ప్రకాశం! ఎంతో మంది దేవతల నివాసస్థానాలు! ఇన్ని ఉన్నప్పటికీ దురదృష్టవంతుడైన మానవుడు భ్రమకులోనై శుష్కమైన బహిరంగ ప్రపంచంలోనే రమిస్తాడు. మానవుడి జీవితం కుక్క జీవితం వంటిది. కుక్క, ఎండిపోయిన ఎముక ముక్కను విడిచిపెట్టకుండా కొరుకుతూనే ఉంటుంది. దానివల్ల ఏమీ దొరక్క పోగా, పండ్లనుంచి రక్తం కారుతుంది. అయినా విడిచిపెట్టదు. అదేవిధంగా, మానవుడి బాహ్య జగత్తులో ఆనందాన్ని అన్వేషించడం మానడు. చివరకు ఏమి దొరుకుతుంది? శ్రమ, నీరసము.

బాహ్య జగత్తుకన్న అంతరజగత్తు శ్రేష్ఠం. చెవిలో అద్భుతమైన శ్రవణ కేంద్రం ఉంది! ఇది, ఎంతో దూరంనుంచి శబ్దాలను వినగలదు! కంఠప్రదేశంలో ఒక నిద్రా స్థానం ఉంది. మన జాగ్రదవస్థలో కలిగే శ్రమనంతటినీ ఇది పోగొడుతుంది. మానవుడు జాగ్రదవస్థలో అనగా, పగటిపూట, ఎంత సంపాదించినా చివరకు మిగిలేది శ్రమ మాత్రమే. గుఱ్ఱం మీద స్వారి చేసినా, ఏనుగు మీద ఎక్కినా చక్కటి పల్లకీలోగాని మరొక వాహనంలోగాని ప్రయాణం చేసినా ప్రొద్దు గుంకే సమయానికి అలసిపోతాడు మానవుడు. ధనం సంపాదించినా బంగారం సంపాదించినా రాజ్యం సంపాదించినా, రోజంతా గడిచినతర్వాత చివరకు మిగిలేది అలసట. నాటకాలు చూడండి, ప్రపంచంలోని సౌందర్యాలన్నిటినీ ఆస్వాదించండి, రత్నాలు - మణులు ఉన్న గనులను చూడండి, ప్రొద్దుగుంకేసమయానికి మిగిలేది అలసట తప్ప మరేమీ ఉండదు. పద్మవిభూషణ వంటి బిరుదులు, సత్కారాలు, ఎన్నిటినైనా పొందండి. కాని, రోజు

ముగిసిన తర్వాత మీకు స్వాగతం చెప్పేది అలసటమాత్రమే. విశ్వానికి ప్రభువైనా చివరకు అలసట తప్ప ఇంకేమీ మిగలదు. మంచిది.

అలసట పోగొట్టుకునేందుకు రాత్రిగాని లేదా పగటిపూటగాని నిద్రపోయి నపుడు, శ్రమ అంతా కంఠస్థానంలో నివారణ అవుతుంది. మనకు నిద్రవచ్చేది అస్థానంలోనే. నా ఆత్మీయులారా! మీరు నిద్రపోయే ముందు, అలంకరించుకున్న వస్తువులన్నిటినీ తొలగిస్తారు. కారణం. మీరు సంపాదించుకున్న వస్తువులేవీ మీరు నిద్రపోతున్న సమయంలో మీకు ఏ విధంగానూ ఉపయోగపడవు. నిద్రపోతున్న సమయంలో మీకు చెందిన విలువైన వస్తువుల గురించిగాని, మీ సంపద గురించిగాని జ్ఞాపకం వచ్చినట్లయితే మీకు నిద్రాభంగమౌతుంది. సంపద గురించి మరిచిపోకలిగినపుడే మీకు నిద్ర పడుతుంది. లేకపోయినట్లయితే నిద్రమాత్ర లను వేసుకోవలసి వస్తుంది. నిద్ర నుంచి లేచినపుడు హాయిగా ఉంటుంది. ఉత్సాహంగా ఉంటుంది. నిద్రరానపుడు అశాంతిగా ఉంటుంది. పిచ్చిపట్టినట్టు ఉంటుంది. ఎంతో బాధాకరంగా ఉంటుంది. దీనివల్ల తెలుస్తుంది, నిద్ర నిజంగా సంపద అని, కంఠం దీని స్థానం. ఈ స్థానాన్ని నేను 'శ్వేతేశ్వరి' అని వ్యవహరిస్తాను. ఇది విశుద్ధచక్రం. ఈ చక్రానికి అధిష్ఠాన దేవత కూడా ఉంది. పరమసుఖప్రదమైన నిద్రను మనకు ప్రసాదిస్తున్న ఈ కంఠ స్థానాన్ని తెలుసుకోలేనపుడు మీ శరీరంగురించి మీరు ఏమి తెలుసుకొనగలరు?

హృదయస్థానంలో హృదయకమలం ఉంది. దీని ఒక్కొక్క దళానికి ఒక్కొక్క గుణం ఉంది. ఇవి: కామం, క్రోధం, మోహం, లోభం, ప్రేమ, లజ్జ, జ్ఞానం, వైరాగ్యం, ఆనందం, సర్వజ్ఞత్వం మొదలైనవి. హృదయంలో అంగుష్ఠ మంత ఆకాశం ఉంది. ఇక్కడ ఒక దివ్యజ్యోతి వెలుగుతుంటుంది. ఈ జ్యోతిని దర్శనం చేసుకొనడంలోనే మునులు తమ జీవితాలను పరిపూర్ణం చేసుకునేవారు. ఎంత గొప్ప స్థానమిది? ఎంత భవ్యమైనది ఈ హృదయాకాశపు జ్యోతి! ఏ శక్తి వికసించినపుడు మానవుడి జీవితమే మారిపోతుందో ఆ భగవతీ శక్తి కుండలిని, ఎంత గొప్పది! అటువంటి అనంతమైన గుణసంపద అంతరంగంలో ఉండి కూడా బాహ్యజగత్తులో ఎటువంటి సుఖాన్ని అన్వేషిస్తున్నావో అర్థంకాదు! ధ్యానం చేయవు, సత్కర్మలు చేయవు! ఎంతో విలువైన ఈ శరీరం గురించి తగిన శ్రద్ధ వహించవు! ఇవేవీ చేయకుండా నువ్వు సుఖాన్ని ఏ విధంగా పొందగలవు?

**అజ్ఞానమనే నిద్రలో ఉన్న ఓ మానవుడా మేలుకో. ధ్యానం చేయి. మోక్షం కోసం కాదు. ధర్మసాధన కోసం కాదు. యోగ పదవినీ ప్రశంసలనూ పొందేందుకు కాదు. ప్రాపంచిక విషయాలను సాధించేందుకైనా ధ్యానం చేయి.** ప్రపంచంలో సౌందర్యం కోసం అన్వేషించి, అది దొరక్క, అలిసి పోతావు. సినిమాల్లో నాటకాల్లో ఆనందాన్ని వెతుక్కుంటావు, దేశవిదేశాలు పర్యటిస్తావు, దొరకదు. ఆఖరుకు సౌందర్యం కోసం జరిపే అన్వేషణలో నీ సౌందర్యాన్ని పోగొట్టుకుని కురూపివి అవుతావు. ఆనందం కోసం వెదికి వెదికి చివరకు నువ్వు పొందేది కష్టాలు, శ్రమ మాత్రమే. ఇప్పుడు చెప్పు నీ ఈ అన్వేషణలో ఎంత యదార్థం ఉన్నది?

మరొకమాట! రకరకాల ఆహారపదార్థాలు, పానీయాల్లో నువ్వు రుచులను వెదుకుతున్నావు. టీ, కాఫీ, కోకాకోలా, క్షీరాన్నం – వీటి కోసం హోటళ్లకు క్లబ్బులకు వెళ్లావు. ఏమి దొరికింది? రసాన్వేషణ జరిపి జరిపి చివరకు నువ్వే రసహీనుడవై పోయినావు. నీ ముఖం వాడిపోయింది. డబ్బు ఖర్చయిపోయింది. రసానికి బదులు నీకు మిగిలింది రోగాలు – జీవితమే అంతంగానున్నది! అనేక రకాల రసపూరితమైన వంటకాలను వండుకొనడం, వాటిని తినడం చేస్తూ చేస్తూ నీ స్వంతరసాన్ని పోగొట్టుకున్నావు. మొదట ఉన్న రసం కూడా పోయింది. హృదయంలో సహజంగా ఉన్న సత్యమైన ఆనందమయమైన, విమలమైన, అమూల్యమైన రసాన్ని పొందలేకపోయినావు.

సుగంధ అన్వేషణలో కూడా ఇదే జరిగింది. కొత్త కొత్త అత్తరులు, సుగంధ పుష్పాలు, పారిస్ సెంట్లలో కొత్త కొత్త సువాసనలను అన్వేషించావు. ఆనందం కోసం వాటిని వాడావు. సువాసనలను వెదుక్కుంటూ ఉండగా ముసలితనం వచ్చేసింది. చివరకు దుర్గంధమే ప్రాప్తించింది. ఓ జీవాత్మా! కొంత ధ్యానం చేసి చూడు. భ్రుకుటి, నాసిక కలిసే స్థానంలో సాటిలేని సుగంధముంది. తమ్ముడా! అక్కడ దుర్గంధం కూడా సుగంధంగా మారుతుంది. అక్కడ జీవాత్మ పరమానంద భరితమౌతుంది.

శబ్దజాల వ్యామోహం కూడా కలిగింది నీకు. నీ గురించి అందరూ మంచి మాటలే చెబితే బాగుంటుంది నీకు. దానికి గాను నువ్వు ఎంత మందిని సంతోషపెట్టావు? మంచి చేసుకున్నావు? 'వార్తా పత్రికల్లో నా గురించి ఏమి వ్రాశారు? నన్ను ఎంత పొగిడారు?' ఇదే ధ్యాస. ధనమిచ్చి రహస్యంగా పుస్తకమొకటి వ్రాయించుకుంటావు.

ఎవరూ దాన్ని కొనకపోతేనేం? ఉచితంగానే పంచిపెడతావు. ప్రశంసలను వినేందుకు ఎంత పిచ్చివాడివి అవుతావు? 'భర్త ఏమన్నాడు? భార్య ఏమన్నది? బాబా ఏమన్నాడు? ఇంకొకరు ఏమన్నారు? సభలో మన గురించి ఏమి చెప్పారు?' ఇదే ఆలోచన. మన గురించి మంచిమాటలు విన్నప్పుడు సంతోషంకలిగేమాట నిజమే. కాని, అది నిజమైన సంతోషం కాదు. మనస్సును మైమరపించే ఆనందం కాదు. ముఖం ఆనందంతో వెలిగిపోదు. మంచి సంగీతం విన్నావు. మంచి సంగీతం నేర్చుకున్నావు, అయినప్పటికీ అంతస్సులోని ప్రేమ పుష్పం మాత్రం వికసించలేదు. **''సోహం శబ్దాచి లాయీ. పహుడత్ రఘులో''** సోహం శబ్దంలో నాకు విశ్రాంతి దొరికింది అంటారు సాధుజనులు. చివరకు ఆశబ్దం కూడా వినలేదునువ్వు. ఓ జీవాత్మా, నీ ప్రయాణం ఎక్కడికి? అన్నీ విన్నావు. కాని, గురు ముఖంగా వినవలసిన శబ్దాన్ని వినలేదు. అది విన్నప్పుడు అమృతమే ఆస్వాదిస్తావు. ప్రపంచమంతటా కొత్త చైతన్యం కళకళ లాడుతున్నట్టు కనిపిస్తుంది.

స్పర్శ సుఖమూ అటువంటిదే. దాని కోసం నువ్వు పూర్తి ఉన్మాదిగా మారావు. పరుపుల్లో దానికోసం ప్రాకులాడావు, దొరకలేదు. దుస్తుల ద్వారా పొందాలని చూచావు, అదీ దొరకలేదు. పూల పానుపులో అన్వేషించావు, అక్కడా దొరకలేదు. పట్టు పీతాంబరాలు సుఖమివ్వగలవని ఆశించావు, అదీలేకపోయింది. స్పర్శ సుఖాన్ని వెదుక్కుంటూ మరొక మానవాకృతిని సంపాదించుకుని ఆ సుఖాన్ని పొందాలని ఆశించావు. కాని అప్పుడు కూడా నీకు సంతృప్తి లభించలేదు. ఆ స్పర్శ కూడా నీకు సుఖాన్ని ఇవ్వలేకపోయింది. దాదాపు నీ జీవితకాలమంతా స్పర్శ సుఖాన్ని వెదుక్కుంటూ అనేక రకాల ప్రయత్నించావు. నీ స్పర్శేంద్రియాలు మొద్దుబారిపోవడంతప్ప మరొక ఫలితం లేకపోయింది.

ఓ కర్మహీనుడా! నీ అంతశ్శక్తి జాగృతమైనట్టయితే పరమానందమయ పరాశక్తి, నీ శరీరమంతా క్రియారూపంలో వ్యాపిస్తుంది. అరె! నువ్వే స్వయంగా స్పర్శ సుఖాన్ని అందచేయగల సముద్రంగా మారిపోతావు.

ముక్తానంద చెబుతున్నది వినండి. ఓ ప్రజలారా! ఇంద్రియాలకు ప్రియమైన విషయాల కోసం ప్రపంచంలో అన్వేషిస్తున్నారు కదా, వాటి కోసమే ధ్యానం చేయండి. మీరు అన్వేషిస్తున్నవన్నీ మీలోపలే ఉన్నాయి. అవి మీకు లభిస్తాయి. మీ జీవితం

పూర్తిగా రసమయమౌతుంది. మీ జీవితం స్వర్గతుల్యమౌతుంది. పరమేశ్వరుడి అనుగ్రహం వల్ల అంతశ్శక్తి జాగ్రుతమైనప్పుడు ధ్యానం ప్రారంభమౌతుంది. మీ శక్తిని ప్రేమించండి. అంతరాత్మను ఆదరించండి. అంతరంగంలో ధ్యానం చేయండి. అక్కడ ఉన్న శక్తి కారణంగానే నిన్ను 'నిన్ను'గా వ్యవహరిస్తున్నారు. ఆ శక్తిని ధ్యానించండి. మీరుభయులు పతి-పత్ని రూపంలో పరస్పర ప్రేమతో సమర్పణ భావంతో జీవించడానికి మీ ఇద్దరిలో మీ రూపాలలో ఉన్న పారమేశ్వరి అనుగ్రాహికశక్తి కారణం. ముక్తానంద ఆరాధించే పారమేశ్వరి శక్తి కూడా ఇదే. ఏ మార్గాన్ని అనుసరించే వారైనప్పటికీ ధ్యానం చేయవచ్చు. ఆత్మ ధ్యానం చేయడాన్ని ఏ మార్గమూ నిషేధించదు. ఓ స్త్రీ పురుషులారా! ఏ జాతికి చెందిన వారైతేనేమి? మీలో ఉన్న పరాశక్తిని ధ్యానం చేయండి. ఏ దేశ వాసులైతేనేమి? ఆత్మ శక్తిని ధ్యానం చేయండి. అరె! అమాయక ప్రజలారా! మీరు ఏ పార్టీకి చెందిన వారైనా కావచ్చు. మీరు చేసే ధ్యానసాధన మీ పార్టీ వ్యవహారాలకు ఏ మాత్రం విఘ్నంకాదు. అంతరంగ ధ్యానం మీ పార్టీకి, మార్గానికి, ధర్మానికి, డిగ్రీలకు, నాయకత్వ పదవులకు, అధికార పదవులకు, స్వామిత్వానికి, మఠాధిపత్యానికి ఏ విధంగాను అంతరాయాన్ని కలుగచేయదు. నువ్వు మండలేశ్వరుడవైనా ధ్యానం చేయి. ధ్యానం నీ పదవులకు భంగమని అనుకోరాదు. నీ ధ్యానానికి నీ పదవే భంగం కలిగించేట్టయితే అది అల్పమైన పదవే అవుతుంది. అటువంటి పదవి వల్ల ప్రయోజనమే లేదు. బాలుడుగాని బాలిక గాని, స్త్రీగాని, పురుషుడుగాని, బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వానప్రస్థుడుగాని, సన్యాసిగాని- మీరెవరైనాసరే ధ్యానం చేయండి. ఆత్మను అన్వేషించు, ఆత్మను ధ్యానం చేయి, అది లభిస్తుంది. ఇంట్లో ఉన్నట్టయితే ఇంట్లోనే చేయి. అడవిలో ఉన్నట్లయితే అక్కడ నేచేయి. పట్టణంలో ఉన్నట్టయితే పట్టణంలోనే, గ్రామంలో ఉన్నట్టయితే గ్రామంలోనే, ఎక్కడ ఉంటే అక్కడనే ధ్యానంచేయి. రోగి అయినా, వైద్యుడైనా, వాది అయినా న్యాయవాది అయినా, దరిద్రుడైనా సంపన్నుడైనా **ధ్యానం చేసినప్పుడు ఆత్మశాంతి లభిస్తుంది.** నీ పంచేంద్రియాల ద్వారా జరిగేక్రియలు ఫలించేది ధ్యానంలోనే. సకల విద్యల ప్రాప్తికేకాక జీవన్ముక్తికి జరిపే కృషి ఫలించేది కూడా ధ్యానంవల్లనే.

ధ్యానం చేయగా చేయగా, అంతవరకు తెలియకుండా ఉన్న నీ ఆంతరిక శక్తి వికసిస్తుంది; దానితో, ధ్యానం ఇంకా ఎంతో బాగా జరుగుతుంది. నీ రూపమే వికసిస్తుంది. నీ అంతరంగంలో ఉన్న దివ్య జ్యోతుల గురించి జ్ఞానం కలుగు తుంది. ఈ జ్యోతుల ఉనికి వల్లనే, మాంసంతో కూడిన నీ శరీరం అందంగా ఉంటుంది. ఈ

జ్యోతుల ఆకర్షణ వల్లనే మీ పరస్పర ప్రేమ అను భవంలోకి వస్తుంది. ధ్యానం చేయగా చేయగా, దివ్యమైన, ప్రకాశిస్తున్న, జ్యోతి ఉదయించి, సుందరమైన 'రూపాల' పట్ల నీకున్న మొట్ట మొదటి ప్రాపంచిక వాంఛ తీరుతుంది. మన్మధుడి రూపం కూడా ఈ జ్యోతి ముందు దిగదుడుపే. అటువంటి జ్యోతిని భార్యాభర్తలు పరస్పరం చూచు కుంటారు. సుందరమైన ఈ జ్యోతి దర్శనం అయిన తర్వాత మీకు ఒక అమూల్యమైన వస్తువు లభించిన అనుభూతి కలుగుతుంది. ప్రపంచం తేజోమయంగా కనిపిస్తుంది.

జ్యోతి యొక్క సుందర రూపం దర్శనమైన తర్వాత దాని మిత్రమైన శబ్దం కూడా ప్రత్యక్షమౌతుంది. అప్పుడు మధురమైన సంగీతాన్ని వినకలుగుతావు. శిరస్సులో అనంతమైన గుణ సముదాయ రూపంలో నాదం ఉదయిస్తుంది. ఈ ధ్వనిని విన్నప్పుడు సుఖప్రదమైన నిద్ర పడుతుంది. ఇటువంటి నిద్రను దేవతలే అనుభవిస్తారు. ఈ సంగీతాన్ని విన్నప్పుడు నువ్వు నాట్యం చేస్తావు. అంతవరకు వున్న ఉదాసీనత, నిరుత్సాహం, మానసిక తాపం, అర్థంలేని దిగుళ్ళు- అన్నీ తొలగిపోతాయి. ఈ సంగీతంవల్ల నీ జీవితం కళకళలాడుతుంది. ఓ ప్రపంచవాసులారా! ఈ ధ్వని విన్నతర్వాత రేడియో సంగీతం రుచించదు. నాలుగువైపులా వినవస్తున్న వార్తల్లో ఆసక్తి ఉండదు. ఇతరులతో సంభాషణకూడా రుచించదు. నీకు రేడియో, ట్రాన్సిస్టర్, టెలివిజన్ ఖర్చుండదు.

అంతే కాదు, ఈ ధ్వని ఒక దివ్యమైన రసాస్వాదన చేయిస్తుంది. ఈరసం, నీ అంగిట్లో నుంచి లభ్యమయే రసం, సుందరమైనది, మధురాతి మధురమైనది. ఒక్కొక్క బిందువు మూల్యం కొన్ని కోట్ల రూపాయలుంటుంది. ప్రపంచంలో నివసించే వారందరు ప్రేమించతగినది. ఈ రసాన్ని ఆస్వాదించినపుడు అన్ని రోగాలు నశిస్తాయి. నువ్వు స్వయంగా రసమయమౌతావు. ఆ తర్వాత నువ్వుతినే అన్ని రకాల ఆహార పదార్థాలు, అవి ఎండిపోయినా, పచ్చివైనా, అమృతతుల్యంగా ఉంటాయి. కోపతాపాలు నశిస్తాయి. కోరికలు తగ్గుతాయి. నేను-నాది అన్న భావం తొలగిపోతుంది. స్వయంగా అమృతరస స్వరూపమౌతావు. ఆతర్వాత, భార్యభర్తల మధ్య కుటుంబ సభ్యుల మధ్య ప్రేమచోటుచేసుకుంటుంది. ''**రసోవైసః! రసంహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి.**'' ఈ రసాన్ని ఆస్వాదిస్తూనే రసమయం కావడంతోపాటు నీకు నీలోపల ఆనందానుభూతి కలుగుతుంది. అదే దేవరసం, అదే ప్రేమరసం, అదే యోగరసం, నువ్వు నీ జీవితంలో అన్వేషిస్తున్న రసం కూడా ఇదే. ఈ రసం లభించనంతవరకు జీవితం నిస్సారము, శుష్కము, నీరసము. అరె! ఈ రసం

లభించినపుడు రసహీనంగా ఉన్న ప్రపంచం రసమయమౌతుంది, దానితోపాటు నీ జీవితం సుఖమయ మౌతుంది.

ఓ సోదరులారా! అక్కడ సుగంధం కూడా ఉంది. రూపము, రసము, ధ్వని ఉన్నస్థానంలోనే వాటి నాల్గవ సహచరి అయిన సుగంధం కూడా ఉంది. మానవ శరీరంలో ఉన్న సుగంధం వికసించినపుడు అది ప్రపంచమంతటా వ్యాపిస్తుంది. ఇల్లంతా వ్యాపిస్తుంది. మీకు కూడా ఒకరిలో మరొకరికి ఆ సుగంధమే వస్తుంది. అప్పుడు చిత్తం శాంతపడుతుంది. జడత్వం, మాంద్యం నశిస్తాయి. ప్రతి అంగంలో స్ఫూర్తి కలుగుతుంది. అప్పుడు నీ జీవితంలో ఏదైనా లోటు ఉన్నప్పటికీ వెలితిగా ఉండదు. స్వజనులు, పిల్లలు, గురుజనులు-వీరందరిపట్ల దివ్యమైన ప్రేమ కలుగుతుంది. ప్రపంచమంతా ప్రేమభావంతోనూ, సమభావంతోను నిండి ఉన్నట్టు సంతోషంగా గానం చేస్తావు.

ఓ మానవుడా నువ్వు అన్వేషించిన అయిదవ వస్తువు స్పర్శ. దానికోసం నువ్వు ఎంతో తపించావు. స్పర్శలో సుఖాన్ని శాంతిని ఆనందాన్ని అన్వేషించావు. అందంగా అలంకరించుకున్న భార్యలో దానికోసం అన్వేషించావు. కాని, నీకు లభించినది కేవలం తాపమే. సంపూర్ణమైన ఆనందంకోసం నువ్వు నీ భార్యను స్పృశించావు. కాని లభించినది సంపూర్ణమైన క్షోభ.

నీకు ఎప్పుడూ ఆనందం లభించలేదు. కాని మానవుడి లోపల ఉన్న శక్తి వికసించినపుడు, మహాశక్తి కుండలిని యొక్క ప్రేమ ప్రవాహం సర్వాంగాలకు, 72 కోట్ల నాడులకు వ్యాపిస్తుంది. ఇది ప్రతి రక్తకణంలోకి ప్రవేశించడంతో నీకు నీ శరీరమంతటా ఆనందానుభూతి కలుగుతుంది. అప్పుడు, మానవ శరీర స్పర్శకోసం నీవు పడిన తపన తీరుతుంది. ఈ విధంగా నీ జీవితం కూడా పూర్తిగా రసమయము, ఆనందమయము, ప్రేమమయము అవుతుంది. ఆతర్వాత, కన్నులలో, అంతకు ముందున్న వెలుగు, మళ్ళీ వస్తుంది. ఎండిపోయి ఉండిన ముఖం, ప్రేమతో నునుపవుతుంది. పెదవులు ఎరుపెక్కుతాయి. ముఖం కళకళలా డుతుంది! అప్పుడు స్పర్శ సుఖాన్ని పూర్తిగా పొంది, సర్వత్రా, సుఖానుభూతిని పొందుతావు. భర్తకు భార్య దేవతగాను, భార్యకు భర్త దేవుడుగాను కనిపిస్తారు. పిల్లలు అత్తమామలు ఇరుగుపొరుగువారు, అందరూ దేవతలుగానే కనిపిస్తారు. దేవుడు మందిరంలో మాత్రమే ఉండడు. ఇల్లు దేవాలయ మవుతుంది. నువ్వు కూడా దేవుడివైపోతావు. అప్పుడు నువ్వు సుందరమైన రూపాన్ని చూస్తావు. రసాస్వాదన చేస్తావు. సువాసనను

ఆఘ్రాణిస్తావు. శ్రావ్యమైన **ధ్వనిని** వింటావు. **స్పర్శ** సుఖాన్ని పొందుతావు. ఈ విధంగా నీ జీవితం పూర్తిగా మారిపోతుంది. ఆ తర్వాత నువ్వు గానం చేస్తావు:

**అవఘాచీ సంసార్ సుఖాచా కరీన్,**
**ఆనందేః భరీన్ తీన్‌హీలోక్.**

– సంత్ జ్ఞానేశ్వర్

''ప్రపంచాన్ని పూర్తిగా సుఖమయం చేద్దాం. మూడు లోకాలను ఆనందంతో నింపుదాం''

అనంతరం, వనంలో కృష్ణుడు, మనస్సులో కృష్ణుడు, మనలో కృష్ణుడు, మనం కృష్ణుడిలో– ఈ విధంగా భావిస్తూ రోజంతా సంతోషంతో నాట్యం చేస్తావు. కృష్ణుడేపతి – కృష్ణుడే పత్ని – కృష్ణుడే బుద్ధి– కృష్ణుడే లక్ష్యం అన్న మంత్రాన్ని జపిస్తావు. 'ఇరుగు పొరుగు వారు ఆయన మూర్తులే ఈ ప్రపంచమంతా ఆయనదే, ఆయనే దీన్ని నిర్వహిస్తున్నాడు,' అన్న భావం కలుగుతుంది. ప్రియమైన జనులారా, ఈ విధంగా మీ ఇల్లే ఒక పుణ్యక్షేత్రమౌతుంది. భార్యాభర్తలు ఒకరినొకరు దేవతగా భావిస్తారు. నీ గృహకృత్యాలు పూజగా మారుతాయి. నీ జీవన విధానం దేవతల జీవన విధానంగా మారుతుంది. ముక్తానంద చెపుతున్నది విను: నిత్యావసరాలు కూడా ధ్యానం వల్లనే తీరుతాయి. దైనందిన వ్యవహారాల నుంచి విశ్రాంతి పొందే స్థానం కూడా ధ్యానంలోనే లభ్యమౌతుంది. ధ్యానం నీకు మిత్రుడు, మార్గదర్శకుడు, నీ కోరికలను తీర్చగల కామధేనువు, కల్పవృక్షము. అందువల్ల ప్రతిదినము కొంత సేపు ధ్యానం చేయడం అభ్యసించు.

రెండు

# ప్రపంచంలో పరమార్థం

మానవుడు ధ్యానయోగాన్ని తన నిత్యజీవితంతో జోడించి తన విధులను నిర్వర్తించుకుంటూ ధ్యానయోగాన్ని సాధనచేసి నట్టయితే, త్రివిధ తాపాలతో నిండిన ఈ ప్రపంచం స్వర్గంగా మారుతుంది. నిజానికి ఈశ్వరుడి నుంచి విముఖం కావడం చేతనే ఈ ప్రపంచం దుఃఖమయము యాతనామయము అయింది. పాయసం చేశారనుకోండి. బాదం పిస్తా ఏలక్కాయలు మొదలైన వాటిని వేశారు దానిలో. కాని ముఖ్యమైన పంచదార వేయడం మరచిపోయారు. అప్పుడు దానికి రుచి ఎక్కడనుంచి వస్తుంది. అదే విధంగా ప్రపంచంలో రుచి, పరమాత్మ ధ్యానం వల్లనే లభిస్తుంది.

మానవుడు ధ్యానం ద్వారా ప్రపంచాన్ని తన ఆప్తమిత్రుడుగా చేసుకుంటాడు. భగవత్ ధ్యానంలేని ప్రపంచం దుఃఖమయము యాతనామయము అవుతుంది. నిజానికి ఈ ప్రపంచం సుఖపడేందుకు ఒక గొప్ప సాధనం; కాని ఈ ప్రపంచంలో భగవంతుడిని పూర్ణ రూపంలో చూడకలిగినపుడే అది సాధ్యం. భగవంతుడి స్మరణ, ఆయన ధ్యానం, ఆయన గురించిన జ్ఞానం లేనట్టయితే ఇదే ప్రపంచం పనికి మాలినదిగాను రుచిలేనిదిగాను రసహీనమైనదిగాను మారుతుంది.

ప్రపంచాన్ని, స్వజనాన్ని త్యాగం చేయనవసరంలేదు. ఈశ్వరుణ్ణి వెదుక్కుంటూ నాలుగువైపులా పరుగులు పెడుతూ అలసిపోనవసరంలేదు. శాంతిని విశ్రాంతిని వెదుక్కుంటూ నిన్ను నువ్వు పోగొట్టుకోవద్దు. ప్రియ మానవులారా! మీ స్వగృహాలలోనే ఉండండి. భార్యాభర్తలతో పిల్లలతోనే ఉండండి. మీ మీ వృత్తులను కళలను పనులను సంతోషంగా నిర్వర్తించుకుంటూ ఉండండి. మీమీ అదృష్టానుసారం మీరు ధనవంతులైనా శ్రామికులైనా రాజులైనా పేదవారైనా, భగవంతుడు అందరివాడు. ధనవంతులకు ఎంత చెందుతాడో బీదలకుకూడా అంతే చెందుతాడు. గోపికలకు ఎంత చెందుతాడో గృహిణులకు కూడా అంతే చెందుతాడు. ఋషులకు మునులకు యోగినులకు యోగులకు ఎంత చెందు తాడో గృహస్థులకు కూడా అంతే చెందు

తాడు. భగవంతుడిని ప్రేమతో ఆహ్వానించు, ప్రేమతో ధ్యానించు. నీ అంతరంగంలో ఆయన దర్శనమిస్తాడు. ఆయన యొక్క ప్రేమపూరితమైన దివ్యమైన ప్రకాశం దర్శనమిస్తుంది. నీలోపల సహస్రారంలో ప్రేమామృతపు చల్లటి శాంతి ధార ప్రవహించడం ప్రారంభమౌతుంది. నువ్వు స్వయంగా ఆనందం యొక్క రూపమేనని అప్పుడు నీకు అనుభవంలోకి వస్తుంది. నువ్వు పూర్తిగా మారిపోతావు. ''ఆ శివుడు నేనే నేనే,'' ''రాముడు కృష్ణుడు నేనే నేనే'' అన్న భావం కలుగుతుంది. ఈ మాటలు నువ్వు ప్రేమతో గానం చేస్తావు. చాలా కాలంగా ఉన్న నీ వేదన అనేక జన్మలుగా ఉన్న రోదన నశిస్తుంది. ''నేను దరిద్రుడిని పామరుడిని దీనుడిని'' అన్న శోకం ముగుస్తుంది.

నీ శరీరం సప్తధాతువులతో కూడిన మాంసపిండం మాత్రమేనని భావించ వద్దు. విషయవాసనలకు కేంద్రం కానపుడు ఈ శరీరం చాలా గొప్పది. అన్ని పుణ్య తీర్థాలు, అందరు దేవతలు, అన్ని మంత్రాలు, అన్ని రకాలసిద్ధులను ప్రసాదించగల స్థానాలు అన్నీ నీ శరీరంలోపల ఉన్నాయి. భగవాన్ శ్రీ నిత్యానంద, పాతకథ ఒకటి చెప్పారు మాకు. అయితే అది నిజంగా జరిగినది. ఒక భార్యా భర్తల జంట, అన్ని పుణ్యతీర్థాల్లో స్నానం చేసి, పృథివికి ప్రదక్షిణం చేసి, దేవతలందరిని పూజించాలని సంకల్పించి మ్రొక్కుకున్నారు. కాని, వారి సంకల్పం నెరవేరలేదు. రోజులు గడిచిన కొద్దీ వారికి తమ మొక్కుబడి గురించి దిగులు పుట్టింది. ఆ సమయంలో వారు, అనుభవజ్ఞుడూ శాస్త్రజ్ఞుడూ అయిన ఒక మంచి సాధుపుంగవుడి దగ్గరకు వెళ్లి తమ మొక్కుబడి గురించి చెప్పుకున్నారు. ఆ పండిత మహాపురుషుడు వారితో ఈ విధంగా అన్నాడు. ''భయపడకండి. ఇక్కడికి దగ్గరలోనే ఒక భార్యాభర్తల జంట ఉన్నారు. వారు, బ్రహ్మ నిష్ఠాసంపన్నులు. వారు, ఈ ప్రపంచాన్ని పరమార్థమయం చేసుకున్నారు. ధ్యానయోగం ద్వారా ఆంతరిక శక్తిని మేల్కొల్పుకున్నారు. షట్చక్రాలలోని దేవతల యొక్క మంత్రాల యొక్క స్థానాలను పరిశుద్ధపరచి, మహాయోగ పరాయణులై కుండలినీ యోగం ద్వారా తాము స్వయంగా పరమశివుడి అవతారంగా మారారు. వారు, పవిత్రమైన దంపతులు. వారిలో మహాశక్తి, చిత్‌శక్తి క్రీడిస్తూ ఉంటుంది. మానవరూపంలో ఉన్నప్పటికీ వారి శరీరమంతటా చిత్‌శక్తి వ్యాపించి ఉంటుంది. అన్ని పుణ్యతీర్థాలు, అందరు దేవతలు, వారిలో నివసిస్తున్నారు. వారు సంపూర్ణంగా పరమ శివ పరాయణులు. అక్కడికి వెళ్లి వారికి మూడుసార్లు ప్రదక్షిణం చేసి, కానుకలను సమర్పించుకుని, ఒక్కసారి ప్రేమపూర్వకంగా మనస్సులో ధ్యానం చేసుకొనండి. మీ సంకల్పం నెరవేరుతుంది.''

ఈ మాటలు అక్షరాలా నిజం. ప్రియమానవుడా! నీ లోపల సర్వతీర్థాలు, సర్వమంత్రాలు, సర్వబీజాక్షరాలు, దేవతలందరితో పాటు స్వయంగా పరమేశ్వరుడే నివాసం చేస్తున్నాడు. కైలాసంలో, వైకుంఠంలో ఎంత ఉన్నాడో మీలోనూ అంత ఉన్నాడు. మీ లోపల ఉన్న ఆయన్ను, లోపలే అన్వేషించకుండా ఎందుకు బయట అన్ని ప్రదేశాల్లో అన్వేషిస్తూ అవస్థపడతారు? మీరందరు మీ ప్రాపంచిక వ్యవహారాలను నిర్వహించుకుంటూనే, మీ మార్గాలను అనుసరిస్తూనే, ఈ అంతరాన్వేషణకు ప్రాధాన్యమిచ్చి మీ జీవితాలను కొనసాగించడం మంచిది. మీరు ఏ మార్గానికి ఏ మతానికి ఎటువంటి నిష్ఠకు చెందిన వారైనా, సాధారణ వ్యక్తులు, అల్పులు, మూఢులు, బలహీనులు కారాదు. ఈ శరీరం ఈశ్వర రహితమని భావించి పతనానికి వినాశనానికి దారితీసే మార్గంలో పోరాదు. నిన్ను నువ్వు సాధారణ మానవుడిగా భావించి ఆత్మఘాతం చేసుకోవద్దు. నీకున్న అల్ప జ్ఞానంతో అల్పుడినని, మూర్ఖుడినని భావించి, నీ చేతులతోనే ఆత్మహత్య చేసుకొనవద్దు. భగవంతుడి ఈ వాక్యాన్ని గుర్తుంచుకో: **ఆత్మైవహ్యాత్మనో బంధు రాత్మైవ రిపురాత్మనః.** ఆత్మే నీకు మిత్రుడైనా శత్రువైనా, అని దీనికి అర్థం. నరకమో స్వర్గమో నీ చేతిలోనే ఉంది. కాలయాపన చేయకుండా ఆత్మ సంక్షేమం కోసం అన్వేషణను వెంటనే ప్రారంభించండి. బయటి ప్రపంచంలో ఉన్నతికోసం కళాశాలలకు విదేశాలకు వెళ్లి విద్యాభ్యాసం చేసి డాక్టర్లు, వకీళ్లు, ఇంజనీర్లు, ప్రొఫెసర్లు అయిన విధంగానే, ఇంజనీరుగా, డాక్టరుగా ఉంటూనే, ఆధ్యాత్మిక శాంతిని పొందేందుకు, మీ ఇంటిని యోగమందిరంగా మార్చుకుని శివుడిని ప్రాప్తించుకోడానికి శ్రీ గురుదేవుడి అన్వేషణ ప్రారంభించండి.

మూడు

# గురుమాహాత్మ్యము

పరమేశ్వరుడి సాక్షాత్కారం గురువుయొక్క కృప వల్లనే సాధ్యం. శ్రీ గురువు, జ్ఞానంతో ప్రకాశించు పరబ్రహ్మాయొక్క వారసుడు. అటువంటి గురువుయొక్క మహాకృపను పొందడం అవసరం. శ్రీగురుకృపచేత అంతర్శక్తి జాగృతం కానంతవరకు, అంతర్శక్తి ప్రకాశించనంతవరకు, అంతరంగంలోని దివ్యజ్ఞాన నేత్రం తెరుచుకోనంతవరకు మన జీవదశ నాశనం కాదు. జీవదశ ఉన్నంతకాలం బ్రహ్మాదశ యొక్క దివ్యానుభూతి అనుభవంలోకి రాదు. రాజు, నిద్రపోతూ, స్వప్నంలో తాను బికారి అయినట్లు భావించి కలవర పడతాడు. అదే విధంగా అజ్ఞాన నిద్రలో ఉన్న ఈ ఆత్మ, తాను బద్ధ జీవుడినని, అన్నిటికీ కర్త, భోక్త స్వయంగా తానే అనీ తాను అల్పుడు సాధారుణుడు అనీ భావించి దుఃఖిస్తుంది. అందువల్ల అంతర్శక్తి వికాసానికి గాను, దివ్యత్వ ప్రాప్తికిగాను, పరమశివ పదాన్ని పొందేందుకుగాను, మనకు మార్గదర్శకు లొకరు అవసరం. అనగా, సంపూర్ణ సత్యాన్ని తెలుసుకున్న, శక్తివంతమైన సద్గురువు, అత్యంత అవసరం. ప్రాణం లేకుండా జీవించలేముకదా. అదేవిధంగా, గురువు లేకుండా జ్ఞానం కలుగదు. శక్తి వికసించదు. అంధకారం నశించదు. మూడవ నేత్రం తెరుచుకోదు. మిత్రుడు, కుమారుడు, బంధుజనం, పత్ని-వీరందరికన్నా గురువు ఎక్కువ అవసరం. ధనం, లలిత కళలు, పదవులు, అధికారాలు-వీటన్నిటికన్నా గురువు ఎక్కువ అవసరం. ఎక్కువ ఏంచెప్పను? ఆరోగ్యం, ప్రాణంకన్నా గురువు ఎక్కువ అవసరం. శ్రీగురు కృపవల్లనే మనలో ఉన్న శక్తిని వికసింప చేసుకోగలుగుతున్నాము. గురువు యొక్క మహిమ, రహస్యమయము, అతి దివ్యము. గురువు మనకు కొత్త జన్మనిస్తాడు. జ్ఞానం గురించి తెలియచెబుతాడు. సాధన గురించి తెలియచేసి ఈశ్వరుడిపట్ల ప్రేమను కలుగచేస్తాడు.

ప్రపంచంలో గురువులు చాలామంది ఉన్నారు. ప్రతి ఒక్కరు గురువే. ఎక్కడ చూచినా గురువులే. ఇంతమంది గురువుల పరస్పర విరుద్ధములైన బోధనలను విని ప్రజలు కూడా అలిసిపోయారు. ప్రతి ఒక్క గురువు ఒక కొత్త మార్గాన్ని బోధిస్తాడు.

ఈ గురువులు ఎవరికీ శిష్యరికం చేయలేదు కాని, అందరికి గురువులు మాత్రం అవుతారు. అనేక మతాలు అనేక మార్గాలు. ఇది కూడా ఒక జీవనోపాధి అయింది. శ్రమలేని ఉపాధి ఇది. కాని ఈ విధంగా జరుగరాదు.

శిష్యుడి అంతర్శక్తిని జాగృతం చేసి ఆత్మానందంలో రమింపచేయగల వ్యక్తి మాత్రమే గురుస్థానంలో ఉండగలడు. గురువు అన్న పదానికి వ్యాఖ్యానం ఇది : **శక్తి పాతం ద్వారా అంతర్శక్తియైన కుండలినిని జాగృతం చేయుట, అనగా మానవ దేహంలోని పారమేశ్వరి శక్తిని మేల్కొల్పి సంచరింపచేయుట, యోగం గురించి శిక్షణ నిచ్చుట, జ్ఞానోదయం ద్వారా ఆనందానుభూతిని కలుగచేయుట, భక్తిపట్ల ప్రేమను కల్పించుట, కర్మలో నిష్కామత్వాన్ని నేర్పించుట, సజీవంగా ఉన్నప్పుడే మోక్షాన్ని ప్రసాదించుట- వీటన్నిటిని చేయగలవాడే గురువు. అటువంటి పరమగురువు శివుడి కన్నా వేరుకాదు.** అటువంటి గురువు శివుడు, రాముడు, శక్తి, గణపతి, తల్లి-తండ్రికూడ. అందరికీ పూజనీయుడైన పరమగురువు, ఆది గురునాథుడి నుంచి ఈ నాటివరకు శిష్యుల శరీరాల్లో జ్యోతిని ప్రజ్వలింపచేసి అనుగ్రహరూపంలో కృపను ప్రసాదించి లీలారాముడై ఉంటాడు. గురు ప్రసాదం వలన నరుడు నారాయణ రూపమై ఆనందంలో లీనమై తన్మయుడవుతాడు. అటువంటి గురువు అత్యంత మహిమాన్వితుడు. సాధారణ జనులు, ఆయనను అర్థం చేసుకొనలేరు.

గురువులకు ప్రాపంచిక విషయాల గురించి బాగా తెలుసును. అదృష్ట, దురదృష్టాల గురించి వారు పూర్తిగా ఎరుగుదురు. పరమాత్మ జ్ఞానం గురించి వారికి సంపూర్ణంగా తెలుసును. పరమార్థంలో నిష్ణాతులు. ప్రాపంచిక విషయాలలో కూడా వారికెంతో నేర్పు ఉంటుంది. అటువంటి గురుజనుల ఆశ్రయంలో ఉండే శిష్యులు, పెద్ద పెద్ద కష్టాలను కూడా అతి సులభంగా దాట గలరు. సిద్ధాశ్రమంలో ఉండే సాధకులు, పెద్ద విపత్తులు సంభవించిన సమయాల్లో కూడా నిర్భయులుగా ఉంటారు. పూజ్యనీయులైన మా గురువు నిత్యానందులవారి అండన ఉన్న భక్తజనులకు ఎటువంటి భయము ఉండేది కాదు. భగవాన్ నిత్యానంద, గొప్ప దివ్యాతిదివ్యమైన గురువు. ఆయన జీవితం అత్యంత రహస్యమయమైనది. ఆయన మహిమ అసామాన్యం. భగవాన్ నిత్యానంద తమ భక్తులకు వారివారి ఇండ్లలోనే, వైకుంఠసుఖాన్ని కలిగించేవారు. ఆ మహాపురుషుడు కేవలం తన కృపచేత భక్తులను యోగులుగా

మార్చేవారు. కఠిన సాధన చేయనవసరం లేకుండానే సాధకులను భక్తి పారవశ్యానికి దాసులుగా తీర్చిదిద్దే వారు. కృపమాత్రం చేత జ్ఞానదృష్టిని కల్పించేవారు. ఈ ప్రపంచంలోనే బ్రహ్మ సాక్షాత్కారాన్ని ప్రసాదించేవారు. స్త్రీ పురుషులకు **పరస్పర దేవో భవ** మంత్రాన్ని బోధించే వారు. సిద్ధలోకానికి చెందిన మహాపురుషుడు ఆయన. పరిపూర్ణమైన సిద్ధుడు. జ్ఞానం-యోగం-భక్తి-కర్మ- ఇవన్నీ ఆయనలో సంపూర్ణ సమన్వయంలో ఉండేవి. ఆయన యోగ జ్ఞానంలో నిపుణులు. అయినప్పటికీ అతి నిరాడంబరంగా మామూలుగా ఉండేవారు. ఎల్లప్పుడు పరధ్యానంగా ఉండే ఆయన మనస్సు, చైతన్యంగా మారిపోయిందా అన్నట్లు ఉండేవారు.

శ్రీగురుదేవుడిని భక్త జనులు ఎప్పుడూ తన్మయస్థితిలో ఉండే గొప్ప యోగిగా పరిగణించేవారు. ఆయన సర్వజ్ఞుడు. అయినప్పటికీ ఏమీ తెలియనట్టు కనిపించేవారు. అందరూ ఆయన్ను బాబా అని పిలిచేవారు. ఆయన దగ్గర ఋద్ధులు, సిద్ధులకు ఎటువంటి ప్రాధాన్యములేదు. పరమశివుడి ఆత్మతత్వం ముందు మిగతా అన్ని అద్భుతాలు పేలవంగా కనిపించేవి ఆయనకు. శివుడిలో జగత్తు ఇమిడి ఉంది. ఇంతకన్నా గొప్ప అద్భుతం మరొకటి ఏమి ఉండగలదు! కాని, అత్యద్భుతమైన శక్తులు ఆయనలో గుప్తంగా ఉండేవి. సిద్ధులలో ఇటువంటి శక్తులు ఉండడం సహజమే. వారికి ఈ సిద్ధులపట్ల ఆసక్తి లేనప్పటికీ వాటంతట అవి పని చేస్తుంటాయి. ఆయన దగ్గర సిద్ధులు నృత్యం చేసేవి. ఋద్ధులు అక్కడే నివాసం చేసేవి. అటువంటి సిద్ధ పురుషులను చూచి పృథ్వి, తనకు రక్షకులున్నారని సంతోషిస్తుంది.

భగవాన్ నిత్యానందకు ప్రపంచంలో ఎంతో పేరు ప్రఖ్యాతులున్నాయి. ఆయన ఒక విలక్షణమైన మహాపురుషుడు. ఆయన స్మృతి, ఆయన గుణగణాల ప్రశంస, ఆయన దర్శనానుభూతి, సూర్య చంద్రులున్నంత వరకు చిరస్థాయిగా ఉంటాయి. ప్రపంచం సత్కరించతగిన మహా మహిమాన్వితుడు ఆయన. ఆయనలో గురుత్వం సంపూర్ణంగా ఉండేది. ఆయన యశస్సును కీర్తించేవారికీ, ఆయన్ను స్మరించుకునే వారికీ శక్తిపాతం జరిగేది. ఇప్పుడుకూడా ఆయన సమాధినుంచీ, ఛాయా చిత్రాల నుంచీ శక్తి లభిస్తుంది. నిజానికి ఆయన ఈ జగత్తు లోపలా వెలుపలా, అంతటా వ్యాపించి ఉన్నారు. సర్వాత్మలో లీనమైన మహాపురుషులు సర్వత్రవ్యాపించి ఉంటారు.

సాధారణంగా గురుజనుల పరిచయ భాగ్యము, వారిని అర్థం చేసుకొనడము దుర్లభం. ఎవరైనా ఏమైనా అద్భుతాలను చేసి చూపిస్తే చాలు, మనం వారిని గురువుగా

ఆదరిస్తాం. చిన్న ప్రవచనం చేస్తే చాలు, గురువుగా భావిస్తాం. మంత్రదీక్ష ఇస్తే చాలు, వారు గురువులౌతారు. తంత్ర విధానం ఎవరైనా చెబితే చాలు, ఇక వారు గురువులే. ఈ విధంగా చాలా మందిలో గురుభావాన్ని ఏర్పరచుకుంటాము. కాని తృప్తి కలుగదు. చివరకు మనకు విశ్వాసం పోతుంది. గురుత్వాన్నే బూటకంగా భావిస్తాం. దీని పరిణామం – మనం నిజమైన గురువులకు దూరంగా ఉంటాము. బూటకపు గురువు దగ్గర మోసపోయి నిజమైన గురువును అపహాస్యం చేస్తాం. గురుత్వం లేని చోట, గురుత్వాన్ని ఆపాదించి, ఏమీ లభించకపోవడంతో, నిజమైన గురువు పట్ల ద్వేషభావంతో వ్యవహరిస్తాము. ఎంత అన్యాయం!

గురువు సత్యం. గురువు పూర్ణుడు. గురువు నిరాడంబరుడు. సరళ స్వభావుడు. అందరినీ ప్రేమిస్తాడు. ఆయన, శిష్యుడి హితాన్నే వాంఛిస్తాడు. శిష్యుడి ధనాన్ని కోరడు ఆయన. నిజానికి శిష్యుడి అజ్ఞానాన్ని, అవిద్యను హరిస్తాడు. శిష్యుడి సంపదనుకాదు ఆయన హరించేది; శిష్యుడి దుఃఖాన్ని పాపాన్ని హరిస్తాడు. శిష్యుడు కఠిన తపస్సు చేయకుండానే, శిష్యుడికి పరమాత్మ దర్శనం చేయించగల శక్తి సంపన్నుడు గురువు. గుహలో ఉండే ఏకాంతాన్ని శాంతిని, శిష్యుడికి తన ఇంటిలోనే కల్పిస్తాడు. చుట్టూ ఉన్న ప్రపంచంలో పరమార్థాన్ని చూపించగలడు గురువు. దైనందిన వ్యవహారాలలో హిమాలయాలను, ధ్యానంలో కైలాసాన్ని చూపించగలడు. **శిష్యుడు సంపాదించి పెట్టుకున్న వస్తుసామగ్రిని కాని, సంపదనుకాని త్యాగం చేయవలసిందని గురువు ఎన్నడూకోరడు. జీవత్వభావాన్ని త్యాగం చేయిస్తాడు. జీవత్వం పట్ల ద్వేషము, వ్యష్టిత్వం పట్ల ఈర్ష్య, ద్వంద్వం పట్ల కోపము, కలిగి ఉండడం ఆయన గుణం. పరమాత్మ సృష్టించిన ఈ ప్రపంచంలోని వస్తువులను నీ చేత త్యాగం చేయించి నీ అంతరంగాన్ని శూన్యము శుష్కము చేయడు ఆయన.**

తలిదండ్రులతో బంధుజనులతో నివసిస్తున్న శిష్యుడికి కూడా పారమేశ్వరీ కృపను అనుగ్రహించి, శిష్యుడు అంతవరకు గడుపుతున్న సాధారణ జీవితాన్ని దివ్యమైనదిగా మారుస్తాడు, గురువు. మానవుడు సమాజంలో తన విధులను వ్యవహారాలను నిర్వర్తించుకుంటూనే, ప్రపంచాన్ని పరమేశ్వరుడి ప్రసాదంగా భావించి, ఈశ్వరారాధనా భావంతో కర్మలను చేస్తూ, గురుకృపను పొంది, ధ్యానం ద్వారా హృదయంలో ప్రకాశిస్తున్న ఆత్మను అతి సునాయాసంగా దర్శించగలడు. గురువు లేకుండా,

అనేకరకాల దీక్షలను పొంది, పర్వతాల్లో అడవుల్లో గుహల్లో, శరీరం శుష్కించి పోయేవరకు తిరిగినందువల్ల లభించేది నిస్పృహ మాత్రమే. ఆపైన ప్రారబ్ధం కర్మ అంటూ వాపోవడం. పరమాత్మ దర్శనం కాకపోవడంతో 'భగవంతుడు ఎప్పుడు దర్శన మిస్తాడో ఎవరు చెప్తారు' అంటూ విచారంలో మునిగిపోతాడు మానవుడు.

శ్రీ గురువు ఒక గొప్ప అద్భుతమైన దేవుడు. భగవంతుడు సాక్షాత్కారం చేసుకున్న గురువును సాధారణ వ్యక్తిగా భావించి విడిచిపెట్టకు. గురుదేవుడి కృప నీ మీద పూర్తిగా కలిగినపుడు మాత్రమే ఆయన మహత్తును నువ్వు తెలుసుకోగలవు. గురువు తన శిష్యులను ఉన్నతమైన స్థాయికి తీసుకువెళ్లి, సత్యస్వరూపం గురించి తెలియచెప్పి, శివుడిలో లీనం చేయించి, శివుడిగా రూపొందిస్తాడు. మానవుడిని పూర్తిగా మార్చివేయగల అసాధారణశక్తి గురువుకు ఉంది. వృద్ధాప్యము, దుఃఖములేని కొత్త జీవితాన్ని గురువు ప్రసాదిస్తాడు. ఈ ప్రపంచంలో ఉన్నపుడే, ఆయన శిష్యుడికి పూర్ణత్వాన్ని కలుగచేస్తాడు. గుడ్లగూబ, పగటిపూట జరిగేవాటిని చూడలేదు. కాకి, రాత్రిపూట జరిగే వాటిని చూడలేదు. అదేవిధంగా గురుప్రసాదం లభించని మానవుడు ప్రపంచాన్ని స్వర్గంగా చూడ జాలడు. దుఃఖమయమైనదిగాను, శోకమయమైనదిగాను మాత్రమే చూడగలడు.

మంత్రాన్ని చైతన్యవంతం చేయగల శక్తి సంపన్నుడూ మంత్రద్రష్ట, శక్తి పాతాన్ని ప్రసాదించగల కుశలుడూ అయిన గురువే నిజమైన గురువు. గురువు గృహస్థయినా, సన్యాసి అయినా శక్తిని ప్రసాదించగల సామర్థ్యం అవసరం. గురువులో **పారమేశ్వరీ అనుగ్రాహికాశక్తి** సంపూర్ణంగా నివాసం చేయడం అవసరం. ప్రపంచంలో చాలామంది గురువులున్నారు. గురువులకు లింగభేదం లేదు. పరమ శివుడు గురువు, పరాశక్తి చిత్‌శక్తి కూడా గురువు. గురువు అలింగము. నరుడుకాని, నారికాని జ్ఞానదృష్టిలో ఒకరే. ఒకే శక్తి, ఒకే ఆత్మ, ఒకే విధమైన తృప్తి ఇద్దరిలోను ఉంటుంది. వారిలో చిత్‌శక్తి సంచరించడం ప్రారంభమైన తర్వాత, స్త్రీ స్త్రీ గాదు, పురుషుడు పురుషుడు గాదు. బాహ్యానికి స్త్రీగా పురుషుడుగా కనిపించినప్పటికీ, ఆంతరంగికంగా వారు విశ్వవ్యాపినియైన పరిపూర్ణ చిత్‌శక్తి యొక్క స్వరూపులే. గురుదేవుడి కృపా ప్రసాదం వల్ల యోగమాత మహాకుండలిని జాగృతమైనపుడు శరీరంలోని మాంసమయ మలదోషాలన్నీ నాశనమౌతాయి. స్త్రీపురుషభేదభావం యోగాగ్నిలో భస్మమౌతుంది. అనంతరం సప్తధాతువుల్లోకి చిత్‌శక్తి ప్రవేశించి ధాతువులనుకూడా చితిమయం

చేస్తుంది. నీటిలో పంచదారను కలిపినపుడు అది షర్బత్ అవుతుంది. అదే విధంగా కుండలినీ చిత్‌శక్తి శరీరమంతటా వ్యాపించినపుడు, శరీరం మాంసమయంగా కనిపించినప్పటికీ పరిశుద్ధమైన చిత్‌శక్తిమయమౌతుంది. అటువంటి పరిస్థితిలో ఎవరు స్త్రీ, ఎవరు పురుషుడు? గురువుల్లో పరిపూర్ణమైన పరబ్రహ్మయొక్క చిత్‌శక్తి నివాసం చేస్తుంది. ఈ చిత్‌శక్తి విలాసంలో తన్మయులై గురుజనులు ప్రేమానందంలో మునిగి ఉంటారు. అనాదిగా పరమేశ్వరుడినుంచి ఇంతవరకు పరంపరగా ప్రవహిస్తున్న శక్తి, శ్రీ గురువు ద్వారా శిష్యుడిలోకి ప్రవేశించి, శిష్యుడి దేహంలోని మల దోషాలన్నిటినీ యోగాగ్నిలో దగ్ధంచేసి, శిష్యుడిని పరిపూర్ణంగా శుభ్రం చేసి అజ్ఞానావరణాన్ని తొల గిస్తుంది. కాలక్రమేణా శిష్యుడే గురువుగా మారిపోతాడు.

పూజనీయుడైన పరమగురువు చితిమయరూపంలో శిష్యుడిలో ప్రవేశిస్తాడు. అటువంటి గురువును ఏవిధంగా ప్రేమిస్తాము? ఆయనతో ఏ విధంగా వ్యవహరిస్తాము? ఆయన ఋణాన్ని ఏ విధంగా తీర్చుకుంటాము? ఓ గురుదేవా! మీరు మా మలినమైన శుచి శుభ్రం లేని వికారమైన భౌతిక శరీరాల్లో కూడా భేదాభేదాలను చూడరు. శుద్ధాశుద్ధాలను చూడరు. ఆరోగ్య-అనారోగ్యాలను చూడరు. కృపామయులై మా శరీరాల్లో ప్రవేశించి మా పాపాలను అశుద్ధాన్ని కడిగివేస్తారు. ప్రతినాడిలో ప్రతి రక్తకణంలో శక్తిరూపంలో ప్రవేశించి వాటిని క్రియాశీలం చేస్తున్నారు. మీ కెంత దయ, ఎంత అనుగ్రహం! ఎంత ఉపకారం చేస్తున్నారు మాకు! శరీరంలోని ప్రతి అంగంలోకి, శుభ్ర-అశుభ్రమైన స్థానాలలోకి, నాడుల్లోకి, ప్రవేశించి కఫ-పిత్త-వాత రూపంలోని మాలిన్యాలన్నిటినీ చాకలి వలె, అంతర-యోగక్రియల మూలంగా శుభ్రం చేస్తున్న గురువుకు సమానమైన మిత్రులెవరుండగలరు! దాసదాసీ జనులకు పరిచారకులకు సమానంగా, గురువు, లోపలి మాలిన్యాలను యోగాగ్నిలో దగ్ధం చేసి శరీరాన్ని శుద్ధమైన బంగారంగా మారుస్తాడు. అటువంటి గురువుకు సమానమైన మిత్రుడు ప్రియతముడు, తల్లి, తండ్రి, దేవుడు ఎవరున్నారు? అటువంటి గురువుకు ఏ విధంగా పరిచర్య చేసి మన ఋణాన్ని తీర్చుకోగలం? మీ కులం, జాతి, మతం, కర్మాకర్మలు, గుణదోషాల వంటి వాటిని లెఖ్ఖ చేయకుండా మీలో ప్రవేశించి మిమ్ములను తనవాడిగా చేసుకున్న గురువు యొక్క మహిమను ఎవరు కీర్తించగలరు? అందువల్ల ముక్తానందకు సర్వమూ నిత్యానందుడే. ముక్తానందకు పరమపిత, దేవత, ఆనందము, ధ్యానము, సమాధి - అన్నీ నిత్యానందుడే. ఓ ప్రియతమ గురుదేవా! ''ఆరతీ కరూం

సదగురుకి, ప్యారె గురువరకీ'' అని గానం చేసి మీ ఋణం తీర్చుకోగలనా? సాధ్యం కాదు గురుదేవా! మీరు గొప్పవారు. మీ పూజకోసమే ''శ్రీ గురుదేవ సిద్ధపీఠం'' ఉన్నది. **ఓ గురుదేవా, నా లోపల సంచరిస్తున్న ప్రాణం మీరు. వెలుపల సంచరిస్తున్న అపానం నేను. ''సో'' నిత్యానందుడు. ''హం'' ముక్తానందుడు. ''సోహం'' నిత్యానంద. సోహం నిత్యానంద! ఇదే ప్రతినిత్యం మీకు పూజ.**

దీక్ష నిచ్చినపుడు మీరు చెప్పిన మంత్రం ''ఓం నమః శివాయ''. ఈ మంత్రం సంపూర్ణంగా మీ స్మృతి రూపం. మీరే శివుడు.

**యోగురుః సశివః ప్రోక్తోయః శివః సగురుః స్మృతః .**
**ఉభయోరంతరంనాస్తి గురోరపి శివస్యచ ..**

అనగా గురువునే శివుడంటారు. శివుడిని గురువుగా పరిగణిస్తారు. ఉభయుల మధ్య భేదం లేదు. శివుడు, గురువు ఒకరే అని అర్థం. 'సోహం' మీరిచ్చిన ధ్యానమంత్రం. ధారణ గతిని స్థిరం చేసే మంత్రం. నేను సాధన రూపంలో చేస్తున్న యజ్ఞానికి మీరిచ్చిన 'సోహం' మంత్రమే పూర్ణాహుతి. 'సోహం'తో పూర్ణాహుతి చేసిన తర్వాతనే శాంతీ సంతృప్తీ లభించి 'సోహం'గా మారాను. మీరు మీ కృపను మాత్రమే ప్రసాదించి ఊరుకోలేదు. మీరు 'సోహం' మంత్రం ద్వారా స్వయంగా నాలో ప్రవేశించి నా పాపాలన్నిటినీ భస్మం చేశారు. మాలిన్యాలను కడిగివేశారు. జీవుడిని శివుడిగా మార్చారు. నన్ను మీ వాడినిగా స్వీకరించారు. ఓ గురుదేవా, మిమ్ములను ఏ విధంగా సన్మానించగలను? మీకు ఏ విధంగా పూజ చేయగలను? జయగురుదేవ! జయగురుదేవ! జయగురుదేవ! అంటూ భజన మాత్రం చేస్తుంటాను.

అటువంటి గురుజనులను గురువుగా భావించి అటువంటి సిద్ధ పురుషుల నుంచి దీక్ష పొందడం ఎంత అదృష్టం! వారు పలికే పలుకులే చైతన్యమంత్రం. అటువంటి పరమగురువులు, చితిమయమైన మంత్రం ద్వారా, స్పర్శ ద్వారా లేక దృష్టి ద్వారా, శిష్యుడిలోకి ప్రవేశిస్తారు. అందువల్లనే గురువుతో సహవాసం, గురువుతో సంబంధం, గురువు యొక్క ఆశ్రమంలో నివసించడం, గురువు యొక్క చరణస్పర్శ, గురుపాదోదక సేవనము, గురుప్రసాద సేవనము, గురుసేవ, గురువుయొక్క గుణ గణాలను కీర్తించడము, గురువు ప్రేమోన్మత్త స్థితిలో ఉన్నపుడు ఆయన నుంచి ప్రవహించే చిత్‌శక్తి స్పందనలనూ గురువు ధరించిన వస్త్రాలనుంచి వెలువడే చిత్‌శక్తి

కణాలనూ గురువు ఉచ్ఛ్వాస–నిశ్వాసముల ద్వారా 'సోహం' శబ్దంతో పాటు వెలుపలికి వచ్చే చిత్‌శక్తి ప్రభనూ ఆస్వాదించడము – ఇవన్నీ శిష్యుడికి సంపూర్ణమైన సిద్ధ పదాన్ని కలుగచేస్తాయి. దీనిలో ఆశ్చర్యమేమి లేదు. నా పూజ్య గురుదేవుడు అటువంటి గొప్ప సిద్ధ పురుషుడు. ఆయన నుంచి దివ్యమైన చిత్‌శక్తి కిరణములు ఎల్లవేళలా ప్రవహించేవి. ఆయన దృష్టి పడిన వారందరు జాగృతమయేవారు. ఆయన మాహాత్మ్యం చాలా గొప్పది. ''హఠయోగ ప్రదీపిక'' లో ఈ విధంగా ఉంది :

**దుర్లభో విషయత్యాగో దుర్లభం తత్వదర్శనం .**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా :.**

ఈ సహజావస్థ ఎంతో దుర్లభమైనది. సద్గురు కరుణలేనిదే లభ్యం కాదు. ఈ దశ, అపరిమితమైన ఈశ్వరప్రేమ, గురుకృపవల్లనే లభిస్తుంది, లేనపుడు లభించదు. మానవ జీవితంలో శాంతిని పొందేందుకు అనేక ఉపాయాలను పేర్కొని ఉన్నారు. వీటిలో కొన్ని బహిరంగ సాధనలు, కొన్ని అంతరంగ సాధనలు. వేదాలలో, షడ్ దర్శనాలలో, రామాయణం- మహాభారతం వంటి సద్‌గ్రంథాలలో అనేక రకాల సాధనమార్గాలను పేర్కొని ఉన్నారు. సాధకులు భక్తి శ్రద్ధలతో దీర్ఘకాలం అనుష్ఠానం చేయగా కఠిన పరిశ్రమ తర్వాత వాటికి తగిన ఫలితం ఉంటుంది. ఏ మార్గాన్ని అవలంబించినా ఎన్నిరకాల ఉపాసనలు చేసినా ఈ సహజావస్థ మాత్రం అత్యంత దుర్లభం. సహజావస్థ రూపమైన పరమకైవల్య పదం, సిద్ధ మార్గం ద్వారా మాత్రమే లభ్యమౌతుంది. ఇతర మార్గాల ద్వారా ఎన్నటికీ లభించదు.

**నానా మార్గైస్తు దుష్‌ప్రాప్యం కైవల్యం పరమం పదమ్**
**సిద్ధ మార్గేణ లభతే నాన్యథా పద్మసంభవ.**

యోగ శిఖోపనిషత్

మన పరమపిత శ్రీ గురువు, దీక్షద్వారా, ఈ స్థితిని కలుగజేస్తారు. దీక్ష ప్రసాదించి పాపాలను నాశనం చేసి, పరమాత్మతో ఐక్యం చేస్తారు.

**దీయతే శివసాయుజ్యం క్షీయతే పాశబంధనమ్,**
**అతోదీక్షేతి కథితా బుధైః సచ్ఛాస్త్ర వేదిభిః.**

దీక్షా కాలంలో, గురుశక్తి శిష్యుడిలో ప్రవేశిస్తుంది. వృక్షం బీజరూపంలో ఉన్నట్లు, శక్తి శ్రీగురురూపంలో ఉంది. ఆ శక్తే శిష్యుడిలో ప్రవేశిస్తుంది. అనేక రకాల

యోగక్రియలను చేయిస్తుంది. సాధకుడు తన ప్రియమైన గురువును స్మరిస్తూ, తన్మయం చెంది, ధ్యానానికి ఆసనంమీద కూర్చుని, గురుముఖంగా లభించిన మంత్రాన్ని శాంతంగా జపించినపుడు, గురువు మంత్రరూపంలో శిష్యుడి అంత రంగంలో క్రియాశీలుడౌతాడు. ఈ క్రియలు, అర్థంలేనివి కావు. ఫలితంలేనివి కావు. క్రియలరూపంలో పనిచేసేది పరమగురువే. రకరకాల ఆసనాలు, ప్రాణా యామము, నృత్యాలు, మంత్రఘోషలు, ముద్రలు, అంగ విన్యాసాలు సంభవిస్తాయి. వీటిని, శ్రీగురుశక్తి, అంతరంగంలో నుంచి చేయిస్తుంది. బాహ్యానికి ఇవి అతి విచిత్రంగాను భయంకరంగాను కనిపిస్తాయి. కాని సాధకుడు భయపడడు. సాధకుడికి ఈ క్రియలవల్ల తన్మయత్వము ఆనందము కలుగుతాయి. శరీరం తేలికైనట్టు, శరీరానికి బలం వచ్చినట్టు అనిపిస్తుంది. ఈ క్రియల్లో కొన్ని రాజయోగానికీ, కొన్ని హఠయో గానికీ, కొన్ని మంత్రయోగానికీ కొన్ని భక్తియోగానికీ చెందినవి. పరమగురువు యొక్క శక్తి శిష్యుడిలో ప్రవేశించిన తర్వాత ఈ యోగ క్రియలు తమంతట తామే అవసరానికి తగినట్టు జరుగు తుంటాయి. **నాలుగు యోగాలు ఒకటై శిష్యుడిలో క్రియా శీలమౌతాయి. దీనినే సిద్ధయోగమనీ మహాయోగమనీ అంటారు. సిద్ధ మార్గము, సిద్ధకృప అని కూడా అంటారు.**

సాధకుడు ప్రతిదినము గురుభక్తిని పెంపొందించుకుంటూ గురువులో తన్మయమై లీనమయే కొద్దీ, క్రియలు కూడా బలవత్తరమై, అనేకరకాల విచిత్రానుభూతులు కలుగుతాయి. ఎటువంటి ప్రయాస లేకుండా ఆసనాలు, దూరంగా జరుగుతున్న వాటిని చూడడము, దూరం నుంచి శబ్దాలను వినడము వంటివి అతి సహజంగా జరుగుతాయి. కాని, అప్పుడప్పుడు, సాధకుడి హృదయమాలిన్యం కారణంగా గురువుకు సంబంధించిన వ్యవహారాలలో రాగ ద్వేషా లనూ ఇతరదోషాలనూ చూడడం ప్రారంభమౌతుంది. దీనివల్ల సాధన కుంటుపడుతుంది. అప్పుడు ప్రశ్నిస్తాడు, ''బాబాజీనాకు ముందు జరిగినట్టు క్రియలు జరుగడం లేదు. ఎందువల్ల'' అని.

నేను సమాధానం చెబుతాను: ''జరుగుతాయి, జరుగుతాయి. తప్పకుండా జరుగుతాయి. మొదట నిన్ను నువ్వు సంస్కరించుకో'' అని.

మా పూజ్య గురుదేవులెప్పుడైనా కొంచెం కోపం వహిస్తే నేను అర్థం చేసుకునే వాడిని. ఈ విధంగా అనుకునేవాడిని: ''మిత్రమా! భగవంతుడి అన్ని క్రియలు,

అన్ని కర్మలు భగవంతుడితోనిండినవి. అవి ఏ విధంగా ఉన్నా శుభ ప్రదమైనవి. భగవంతుడి కర్మలు క్రియలు అన్నీ పరమానంద మయములు, మంగళ ప్రదములు'' అని. మీకు తెలుసునోలేదో, కృష్ణ భగవానుడు, గోపికల అనంత ప్రేమతో ప్రసన్నుడై వారిని అనుగ్రహించిన స్థితి, ఉద్ధవుడికీ– అర్జునుడికీ జ్ఞానోపదేశంతో కల్పించిన స్థితి, కంస, చాణూరులను వధించి వారికి ప్రసాదించిన స్థితి వీటిలో భేదం ఏముంది? దేవకికి ప్రసాదించిన స్థితినే, విషం త్రాగించిన పూతనకు కూడా ప్రసాదించాడు, దేవకికి ప్రేమతో ఇచ్చాడు. పూతనకు కోపంతో ఇచ్చాడు. కాని ఇద్దరికి లభించినది ఒకే రకమైన గతి, మతి, స్థితి.

ఈశ్వర లీలలో ఒక ఆనందముంది **''ఏకమేవాద్వితీయమ్.''** అన్ని కర్మలు పనులు క్రియలు అన్నిటికీ ఒకేరూపం. అదే విధంగా శ్రీ గురుదేవుడి క్రియలన్నిటిలో శక్తియొక్క పూర్ణవికాసము, చిదంబయొక్క పూర్ణ విలాసము ఉంటుంది. ఆయన పనులన్నీ పుణ్య ప్రదాలు, ఉన్నతికి సోపానాలు. అటువంటి గురుజనుల పనుల్లో గుణదోషాలను వెదుకుతూ సాధకుడు, తన సాధనకు తానే అవరోధమౌతాడు. గురువులు, మహా పురుషులు, సిద్ధులలో గుణదోషాలను ఎంచడం ఎంతమాత్రం పనికిరాదు.

సిద్ధుల ఆచరణ అతి విచిత్రమైనది. సాధారణ మానవులు దీన్ని అర్థం చేసుకొనలేరు. మహాపురుషుల సాంగత్యంలో ఉంటూ వారిమీద దోషారోపణ చేయరాదు. మాగురుదేవులు తిట్టేవారు, అప్పుడప్పుడు కొట్టేవారు కూడా. దానికి కారణం ఉండేది. అటువంటి మహాపురుషులకు దివ్యమైన ప్రతిభ ఉంటుంది. అటువంటి సిద్ధ పురుషుల ప్రవర్తన విచిత్రంగా ఉంటుంది. మూఢులనుంచి నేర్చుకుంటారు, పండితులకు నేర్పుతారు. బలవంతులతో పోరాడుతారు. నక్కను చూచి భయపడి పారిపోతారు. ఏమీ దొరకక పోయినట్టయితే నోరుతెరిచి అడుగుతారు. ఎవ్వరైనా ఏదైనా ఇచ్చి నట్టయితే దాన్ని ఇంకెవరికైనా ఇచ్చివేస్తారు. అటువంటి మహాత్ములను అందరూ ఏదో ఒకటి అర్థిస్తూనే ఉంటారు. తమ దగ్గర ఏమీ లేక పోయినప్పటికీ అడిగినవారికి అన్నీ ఇస్తూనే ఉంటారు. ప్రపంచదృష్టిలో అతి అమూల్యమైన వస్తువులకు వారి దృష్టిలో ఎటువంటి విలువలేదు. సిద్ధ పురుషులు మామూలు జీవితానికి దూరంగా ఉంటారు.

నాలుగు

# చిన్మాత కుండలిని

గురు పరంపర ఒక గొప్ప పరంపర. అనాది నుంచి మహాపురుషుల తపస్సు, తేజస్సు, మనకు కొండంత రక్షణగా ఉంటున్నట్టు, గురుజనుల గురించి చెబుతారు. అటువంటి గురువు శిష్యుడిలో శక్తిని మేల్కొలిపి, చక్రాలను భేదించి సహస్రారంలో స్థిరం చేస్తాడు.

శ్రీగురువు, పరమ చిత్‌శక్తిని శిష్యుడిలో ప్రవేశింపచేస్తాడు. 'ప్రత్యభిజ్ఞా హృదయం'లో దీని వివరణ ఉంది: **'చితిః స్వతంత్రా విశ్వసిద్ధి హేతుః'**, చితి స్వతంత్రంగా ఉంటూ జగత్తునంతటినీ సృష్టిస్తుంది. ఈ చిత్‌శక్తి పరమశివుడికి భిన్నం కాదు. జగత్తు యొక్క సృష్టి – స్థితి – లయములకు మూలము ఆమే.

ఈ చిత్‌శక్తి స్వతంత్రంగా ఉంటుంది. సర్వవ్యవహారాలను నిర్వహిస్తుంది. సర్వసాధనలు ఫలించేట్టు చేస్తుంది. భుక్తిని, ముక్తిని ప్రసాదిస్తుంది. సుఖాన్ని పొందే ఉపాయాన్ని తెలుపుతుంది. స్వయం ప్రకాశమైనది. సర్వశక్తి ప్రదాయిని. దేశ – కాల – ఆకారాలకు అతీతమైనది. పరమశివుడి కార్యరూపిణి. అనుగ్రహించేది, నిగ్రహించేది ఆమే. పరతత్త్వాన్ని ప్రకాశింప చేసేదీ ఆమే. ప్రవృత్తి, నివృత్తి కూడా ఆమే. ఈ పర శివశక్తి యొక్క మహిమ అద్భుతమైనది. జ్ఞానుల జ్ఞానం, కర్మ చేసేవారి కర్మఫలం, భక్తుల తన్మయ స్థితి ఇవన్నీ ఆమే. యోగుల యొక్క కుండలిని క్రియాశక్తి, ఆమే. ప్రపంచమంతా చిత్‌శక్తి చేత అలంకృతమై ఉంది. అత్యంత ఆశ్చర్యకరమైనది. ఆమెను అర్థం చేసుకోనడం కూడా ఆశ్చర్యమే. పరమ శివుడి పరమశక్తి ఆమె. విశ్వవ్యాప్తంగా జరిగే కార్యకలాపాలన్నిటినీ, ప్రవృత్తి నుంచి నివృత్తి వరకు ఆమే నిర్వహిస్తుంది.

ఓ తల్లి, చిన్మాత! నువ్వు పరమ శివుడి స్ఫురణవు. ప్రియపత్నివి. ఆయన గమనానివి కూడా నువ్వే. విశ్వానికి కారణరూపమైన నువ్వు పంచతత్త్వాత్మికవు. నువ్వేసూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలున్ను. ఓ కుండలేశ్వరీ! నువ్వువైకుంఠము, స్వర్గము, పాతాళము, నరకము కూడా. **భూర్భువః స్వర్లోకవులు నువ్వే.** నాలుగు దిశలూ నువ్వే.

స్వేదజ, ఉద్భిజ, అండజ, జరాయుజ వర్గాలకు చెందిన 84,00,000 రకాల ప్రాణి కోటికి ఆధారము నువ్వే. ఈ అనంత ప్రాణికోటిలో నువ్వే ప్రకటితమౌతున్నావు. నీకు లెఖ్ఖలేనన్ని రూపాలున్నాయి. ఈ విశ్వాన్ని విమర్శించి విమర్శించి మానవులు, అలసి పోతుంటారు. నీ దివ్య ప్రకాశపు విభూతులు అనంతం. భేదాభేదరూపమైన అనంతసృష్టిని నీలోనే ఇముడ్చుకుని నిర్లిప్తంగా ఉంటావు. పరమానందరూపంతో ఉల్లాసంగా ఉంటావు. వేదం, వేదాంతం, శాస్త్రం, మంత్రం, ఇత్యాది సాధనలతో నిన్ను పొందవచ్చు.

ఓ తల్లి కుండలినీ! నిత్యానందుడి నుంచి ప్రాప్తించిన ఆనంద శక్తివి నువ్వు. నువ్వు యోగానివి. యోగాంగము కూడా. సమాధికి అర్థం నువ్వే. నీ పేరు నిర్వికల్ప. నువ్వు ఈ మానవ దేహానికి మూలాధారం. తల్లీ! చిన్మయి కుండలినీ! పరమగురువుల పరిశుద్ధమైన ఆత్మ గురువు నువ్వే. భృకుటిలో ద్విదళ చక్రంలో, శ్రీ గురుపీఠంలో గురురూపంలో విరాజమానమై శిష్యజనుల యోగక్షేమాలను నిర్వహిస్తున్నది నువ్వే. సాధకుల పరమదైవతమైన ఓ యోగిని కుండలినీ! ఓ గురు! ఓ ప్రేమాస్పద! ఓ క్రియాశాలినీ! నిత్యానందుడి కృపవల్ల లభించినది నువ్వే. నిత్యానందుడి నుంచి వరదానంగా లభించిన రెండక్షరాలు 'సోహం' నువ్వే. నా ఉనికి నీవల్లనే తల్లీ. నీవల్లనే నా దీక్ష భద్రంగా ఉంది. నువ్వే, పరమ నీలమణి సహాయంతో నా ఆకారాన్ని ధరించి, భక్తజనులకు అనేక దృష్టాంతాల ద్వారా వారిని శ్రద్ధాసక్తులను చేస్తున్నావు.

ఓ ప్రియమైన యోగశక్తీ! నా యొక్క గురుప్రేమను నీకు అర్పిస్తున్నాను. ఉత్కృష్టమైన ఫలితాలను అందచేసే దానివి, నువ్వు. అనంత సామర్థ్యాన్ని నీలో కలిగి ఉన్నావు. అనంతమైన రూపాలను ధరిస్తావు. రాముడి సీత, కృష్ణుడి రాధ, నారాయణుడి లక్ష్మి, శివుడి భవాని, యోగుల యోగశక్తి, సాధకుల క్రియాశక్తి, గురుజనుల యొక్క శక్తిపాతరూపమైన అనుగ్రాహిక శక్తి – ఇవన్నీ నువ్వే. నువ్వే గురువువు. శక్తిపాతాన్ని ప్రసాదించేవారి శక్తివి నువ్వే.

పరమపూజ్యురాలైన తల్లి శక్తి, గురువులో గురుమయమై ఉంటుంది. అందువల్లనే గురువు, స్త్రీ కాదు, పురుషుడు కాదు. గురువు పరమానంద మయమైన ఉజ్జ్వలమైన ప్రేమ శక్తి. గురువు, సంపూర్ణంగా వికసించిన కుండలిని యొక్క జ్ఞానశక్తి. చిత్‌శక్తీ, గురువూ ఒక్కటే. చిత్‌శక్తిలో గురువు, గురువులో చిత్‌శక్తి, ఇద్దరికీ భేదం లేదు.

గురువు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపము. నిజానికి, గురువు పరబ్రహ్మే.

దివ్యాతిదివ్యమైన చిత్‌శక్తిని శిష్యుడిలో జాగృతం చేయగల గురువు, గురువు మాత్రమే కాదు, ప్రియమైన ప్రాణమిత్రుడూ, అంతరాత్మ. గురువు ప్రాణ మిత్రుడే కాదు సాధకుల సాధన సంపత్తికూడా. సాధనకు లక్ష్యము. సాధన ద్వారా లభించేదీ గురుతత్వమే. నిష్ప్రపంచము, పరమోన్మత్తము, పరమానంద మయము అయినది గురుతత్వము. గురుగీతలో గురువును వర్ణించిన విధములోగాని, జ్ఞానేశ్వరుడి 'భావార్థదీపిక' (జ్ఞానేశ్వరి)లో 13వ అధ్యాయములో గురుమహిమ గురించి చేసిన సంకీర్తనలో గాని లేశ మాత్రం కూడా అతిశయోక్తి లేదు. గురుపాదోదకం సేవించిన శిష్యుడికి అమృతంకూడా సాధారణవస్తువే. గురుపూజ, మిగతా అన్ని రకాల పూజల కన్న అత్యుత్తమమైన పూజ, మహాపూజ. 'శ్రీ గురుగీతలో' ఈ విధంగా ఉంది.

**గురురేవ జగత్సర్వం బ్రహ్మవిష్ణుశివాత్మకం .**
**గురోఃపరతరం నాస్తి తస్మాత్ సంపూజ యేత్ గురుం.80.**

చిత్‌శక్తి మయమైన గురువుయొక్క మహిమను ప్రత్యక్షంగా అనుభవించినపుడే మీకు ఈ మాట అర్థమౌతుంది. అన్ని పుణ్యతీర్థాలూ, అందరు దేవతలూ శ్రీగురువే. ఎక్కువ ఏమని చెప్పను? విశ్వవ్యాప్తంగా, విశ్వాకారములో ఉన్న బ్రహ్మ శ్రీగురువే. అటువంటి గురువే, అనుగ్రహరూపంలో శిష్యుడిలో స్వయంగా ప్రవేశిస్తాడు. తన పారమేశ్వరీ అనుగ్రాహిక శక్తిని శిష్యుడి అంతరంగంలో ప్రవేశింపచేస్తాడు. **శక్తిని ప్రవేశింప చేయడమే శక్తిపాతదీక్ష, క్రియాయోగము, గురుకృప.** రుద్రశక్తిని శిష్యుడిలో సమావేశపరచడమే గురువు అనుగ్రహం.

ఐదు

# సాధన

సిద్ధుల కృప లభించిన వెంటనే సాధన ప్రారంభమౌతుంది. కొందరికి సాధన యొక్క అనుభూతి త్వరగా కలుగుతుంది. కొందరికి కొంత ఆలస్యమౌతుంది. సాధన, అంతరంగంలో సూక్ష్మరూపంలో జరిగినట్టయితే అనుభవంలోకి రాదు. అనుభవంలోకి రాకపోయినప్పటికీ, సాధకుడు, గౌరవంతో, సత్కారంతో, శ్రద్ధతో సంపూర్ణమైన ప్రేమతో తన సాధనను కొనసాగించడం అవసరం. గురుకృప ఎన్నడూ వ్యర్థం కాదు. ప్రకృతిలో మార్పులు రావచ్చు, సూర్యకిరణాల వేడి తగ్గవచ్చు, చంద్రుడి చల్లదనం అంతరించవచ్చు, నీరు ప్రవహించకపోవచ్చు, పగలు రాత్రిగాను, రాత్రి పగలుగాను మారవచ్చు, కాని ఒకసారి లభించిన గురుకృప, లేదా సిద్ధకృప మాత్రం వ్యర్థం కాదు. ఈ కృప జన్మజన్మాంతరాలు శిష్యుడి వెంట ఉంటుంది. ఏ దేశం వెళ్లినా ఇంకొక లోకం వెళ్లినా, మానవుడు చేసిన పాపాలు వెంబడిస్తాయి. మానవుడు, తను చేసిన పాపకర్మలనుంచి తప్పించు కొనలేడు. అదే విధంగా, శిష్యుడికి లభించిన గురుకృప, అది క్రియాశీలమయేవరకు, శిష్యుడిని వెంబడిస్తుంది, విడిచిపెట్టదు. అందువల్ల మీరు ధైర్యంతో ఉత్సాహంతో ప్రేమతో అభ్యాసం చేయండి.

భగవంతుడి కృపాశక్తి అంతరంగంలో ప్రవేశించిన తర్వాత, మొదట జడత్వం, నిద్ర, సోమరితనం వస్తాయి. కొంతమంది సాధకులకు మంచి నిద్ర పడుతుంది. సాధన సక్రమంగా జరుగుతున్నట్టు ఇది సూచన. దీని గురించి సందేహపడనక్కర లేదు. ధ్యానం చేసుకునేందుకు ఒకే స్థానంలో కూర్చొనడం మంచిది. వీలున్నట్లయితే, ధ్యానం చేసే సమయంలో ధరించే దుస్తులను విడిగా పెట్టుకొనడం కూడా మంచిది. ధ్యానం చేసుకునే ప్రదేశంలో చిత్‌శక్తి యొక్క కిరణాలు వ్యాపించి ఉంటాయి. అందుచేత ఒకే స్థానంలో ధ్యానం చేయడం చేత ముందు ముందు ధ్యానం బాగుంటుంది. మాకు, ధ్యానం చేసుకునేందుకు విడిగా ఒక గది ఉంది. మొదట నేను మాత్రమే అక్కడ ధ్యానం చేసుకునేవాడిని. కొంత కాలం తర్వాత అందరూ అక్కడ ధ్యానం చేసుకోవడం ప్రారంభించారు. అందరికీ అక్కడ ధ్యానం బాగుంటుంది.

దీక్ష కూడా అక్కడే జరుగుతుంది. అందువల్ల ధ్యానం ఒకే చోట చేసుకొనడం ఉత్తమం. అనుకూలం లేకపోయినట్టయితే ఎక్కడైనా ధ్యానం చేసుకొనవచ్చు. ప్రియమైన గురుదేవుడి కృప తప్పకుండా లభిస్తుంది.

మానవ శరీరం మాంస పిండంగా కనిపించినప్పటికీ, దానిలో బ్రహ్మాండమైన సృష్టి ఉంది. ఈ శరీరం 72 కోట్ల నాడులతో కూడిన అత్యద్భుతమైన సృష్టి. 72 కోట్ల నాడులు, ఆరు చక్రాలు, తొమ్మిది ద్వారాలతో ఒక గృహాన్ని పోలి ఉంటుంది. ఈ శరీరాన్ని, ఏడు ధాతువులతో కూడిన నగరమని కూడా చెప్పవచ్చు. 72 కోట్ల నాడుల్లో నూరు ముఖ్యమైనవి. వీటిలో పది, శ్రేష్ఠమైనవి. ఈ పదింటిలో మూడు, అతి ముఖ్యమైనవి. ఈ మూడింటిలోను మధ్యలో ఉన్న సుషుమ్న నాడి, అత్యంత మహిమాన్వితమైనది. మానవ జీవితానికి సంబంధించిన అన్ని పనులు, సుషుమ్న నాడి ద్వారా జరుగుతాయి. సుషుమ్న నాడి, పరమశివుడి నివాస స్థలమైన సహస్రారం నుంచి, కుండలినీ స్థానమైన మూలాధారం వరకు అఖండ రూపంలో వ్యాపించి ఉంటుంది.

శరీరంలో ప్రాణం ముఖ్యం. ప్రాణం పోయినట్టయితే అన్నీ పోయినట్టే. ప్రాణం పోయిన శరీరానికి విలువేలేదు. ప్రాణంతోనే ఉంది, జగత్తు అంతా. ప్రాణం వల్లనే మానవుడు జీవిస్తున్నాడు. ప్రాణం వల్ల ఆనందం, ప్రాణం వల్ల శక్తి, ప్రాణం వల్ల సిద్ధి, ప్రాణం వల్ల ఆరోగ్యం, ప్రాణం వల్ల లోక-పరలోక సంచారం, ప్రాణం వల్ల సంతానోత్పత్తి, ప్రాణం వల్ల బలం-వీర్యం, ప్రాణం వల్ల రోగం-చింత, ప్రాణం వల్ల చిత్త భ్రమణం- ఉన్మాదం, ప్రాణం వల్ల సౌందర్యం. ప్రాణం వల్లనే పునర్జన్మ. చివరకు, జీవన్ముక్తి కూడా ప్రాణం వల్లనే అనగా ప్రాణమే బ్రహ్మ, విష్ణు, శక్తి మరియు కుండలిని. **ప్రాక్‌సంవిత్ ప్రాణే పరిణతా** అనగా, ప్రకృతికి మూలా ధారమైన విశ్వచైతన్యమే ప్రాణరూపంగా మార్పు చెందుతుంది. **సర్వం ప్రాణే ప్రతిష్ఠితం,** జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అన్నీ ప్రాణంలోనే ప్రతిష్ఠితమై ఉన్నట్లు ఈ వాక్యం చెబుతుంది. రథ చక్రం మధ్యలో ఒక కమ్మిని బిగించిపెడతారు. చక్రానికి అది ఆధారము. అదే విధంగా, శరీరము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి- అన్నీ ప్రాణం మీదనే ఆధారపడి ఉన్నాయి. ఈ ప్రాణం శరీరంలో అనేక రకాలైన పనులను చేస్తుంది, చేయిస్తుంది. ఈ చిత్ శక్తి మయమైన ప్రాణం, శరీరం సక్రమంగా ఉండేట్టు చేసేందుకు, ప్రాణం-అపానం-సమానం-వ్యానం-ఉదానం అన్న అయిదు రూపాలను ధరి

స్తుంది. ఇవన్నీ ఒకే ప్రాణం, ఒకే శక్తి. అటువంటి ప్రాణం వివిధ రకాల పనులు సక్రమంగా జరిగేట్టు చూచేందుకు గాను, పిండాండ బ్రహ్మాండమంతటా ఈ అయిదు రూపాలలో వ్యాపించి ఉంటుంది. **ప్రాణం** హృదయంలో పనిచేస్తుంది.

**'అపనయతీతి అపానః'** అధోముఖంగా విసర్జన చేసే శక్తికి అపానం అని పేరు. గుహ్యేంద్రియాల ద్వారా మలమూత్ర విసర్జన చేయిస్తుంది **అపానం.**

**'సమం నయతీతి సమానః'** అన్ని ప్రదేశాల్లో సమానంగా పనిచేసేది సమానం. మనం తినే అన్నంయొక్క రసాన్ని శరీరంలోని అన్నిభాగాలకు అందచేస్తుంది **సమానం.**

**'వ్యాప్నోతీతి వ్యానః'** వ్యాపించి ఉన్నది వ్యానం. శాఖోపశాఖలుగా ఉన్న 72 కోట్ల నాడుల్లో సంచరిస్తున్న శక్తికి పేరు **వ్యానం.**

**'ఊర్ధ్వం నయతీత్యుదానః'** ఊర్ధ్వముఖంగా తీసుకుని పోయేది **ఉదానం.** ఉదాన వాయువు సాధకుడికి ఆప్తమిత్రుడు. దీని బలం చేత యోగి, బ్రహ్మచర్య వ్రతాన్ని రక్షించు కొనకలుగుతాడు. యోగి 'ఉదానం' సహాయంతో వీర్యాన్ని ఊర్ధ్వముఖం చేసుకుని ఊర్ధ్వరేతస్కుడవుతాడు. అతడి వీర్యము లేదా రేతస్సు, ప్రాణంలో మిళితమై, ప్రాణమవుతుంది. దీని ప్రభావం చేత యోగి, స్వర్గంలోని నర్తకిని చూచికూడా చలించడు. శక్తిపాత దీక్షనిచ్చే అర్హతకు ఈ ఊర్ధ్వరేతస్సు మూలాధారం. శక్తిని బలాన్ని తేజస్సును పరాక్రమాన్ని ఇచ్చేది ఇదే. ఉదానవాయువు సహాయంతోనే, పాపాత్మలు పాపలోకాలకూ పుణ్యాత్మలు పుణ్యలోకాలకూ, అక్కడి నుంచి మానవ లోకానికీ వస్తాయి. ఇదే ఉదానవాయువు పరిశుద్ధమై, క్రియా యోగంలో సమాధి సుఖానుభూతిని కలిగిస్తుంది. ఉదానశక్తి సుషుమ్నలో ఉంటుంది.

ఈ పంచ ప్రాణాలు తమతమ క్రియల ద్వారా జీవమును కాపాడుతాయి. పరమేశ్వరుడి యొక్క అనంతశక్తుల్లో ప్రాణం ముఖ్యమైనది. ప్రాణం హృదయగతికి మూలాధారమై, శరీరం మనుగడకు బాధ్యత వహిస్తుంది. హృదయగతి సతతము కొనసాగేట్టు చూచేది ప్రాణమే. జీవాత్మ నివసించేది ప్రాణశక్తివల్లనే.

మధ్యనాడి సుషుమ్నలో మహాశక్తి ఇమిడి ఉంది. శ్రీగురు కృపచేత జాగృత మైన ుండలినీ మహాశక్తి, పంచప్రాణాల ఆధారంగా 72కోట్ల నాడుల్లోకి ప్రవేశించి అన్ని

అంగాలలోనూ వ్యాపిస్తుంది. ఈ శక్తి, సప్తధాతువుల్లో రక్తకణాల్లో ద్రవపదార్థాలలో వ్యాపించి, శరీరాన్ని పరిశుభ్రంగా సౌష్ఠవంగా నిర్మలంగా అందంగా రూపొంది స్తుంది. శరీరానికి తేజస్సును, కాంతిని ఇస్తుంది.

పరమాత్మయొక్క ఈ శక్తి అనేక రకాలుగా పనిచేస్తుందని నేను చాలా సార్లు చెప్పి ఉన్నాను. ఈ శక్తి అప్పుడప్పుడు తన ఐశ్వర్యయుక్తమైన ఉల్లాసభరితమైన ఆనంద దాయకమైన క్రియలతో, గురుభక్తి నిష్ఠాగరిష్ఠుడైన సాధకుడిలో అత్యద్భుతంగా స్ఫురిస్తూ ఉంటుంది. అప్పుడు సాధకుడు నృత్యం చేస్తాడు, గానం చేస్తాడు, రోదిస్తాడు, అరుస్తాడు, అంగ విన్యాసాలు చేస్తాడు. కప్ప గంతులువేయడం, వర్తులాకారంగా తిరగడం, సుడితిరగడం, నేలమీద పడిదొర్లడం, ముఖాన్ని మొత్తుకోవడం, మెడను అతివేగంగా తిప్పడం, రకరకాల ఆసనాలుముద్రలు, వణకడం, చెమటపట్టడం, జాలంధర- ఉడ్డియాన- మూలబంధక్రియలు, నాలుకను లోపలికి లాక్కోవడం, లేదా నాలుక అంగిట్లోకి పోయి ఖేచరిముద్రపడడం, కనుగుడ్లు పైకి పోవడం, రకరకాల ధ్వనులను చేయడం, సింహగర్జన- పశువులు చేసే శబ్దాలను చేయడం, మంత్రాలనూ ప్రణవాన్నీ పెద్దగా ఉచ్చరించడం- ఇత్యాది క్రియలు, సాధకుడు ధ్యానం చేస్తున్న సమయంలో జరుగుతాయి. రకరకాల ప్రాణాయామక్రియలు, వాటంతట అవి జరుగుతాయి. భస్త్రిక- భ్రామరి- శీతలి- సీతకారి- ఉజ్జాయి మొదలైన ప్రాణా యామ క్రియలను సాధకుడు ధ్యానసమయంలో సునాయాసంగా చేస్తాడు. కేవల కుంభకం, సహజ కుంభకం జరుగుతాయి. ధ్యానం ఎక్కువైన కొద్దీ, కుంభకం సమయం ఎక్కువవుతూ ఉంటుంది. అప్పుడప్పుడు కొంత అస్వస్థత కలుగుతుంది కాని, త్వరగా నివారణ అవుతుంది. శరీరంలో గుప్తంగా ఉన్న రోగాలు బయటికి వచ్చి వెళ్లిపోతాయి. ఈ క్రియలు, మార్పులు అన్నీ సర్వజ్ఞుడైన జ్ఞానధనుడైన గురువు యొక్క కృపచేతనే సాధ్యం.

సాధకుడికి అప్పుడప్పుడు మైకం వంటిది ఆవహిస్తుంది. శిరస్సు భారంగా తోస్తుంది. నిద్రవచ్చినట్టు తోస్తుంది. అప్పుడప్పుడు అనేక దృష్టాంతాలు కూడా కనిపిస్తాయి. సిద్ధుల దర్శనం, జ్యోతులదర్శనం, లోకలోకాంతరాల్లో సంచరించిన అనుభూతి, స్వర్గం- నరకం- పితృలోకం, సిద్ధలోకం మొదలైన ప్రదేశాలను దర్శించడం- వీటితో పాటు శ్రీ గురుదేవుడి దర్శనం కూడా కలుగుతుంది. అంతరంగంలో అలౌకికమైన ఆనంద తరంగాలు లేస్తాయి. అన్ని నాడుల్లోను సుఖప్రదమైన ఆనందము పొంగి

పొరలుతుంది. సాధకుడు తన్మయంతో ఆనందపుటుయ్యాలలో ఊగుతాడు. యావత్తు సృష్టి, మామూలు చిన్న వస్తువు కూడా ఎంతో అందమైనదిగా ప్రియమైనదిగా కనిపిస్తుంది. సరికొత్త ప్రపంచంలో కొత్త జన్మనెత్తినట్టు, ఇంద్రపురిలోని సౌందర్యము, ఆహ్లాదము, ఆనందము, మర్త్యలోకంలో అవతరించినట్టు తోస్తుంది. సాధకుడు సంతోషంతో పారవశ్యం చెందుతాడు. జీవితం ఎంత ఆనందమయమో ఎంత మధురమో ఎంత ప్రేమ మయమో సాధకుడికి తెలుస్తుంది. హృదయంలో ప్రేమ పెల్లుబుకుతుంది. అన్ని ప్రాణుల పట్ల కరుణ కలుగుతుంది.

శక్తి యొక్క వేగము కొన్ని సమయాల్లో అతి తీవ్రంగాను కొన్ని సమయాల్లో మందంగాను ఉంటుంది. కొన్ని రోజులు ధ్యానం ఎక్కువగా ఉంటుంది, కొన్ని రోజులు తక్కువగా ఉంటుంది. భయపడవద్దు. నిర్భయంగా గురువు శరణు పొందండి. గురువులో విశ్వాసం కలిగి ఉండండి. ఆయనే మీ ఆశ, మీ విశ్వాసం, మీ బలం. మీరు సహజంగానే పరిపూర్ణులవుతారు. ధ్యానం ప్రతినిత్యము నియమానుసారం చేయండి. సమయ నియమాలను సదాపాటించండి. మనస్సులో శ్రీ గురు ప్రసాదించిన నామాన్ని జపిస్తూ ఉండండి.

నామ జపం, అంతర్శక్తిని అతివేగంగా క్రియాశీలం చేస్తుంది. 'అ' కారం నుంచి 'క్ష' కారం వరకు అన్ని అక్షరాల్లోను కుండలిని, చిత్‌శక్తి వ్యాపించి ఉండడమే దీనికి కారణం.

**అకారాదిక్షకారాంతా మాతృకా వర్ణరూపిణీ,**
**యయా సర్వమిదం వ్యాప్తం త్రైలోక్యం స చరాచరమ్.**

నామం పరమాత్ముడి ప్రత్యక్షరూపం. అందువల్ల నామాన్ని జపించు. నామాన్ని ధ్యానం చేయి. నామాన్ని గానం చేయి. నామాన్నే ధ్యానించు. నామ జపం జరుగుతున్నదా లేదా అన్న ధ్యానమే చాలు. నామజపం, సాధనలో రుచినీ గురువులో పూర్ణప్రేమనూ ఎక్కువచేస్తుంది. విజ్ఞానశాస్త్రం వల్ల లభించే నైపుణ్యాన్నీ ప్రేమవల్ల లభించే విశ్వాసాన్నీ ఇస్తుంది. నామం చింతామణీ, కామధేనువు, కల్పవృక్షము.

నిజానికి నిన్ను శ్రీ గురువు దగ్గరకు చేర్చిన మంత్రం, నామం. నామాన్ని సంపూర్ణమైన శ్రద్ధతో పరమ సత్యనిష్ఠతో ప్రత్యక్షదైవంగా భావించి జపించు. ''**మంత్రము – గురువు, శక్తి – నీవు, అందరూ ఒకటేనన్న సంగతిని మరిచి**

**పోవద్దు''**. మంత్రం, జపించేవారిని రక్షిస్తుందని అంటారు: **మంత్రాః మనన త్రాణ రూపాః.** మంత్రాన్ని ఆత్మీయం చేసుకుని జపించు. సిద్ధ గురువు నుంచి ప్రసాదరూపంలో లభించిన మంత్రాన్ని జపిస్తూ ఉండు. నీ గురువు, మంత్రంలో మూర్తీభవించి ఉంటాడు. అందువల్ల నువ్వు చైతన్యమైన గురుమంత్రాన్ని జపిస్తూ ఉండు. ప్రేమతో గానం చేస్తూ ఉండు. స్నేహంతో ధ్యానిస్తూ ఉండు. అప్పుడు శక్తి, విద్యుచ్ఛక్తి వేగంతో పనిచేస్తుంది. గురువు ప్రసాదించిన మంత్రాన్ని ప్రేమతో ప్రాణ–అపాన వాయువులతో మేళవించి జపించు. అప్పుడు ఆలస్యమే ఉండదు. క్రియలు వాటంతట అవే జరుగుతాయి. సాధన, దర్శనాలు, వాటంతట అవే జరుగుతాయి. సంతతుకారామ్ మాటలివి: అంతవరకు అర్థం కానివి, నామ జపం వల్ల అర్థమౌతాయి. అంతవరకు కనిపించనివి, నామ మహిమ చేత కనిపిస్తాయి. నామ జపం వల్ల చెప్పలేనంత లాభం ఉంది.

**నకళే తేం కళోం యేఈల ఉగలే, నా మేంయా విఠలే ఏకాచియా । 1**

**నదిసేతేం దిసోం యేఈల ఉగలే, నామేంయా విఠలే ఏకాచియా। 2**

**అలభ్యతేం లాభ హోఈల అపార, నామ నిరంతర మ్హణతాం వాచే । 3**

అటువంటి నామాన్ని ఏకాంతస్థలంలో కూర్చుని నిర్మలమైన మనస్సుతో జపించు. చెడు భావాలు, చెడు జ్ఞాపకాల గురించి నువ్వు ఆలోచించినపుడు నీ అంతః కరణ వాటిని పోలిన అనుభూతులనే పొందుతుంది. కామ వికారాల గురించి ఆలోచించి నట్టయితే నీలో కామం ప్రవేశిస్తున్న అనుభూతి కలుగుతుంది. అదే విధంగా మంత్రం గురించి ధ్యానిస్తూ మంత్రమయమయేందుకు ఎంతో కాలం పట్టదు. మంత్రంతో పాటు శ్రీగురువు నీలోపల ప్రవేశించి ఉన్నాడు. సర్వాంగాలలో ప్రసరించి నిన్ను తనకు సమానంగా చేస్తాడు. గురువు చేస్తున్న ఈ ఉపకారం ఎంతో గొప్పది. మరొకసారి జ్ఞాపకం చేస్తున్నాను. మంత్రాన్ని జపిస్తూ ఉండు. ఆ విధంగా చేస్తూండగా ధ్యానావస్థ ప్రాప్తిస్తుంది.

హృదయంలో విరాజమానమై ఉన్న గురుశక్తి, ధ్యానాన్ని తీవ్రతరం చేస్తుంది, మరియు స్థిరం చేస్తుంది. ధ్యానానికి ఆలంబనగా అంతరంగంలో ఏదో ఒక దాన్ని చూపిస్తుంది–జ్యోతి, లేదా నాదం, లేదా బిందువు. ఆ తర్వాత నీ ధ్యానం గాఢమౌతుంది.

చిత్త చాంచల్యం మీద విజయాన్ని సాధించేందుకు ధ్యానం అమోఘమైన ఉపాయం. ధ్యానం వాంఛితఫలాలను ఇచ్చే కల్పవృక్షం. ఈశ్వర శక్తిని ఆకర్షించే అయస్కాంతం, ధ్యానం. ధ్యానం సాధారణ వస్తువు కాదు.

**ధ్యానం యోగంయొక్క హృదయం, సాధనకు మూలం, జ్ఞానానికి తాళపు చెవి, ప్రేమ ప్రవాహం, మరియు శ్రీ గురువు యొక్క అనుగ్రహ సంపత్తిని సంపాదించిపెట్టే యజ్ఞం.** ధ్యానం శ్రీ గురువు యొక్క రూపం.

ధ్యానం ఏ విధంగా చేయడం, ఎవరిని చేయడం, ఎంతవరకు చేయడం వంటి ప్రశ్నలు ఎంతో ముఖ్యమైనవి. అడగవలసిన ప్రశ్నలు. గీతలో ఈ విధంగా పేర్కొన్నారు: ''**ధ్యానే నాత్మని పశ్యంతికేచిదాత్మానం**'' అనగా, ధ్యానం చేత ఆత్మ దర్శన మౌతుంది, అని అర్థం. శ్రీమద్ భాగవతంలో ఈ విధంగా చెప్పారు: ''**ధ్యానే ధ్యానే తద్రూపతా**'' అనగా, ధ్యానంలో సాధకుడు పరమాత్మరూపాన్ని పొందుతాడు అని అర్థం. భ్రమరంగురించి ధ్యానం చేసే కీటకం భ్రమరంగా మారుతుంది. అదే విధంగా సాధకుడు భగవంతుడిని ధ్యానం చేసి చేసి ఆయన రూపాన్నే పొందుతాడు.

ధ్యానం పేరు విని భయపడవద్దు. నీ జీవితంలో ధ్యానం అనేక రకాలుగా చేస్తూనే ఉంటావు. అనగా, అది జరుగుతుంటుంది. నీ నైపుణ్యం, నీ శక్తి సామర్థ్యాలు, ధ్యానం వల్లనే పరిపూర్ణమౌతాయి. వైద్యుడు చేసే చికిత్స, న్యాయాధిపతి తీసుకునే నిర్ణయం, 'రేడార్' వంటి యంత్రాల నిర్మాణానికి అవసరమైన శక్తి సామర్థ్యాలు, ప్రొఫెసర్ల లెక్చర్లు, అన్నం వండడం, కారు నడపడం, సంగీతం పాడడం, గణితం అభ్యసించడం – ఇవన్నీ ధ్యానం లేకుండా సాధ్యమా? వీటన్నిటికీ ధ్యానం కొంతైనా అవసరం. కాని ఈ విషయాలన్నిటిగురించిన నీ ధ్యానం ప్రాపంచికమైనది. ఈశ్వరుడి గురించినది కాదు. నువ్వు ప్రాపంచిక విషయాలగురించి శ్రద్ధ వహించే విధంగానే చిత్తాన్ని పరమేశ్వరుడి మీద లగ్నం చేసినపుడు అది ధ్యానమౌతుంది. ఇది కష్టం కాదు. కాని అంత సులభం కూడా కాదు. ధ్యానానికి నిజమైన అర్థం: **'నిర్విషయం మనః'**, మనస్సును ఆలోచనా రహితంగా, చింతనారహితంగా, స్పృహరహితంగా ప్రశాంతంగా ఉంచడమే ఉత్తమ శ్రేణికి చెందిన ధ్యానం. ఉత్తమ శ్రేణికి చెందిన మహాత్ములకే ఈ ధ్యానం గురించి తెలుసును. ధ్యాన సమయంలో మనస్సున ఎటువంటి ఆలోచనలు లేకుండా ఆత్మలో లీనమై ఉండడం ఉన్నతమైన అవస్థకు నిదర్శనం.

ధ్యానం విషయంలో శంకలుండరాదు. తర్క వితర్కాలు కూడదు. సగుణాన్ని ధ్యానించనా, లేక నిర్గుణాన్ని ధ్యానించనా అన్న సందేహం కలుగుతుంది. సగుణ నిర్గుణాలు రెండూ ఒకే ఫలితాన్నిస్తాయి. తుకారామ్ – తులసీ దాసు – నామ దేవుడు, మీరాబాయి, జనాబాయి వంటి భక్తులు సగుణోపాసనే చేశారు. వీరు సగుణాన్ని

సాక్షాత్కరింపచేసుకున్నారు, నిర్గుణాన్ని కూడా సాక్షాత్కరింప చేసుకున్నారు. సగుణం కల్పనకాదు, సత్యం. పరమాత్ముడి మహిమలు అనంతం. అనంత శక్తి సంపన్నుడైన భగవంతుడు, శూన్యంలో ఈ వ్యవహార యోగ్యమైన జగత్తును సృష్టించాడు. స్వయంగా జగత్తు యొక్క రూపాన్ని దాల్చాడు. జగత్తు లోని వస్తువులన్నిటి రూపాలను ఆయనే దాల్చాడు. అనంత రూపాలు అనేక నామాలు కలిగిన పరమాత్మ, సగుణం కావడం కష్టంకాదు. అందు వల్ల వాదప్రతివాదాల్లో, సాధువులు సన్యాసులేకాదు, ముముక్షువులు కూడా పాల్గొనరాదు. నీకు ఇష్టమైన రూపాన్ని ధ్యానం చేయి. సగుణమూ నిర్గుణమూ రెండూ గోవిందుడే. నీ మనస్సు, దేనివల్ల ప్రశాంతమై చపలత్వము లేకుండా ఆత్మలో లీనమౌతుందో దాన్ని ధ్యానం చేయి. ధ్యానాన్ని గురించి వాదోపవాదాలకు దిగి సమయాన్ని వ్యర్థం చేసుకోవద్దు. ఎవరి గురించి అయినా ధ్యానం చేయి. అందరు దేవతలు ధ్యానానికి యోగ్యులే, వారందరి రూపాలు ఒకటే. ధ్యానం చేయగా చేయగా అంతరంగంలో పరమశాంతికి నిలయమై ఉన్న స్థానం ప్రాప్తమౌతుంది. ఆ స్థానానికి చేరుకున్నపుడు సాధకుడు దుఃఖాలను మరిచిపోతాడు. పూర్ణత్వాన్ని అనుభవిస్తాడు. తనలోటుపాట్ల గురించిన దుఃస్వప్నాలను విస్మరిస్తాడు. జనన– మరణాల ఆలోచన నశించేది ఈ స్థానంలోనే. ఆ స్థానాన్ని ధ్యానం ద్వారా ప్రాప్తం చేసుకో. వాదోపవాదాలు ఒక జబ్బు. మానవుడు అనేక రకాల జబ్బులతో బాధపడతాడు. రోగాలవల్ల బాధతప్ప మరొక ప్రయోజనంలేదని బాగా తెలిసిన మానవుడు ధ్యానం గురించిన వివాదంలో పడి మరొక రోగాన్ని తెచ్చుకొనడం ఎందుకు? చిత్తాన్ని శూన్యం చేసుకో. నిద్రనుంచి అప్పుడే మేల్కొన్న మనిషికి, మెలకువగా ఉన్నప్పటికీ, మనసు శూన్యంగా ఉన్న అనుభవం కలుగుతుంది. నువ్వుకూడా అదే విధంగా నీ మనస్సును ప్రశాంతంగా నిశ్చింతగా చేసినపుడు నీమనస్సుకూ ఆత్మకూ భేదం ఉండదు. ధ్యానంలో ప్రగతి ఇదే. నీకు ఇంకొక విషయం చెబుతాను. **నీకంటితో చూచే వాటన్నిటిలోనూ రాముడున్నట్టు తెలుసుకో. దృష్టి గోచరమవుతూన్న ప్రతివస్తువు భగవంతుడితో నిండి ఉంది. ఆ విధంగా అర్థం చేసుకున్నప్పుడు ధ్యానం ఎంతో బాగ జరుగుతుంది. ఈసత్య దృష్టి జనన మరణాల చక్రం నుంచి ముక్తి నిస్తుంది.** యమధర్మరాజు తనదూతలతో ఈ విధంగా చెబుతున్నాడు :

**సకలమిదమహం చ వాసుదేవః పరమపుమాన్ పరమేశ్వరః స ఏకః ।**
**ఇతిమతిరచలా భవత్యనంతే హృదయగతే వ్రజతాన్ విహాయదూరాత్॥**

విష్ణుపురాణం
3-7-32.

'మనకు కనిపిస్తున్న ఈ ప్రపంచము, మరియు నేను, పరమపురుషుడైన వాసుదేవుడే' అన్న భావం హృదయంలో నిశ్చితమై ఉన్నవారికి దూరంగా ఉండండి, వారి దగ్గరకు వెళ్లకుండా వచ్చేయండి', – అని యమధర్మరాజు తన దూతలకు చెబుతున్నాడు. ఎంత గొప్ప ధ్యానం! ఎంత గొప్ప ఆలోచన! ప్రాక్ పశ్చిమాలు, ఉత్తర దక్షిణాలు, వెనుకా ముందూ, పైనా కిందా పరమాత్మ ఉన్నట్టు భావించి ధ్యానం చేసుకునే వారికి జీవన్ముక్తి వెంటనే లభిస్తుంది.

గోపికలు కూడా ఈ విధమైన ధ్యానమే చేశారు. వారికి, ఎక్కడ చూచినా శ్యామసుందరుడే కనిపించాడు. గోపికలకు, యమునానది శ్యామసుందరుడు, వృక్షాలు వనాలు శ్యామసుందరుడు, నాలుగు దిక్కులు శ్యామ సుందరుడు, భర్త శ్యామసుందరుడు, పిల్లలు శ్యామసుందరుడు, ఆవులు శ్యామసుందరుడు, తాము స్వయంగా శ్యామ సుందరుడు. మనస్సులో శరీరంలో శ్యామసుందరుడు, సర్వత్రశ్యామసుందరుడే. శ్యామసుందరుడు తప్ప, గోపికలకు, అన్యమేదీ కనిపించలేదు. ఇటువంటి ధ్యానం, పర్వతాలకు అడవులకు పోకుండానే లభ్యమౌతుంది. ఇది జ్ఞానానంతర ధ్యానం. దీనిలో పరమేశ్వరుడి గురించిన ఎఱుక ముఖ్యం. ప్రపంచం యావత్తు పరమాత్ముడి సంపూర్ణమైన రూపం అన్నది, పరమ సత్యం.

ఆరు

# సిద్ధ పీఠం యొక్క మహత్తు

భగవాన్ నిత్యానందుడి దగ్గరకు చాలామంది వచ్చే వారు, సాధన చేసేవారు. అందరికీ ఒకటే కోరిక. స్వయంగా నిత్యానందులు కావాలని, ఋద్ధి – సిద్ధులను పొందాలని, సన్మాన సత్కారాలను పొందాలని, నిత్యానంద అయిపోవాలని. 'నేను ముఖ్యుడిని, నేను గొప్పవాడిని, నిత్యానందుడికి నాపట్ల చాలా ప్రేమ, ఆయన కృప నాకు మాత్రమే లభించింది. ఇంకెవరికీ అంత లభించలేదు.' ఈ విధమైన ఆలోచనలూ ఇతరులకు బాధను కలిగించే మాటలూ, భక్తుల్లో వినవచ్చేవి. దీనివల్ల ఈర్ష్య, అసూయ, ద్వేషం, ఆడంబరం ఎక్కువ కావడం ప్రారంభమైంది భక్తుల్లో. ఇవి పెరిగే కొద్దీ నిత్యానందుడి సాన్నిధ్యంలో లభించే తన్మయత్వం తక్కువ కావడం ప్రారంభమైంది. ధ్యానం కూడా తగ్గుతూ వచ్చింది. 'అతడు ఏమన్నాడు?' 'అక్కడ ఏం జరిగింది'? 'అతడికి ఏమి వచ్చు?' 'నావంటివారు ఇంకెవరున్నారు?' 'నామాట నిత్యానందుడు కూడా వింటాడు, మరి మిగతా వారి మాట ఎందుకు?' 'మనమాట స్వాములవారు వినవలసిందే' 'నువ్వు చాలా గొప్పవాడివని భావమా' – ఇటువంటి అర్థంలేని మాటలు వ్యాపించడం ప్రారంభమైంది. తాము నిత్యానందుడికి సమానమై పోయినట్టు భావించి భక్తులు తమలో గర్వాన్ని అహంభావాన్ని పెంచుకొనసాగారు. దానితో వారి సాధనకు పెద్ద విఘ్నాలు సంభవించేవి. పాపాలన్నీ సమసిపోవలసిన చోటు అది. అందరూ పాపాలనుంచి బయటపడి, నిర్మలం కావలసిన చోటు అది. అటువంటి చోట, ఇటువంటి వ్యాధి ప్రబలింది! మంచిది.

గురు ప్రేమ ప్రభావం వల్ల అంతఃకరణ పరిశుద్ధమై, సాత్త్విక లక్షణాలు దినదినానికి వృద్ధి చెందుతాయి. అదే విధంగా, ఈర్ష్యాసూయలు, విషయ వాంఛల ప్రవృత్తి వల్ల పైన పేర్కొన్న మంచి లక్షణాలు రోజు రోజుకు తగ్గుతాయి. ధ్యానం చేసుకునేవారు ఈసంగతిని గుర్తుంచుకొనడం మంచిది. ఒక సంగతి మాత్రం నిశ్చితం. సాధకుడికి ధ్యానం, పుణ్యం ఎక్కువై ఆత్మశాంతి, స్వర్గసుఖమైనా లభిస్తాయి, లేదా మనుస్సులో

సంఘర్షణ ఎక్కువై, పుణ్యం తక్కువై, పాపం ప్రతినిత్యం ఎక్కువై విషయవాంఛలకు లోనై నరకానికి చేరువైనా అవుతాడు.

ఆశ్రమంలో నివసించేవారు ఎంతో మెలకువగా ఉండడం అవసరం. సిద్ధ పీఠం, గురు జనుల దర్బారు. దేదీప్యమానంగా ప్రజ్వరిల్లు యోగాగ్ని కేంద్రమది. యోగాగ్ని మీ పాపాలను పూర్తిగా దగ్ధం చేసి మిమ్ములను యోగీశ్వరులను చేస్తుంది. ఆ విధంగా కాక, ఆశ్రమంలో ఉంటూ సాధన చేయకుండా విషయ వాంఛలతో కూడిన జీవితాన్ని గడిపినట్టయితే మీ పుణ్యాలను తగ్గించి, నిస్తేజం చేస్తుంది. ఆశ్రమంలో విషయ వాసనలు లేశమాత్రం కూడా ఉండరాదు. ఆశ్రమంలో ఉంటున్నవారు, ఆశ్రమంలో ఉంటున్న ఇతరుల్లో తమ ఆత్మరూపమైన గురుదేవుడిని మాత్రమే చూడడం మంచిది. దీనవల్ల ధ్యానం, గాఢమౌతుంది. ఆశ్రమానికి భక్తులుగా వెళ్లేవారు ఎన్నడూ, ఇతరుల్లో గుణదోషాలను చూడరాదు. ఇతరుల దోషాలను చూచేవారు తమదోషాలను పెంచుకుంటారు. అటువంటి వారి యోగశక్తి తగ్గిపోతుంది. అప్పుడు, 'ఇక్కడ ఏమీ బాగాలేదు, మరొక ఆశ్రమానికి వెళ్ళడం మంచిది,' అనుకుంటారు. అది వ్యభిచార ప్రవృత్తి మాత్రమే. మరొక ఆశ్రమానికి వెళ్లినా ఇదే విధంగా ప్రవర్తిస్తారు. ఆశ్రమాన్ని విలాస ప్రదేశంగా భావించరాదు. మాటలతో పొద్దుపుచ్చే ప్రదేశం కాదు, ఆశ్రమం. కాలేజీల్లో చదువుకునే బాలబాలికలు కలిసి తిరిగే విలాస ప్రదేశం వంటిదికాదు, ఆశ్రమం. టెన్నిస్ ఆడుకునే క్లబ్ కాదు. 'విస్కీ' 'బ్రాందీ'ల వంటి మత్తు పానీయాలు సేవించే 'బార్' కాదు. ఆశ్రమానికి వెళ్లేవారు అమర్యాదగా విశృంఖలంగా తమకు నచ్చిన విధంగా వ్యవహరించి తమకు ప్రాప్తించిన శక్తిని పోగొట్టుకుని పథభ్రష్టులు కారాదు. ఎక్కడంటే అక్కడ కూచుని సభ తీర్చడం, అనవసరమైన వాటి గురించి సంభాషణ, ఇతరులను నిందించడం, సందేహాలను దోషాలను ఆపాదించడం వంటి పనులు యోగసిద్ధిని నష్టపరుస్తాయి. ఆశ్రమం పట్ల గౌరవం, ఉన్నతమైన ఆచరణ, సత్కర్మ, నియమిత జీవనం వల్ల అంతరంగంలో చిత్‌శక్తి విన్యాసమూ కుండలిని విలాసమూ త్వరగా అనుభవం లోకి వస్తాయి. ఇటీవలి మాట: సాధన చేస్తున్న ఒక బాలిక, ధ్యానంలో మంచి అనుభవాలను పొందుతూ ఉంది. ఆ బాలిక, ఆశ్రమానికి వచ్చి ఒక నెలకూడా కాలేదు. ఆ బాలికకు ధ్యానం చాల బాగ కుదురుతుంది. అనేక రకాల ముద్రలు సంభవిస్తాయి. ఆ బాలిక ఒకరోజు ధ్యానంలో నుంచి లేచి పరిగెడుతూ నాదగ్గరకు వచ్చింది. కుడిచేతి నడిమివేలును పట్టుకుని ఉంది. అన్నదికదా, 'బాబాజీ,

ఈ వేలును పాముకరిచింది. అందుకే నేను ధ్యానం నుంచి లేచి మీ దగ్గరకు వచ్చాను.' ఎంత మంచి అనుభూతి! చాలాకొద్ది సమయంలోనే ఆమె, ఎన్నో దశలు దాటింది! సిద్ధ యోగంలో కుడిచేతి నడిమి వేలును సర్పం కాటువేయడం మోక్షానికి గొప్ప సూచన. సిద్ధ యోగసాధకులకు పాము స్వప్నంలో కాటువేసినా మోక్షం సిద్ధించడం నిశ్చితం. ధ్యాన కాలంలో అటువంటి అనుభూతి కలిగినట్టయితే మరీ శ్రేష్ఠం, మంచిది.

పరాశక్తిమయి శ్రీకుండలినియొక్క మహావిద్యను **సిద్ధవిద్య** అంటారు. ఈ మార్గాన్ని అనుసరించే సాధకులను **సిద్ధవిద్యార్థులు** అని వ్యవహరిస్తారు. ఈ మార్గాన్ని **సిద్ధమార్గము** లేక **సిద్ధపథం** అనీ అంటారు. **సిద్ధపీఠం** చిత్‌శక్తి వల్ల ప్రేరితమైన పరమాణువులతో నిండి ఉంటుంది. సిద్ధపీఠంలో ప్రసాదించే **కుండలిని దీక్షను శాంభవీ దీక్ష** అని వ్యవహరిస్తారు. హంసగాయత్రీ హంస ప్రణవమూ దీనికి జపమంత్రాలు. ప్రాణ – అపానాలద్వారా హంసానుసంధానమే ఈ మార్గంలో ప్రాణాయామము. అటువంటి సిద్ధ పీఠం లేదా ఆశ్రమం యొక్క రక్షణ బాధ్యతను, అక్కడ నివసించేవారి యోగక్షేమాల బాధ్యతను సిద్ధలోకవాసులందరూ, సమస్త మహాపురుషులూ వహిస్తారు. పరమ పురుషుడైన సిద్ధేశ్వరుడూ ఆయన పరంపరాగత శిష్యులైన సిద్ధ యోగులు యోగినులు దీనికి గాను తమ శక్తిని ప్రదానం చేస్తారు. సిద్ధ మార్గంలో ధ్యాన సాధన సమయంలో మీరు సిద్ధాశ్రమంలో నివసించినట్టయితే, మీకు సిద్ధలోక వాసులు, ఋషి – ముని – యోగిపుంగవుల దర్శన భాగ్యం తప్పక లభిస్తుంది. దివ్యా నందానుభూతి, మహానిద్రానుభూతి, లోక లోకాంతరాల సందర్శనంవంటి సిద్ధులు ప్రాప్తిస్తాయి. సిద్ధవిద్యార్థులారా, సిద్ధవిద్యార్థినులారా మీరు, మీ శరీరంలో సిద్ధప్రేరితమై ఉన్న సిద్ధశక్తి ప్రసరణాన్ని మెలకువతో సంరక్షించుకొనండి. పరస్పరం క్రోధాన్ని రోషాన్ని పాపదృష్టిని భేదదృష్టిని విడనాడండి. స్వప్నంలో కూడా దోషాలను చేయవద్దు. దోషాలను ఎక్కువచేసుకోవద్దు. సిద్ధాచరణకు విరుద్ధంగా నడుచు కోవద్దు. సిద్ధ గమనాన్ని అర్థం చేసుకుని సంచరించండి. అర్థం చేసుకొనక పోవడం వల్ల ఎంతైనా హాని జరుగవచ్చు. తండ్రినుంచి, భవిష్యత్తులో తండ్రి కాబోయే కుమారుడు, తల్లినుంచి భవిష్యత్తులో తల్లికాబోయే కుమార్తె ఏ విధంగా రక్తము, రూపము, లింగము వంటివాటిలో అభేదమూగా అభిన్నమో అదే విధంగా అనాదీ, అనంతమూ, అపారమూ, అగో చరమూ, అచంచలమూ, అవికారమూ సత్ – చిత్ – ఆనంద స్వరూపమూ, సర్వ శక్తిశాలీ, సర్వజ్ఞమూ అయిన పరమ పురుషుడు

పరమ గురువు అయిన పరమ శివుడి శక్తి ఈ నాటివరకు సిద్ధ విద్యార్థులు విద్యార్థినులలో శక్తిపాత రూపములో సంపూర్ణముగా వ్యాపించి ఉంది. ఈ చిత్ శక్తి అనాది అయినప్పటికీ నిత్యనూతనము. ఈ శక్తిని శివుడు 'శివసూత్రాల' లో '**ఇచ్ఛాశక్తి రుమా కుమారీ**' అని పేర్కొన్నాడు. ఆమె, పరమేశ్వరుడి ఆత్మరూపమూ, ఆయన యొక్క పవిత్రమైన ఇచ్ఛాశక్తి అయిన ఉమ. అనగా, సాధక జనులకు ముందు ముందు మార్గదర్శకంగా ఉండు కుమారి. మహామహిమాన్విత అయిన ఈ చిత్‌శక్తి, పరమేశ్వరి, గురుకృపా రూపమైన శక్తిగా సిద్ధ విద్యార్థులు విద్యార్థినుల్లో వ్యాపించి ఉంటుంది.

సిద్ధమార్గంలో పురోగమించే సిద్ధవిద్యార్థులను సన్మానించడం అవసరం. అటు వంటివారిని సన్మానించడం పరాశక్తిని సన్మానించడమే. వారిని అవమానించరాదు. అమర్యాదగా ప్రవర్తించడం మంచిదికాదు. అటువంటి ప్రవర్తన, పరాశక్తి పరమశివుడైన శ్రీ గురువు పట్ల అపచారమవుతుంది. పూజ్యులైన శ్రీ గురువు యొక్క పరమశివశక్తి, ఎదుటి వారిలో ఉందన్న సంగతిని ప్రతి సిద్ధ విద్యార్థి, విద్యార్థిని ఎల్లప్పుడు గుర్తుంచుకొనడం మంచిది. సాధకుల్లోను గురువుల్లోను వ్యాపించి ఉన్నది ఒకే శక్తి, చిదంబ యొక్క శక్తి. ఇతరుల పట్ల అవహేళన, చెడుదృష్టి, కించపరచడం, దోషారోపణ చేయడం వంటివి పనికిరాదు. మెలకువగా వ్యవహరించండి. శ్రీ గురువులో ఉన్న పరాశక్తే వారిలో కూడా ఉందన్న సంగతిని తెలుసుకొనండి. అదే శక్తి మనలో కూడా ఉంది. ఈ విధంగా చేయకపోయి నట్టయితే మీ సాధనా, ప్రసాదరూపంలో మీకు లభిస్తున్న అనేక దృష్టాంతాలూ ఆగిపోతాయి. దూరపు దృశ్యాలను చూడడం, దూరపు శబ్దాలను వినడం వంటి అనుభవాలు ఆగిపోతాయి. మీకు సిద్ధులు ప్రాప్తించవు. మీ అంతరంగంలో వ్యాపించి ఉన్న పారమేశ్వరి శక్తితో స్నేహంగాను గురుకృపాశక్తితో మర్యాదగాను ఉంటూ సాధన సమయంలో సంభవించే క్రియల సాంగత్యాన్ని అనుభవించండి. అంతరంగంలో అనేక రకాల అనుభూతులు కలుగుతాయి, వాటిలో రమించండి, వాటినే ప్రేమతో స్మరించుకొనండి. అంతఃకరణం స్వతహాగా పవిత్రమైనది. దానిని చెడు భావాలతో అనాచారాలతో చెడుప వద్దు. మహాశక్తిని జాగ్రత్తగా సంరక్షించుకునేందుకు మీరు కఠిన తపస్సు చేయవలసి ఉంటుంది. గర్భిణీస్త్రీ తన గర్భంలో ఉన్న శిశువును కాపాడుకునేందుకు ఆహార విహారాదుల్లో ఎంతో జాగ్రత్తగా మెలకువగా ఉంటుంది. లేనట్టయితే గర్భం నిలవదు, శిశువుకు హాని కలుగుతుంది, శిశువు బలహీనమవుతుంది. ధనవంతుడు తన సంపదను అదే విధంగా సంరక్షించు

కుంటాడు. గుణవంతుడు తన సుగుణాలను కాపాడుకుంటాడు. అదేవిధంగా సాధకుడు ఎవరైనా, నియమాలను పాటించ కుండా సంయమహీనుడైనట్టయితే శక్తి క్షీణిస్తుంది.

సిద్ధుల సాంగత్యంలో, సిద్ధపురుషుల ఆశ్రమంలో ఎంతో మెలకువగా ఉండడం అవసరం. సిద్ధ యోగవిద్యార్థులు, వ్యర్థమైన సంభాషణల్లో, లేనిపోని మాటల్లో పాల్గొనరాదు. నియమాలను ఉల్లంఘించరాదు. మరొకరు తినగా మిగిలిన ఆహారాన్ని తినరాదు. ఇతరులను అనవసరంగా స్పృశించరాదు. చిత్‌శక్తియొక్క మహిమ చాలా గొప్పది. అది అత్యంత పవిత్రమైనది. అనగా జాతి – మత – భేదాలను, ధనిక – పేద తారతమ్యాలను, అస్పృశ్యత వంటి వాటిని పాటించడం కాదు. ఆడంబరం కాదు. దీని అర్థం ముఖ్యంగా, పవిత్రంగా ఉండడం. మానవుడి హృదయంలో దివ్యశక్తియొక్క బలం సహజంగానే ఉంటుంది. అనవసరమైన మాటలు, చెడ్డవారి సహవాసము, ఈ శక్తిసంపదను నష్టం చేస్తాయి.

మానవుడి మనోరాజ్యంలో అనేక రకాలైన శక్తి పుంజాలు ఉదయిస్తూ అస్తమిస్తుంటాయి. మానవుడు వ్యవహరించే తీరుకు తగినట్లు పరిణామం చెందుతాడు. అందువల్లనే '**క్రతుమయః పురుష**' అన్నారు. నువ్వు పరిపూర్ణమయేందుకుగాను, పవిత్రభావనతో ధ్యానం ద్వారా సంపాదించిన చిత్ శక్తి పుంజమును, ప్రతి నిత్యము వృద్ధి చేసుకొనడం అవసరం. మధ్యలో ఆగరాదు. ముఖ్యంగా సిద్ధ విద్యార్థులు ఈ శక్తిని వృద్ధి చేసుకొనడం మంచిది. ఈ శక్తి ప్రాపంచికంగాను పారమార్థికంగాను కూడా సహాయం చేస్తుంది. ఇక్కడ ఒక శ్లోకం చెబుతాను. సిద్ధయోగం యొక్క ఫలితాలను దీనిలో పేర్కొన్నారు:

**యత్రాస్తి మోక్షో నచ తత్ర భోగో యత్రాస్తి భోగో న చ తత్ర మోక్షః,**
**శ్రీసుందరిసేవనతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థావైవ.**

దీని అర్థం : మోక్షం ఉన్నచోట సంసారిక భోగాలుండవు, భోగలాలస ఉన్నచోట మోక్షంలేదు. కాని శ్రీ సిద్ధవిద్యారూప పరమసుందరి, కుండలిని ఉపాసన జరిగే చోట భోగము, మోక్షము, రెండూ ఉంటాయి. దీనిలో ఆశ్చర్యమేమీ లేదు.

ఈ చరాచర జగత్తుకు మూలం ఆదిశక్తి, భవాని. కృష్ణ భగవానుడు గీతలో 13వ అధ్యాయంలో ఈవిధంగా పేర్కొన్నాడు.

**ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః,**
**యః పశ్యతి తథాత్మానమకర్తారం సపశ్యతి. 29.**

దృష్టిగోచరమవుతున్న అన్ని వస్తువులు, అన్ని క్రియలు, ప్రకృతి అయిన భవాని చేస్తున్నవే, అని భావించేవారి దృష్టి, సత్యమైనది. మహర్షులు సాటిలేని, ఆనందమయి అయిన చిత్‌శక్తి భగవతి మాతను ఈ విధంగా ప్రార్థించారు: '**త్వమేవ సర్వ జననీ మూల ప్రకృతి రీశ్వరీ**' అనగా, ఓ జననీ, నీవే అందరికీ తల్లివి, మూల ప్రకృతివి అని అర్థం. 'స్పంద శాస్త్రం'లో ఈ విధంగా ఉంది :

'**ఇతి వా యస్య సంవిత్తిః క్రీడాత్వేనాఖిలం జగత్|**'

ఈ యావత్తు జగత్తును పరమశివుడి పరాశక్తి సంవిత్తు యొక్క లీలగా పరిగణించేవారు, నిజాన్ని చూడకలిగినవారు. అదే శక్తి కుండలిని, అంతరంగ సాధన క్రియాశక్తి. ఈ శక్తి వికాసమే ప్రపంచము. సిద్ధయోగుల శక్తిపాతంలోని శక్తి ఆమే. అందువల్ల సాధక జనులు ఆశ్రమంలో ఎంతో మెలకువగా ఉండడం అవసరం. మీ వ్యవహారాలు గురువుకు ఆగ్రహాన్ని కలిగించేవిగా ఉండరాదు. మీ శక్తిని క్షీణింప చేసేవిగా ఉండరాదు. జాగ్రత్తగా మెలగండి. ఎంత పవిత్రంగా ఉంటారో అంత దివ్యత్వాన్ని సంపాదించుకుంటారు. మీ దివ్యత్వాన్ని పెంచుకునే కొద్దీ శక్తియొక్క ప్రభావం సర్వత్ర దర్శనమిస్తుంది. గురుపీఠం నలువైపులా ఉండే వృక్షాలు లతలు పువ్వులు పండ్లు పశుపక్ష్యాదులలో, లోపలా, వెలుపలా శక్తి కణాలు నిండి ఉంటాయి. సిద్ధపరంపరకు చెందిన మహాసిద్ధపురుషుల కృపాదృష్టి ఉంటుంది. సిద్ధ పీఠాలలో, గురుపరంపరకు చెందిన మహాత్ములందరు సాధకులను కనిపెట్టి ఉంటారు. ఈ సంగతిని ఎప్పుడూ విస్మరించరాదు.

ఏడు

# గురుధ్యానము

సిద్ధయోగంలో, మీ ఇష్టదైవాన్ని ఏకాగ్రతతో ధ్యానం చేయడానికి ఎంతో ప్రాముఖ్యముంది. పరమ గురువు అంతర్శక్తిని జాగృతం చేసి, మంత్రోపదేశం చేసి, ధ్యానం, ఆసనం నేర్పించారు. సూర్యోదయానికి పూర్వమేలేచి, స్నానం చేసి, తూర్పుదిక్కుకు అభిముఖంగా లేదా ఏదిక్కు అయినా భగవంతుడి దిక్కుగా భావించి, ప్రశాంతంగా కూర్చుని పరమేశ్వరి అనుగ్రాహిక శక్తిని ధ్యానించు. మంత్రాన్ని జపించు. మంత్రాన్ని ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో అనుసంధాన పరచు. మనస్సును మంత్రంతో నింపు. మనస్సు అటూఇటూ చలించిన నట్టయితే దాన్ని మళ్లీ ధ్యానంలో లగ్నంచేయి. నీకు మరొక మంచి ప్రక్రియ చెబుతాను విను. పతంజలి ఋషి యొక్క సూత్ర మొకటి ఉంది. **'వీతరాగ విషయం వాచిత్తం.'** నీ మనస్సును నీ ప్రియమైన గురుధ్యానంలో లగ్నం చేయి. **ఇది సిద్ధయోగానికి లేదా కుండలిని మహా యోగానికి ప్రాణం, ధ్యానం యొక్క రహస్యం, ఆత్మ లాభానికి గురు రూపమైన తాళపు చెవి.**

మానవుడు దేని గురించి ధ్యానం చేస్తాడో, దానికి అనురూపంగా మారుతాడు. ప్రేమతో మనస్సులో ఏ వస్తువును ప్రతిష్ఠితం చేసుకుంటాడో, అదే వస్తువుగా మారిపోతాడు. సిద్ధ గురువులను ధ్యానించడం అతి సులభం. దీనికి ఒక కారణం, మనం శ్రీ గురువును నఖశిఖ పర్యంతం పూర్తిగా ఎరుగుదుము. మన ప్రియమైన గురువును తరుచు కలుసుకుని ఉంటాము. ఆయనతో ప్రయాణం చేసి ఉంటాము. అనేక విషయాల గురించి ఆయన చేసిన ప్రసంగాలను విని ఉంటాము. తన్మయంతో కూడిన యౌగిక క్రియలు, తత్వజ్ఞానం గురించిన మాటలు, వివిధరకాలూ విచిత్రాలూ అయిన సాధనల జ్ఞానం, అనేకమంది జ్ఞానులు మహాపురుషుల కథలు, శ్రీ గురువు చెప్పగా వింటున్నాము. ఇవన్నీ మన మానసిక ఫలకంలో ఉంటాయి. వాటిని మనం గుర్తు తెచ్చుకున్నా తెచ్చుకోకపోయినా అవి అప్పుడప్పుడు మనసులో మెదులు తుంటాయి. ఇది అందరి అనుభవం.

ఒకసారి ఒక యువకుడు వచ్చి ఈ విధంగా అన్నాడు: ''బాబాజీ నేను చాలా కలత చెంది ఉన్నాను. నాకు శాంతిని ప్రసాదించండి. జరిగిన సంగతి ఇది : నేనొక యువతిని ప్రేమించాను. మేమొకరికొకరం నచ్చాము. వివాహం చేసుకుందా మనుకున్నాము. కాని, ఇంతలో ఆ యువతి మరొకరిని ప్రేమించ సాగింది. అతడిని వివాహం చేసుకుంది. నాకు చాలా బాధగా ఉంది. ఓర్చుకోలేకుండా ఉన్నాను''.

నేనన్నాను: ''దీనికింత బాధ ఎందుకు? నువ్వుకూడా మరొక యువతిని పెండ్లి చేసుకో'' అని. ఆయువకుడన్నాడు: ''నిజమే కానీ ఆ యువతి నా మనస్సులో నుంచి పోవడం లేదు, ఎంత ప్రయత్నించినా''. నేనడిగాను: ''నువ్వెందుకు ఆమెను గుర్తు చేసుకుంటున్నావు?'' అని. ఆ యువకుడన్నాడు: ''నేను జ్ఞాపకం చేసుకోవడం లేదు. అప్రయత్నంగానే ఆమె జ్ఞాపకం వస్తుంది. ఆమెరూపం దానంతటదే నా కళ్ల ముందు ప్రత్యక్షమౌతుంది.''

ఆహా! ఎంత విచిత్రం! ఆ యువతిని పద్ధతి ప్రకారం చాలా కాలం పూజించలేదు. ఒక్కొక్క అంగాన్ని బీజాక్షరంతో ధ్యానం చేయలేదు. గొప్ప సిద్ధ మహాపురుషుడి నుంచి ఆ యువతీ పేరున మంత్ర దీక్ష తీసుకోలేదు. అయినప్పటికీ, ఆ యువతి రూపం మనుసునుంచి తొలగడం లేదు. తొలగించడానికి ఉపాయాన్ని బాబాజీని అడిగేందుకు వచ్చాడు. చూచారా! సాంగత్య ప్రభావం! ఎవరినైనా ప్రేమతో హృదయంలో ప్రతిష్ఠించామో, అక్కడి నుంచి తొలగించడం మహాకష్టం. 'నా మనస్సులో ఎందుకున్నావు వెళ్లిపో' అన్నప్పటికీ వెళ్లదు. ప్రేమతో కూడిన ధ్యానానికి ఇటువంటి ఫలితమే ఉంటుంది. నువ్వు నీ గురుదేవుడిని ఈ విధంగా ఎందుకు ప్రేమతో ధ్యానించవు? ఒక్కసారి ఆయన్ను అంతఃకరణంలో ప్రవేశింపచేసుకున్నట్లయితే విగ్రహంగా మారి కూర్చుంటారు. ఆ తర్వాత పొమ్మన్నా పోరు.

ప్రపంచంలోని సంసారులందరూ ఈ గీతాన్ని రాత్రింబగళ్లు ఆలపిస్తూ ఉంటారు: ''బాబాజీ, ధ్యానంలో కూర్చునేందుకు ప్రయత్నిస్తాను. కాని కూర్చున్న వెంటనే బయటి ప్రపంచంలోని విషయాలే జ్ఞప్తికి వస్తాయి. అదే ఆఫీసు, అదే ఫ్యాక్టరీ, పిల్లలు – ఏం చేయను? తోచకుండా ఉంది. ధ్యానం కుదరడమే లేదు.

నేనంటాను : ''ధ్యానం ఎంతో బాగ కుదురుతున్నది. నీమనసులో ఆఫీసు జ్ఞప్తికి రావడం ధ్యానమే. నీ ఫ్యాక్టరీ జ్ఞప్తికి రావడం ధ్యానంలో భాగమే. ధ్యానంలో నీ పిల్లలు నీకు దర్శనమిస్తున్నారు. నీ సాధనకు ఫలితం పొందికూడా నీకు సంతోషంగా లేదా. ప్రాపంచిక విషయాల గురించి ఎంతో ప్రేమతో ధ్యానం చేశావు. కొంతమందిని ప్రేమించావు. కొన్ని విషయాలగురించి శ్రద్ధగా ఆలోచించావు. వాటి ఫలితమే ఇప్పుడు

జరుగుతున్నది. ఒకసారి కార్ఖానా దర్శనం, మరొకసారి ఆఫీసు దర్శనం, ఇంకొకసారి పిల్లల దర్శనం, ధ్యానంలో కలుగుతూ ఉన్నా నువ్వు వీటిని ధ్యానంగా భావించడంలేదు. తమ్ముడూ, నా పరిస్థితి కూడా అదే. నేను సద్గురువు నిత్యానందుడిని ధ్యానం చేశాను. అన్ని సాధన మార్గాల ద్వారా ఆయన్ను ప్రేమించాను. ప్రియతమ గురుదేవుడి చరణాలను కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాను. అవన్నీ ఎప్పుడూ హృదయంలో స్ఫురిస్తూనే ఉంటాయి. ఆయన్ను నేను ధ్యానించకుండా ఉన్నా అంతరంగంలో 'గురుదేవ, గురుదేవ' అన్న జపం వినిపిస్తూనే ఉంటుంది. శరీరంలోని ప్రతి భాగంలోనూ శ్రీ గురువు దర్శనమిస్తూ ఉంటాడు. స్వప్నంలో కూడా ఆయనే కనిపిస్తాడు. ఆయన సాక్షాత్కారమే కలుగుతుంది.

**మనం ఏ విషయం గురించి ఆలోచిస్తామో, అదే విషయం, హృదయంలో స్ఫురిస్తుంది. ఆ విధంగా స్ఫురిస్తూ, కాలక్రమేణా ఆ స్ఫురణ కూడా తొలగిపోతుంది. అటువంటి స్థితి, ఉన్నత స్థాయికి చెందిన ధ్యానం.** అందువల్లనే పరమాత్మ స్వరూపుడైన శ్రీ గురువును సతతము ధ్యానించవలసిందని శాస్త్రాలు మనకు చెబుతున్నాయి. మనస్సులో ఎల్లపుడూ ఉన్నతమైన ఆలోచనలు ఉండేట్టు జాగ్రత్త వహించడం అవసరం. శ్రీ గురువు ధ్యానం వల్ల ఎదురు చూడనంత అద్భుతమైన ఫలితం లభిస్తుంది. మనస్సు చైతన్యవంతమైనపుడు నువ్వు పరమానందభరితమైన స్థితిని పొందుతావు.

ప్రియమైన జనులారా! ఒకమాట వినండి. తత్వజ్ఞాన గరిష్ఠులైన మహాత్ములు, ధ్యానం చేయవలసిందని ఎందుకు ప్రేరేపిస్తున్నారు? దీనికి కారణమేమై ఉంటుంది? ఇంత ఎక్కువ సమయాన్ని ధ్యానంలో గడప వలసిందని ఎందుకు చెబుతున్నారు? ఋషులు సరిగానే చెబుతున్నారు. యథార్థమే చెబుతున్నారు. ప్రాణికోటి సంక్షేమానికి, అందరి శ్రేయస్సుకు, ప్రాపంచిక వ్యవహారాలలో పారమార్థిక వైఖరిని ప్రవేశ పెట్టేందుకు, ఈ విధంగా బోధిస్తున్నారు. ప్రపంచంలో రాముడిని, రాముడిలో ప్రపంచాన్ని చూపిస్తారు. ప్రపంచంలో సుఖాన్ని పొందేందుకు మూలసాధనం మనస్సు. అందువల్లనే మహాత్ములు చెబుతున్నారు. ''ధ్యానం చేయి. పరమేశ్వరుడి ధ్యానం చేయి. మనస్సు చిన్మయము. దానిని పరికించు'' అని.

ఎనిమిది

# చిత్తము

మానవ జీవితంలో పరమాత్మను పొందేందుకు అనేక సాధన సంపత్తులున్నాయి. **వీటిలో చిత్తం, ఒక గొప్ప సంపద, అమూల్యమైనది.** ప్రపంచంలో మనకు అన్నిరకాల సామగ్రి దొరుకుతుంది. కాని ఒకసారి మనసును పోగొట్టుకున్నట్టయితే దానిని మళ్ళీ సంపాదించుకొనడం మహా కష్టం. మనస్సు ఒక సారి పోయిందా, పోయినట్టే. అది మళ్ళీ బాగుపడదు, దొరకదు. అందువల్లనే మనస్సును నిర్మలంగా దృఢంగా శక్తివంతంగా, సత్య స్ఫురణ పోకుండా ఉండేందుకు మన ఆర్య సంస్కృతిలో ఉపాసనను పేర్కొని ఉన్నారు. మంత్రజపం, స్తోత్ర పాఠం, ఈశ్వర చింతన - వీటిలో నీ ఉపాసన మార్గం ఏదైనా, అది **మనస్సుకు చేసే పూజ.**

ఒక సారి ఒక పెద్ద పారిశ్రామిక వేత్త నా గురువైన నిత్యానంద బాబా దగ్గరకు వచ్చాడు. ఆయనకు సహాయంగా ఇద్దరు పనివారూ, ఇద్దరు నర్సులూ ఒక డాక్టరూ వచ్చారు. కారణం, ఆయన ఒక ''మెంటల్ కేస్''. అనగా ఆయన తన మనస్సును పోగొట్టుకున్నాడు. చింతన చేసి చేసి చిత్త శూన్యుడయ్యాడు. ఆలోచించే శక్తి నశించింది. నిద్ర పట్టేది కాదు. బుద్ధి చెడిపోయింది. పిచ్చి పట్టి నట్టు అయింది. మనస్సు సరిగా పనిచేయక పోవడంతో ఆయన తన అస్తిత్వాన్నే కోల్పోయాడు. ఆయనకు చాలా కార్ఖానాలుండేవి. పంచదారకార్ఖానా, జవుళి మిల్లులూ, ఉండేవి. ఎంతో పేరు ప్రతిష్ఠలున్న వ్యక్తి. కాని, చిత్తానికి కోపం రావడంతో 'చిత్తేశ్వరుడు' ఆయన్ను విడిచిపెట్టి వెళ్లడంతో జీవించి ఉండి కూడా మరణించిన వ్యక్తి మోస్తరు కాలం గడుపుతున్నాడు. చిత్తం సహాయంతో చిత్తం యొక్క కృప వల్ల చిత్తం యొక్క స్నేహం వల్ల ఆయన, దేశ విదేశాల్లో తన వ్యాపారాన్ని బాగా విస్తరింప చేసుకున్నాడు. ఇప్పుడు ఆయన చిత్తం, ఆయన మీద ఆగ్రహించి వెళ్లిపోయింది. చిత్తం యొక్క స్నేహం లేదు ఆయనకిప్పుడు. దానితో ఆయనకు ఈ దుర్దశ పట్టింది!

చిత్తం అన్నిటికన్న గొప్పది. చిత్తంలో అన్నీ ఉన్నాయి. ఒకసారి విదేశాలనుంచి ఒక లార్డు, నన్ను చూచేందుకు వచ్చాడు. ఆశ్రమంలో కొన్ని రోజులు ఉన్నాడు కూడా.

ఒకరోజు నాతో అన్నాడు ''స్వామీజీ, మనశ్శాంతి లేదు. అశాంతిగా ఉంది. నిద్రరాదు. జీవితంలో ఉత్సాహం లేదు. నాదగ్గర చాలా ధనం ఉంది. నా దేశంలో నాకు ఎంతో గౌరవ ప్రతిష్ఠలున్నాయి. అయినా నాకు శాంతి లేదు, సంతృప్తి లేదు. ఎప్పుడూ ఏదో ఒక దిగులు. దీనికి కారణం తెలియదు. దయచేసి ఏదైనా ఉపాయం చెప్పండి. భారతదేశంలో ధ్యానానికి ఎంతో గొప్ప స్థానం ఉన్నట్టు తెలిసి, ఇక్కడికి వచ్చాను. దారిలో ఢిల్లీలో ఒక మహాత్మురాలి దర్శనమైంది. ఆమె సాన్నిధ్యంలో ఎంతో ఆనందం కలిగింది. ఆ తల్లే, మీ గురించి చెప్పింది. మీ దర్శనం చేసుకోమని చెప్పింది. చిత్తం, స్థిరంగా శాంతంగా చురుకుగా ఉండేట్టు నాకేదైనా సాధన మార్గం ఉపదేశించి అనుగ్రహించండి.''

చిత్తం చాలా విలువైనది. చిత్తాన్ని, సాధారణమైన వస్తువుగా పరిగణించరాదు. చితి లేదా చిత్‌ప్రకాశం యొక్క సంక్షిప్తరూపం చిత్తం. ప్రత్యభిజ్ఞాహృదయంలో ఒక సూత్రం ఉంది. **'చేత్య సంకోచినీ చిత్తం'**. దాని భాష్యంలో ఈ విధంగా వ్రాశారు: **''న చిత్తం నామ అన్యత్ కించిత్ అపితు సైవ భగవతీ తత్.''** చిత్తం సాక్షాత్తు భగవతి. అనగా భగవతి, చిత్‌శక్తి కుండలిని, చిత్ శక్తియొక్క సహాయంతోనే ఈ సృష్టి అంతా జరిగింది. చిత్ శక్తి యొక్క సహాయంతోనే వ్యక్తి తన జీవితం గడుపుతాడు. చిత్తం, చిత్‌శక్తియొక్క ఒక స్ఫురణ. చిత్ ప్రకాశ రూపుడైన పరమేశ్వరుడు, అనంతశక్తి సంపన్నుడు. ఆ పరమాత్మలో ఆ శక్తి అనేక రకములైన పనులను అనేక ప్రకారాలుగా నిర్వహించుతూ ఆ పరమేశ్వరుడిలో ఐక్యమై ఉంటుంది, సూర్యుడి అనంతకిరణాలు అనంత ప్రకారాలుగా ఉంటూ, సూర్యుడికి అనురూపంగా ఆయనలో ఐక్యమై ఉన్నట్టు.

ఈ శక్తి అనేక రకాల పనులను నిర్వహిస్తూ, అనేక రూపాలలో కనిపిస్తూ ఉన్నప్పటికీ అది నిర్వికారమైనది. ఒరలో ఉన్నపుడు కత్తి నిష్క్రియంగా ఉంటుంది. యుద్ధ సమయంలో మాత్రమే నరికే పని చేస్తుంది. అదేవిధంగా జీవాత్మ తన కర్మ ఫలాన్ని అనుభవించేట్టు, చిత్‌శక్తి, చిత్త రూపంలో ఉండి సహాయ పడుతుంది. చిత్తాన్ని ఒక సామాన్య వస్తువుగా పరిగణించి అవహేళన చేయరాదు. విచ్చలవిడిగా వ్యవహరించడం, వ్యర్థమైన చెడు సంభాషణలను చేయడం, రాత్రిం బగళ్లు చెడు ఆలోచనలను చేయడం, మనస్సును అశుభ్రం చేయడం, తర్క వితర్కాలతో మనస్సును నింపడం – ఇవి ఘోరనరకానికి దారితీసే సాధనాలు. **పరమేశ్వరుడు నీలో చిత్తరూపంలో**

**ఉంటూ నీ కర్మలకు తగిన ఫలితాన్ని అందచేస్తాడు.** నువ్వు చేసే పనులను పరమేశ్వరుడికి తెలియకుండా రహస్యంగా ఉంచుకొన గలవా? కొంచెం ఆలోచించి చూడు. అందువల్ల ధ్యానం చేయి. మనస్సులో ఉన్నతమైన భావాలను కలిగి, శ్రీగురు ధ్యానం చేయి.

చిత్తం, నువ్వు చేసే ఆలోచనకు తగినట్టు ఫలితాన్ని అందచేస్తుంది. మానవుడు మనస్సు ద్వారానే శాంతిని పొందుతాడు. చిత్తం వల్లనే భ్రాంతు డవుతాడు. చిత్తం వల్లనే మేధావి అవుతాడు. చిత్తం యొక్క ప్రసాదం వల్లనే కవీ బుద్ధిమంతుడూ కళాకారుడూ గొప్ప సంగీతవేత్త, యోగీ, అవుతాడు. చిత్తం వల్లనే శాస్త్రాలలో నిపుణుడవుతాడు. సమాధి కూడా చిత్తం వల్లనే ప్రాప్తిస్తుంది. చిత్తమే గురువు. శక్తిని సంచరింప చేసేది చిత్తమే. చిత్తమే నిర్వికల్ప పదము. చిత్త భ్రష్టుడు ఎప్పుడూ కష్టాలపాలవుతాడు. కర్మా చరణలో భ్రష్టుడవుతాడు. మోక్షమార్గాన్ని పొందలేడు. మలినమైన చిత్తమే ఘోర నరకము.

చిత్తాన్ని జాగ్రత్తగా సంరక్షించుకొనడం అవసరం. చిత్తం నీ ప్రియమైన మిత్రుడు. గురుజనుల ప్రేమను పొందకలిగిన అర్హత చిత్తానికే ఉంది. అందువల్ల నువ్వు ప్రశాంత చిత్తంతో ధ్యానం చేయి. చిత్తంలో నివసిస్తున్న పరమేశ్వరుడు ప్రసన్నుడై, తన విశ్వరూపాన్ని నీకు ధ్యానంలో కలుగచేస్తాడు. చిత్తం ప్రసన్నం కావడం వల్ల, నీకు ఆత్మ విచారణ సహజంగానే ప్రాప్తిస్తుంది. చిత్తరూపంలో నీ దగ్గర ఎంత గొప్ప సంపద ఉంది! ఇటువంటి గొప్ప ఆశ్చర్యకరమైన చిత్‌శక్తి నీ దగ్గర ఉండి కూడా నువ్వు రోదిస్తున్నావెందుకు? ఎందుకు దుఃఖం నీకు? అల్పుడిగా దీనుడిగా ఎందుకు భావించుకుంటున్నావు నిన్ను, నువ్వు? చిత్తంలో ఎల్లప్పుడు నివసిస్తున్న చిత్‌శక్తిని పూజచేయి. చిత్తంలో అంతఃస్ఫురణ రూపంలో స్ఫురించే ఆత్మతత్వాన్ని మరిచి పోకుండా వ్యవహరించు. మంచిది.

పరమాత్మ అందిరిలోనూ చిద్రూపంలో వ్యాపించి ఉండడం చేత, నువ్వు ధ్యానంలో ఉన్నపుడుకూడా నీ బయటి ప్రపంచాన్ని ఆనందమయం చేస్తాడు. ఇటీవల జరిగిన సంగతి: ఒక సాత్విక పండిత కుటుంబానికి చెందిన ఒక బాలుడు తలిదండ్రులతో ఆశ్రమానికి వస్తూ ఉంటాడు. తలిదండ్రులు సదాచార సంపన్నులు, పురోహితులు. బాలుడు ధ్యానం చేయడం ప్రారంభించాడు, అతి సునాయాసంగా. ధ్యానం చేయగా చేయగా అంతరంగంలో చిత్‌శక్తి జాగృతమైంది. మంత్రాన్ని ఎంతో ప్రేమతో జపించే

వాడు. పరమగురువైన పరమశివుడి శక్తితో నిండినదై లభించిన మంత్రం, కేవలం మంత్రమే కాదు, అది మహాద్భుతమైన అత్యంత ఉత్కృష్టమైన గుప్తమైన దివ్యశక్తి. మంత్రంలో పరమ శివుడు, గురువు ఏకమై ఉంటారు. అందువల్లనే మంత్రము చైతన్యము. దానిలో సర్వజ్ఞత్వము వంటి శక్తులుంటాయి. **మంత్రాః సర్వజ్ఞ బలశాలినః.** మంత్రాన్ని జపిస్తూ జపిస్తూండగా ఆ బాలకుడికి ధ్యానంలో అనేక రకాల అనుభూతులు కలగడం ప్రారంభమైంది. చిన్న పిల్లవాడు! మంత్ర స్ఫురణ మహిమ చేత ధ్యానంలో, మంత్ర దేవత ద్వారా, భావిసంఘటనల గురించిన జ్ఞానాన్ని పొందసాగాడు.

బాలుడి పరీక్షలు సమీపించాయి. ధ్యానంలో మంత్రదేవత కనిపించి, 'కారు ప్రమాదంలో నీకు గాయాలు తగులుతాయి. పరీక్షలకు కూర్చోలేవు' అని చెప్పింది. పిల్లవాడు, తలిదండ్రులకు ఈ సంగతి చెప్పినపుడు, వారు నమ్మలేదు. పోగా పరిహసించారు. 'చదవడం ఇష్టం లేదు నీకు. అందుకే సాకులు చెబుతున్నావు' అన్నారు. కాని, పిల్లవాడు ఈ సంగతి చెప్పిన తర్వాత మూడవ రోజున అదే జరిగింది. కారు ప్రమాదంలో కుడి చేతికి గాయాలు తగిలి, పరీక్షకు కూర్చోలేక పోయాడు.

ఒక వారం రోజుల తర్వాత మళ్లీ ఒక ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. ఆ పిల్లవాడు, అన్నదమ్ములతో 'ఏర్‌గన్' తీసుకుని తమ తోటలో ఆడుకునేందుకు వెళ్లాడు. పొద్దునే తంద్రావస్థలో మంత్రదేవత మళ్లీ కనిపించి హెచ్చరించింది ''నీ తుపాకి మానవ రక్తాన్ని కోరుతూ ఉంది'': అని. పిల్లవాడు దీన్ని పట్టించు కోలేదు. ఆ సాయంత్రం, 'ఏర్‌గన్' తీసుకుని, అన్నదమ్ములతో పోయి ఆడుకున్నాడు. ఇంటికి తిరిగి వచ్చి 'ఏర్‌గన్' ను మోకాళ్లనడుమ నేరుగా నిలబెట్టి, వంగి, గది తాళం తీస్తున్నాడు. ఇంతలో, తుపాకి తొలగి పోయింది. ప్రక్కనే ఉన్న మరొక పిల్లవాడు దాన్ని పట్టుకునే ప్రయత్నం చేశాడు. హఠాత్తుగా తుపాకి పేలి, గుండు, బాలుడి ఱొమ్ములోకి పోయింది. కుడి ఊపిరితిత్తి దగ్గర రెండున్నర అంగుళాలలోతు గాయమైంది. అయినా పిల్లవాడు చలించలేదు. ప్రశాంతంగా స్థిమితంగా ఉన్నాడు. కారణం, ధ్యానంలో ఉన్నాడు. పిల్లవాడిని వైద్యుడి దగ్గరకు తీసుకు వెడుతూండగా, మంత్రదేవత మరల దర్శన మిచ్చింది, ఏవో రహస్యాలను చెప్పింది. గాయపడి ఉన్న ఆ పిల్లవాడు, ఆ మాటలను ఒక కాగితం మీద వ్రాశాడు. తర్వాత ఆ కాగితాన్ని నాకిచ్చాడు. బాలుడికి ఆపరేషన్ చేయవలసి వచ్చింది. ఆగాయం, ప్రమాదాన్ని తెచ్చిపెట్టవలసిందే కాని,

పరమశివుడు, పిల్లవాడిని రక్షించాడు. ఆపరేషన్ తర్వాత బాలుడికి ఔొమ్ములో విపరీతమైన నొప్పి ప్రారంభమైంది. బాలుడు, ధ్యానం చేసుకొనడం ప్రారంభించాడు. ధ్యానంలో తంద్రాస్థితి కలిగి ఒక మహాత్ముడి దర్శనమైంది. ఆయన పిల్లవాడి ఔొమ్మును చేతితో నిమిరాడు. నొప్పి వెంటనే మాయమైంది. దీనివల్ల ప్రాపంచిక విషయాలలో కూడా ధ్యానం ఎంత ఉపయుక్తమో ఎంత ఆచరణీయమో అర్థమౌతుంది.

పరమార్థం కోసమే కాదు ధ్యానం, లౌకిక ప్రపంచానికి కూడా ధ్యానం గొప్ప మిత్రుడు. దీనిలో సందేహం ఏమీలేదు, అసత్యమేదీ లేదు. ధ్యానం వల్ల చిత్తం నిర్మలమై, విద్యార్థి, ఉన్నత శ్రేణిలో ఉత్తీర్ణుడవుతాడు. ధ్యానకాలంలో చిత్త నిరోధం కారణంగా కుంభకం జరిగి నరాలు బలపడతాయి. రక్త ప్రసరణం సరిగా జరుగుతుంది. తినే ఆహారం పూర్తిగా జీర్ణమౌతుంది. రక్తకణాలు ఎక్కువవుతాయి. చురుకుదనం ఎక్కువవుతుంది, ధ్యానం వల్ల. ప్రతి దినము ధ్యానం చేసేవారి చిన్న చిన్న రోగాలు నయమై పోతాయి. నాకు తెలిసిన బాల బాలికలు చాలామంది ధ్యానం వల్ల మంచి స్ఫూర్తినీ స్ఫురణనూ పవిత్రమైన శీలాన్నీ పొంది ఉన్నత స్థాయికి చేరుకొనడం గమనించాను. ధ్యానం వల్ల చిత్తం శాంతమై, మనసు సహజంగానే స్థిరమౌతుంది. శ్వాసగమనం మామూలుకన్నా మందంగా జరుగుతుంది. అంతరంగంలో శాంతి ప్రాప్తించడంతో జీవితంలో ఒక కొత్త స్ఫూర్తి వస్తుంది.

తొమ్మిది

# నా ధ్యాన సాధన

ధ్యానం ఏ విధంగా చేయాలన్న విషయమై ఎక్కువ ఆలోచించనవసరం లేదు. నేను ముందు చెప్పినట్టు మనస్సును స్థిరం చేసేందుకు పతంజలి సూత్రం ప్రకారం **వీతరాగ విషయం వా చిత్తం,** ఈ పద్ధతి ఉన్నతమైనది. గురుదేవుడి ధ్యానం చేయడం శ్రేష్ఠం, శ్రేష్ఠతరం, శ్రేష్ఠతమం, అతి ఉత్తమం. నేను చాలా రకాల సాధనలు ప్రాణాయామం – ధ్యానం – మంత్ర జపం వంటి అనుష్ఠానాలు చేశాను. కాని చివరకు నా ప్రియమైన గురుదేవుడి ధ్యానంలో మునిగిపోయాను. అన్నిరకాల ధ్యాన ప్రక్రియలకు గురుధ్యానం మూలం. 'శ్రీ గురుగీత'లో

**ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోఃపదం,**
**మంత్రమూలం గురోర్వాక్యం మోక్షమూలం గురోకృపా.**

అనగా, ధ్యానానికి మూలం గురువు యొక్క రూపం, పూజకు మూలం గురువు యొక్క పదయుగళం, గురువు యొక్క వాక్యమే మంత్రానికిమూలం, గురుకృప మోక్షానికి మూలం.

దీన్ని చదివినప్పుడు నాకు మహామంత్రం లభించింది. ఎంతో ప్రేమతో గురుధ్యానంలో మునిగి పోయాను. నిజానికి ఈ మంత్రభావం, అన్ని యజ్ఞాలను అన్ని పూజలను మించినది. సంత్ తుకారామ్ అభంగాలలో మంత్రతుల్యమైన అభంగమిది.

**గురు చరణీc లేవితా భావ, ఆపే ఆప భేటే దేవ,**
**మణునీ గురుసీ భజావే, స్వధ్యానాసీ ఆణావే.**
**దేవ గురుపాసీ ఆహే, వారంవార సాంగూc కాయే॥**
**తుకామ్హణే గురు భజనీc, దేవ భేటే జనీc వనీc॥**

తుకారామ్ మహారాజ్ ఈ అభంగంలో సత్యమే పేర్కొన్నారు. గురువు పట్ల భక్తిశ్రద్ధలు, ప్రేమానురాగాలు, గురుచరణారవిందంలో సంపూర్ణమైన భక్తి భావం

కలగడంతో పరమాత్ముడు సులభంగా లభిస్తాడు. అందువల్ల గురువుకు మహాపూజ చేయి. ధ్యానం చేయి. పరమేశ్వరుడు, గురువు దగ్గరే ఉంటాడు. ఎన్నిసార్లు ఏమని చెప్పను? శ్రీ గురువు నామస్మరణ చేయడం వల్ల పరమేశ్వరుడు వనంలో, జనంలో, సర్వత్ర లభిస్తాడు; అన్నది ఈ అభంగం అర్థం. ఈ అభంగం ఒక్కటి నాకు దైవతుల్యమైనది. అభంగాన్ని పూర్తిగా అర్థం చేసుకొనడం వల్ల నాకు మంచి ఫలితం లభించింది. శ్రీగురు నిత్యానందను ధ్యానించాలన్న నిర్ణయం చేసుకున్నాను. గణేశపురి హాలులో, దూరంగా ఒక మూల సందడి లేని చోట, శ్రీ గురు దేవుడు బాగా కనిపించే విధంగా కూర్చుని, చాలా కాలం, ఏకాగ్ర దృష్టితో గురుదేవుడిని చూచేవాడిని.

ఎంత అందమైన కృష్ణవర్ణపు శరీరం! సర్వాంగసుందరమైన సౌష్ఠవం, నీల స్ఫటికాన్ని పోలి మెరుస్తున్న శరీర కాంతి, చిన్న ముత్యాల వంటి పలువరుస, పొడవైన వేళ్లు, కుంభకం చేత పుష్టిగా ఉన్న ఉదరం, తెల్లటి శుభ్రమైన లంగోటీ, కుడిచేతి వేళ్లు చిన్ముద్రలో, ఎడమ చేతి వేళ్లు విప్పారు కుని అభయ ముద్రలో, కంఠంనుంచి దివ్యమైన హుంకారధ్వని, తన్మయత్వంలో ఊగాడుతూన్న శరీరం, ప్రతి రోమంలోను పరమానందపు తరంగాలు, సర్వాంగాల నుంచి వెలువడుతున్న దివ్యమైన తేజస్సుతో నిండిన కిరణాలు నలువైపులా ప్రకాశాన్ని వెదజల్లుతున్న నవ్వు ఇవన్నీ నా హృదయంలో అంకితమైఉన్నాయి. తదేక దీక్షగా ఆయన సుందర మూర్తిని చూస్తుండేవాడిని. ప్రతిసారి ఒక కొత్త ఆకర్షణ. ఒక కొత్త అద్భుతం కనిపించేది.

గురుదేవులు, కంబళి పరచిన కొయ్య మంచం మీద విరాజమానమై ఉండేవారు. మంచం ముందూ వెనకా పిల్లలకోసం తియ్యటి మిఠాయిలూ బిస్కట్లతో నిండిన డబ్బాలు చాలా ఉండేవి. రెండు వైపులా ఒక్కొక్క మంచం ఉండేది. భక్తులకు ప్రసాదంగా ఇచ్చేందుకు, ఒక మంచం మీద పండ్లు మరొక మంచం మీద వస్త్రాలు ఉండేవి. వీటన్నిటి మధ్య విరాజమానమై ఉన్న మంగళమయుడైన యోగి రాజును, శ్రీ గురుదేవులను నేను తిలకిస్తూ ఉండేవాడిని. ఎవరో వస్తారు, ఏదో అడుగుతారు. ప్రశ్నలకు గురుదేవులిచ్చే సమాధానాలను మననం చేసుకునే వాడిని.

గురుదేవులు తనకరకమలాలను ముందుకు వెనుక్కు పైకీ కిందికీ అప్పుడప్పుడు ఊపుతూ ఉండేవారు. ఆయన విశాలమైన దివ్యమైన నేత్రాలు తన్మయత్వంతో నిండి ఉండేవి. అప్పుడప్పుడు నేత్రాలు అర్ధ నిమీలితాలుగా ఉండేవి. అప్పుడప్పుడు ఆయన పెదవుల మీద స్థిమితమైన మందహాసం కనిపించేది. ఆయన మనోభావాలు ఎప్పుడూ

అన్నిరకాల జంఝాటాలకు, భేదభావాలకు గ్రహణత్యాగాలకు, స్వ – పర – జాతి – వ్యక్తి భేదాలకు, ద్వైతం అద్వైతం, ధర్మం, అధర్మం వంటి ద్వంద్వభావాలకు దూరంగా ఉండేవి. అనగా నిష్క్రియంగా ఉండేవి. ఆయన ఎప్పుడూ తన్మయత్వంలో స్థిరంగా ఉండేవారు. నేను ఆయన్ను అప్పుడప్పుడు కనులు బాగా తెరిచి చూచేవాడిని. అప్పుడప్పుడు కనులు మూసుకుని, బయటచూచిన దృశ్యాన్ని అంతరంగంలో ధ్యానంలోకి తెచ్చుకునే వాడిని. ఆయన్ను చూచి చూచి, ఆయన్ను ధ్యానం చేసి చేసి, అంతకు ముందు చేసిన ధ్యాన ప్రక్రియలన్నిటినీ వదిలిపెట్టాను. ధ్యానం చేసి చేసి, నేను గురుదేవుడి దివ్యభావంలో తన్మయుడనయే వాడిని.

ఒకసారి చిన్ముద్ర, ఒకసారి ధైర్యం చెబుతున్నట్టు అభయముద్ర, మరొక సారి ఆశీర్వదిస్తున్నట్టు, తన్మయత్వంతో నిండిన క్రియలు, అటూ ఇటూ ఊగుతున్న కంఠం, మందహాసం చేస్తూ, పూర్ణానందంలో తన్మయుడై గానం చేస్తున్న ఓంకార స్వరము, 'ఆః .... ఆః .....' అంటూ, అంతర్దీక్షా రూపంలో వినవచ్చే మంత్ర ధ్వని – ఈ రూపాలన్నిటినీ నేను ధ్యానం చేసేవాడిని. కొంత కాలం ఆవిధంగా గడిచింది. ధ్యానంలో అప్పుడప్పుడు శ్రీగురుదేవుడి రూపం అతి స్పష్టంగా కనిపించేది. అప్పుడప్పుడు ఆయన రూపం అస్పష్టంగా కనిపించేది. ధ్యానం గాఢమైన కొద్దీ అంతరంగంలో ఆనందం, ధైర్యం, బలం, తేజస్సు ఎక్కువ కావడం ప్రారంభమైంది. ఆ విధంగా చేస్తూ చేస్తూ ధ్యానంలో గురుభావం రావడం ప్రారంభమైంది. **శ్రీగురు ధ్యానం గొప్ప ఫలితాన్ని ఇస్తుంది,** అని అందుకే నేను పలుమార్లు చెబుతాను. ఈ విషయమై ఎంత చెప్పినా, చాలదు.

ప్రియమైన గురుదేవులు నా మనోభావాలను అర్థం చేసుకునేవారు. అప్పుడప్పుడు ఆయన ఈ సంగతిని సూచనగా తెలియచేసేవారు. నేను శ్రీ గురుదేవుడి క్రియలన్నిటినీ ధ్యానంలో చూచేవాడిని: తెల్లవారుఝామున మూడుగంటలకే లేచి ఉష్ణతీర్థంలో స్నానానికి వెళ్లేవారు. స్నానం తర్వాత తమను తామే పూజించు కునేవారు. తమను తామే ధ్యానించుకునేవారు. తమను పరమానంద మయ స్వరూపంగా దర్శించుకుని, పరమానంద భరితులయేవారు. తమలో తాము పాడుకునేవారు. తమలో తాము మాటాడుకునేవారు, తమ మాటలను తామే వినేవారు తన్మయత్వంలో తమ విలాసాలను తామేచూచి ఆనందించేవారు. ఈ విధంగా భగవాన్ నిత్యానందుడి భావాలన్నిటినీ నేను అభ్యాసం చేసేవాడిని. దీనితో అంతరంగంలో అప్పుడప్పుడు, ''నేను పూర్తిగా

నిత్యానంద స్వరూపుడినే'' ''నేనే నిత్యానందను'' అన్న భావావేశం కలిగేది. ఆ భావావేశంలో గుప్తమై ఉన్న మహిమ నా అనుభవంలోకి వచ్చేది. ఆ సమయంలో నా అంతః కరణంలోని భావాలు అత్యంత అలౌకికమైనవిగా ఉండేవి. దివ్యమైన ఆత్మానందానుభూతిలో ఉన్మత్త దశ అనుభవంలోకి వచ్చేది. అప్పుడు ''పరిపూర్ణుడి నయాను, పరిపూర్ణుడి నయాను'' అన్న భావం అంతరంగంలో ఉదయించేది. అప్పుడప్పుడు శ్రీ గురు నిత్యానంద యొక్క తటస్థమైన అన్యమనస్కమైన భావాన్ని అభ్యసించేవాడిని. నా పరమగురువు, దీర్ఘకాలం, ఒకే భావంలో స్థిరంగా ఉండే వారు. పెదవులు గట్టిగా మూసుకుని, అర్ధనిమీలితమైన నేత్రాలతో, ముఖం గంభీరంగా ఉండేది. ప్రాణం స్థిరంగా, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నెమ్మదిగా ఉండేవి. ఆ స్థితిలో ఆ భావాన్ని నేను మననం చేసి అభ్యాసం చేసేవాడిని. నా కండ్లు కూడా అర్ధనిమీలితమై స్థిరంగా ఉండేవి. పలువరసను బిగబెట్టి, పెదవులు మూసుకునేవి. ఆ విధంగా జరుగగానే శ్వాస నెమ్మదిగా కదిలేది. మనస్సు పూర్తిగా శ్శాంతపడి స్థిరమయేది. ఆ తర్వాత భగవాన్ నిత్యానందుడి విధంగానే, నా తల, కొద్ది కొద్దిగా ముందుకు వెనక్కు ఆడేది. నాలోపల, వెలుపల కూడా శ్రీ గురుదేవుడి భావం పూర్ణరూపంలో ఆవరించి నట్టు అనిపించేది.

ఆ రోజుల్లో నాకు ముక్తానంద భావం తక్కువగానూ నిత్యానంద భావం ఎక్కువగానూ కలుగుతుండేది. ఎవరైనా నన్ను సమీపించినా లేదా పరిచితులెవరైనా పలకరించినా భగవాన్ నిత్యానంద మోస్తరుగా కోపం వచ్చేది. అప్పుడప్పుడు ఆయన మోస్తరుగానే తిట్టేవాడిని. ఆ సమయంలో నా అంతరంగంలో ముక్తానంద భావము, శ్రీగురు నిత్యానంద భావమూ కూడా క్రియాశీలమై ఉండేవి. ఈ రెండు భావాల గురించి నాకు సంపూర్ణమైన జ్ఞానం ఉండేది. భగవాన్ నిత్యానంద భావం గురించిన ధ్యానం పూర్తయినప్పుడు, నేను ధ్యానం నుంచి లేచే వాడిని. కొంత సేపు నా స్థానంలో అటు ఇటు తిరిగేవాడిని. ఆ సమయంలో తిరుగుతున్నది 'ముక్తానంద'. 'నిత్యానంద' భావం అప్పుడు ఉండదు. అప్పుడు ధ్యానంలో కలిగిన భావం యొక్క జ్ఞాపకం మాత్రమే మిగులుతుంది. నేను ఎవరిని తిట్టినదీ ఎవరిని కొట్టేందుకు పరిగెట్టినదీ ఇవన్నీ జ్ఞాపకం వచ్చి బాధపడేవాడిని. సంయమం లేక పోయినందుకు పశ్చాత్తాపం కలిగేది. ఈ విధంగా నేను శ్రీగురు ధ్యానాన్ని, **ధ్యానమూలం గురోర్మూర్తిః** అన్న మంత్రాన్ని అనుసరించి పూర్తిగా అభ్యసించాను. గురుభావంలో సాధన చేస్తున్న

సమయంలో అప్పుడప్పుడు కోపం వచ్చి ఎంతో ఇబ్బంది కలిగేది. ఒకనాడు ధైర్యం తెచ్చుకుని శ్రీ గురుదేవుడిని అడిగాను. నేను ఆయన్ను 'అప్పా' అని పిలిచాను. ('అప్పా' అన్న శబ్దాన్నికి మా భాష-కన్నడంలో తండ్రి అని అర్థం.) నేను చెబుతూ ఉన్నాను, బాబా 'హుం' అంటూ వింటున్నారు. నేనన్నాను: ''నాకు ధ్యానంలో అప్పుడప్పుడు ఎవరో ఒకరిపైన కోపం వస్తుంది. తిడతాను కూడా. నాకు సిగ్గుగా ఉంది''. అప్పుడు గురుదేవులన్నారు: ''అది నువ్వు కాదు. నువ్వు కాదు. అది ఒక భావం. అది నువ్వు కాదు.''

ఈ మాటలను అర్థం చేసుకొనడం చాలా కష్టమైంది. 'నువ్వుకాదు, నువ్వుకాదు, అది నువ్వుకాదు.' ఈ మాటలను అర్థం చేసుకునేందుకు ప్రయత్నం చేస్తూ ఎనిమిది రోజులు, తర్క వితర్కంలో గడిచిపోయాయి. అప్పటికీ అర్థం కాలేదు. అప్పుడు ప్రశ్న తలయెత్తింది. ఏం చేయను? భగవాన్ నిత్యా నందుడిని మనస్సులోనే ప్రార్థించాను.

నా ఉపాసనా మూర్తి శ్రీ గురు దేవుడే. నా సగుణపూజకు, సగుణ ధ్యానానికి, సగుణ ఉపాసనకు లక్ష్యం, పరమగురువైన నిత్యానందుడే. నిత్యానందుడు నా సగుణదేవత. సీతారాముడు, రాధాకృష్ణుడు, గిరిజా శంకరుడు, దత్తాత్రేయుడు- అందరినీ శ్రీ నిత్యానందుడిగానే భావించి ఉపాసన చేసేవాడిని. నామనసులో మరొక దేవుడి గురించి ఎప్పుడూ ఎటువంటి ప్రశ్నా ఉదయించలేదు. 'నేను రాముడిని జపించ లేదే, కృష్ణుడిని పూజించలేదే, శివుడిని ధ్యానించలేదే అన్న శంక, నాకెప్పుడూ కలగలేదు. శ్రీ గురువులో అందరు దేవతలు ఉన్నట్టు నాకు పూర్ణ విశ్వాసముంది. అందువల్లనే శ్రీ గురుపూజ, సర్వదేవతల పూజ, శ్రీగురు ధ్యానం, అందరు దేవతల ధ్యానం. శ్రీ గురునామజపం ఏడుకోట్ల మహామంత్రాల జపానికి సమానం. ఇది నా దృఢమైన విశ్వాసం. నేను, శ్రీ సిద్ధారూఢస్వామి – శ్రీ ఝిప్రు అణ్ణా, శ్రీహరిగిరి బాబా, శ్రీమడివాలి స్వామి, అథణి శివయోగి, పండరి పురానికి చెందిన శ్రీ నరసింగస్వామి, శ్రీబాపూమాయి వంటి మహాపురుషులు అరవైమంది దర్శనం చేసుకున్నాను. వారందరు చెప్పిన మాట ఒక్కటే: 'గురుధ్యానం – గురువాజ్ఞా పాలనం – గురు సేవ – వీటిని మించిన సాధనా మార్గం మరొకటి లేదు' అని. నేను మరికొంతమంది మునులను సన్యాసులను సందర్శించాను. ఉత్తమ శ్రేణికి చెందిన వైష్ణవులను దర్శనం చేసుకున్నాను. హిమాలయాల్లో సంవత్సరాలుగా నివసిస్తున్న దిగంబర అవధూతల

దర్శనం చేసుకున్నాను. వీరందరూ తమ ప్రవచనాల చివర ఒకటే మాట! గురుదేవుడి ధ్యానం, ఆయన సేవ, ఆయన ఆజ్ఞను పాలించడం-ఇవే శ్రేష్ఠమని చెప్పారు. గురువులో లీనం కావడం, సర్వ శ్రేష్ఠమైన సాధనమని చాలాసార్లు విన్నాను. ఆ తర్వాత శివుడిని ఆరాధించే మహాయతుల దర్శనం చేసుకున్నాను. వారి సిద్ధాంతాలు శివ మయం, వారి ధ్యానం శివభావం, వారి దీక్షా పద్ధతి శక్తి పాతం. వారు కూడా ఇదే తత్వాన్ని బోధించారు: 'గురువు దగ్గరకు వెళ్లు. గురువును ఉపాసించు. గురువుతో ఉండు' అన్నారు. నేను చాలామంది సత్పురుషుల గ్రంథాలను కూడా చదివాను. ఏక్‌నాథ్ మహారాజ్ 'గురువును ధ్యానించవలసిందని' వ్రాశారు. శ్రీ జ్ఞానేశ్వరుడు కూడా 'గురువే మంత్రము, గురువే తంత్రము, అన్నీ గురువే' అన్నాడు. శ్రీగోరఖ్‌నాథ్, శ్రీనానక్‌దేవ్, శ్రీ కబీర్, **అందరూ గురుమహిమనే గానం చేశారు.** ఇప్పుడు నాకు పూర్తిగా విశ్వాస మేర్పడింది, గురుధ్యాన మొకటే సర్వశ్రేష్ఠమయినదని.

శ్రీ గురువు యొక్క సగుణోపాసనలో సదా లీనమయే వాడిని. నిత్యానందను ధ్యానిస్తాను. నిత్యానంద గురించి గానం చేస్తాను. నిత్యానంద గురు మంత్రాన్ని జపిస్తాను. గురుదేవుడు స్నానం చేసిన తర్వాత, ఉష్ణకుండంలోని నీటిని తీర్థంగా భావించి సేవిస్తాను. మధ్యాహ్నం భగవాన్ నిత్యానంద భోజన సమయంలో, ఎవరికీ అక్కడ ప్రవేశం ఉండేదికాదు. ఉచ్ఛిష్ట ప్రసాదం అడిగినా దొరికేది కాదు. నేను, భగవాన్ నిత్యానందుడికి వంట చేసే కరియణ్ణశెట్టీ, మోనప్పా వంట పాత్రలు కడిగే సమయంలో, మిగిలి పోయిన ఆహార పదార్థాలను పారవేసే చోటును కనిపెట్టాను. ఎవరికీ తెలియకుండా అక్కడికి వెళ్లి, అక్కడ దొరికే అన్నపు మెతుకులను తెచ్చుకుని ప్రసాదంగా భుజించేవాణ్ణి. శ్రీ గురువు యొక్క ఉచ్ఛిష్టం దొరికిందని ఎంతో సంతోషం కలిగేది. భగవాన్ నిత్యానందుడు కూర్చునే చోట దొరికే ధూళి కణాలను శరీరానికి పూసుకునే వాడిని. ఈ విధంగా సగుణ పూజ, సగుణ ఉపాసన, సగుణ ధ్యానం దినదినము ఎక్కువ కాజొచ్చింది. గురువు పట్ల ద్వేషభావాన్ని దోషభావాన్ని కలిగి ఉండడం, ఆయన గురించి తర్కవితర్కాలు చేయడం వంటివి నేను చేయలేదు. ఇంకెవరైనా గురునింద చేసినా వినేవాడిని కాదు. అప్పుడప్పుడు ఆయన పాదాలు ఒత్తే అవకాశం లభించేది. ఒళ్లుకూడా పట్టే వాడిని. ఈ విధంగా సాధన చేస్తూ, భక్తి శ్రద్ధలు ఎక్కువై, నిష్ఠ సంపూర్ణమైన స్థితిని చేరుకుంది.

అప్పుడప్పుడు భగవాన్ నిత్యానంద, నా మనోభావాలను తెలుసుకొని నేను అడగకుండానే, ఆయనే ఏదైనా చెప్పేవారు. ఒకనాటి సాయంత్రం, నాలుగున్నర గంటల సమయం. వాతావరణం ప్రశాంతంగా ఉంది. పాతహాలులో నేనూ మరికొంతమంది కూర్చుని ఉన్నాము. భగవాన్, తామే మాట్లాడ సాగారు: ''గురు ధ్యానం సంజీవని, గురుధ్యానం రహస్యమైనది. పూర్ణయోగం, సర్వజ్ఞానం. జ్ఞానమంతా గురు ధ్యానంలోనే. గురుధ్యానంలోనే. గురువుకు మహాపూజ, గురువు గురించి మహా ధ్యానం–వీటి గురించి 'జ్ఞానసింధు' లో ఉంది. చాలామంచి గ్రంథమది''. ఈ మాటలు చెప్పి మౌనంగా ఉండిపోయారు. ఆయన చెప్పిన ఈ మాటలను నేను మంత్ర తుల్యంగా భావించి మననం చేయడం ప్రారంభించాను. ఈ మాటలను పదేపదే మననం చేసుకుంటూ వెలుపల తూర్పు దిక్కుగా కుండంవైపు నడిచి వెళ్లాను. అక్కడ బొంబాయి నుంచి వచ్చిన ఒక భక్తుడి చేతిలో, కన్నడ భాషలో ఉన్న 'జ్ఞాన సింధు' పుస్తకం కనిపించింది. నన్ను చూచి, ''స్వామీ నా దగ్గర 'జ్ఞానసింధు' అన్న పుస్తకమొక్కటి ఉంది. దీన్ని చదివి చదివి నా బుద్ధి చెడి పోయింది. దీన్ని తీసుకువెళ్లి నిత్యానంద బాబా దగ్గర పెడదాం'' అన్నాడు. సరేనన్నాను. ఇద్దరం లోపలికి వెళ్లాం. ఆ భక్తుడి పేరు కృష్ణశెట్టి. ఆయన ఆ పుస్తకాన్ని బాబా ఎదుట పెట్టాడు. భగవాన్ నిత్యానంద ''హుం'' అని శబ్దం చేసి, నాతో అన్నారు ''నువ్వు తీసుకో'' అని. నేనా పుస్తకం తీసుకున్నాను, మహాప్రసాదంగా భావించాను. గురుదేవుడిచ్చే ఏ వస్తువునైనా నేను ప్రసాదరూపంలో గ్రహించేవాడిని. ఎప్పుడైనా పండు లభించినట్టయితే, అది పండు అన్న భావాన్ని తొలగించి శక్తి ప్రసరణానికి ప్రసాదంగా భావించి ఎంతో భక్తితో దాన్ని తినేవాడిని. తిన్న తర్వాత కొంతసేపు ధ్యానం చేసేవాడిని. అదే విధంగా ఆపుస్తకాన్ని శిరస్సుమీద పెట్టుకున్నాను. ఈ గ్రంథాన్ని అది వరకే రెండు మూడు మార్లు చదివి ఉన్నాను. నాకు కొత్త కాకపోయినప్పటికీ, గురువు నుంచి లభించిన కొత్త ప్రసాదంగా భావించి తెరిచాను. పుస్తకం మధ్యలో ఆదిగురువు యొక్క మహాపూజ వర్ణితమై ఉన్న అధ్యాయం అది. హాలులో ఒక మూల కూర్చుని ఎంతో శ్రద్ధగా చదివాను. ఈ అధ్యయం ఎంతో అర్థపూర్ణమైనది.

ఈ పుస్తకం రచయిత ఒక గొప్ప సిద్ధ పురుషుడు. పరమ అవధూత. ఆయన పేరు శ్రీ చిదానంద అవధూత. ఆయన, బగలాముఖి దేవిని సగుణోపాసనతో సాక్షాత్కరింప చేసుకున్న మహాపురుషుడు. ఆయన నివాసం, హంపీకి ఆవల,

తుంగభద్రానది ఒడ్డున బగలాముఖి పర్వతం మీద. నేను ఆ అధ్యాయాన్ని మూడుసార్లు చదివాను. ఆ అధ్యాయంలో గురువును ధ్యానంచేసే పద్ధతి గురించి ఉంది. శ్రీ గురువును మనలోకి ఆవాహన చేసుకుని స్వయంగా గురురూపమై గురువును ధ్యానించడం ఈ పద్ధతి. పరమశివుడికీ కార్తికేయుడికీ జరిగిన సంభాషణ ఉంది ఈ గ్రంథంలో. ప్రియమైన గురు భక్తులారా, శ్రద్ధగా వినండి. ఈ అధ్యాయం ఈ విధంగా ప్రారంభమౌతుంది.

''**అథ శ్రీ గురు ధ్యానం:** ఇప్పుడు గురుధ్యానం ప్రారంభం. పరమ శివుడు అంటున్నాడు: 'ఓ పరమ గురుభక్త శిరోమణీ కార్తికేయా, శ్రీ గురుధ్యానం చాలాగొప్పది. సిద్ధ జనుల అత్యంత గోపనీయమైన సాధన ఇది. గురు ధ్యానం, భోగ- మోక్షాలు రెండింటినీ ప్రసాదిస్తుంది. అంతేకాదు, ధ్యానం చేసేవారు, ధ్యానం చేస్తూ చేస్తూ, చివరకు పరతర ఆనందమయమైన పరమ తేజస్స్వరూపమైన పరమగురువుగా మారిపోతారు. ఓ కార్తికేయా, శ్రీగురువు ప్రత్యేకమైన ఒక ఆకారంలో కనిపిస్తున్నప్పటికీ ఆది- అంతాలు లేనివాడు. ఆయన సంగతి ఎవరికీ తెలియదు. గురుతత్వం, ఆది తత్వం. పరమానందమయ స్వరూపం. స్పందనకు మూలకారణ మైనప్పటికీ ఎటువంటి స్పందన లేకుండా, వృత్తులన్నీ సమాప్తమయే స్థానం. ఆవాగమనాలు ముగిసే స్థానం. స్థావర జంగమాత్మక జగత్తుకు ఇక్కడ ఆశ్రయం లభిస్తుంది. ఓంకారానికి లక్ష్యం. సిద్ధ పురుషుల నివాసస్థానం. గురుభక్తి ప్రియుడైన ఓ కార్తికేయా, సగుణ నిర్గుణ వివాదం అక్కడ సమసిపోతుంది. ఒక్క గురువు తప్ప ఇంకెవ్వరూ చేరుకోజాలని స్థానం అది. అక్కడికి ఒకసారి చేరుకున్న తర్వాత, మళ్లీ వెనక్కురావడమంటూ ఉండదు. దేవతలందరికీ అధి దేవత, అందరికీ ఆశ్రయమూ అందరి పరమగతీ అయిన సర్వాంతరాత్మ శ్రీగురువు. ఆయన అప్పుడప్పుడు మానవరూపంలో వెలుపల, గురురూపంలో అంతరంగంలో ఉంటూ శిష్యులకు అనుగ్రహ- నిగ్రహాలద్వారా తనరూపాన్నీ తన స్థితినీ ప్రసాదిస్తాడు. అటువంటి చిన్మయమైన గురుమూర్తిని ధ్యానించడం పరమ ఫలదాయకము. ఓ యోగనిష్ఠ కార్తికేయా, నిర్గుణమూ, నిరాకారమూ శక్తిసంపన్నమూ అయిన పరమతేజస్స్వరూపము శ్రీ గురుదేవుడు. పంచ భూతాలతో నిండిన అన్ని దిశలు, ఆకాశము, పర్వతాలు, వనాలు, నదులు, సముద్రాలు, విశాలమైన పృథ్వి- ఇవన్నీ శ్రీ గురువు యొక్క రూపాలు. తూర్పునుంచి పశ్చిమం వరకు, ఉత్తరం నుంచి దక్షిణం వరకు పై నుంచి

క్రిందవరకు, పాతాళం నుంచి స్వర్గం వరకు, కైలాసం, వైకుంఠం, ముక్తుల పరమ పదము - ఇవన్నీ పరమానంద మయుడైన శ్రీ గురువు తప్ప అన్యం కాదు. అన్నీ ఆయనే అయి, అన్నిటా ఉన్నాడు. ఆయన ఎవరికీ చెందడు. ఆయనకు చెందినవారు ఎవరూ లేరు.

''సోహం'' మంత్రానికి పరమలక్ష్యమైన సోహం రూపం, గురువే. ఆయన చరాచరుడు. పిండ బ్రహ్మాండరూపుడు. ఆయనే, తన ప్రజలకూ సంతానానికీ, ఆత్మీయులకూ, తనకు ప్రియమైన భక్త జనులకూ తన శక్తిని ప్రదానం చేసేందుకు గాను మానవాకారంలో గురురూపంలో అవతరిస్తాడు. అటువంటి గురువు సిద్ధ మార్గ ప్రవర్తకుడు. వారి ప్రవర్తన, బుద్ధి, నీతి నియమాలు అతి విలక్షణమైనవి. అటువంటి గురు జనులకు లింగభేదం లేదు. వారు గురువులు మాత్రమే. వారి శరీరం, కుండలినియోగాగ్ని వల్ల తప్తమైనది. వారి సప్త ధాతువులు చితితో నిండినవి, వారి ప్రాణంలో ఓంకారం సోహమై ప్రసరిస్తూ ఉంటుంది. ఈ విస్తృత ప్రపంచం గురుజనుల చిచ్ఛక్తి విలాసము.

అటువంటి గురువు నీ సర్వాంగాలలో ఉన్నట్లు భావించి ధ్యానం చేయి. ఓ గురుభక్తా, ఇది మహాపూజ. ప్రశాంతంగా చిత్త వికారాలను తొలగించి చిత్తాన్ని నిరాలంబం చేయి. చిత్తంలో చింతన రూపంలో తల ఎత్తే దోషాలన్నిటిని తొలగించు. శ్రీ గురువు సమక్షంలో కూర్చో. మొదట, అన్ని దేవతలను తనలోనే కలవాడు - సర్వమంత్రమయుడు, అందరు మునులు ఋషుల రూపాన్ని ధరించినవాడు అయిన పరమగురువుకు నమస్కారం చేయి. అన్ని దిక్కుల్లోను ఆయన దర్శనం చేసుకుని నమస్కారం చేయి. ఈ విధంగా ప్రార్థించు: ''ఓ గురుదేవా మీరు సర్వమయులు, విశ్వరూపం మీరే. వివిధ రూపాలలో ఉన్న మీకు నా అనంత ప్రణామాలు.'' ఈ విధంగా మనస్సులోనే ప్రణామం చేసి ఓ కార్తికేయా, నీ పైన క్రింద, ముందు వెనుక, అన్ని దిక్కుల్లోను పూర్ణ గురుతత్వమే ఉన్నదని తెలుసుకుని గురువును ధ్యానించు. ఆ తర్వాత నీ శరీరాన్ని గురుభావంతో నింపుకో. వస్త్రంలో నూలు ఏ విధంగా ఇమిడి ఉందో, అదే విధంగా నూలులో వస్త్రం ఉంది. అదేవిధంగా నీలో గురువు, గురువులో నువ్వు ఉన్నారు. ఈ దృష్టితో ఇద్దరినీ ఒకే రూపంలో చూడు. మట్టికీ కుండకూ భేదం లేని విధంగా నీ గురువు నీనుంచి భిన్నంకాదు. ఆ విధంగా భావించి ప్రశాంతంగా ఆసనం మీద కూర్చుని, నీ శిరస్సును స్పృశించి, దాన్ని నీ

గురువు యొక్క శిరస్సుగా భావించుకో. అదే విధంగా కపాలం, రెండు కళ్ళు, రెండు చెవులు, ముక్కు, జిహ్వ, కంఠం, రెండు భుజాలను చేతితో స్పృశించి ఇవన్నీ గురువు యొక్క అంగాలేనని భావించు, రొమ్ము, హృదయం, పొట్ట, వీపు, నడుము, మోకాళ్ళు, పిక్కలు, పాదాలు, వీటన్నిటినీ స్పృశిస్తూ, ఇవి అన్నీ గురువుకు చెందినవి అని భావించు. చివర, పాదాల వ్రేళ్లనుకూడా, ఇవికూడా గురువే అని స్మరిస్తూ స్పృశించు. పైనుంచి వివిధ అంగాలను స్పృశిస్తూ పాదాల వరకు వస్తున్నపుడు 'గురు ఓం' 'గురు ఓం' అని జపించు. చిన్న, పెద్ద అన్ని అంగ ప్రత్యంగాలను స్పృశిస్తూ 'గురు ఓం' అని జపించు. గురు ప్రియుడైన ఓ కార్తికేయా ఆ తర్వాత పాదాల వ్రేళ్లనుంచి శిరస్సువరకు ఇదే పద్ధతిలో ఒక్కొక్క అంగాన్ని, పాదాలు, మోకాళ్ళు, నడుము, పొట్ట, వీపు మొదలైన అంగాలను స్పృశిస్తూ. ''గురు ఓం'' జపించు. ఈ విధంగా అన్ని అంగాలలో గురువున్నట్లు భావిస్తూ, చివర ''గురు ఓం'' జపిస్తూ, శిరస్సును స్పృశించు, నువ్వే మంత్రం, నువ్వే గురువు, నువ్వే సమస్తము, గురువులో నువ్వు, నీలో గురువు, ఈ విధంగా భావిస్తూ ధ్యానం ప్రారంభించు. ప్రతి దినం ఈ విధంగా ధ్యానం చేయి. నాలో గురువు, గురువులో నేను అని భావిస్తూ ధ్యానం చేయడంలో ఏ మాత్రం సందేహించకు. ధ్యానం చేస్తూ చేస్తూ ''గురు ఓం'' జపిస్తూ జపిస్తూ నిన్ను నువ్వు మరిచిపో.''

ఆ తర్వాత పరమేశ్వరుడు కార్తికేయుడితో ఈ విధంగా అంటున్నాడు: ''ఓ స్వామి కార్తికేయా, నువ్వు స్నానం చేసే సమయంలో కూడా నీ శరీరంలోని ప్రతి అంగంలోనూ గురుమూర్తి నివసిస్తున్నట్టు తెలుసుకుని స్నానం చేయి. భోజన సమయంలో, హృదయమందున్న శ్రీ గురుదేవుడే భోజనము చేస్తున్నట్టు భావించి, గురువుకు అర్పించిన భోజనమే తిను. స్నానసమయంలో గురు మూర్తికి స్నానం, భోజన సమయంలో గురువుకు అర్పించిన భోజనం చేయి. మిగతా పనులు కూడా మంగళ మయుడైన గురువుకు అర్పించి, గురువుదాత - గురువు భోక్త - గురువే సర్వ యజ్ఞాలు, గురువే వాటిని చేసే యజమాని, ఈ విధంగా అన్నిటినీ గురు రూపాలుగా భావిస్తూ ప్రతినిత్యమూ 'గురు ఓం' 'గురు ఓం' 'గురు ఓం' అని జపిస్తూ ఉండు. ఇదే మహా గురు పూజ.''

పరమ శివుడు ఇంకా ఈ విధంగా అన్నాడు, ''ఓ షణ్ముఖా, గురు భజనతో శిష్యుడు, అతిత్వరగా గురురూపం దాల్చుతాడు. ఎవరి భజన, ధ్యానం, పూజ,

చేస్తామో మనం, అవ్యక్తి రూపాన్నే దాలుస్తాము, గురుధ్యానం, గురుపూజ, గురు మంత్రస్మరణ, రోమరోమంలో గురువున్నట్లు భావించడం వల్ల, అటువంటి సగుణో పాసన వల్ల, శిష్యుడి హృదయం అతి త్వరగా మారిపోతుంది. అందువల్ల, నువ్వు ఏకాంత ప్రదేశంలో పరమ గురువుగా మారి ఆయన్ను ధ్యానించు. ఇది సిద్ధ జనుల రహస్యమైన సాధనా మార్గం. సద్గురువుల పరమరహస్యం. గురు భక్తులకు ఆత్మ విశ్రాంతి నిచ్చే దివ్యమైన సుఖదమైన శయ్య. ఇది ముక్తి నగరానికి సోపాన మార్గం. గురుభక్తి లేనివారికి ఇది రుచించదు. ఓ స్వామి, కార్తికేయా గురు కృప లభించిన వారికే ఈ రహస్యం అర్థమౌతుంది. పరమేశ్వరుడి అనుగ్రహం లేకుండా గురుపూజ రుచించదు, అర్థం కాదు.'' ఈ విధంగా గురుమహిమ, గురుపూజ, గురుధ్యానం గురించి చెప్పి మహాదేవుడు కైలాసం వెళ్ళి పోయాడు. ఆ తర్వాత శ్రీ కార్తికేయుడు గురుధ్యానంలో నిమగ్నమయాడు.

ఇది జ్ఞానసింధు లోని విషయము. నా సాధన కుడా అదే విధంగా జరుగుతూ ఉంది. పూజ్య గురుదేవులిచ్చిన పుస్తకంలో గురుపూజా విధానం గురించి చదివి, అర్థం చేసుకున్నాను, ఇది నాకు కూడా ఒక సూచన అని. నా సాధనకు ఇది ఒక ఆజ్ఞగా భావించాను. ఆరోజు, నా స్థలానికి వెళ్లలేదు. నిత్యానందుడి సమీపంలో ఆశ్రమంలోనే ఉండిపోయాను. అక్కడి కార్యక్రమం పూర్తయింది. రాత్రయింది. ఆ ప్రదేశమంతా ప్రశాంతమైంది. గురుదేవులు తమ గదిలోకి వెళ్ళి పోయారు. నేను పెద్ద హాలులోకి వెళ్లాను. ఆసనం మీద పూర్వాభిముఖంగా కూర్చుని ధ్యానం ప్రారంభించాను. 'జ్ఞాన సింధు'లో పరమశివుడు, కార్తికేయుడికి ఉపదేశించిన విధానాన్ని మననం చేసుకుంటూ, ఆ ప్రకారం ధ్యానం చేయడం ప్రారంభించాను. ప్రశాంతంగా కూర్చున్నాను. సర్వత్రా వ్యాపించి ఉన్న చైతన్యాన్ని నిత్యానందుడిగా భావించాను. పంచ భూతాలను, నదులు – సముద్రాలు – పర్వతాలు – వనాలను, శ్రీ నిత్యానందరూపంగా భావించి, ఆ భావనను దృఢం చేసుకున్నాను. ఆకాశం నిత్యానందుడి శిరస్సు, పృథ్వి ఆయన పాదాలు, దిశలు ఆయన చెవులు, సూర్య చంద్రులు ఆయననేత్రాలుగా భావించి, సర్వ వ్యాపకుడైన నిత్యానందను ధ్యానించడం ప్రారంభించాను. ధ్యానంలో మనస్సు స్థిరపడ సాగింది. బాహ్య జగత్తు నంతటినీ పూర్తిగా నిత్యానందమయంగా భావించి ధ్యానం చేశాను. అప్పటికీ మనస్సు పూర్తిగా లగ్నం కాక పోవడంతో, నిత్యానందుడి వ్యక్తిగతరూపాన్ని అంతరంగంలో నిలిపి దాని మీద లగ్నం చేశాను.

మొదట శిరస్సును చేత్తో స్పృశించి అత్యంత ప్రియమైన గురుదేవుడు నిత్యానందను ధ్యానించడం ప్రారంభించాను. శిరస్సులో నిత్యానందుడు. కపాలంలో నిత్యానందుడు, రెండు చెవుల్లో నిత్యానందుడు, రెండు కళ్ళలోని జ్యోతుల్లో నిత్యానందుడు. కంఠస్థానంలో శ్రీ గురువు నిత్యానందుడు, భుజాల్లో నిత్యానందుడు, చేతుల్లో నిత్యానందుడు, నా వ్రేళ్ళలో బాబా నిత్యానందుడు, హృదయంలో ఆత్మ రూపుడైన నిత్యానందుడు, ఉదరంలో శ్రీ నిత్యానందుడు, కటిలో శ్రీ యోగేశ్వరుడైన నిత్యానందుడు, తొడల్లో శ్రీగురువు నిత్యానందుడు. మోకాళ్లలో నిత్యానందుడు, కాళ్లలో నిత్యానందుడు, పాదాల్లో నిత్యానందుడు – ఈవిధంగా ప్రతి ఒక్క అంగంలో నిత్యానందరూపాన్ని ప్రతిష్ఠించాను. ప్రతి అంగాన్ని స్పృశించే సమయంలో ''గురు ఓం'' ''గురు ఓం'' అంటూ జపించాను. జపిస్తూ, జపిస్తూ ప్రతి అంగంలో శ్రీ భగవాన్ నిత్యానంద ధ్యానం స్థిరపరచాను. ఆహా! ఆహా! హృదయం శీతలం కావడం ప్రారంభమైంది. వేడి తొలగిపోసాగింది. చల్లటి – సుఖదమైన స్ఫూర్తి శరీరంలో ప్రవహించ సాగింది. తన్మయత్వం కలిగింది. తన్మయులను ధ్యానించడం వల్ల తన్మయత్వం వస్తుంది. ఒక పాట ఉంది :

**సఫాసే మిలాతో సఫాహోగయా మైం,**
**ఖుదీ మిట్ గయా, ఖుద్‌ఖుదా హోగయామైం.**

*అనగా, పరిశుద్ధమైన దాన్ని తెలుసుకున్నపుడు, నేను పరిశుద్ధమయాను .*

*''నే''నన్నది తుడిచి పెట్టుకు పోయింది. స్వయంగా భగవంతుడినే అయాను ..*

ఈ విధంగా ఒక్కొక్క అంగంలో గురురూపాన్ని ప్రేమతో ప్రతిష్ఠించి, భక్తితో పూజించాను, మనస్సులో. సుఖప్రదమైన శయ్యమీద హాయిగా నిద్రించినంత ఆనందం! షడ్రసోపేతమైన భోజనం చేసినంత తృప్తి! దివ్యలోకంలో నివసిస్తున్నంత సంతోషం! అటువంటి ఆనంద తరంగాలలో తన్మయం చెంది, శ్రీ గురువు యొక్క పరమానందమయమైన సంతోష సముద్రంలో, ప్రేమ నావలో కూర్చుని శీతల పవనాలను అనుభవిస్తూ మనసు పరమానంద భరితమైంది.

ఈ లోపున గడియారం పన్నెండు కొట్టింది. నేను ధ్యానంలో కూర్చుని మూడుగంటలైంది. కానీ, ధ్యానం సగం మాత్రమే అయింది. పూర్తిగా కాలేదు. అప్పుడు నేను

కింది నుంచి పైకి ధ్యాన ప్రక్రియను ప్రారంభించాను. నా చరణాలను స్పృశించి ఈ విధంగా అన్నాను: ''ఓ గురుదేవా, మీరు ఇక్కడ ఉండండి''. నా పాదాల్లో నిత్యానందుడు, మోకాళ్లలో నిత్యానందుడు, తొడల్లో నిత్యానందుడు, నడుములో శ్రీ నిత్యానందుడు, వీపులో నిత్యానందుడు, ఉదరంలో సద్గురు నిత్యానందుడు, నాభిలో బాబా నిత్యానందుడు, పక్క ఎముకల్లో నిత్యానందుడు, హృదయ కమలం మధ్య పరాత్పరుడూ పరమానంద మయుడూ అయిన భగవాన్ నిత్యానందుడు; మెడలోని రుద్రాక్షమాలలో నిత్యానందుడు, రెండు బాహువుల్లో నిత్యానందుడు, కంఠంలో గురు నిత్యానందుడు, ముఖంలో నిత్యానందుడు, జిహ్వామీద నిత్యానందుడు, ముక్కులో నిత్యానందుడు, కళ్లలో నిత్యానందుడు, తలలో నిత్యానందుడు, బ్రహ్మ రంధ్రంలోని సహస్రారపు ప్రకాశంలో శ్రీ సద్గురు నిత్యానందుడు, ఈ విధంగా క్రింది నుంచి పైవరకు, మళ్లీ పరమ గురువు నిత్యానంద ధ్యానం చేశాను. ధ్యానం చేస్తుండగా హృదయస్థానంలో ధ్యానం స్థిరమైంది. హృదయంలో ప్రాణం, ప్రశాంతంగా స్థిరమైంది. అక్కడ ధ్యానం ప్రారంభమౌతూనే, వీపున మూలాధారంలో, విపరీతమైన నొప్పి ప్రారంభమైంది. అక్కడ విద్యుచ్ఛక్తి తగిలినట్టు అనిపించింది. సర్వాంగాలలో గాలి వేగంగా ప్రసరించిన అనుభూతి. అన్ని నాడుల్లో స్పందన కలిగి, ధ్యానంలో తన్మయత్వం కలిగింది.

మూడు గంటలకు నిత్యానంద బాబా కంఠం వినిపించింది. ఆయన అంటున్నారు: 'లే' అని. నేను లేచాను. తన్మయత్వంలో ఉన్నాను. మెల్లగా తంద్రాస్థితి తొలగింది. బాబాజీ వేడినీటికుండంలో స్నానం చేశారు. ఆ తర్వాత నేను కూడా స్నానం చేశాను. మళ్లీ అదే ధ్యానావస్థ. ధ్యానం ఎంతో బాగ జరిగింది. గురు భావం ఎక్కువ కావచ్చింది. అంతరంగంలో శాంతి కిరణాలు ప్రకాశించసాగాయి. తెల్లవారు జాము అయింది. భగవాన్ నిత్యానంద బయటికి వచ్చి తమ మంచం మీద కూర్చున్నారు. అందరూ దూరంగా ఉండి దర్శనం చేసుకుంటున్నారు. చివర నేను వెళ్లాను. దర్శనం చేసుకుని అక్కడే నిల్చున్నాను. బాబాజీ అన్నారు: ''మంచిది ఆ ధ్యానం.'' పెదవుల మీద మందహాసం. ఒక చేయి పైకెత్తి చిన్ముద్ర ధరించి ఈ విధంగా పలుకుతున్నారు: ''అదిరా ధ్యానం ... అదే ... అదే ... ధ్యానం, జ్ఞానం, ఉన్నతం... అదిపూజ... అదిరా తన్మయత్వం... తన్మయత్వం... అది సూక్ష్మం... ఆహా ... అది పూర్ణధ్యానం.'' ఈ విధంగా అంటూ గానం చేయసాగారు. ఆయన, నాకు సంపూర్ణమైన ధ్యాన దీక్ష ఇచ్చినట్టు అర్థమైంది.

నేను, గురుధ్యానాన్ని, నా ఇష్టదైవ ధ్యానంగా భావించాను. ఆ తర్వాత ప్రతిదినము బ్రహ్మ ముహూర్తంలో మూడుగంటలకు లేచేవాడిని. ఆ సమయంలో ప్రపంచం నిశ్శబ్దంగా ఉంటుంది. ఆ సమయం, ధ్యానానికి అనుకూలమైనది. రోజూ స్నానం చేసేవాడిని. సర్వాత్మ భావంతో అన్ని దిక్కులకు నమస్కారం చేసేవాడిని. తర్వాత నా ప్రియమైన గురువును ధ్యానించడం ప్రారంభించే వాడిని. ధ్యానం దివ్యంగా సాగేది. మళ్లీ రాత్రిపూట నిశ్శబ్దంగా ఉన్న సమయంలో ధ్యానం ప్రారంభిచేవాడిని. ధ్యానం రెండు వేళలా జరిగేది. అప్పుడప్పుడు స్నానం చేయలేకపోయినా, కాళ్లూ చేతులూ, ముఖం కడుక్కుని ధ్యానానికి కూర్చునేవాడిని. ధ్యానం తర్వాత ఒకసారి బయట తిరిగి వచ్చేవాడిని. నేనుధ్యానం చేసుకునే ప్రదేశంలో నాలుగువైపులా సిద్ధ మహాపురుషుల ఛాయా చిత్రాలు, గురుదేవుడి ఛాయాచిత్రాలు ఉండేవి. వీటన్నిటి మధ్య కూర్చుని ధ్యానం చేసే వాడిని. నేను వీటిని నిర్జీవమైన ఛాయాచిత్రాలుగా భావించేవాడిని కాను. బాబా సాన్నిధ్యంలో భయభక్తులతో మర్యాదతో పవిత్రభావంతో వ్యవహరించిన విధంగానే, ధ్యానం చేసుకునే గదిలో కూడా గురుదేవుడి ఛాయాచిత్రాల సమక్షంలో మర్యాదతో వ్యవహరిస్తాను. ఎప్పుడూ ఛాయా చిత్రాల సమక్షంలో కూడా కాళ్లు జాపి కూర్చోను. ధ్యానం చేసుకునే గదిలో పవిత్రభావంతో వ్యవహరిస్తాను. నడిచే సమయంలో కూడా మెల్లగా నడుస్తాను. కారణం, చిత్‌శక్తి కిరణాలు, ముఖ్యంగా ధ్యానసమయంలో గది అంతా వ్యాపించి ఉండేవి. గురుదేవుడికి పూజ చేసే పటం ఉన్న స్థానంలో, స్వయంగా శ్రీ గురుదేవుడే విరాజమానమై ఉంటాడు, అని నా విశ్వాసం. ధ్యానం చేసే సమయంలో, గదిలోపల సిద్ధ మహాపురుషులందిరిని ఆవాహనం చేసేవాడిని. ఆ పద్ధతి ఈ విధంగా ఉంటుంది: ''శ్రీ గురు చరణారవిందములను ఉపాసన చేసి గురు ప్రసాదరూపంలో పరమశివపదాన్ని ఇంతకు ముందు పొందిన వారు, ఇప్పుడు పొందుతున్నవారు, ఇకముందు పొంద బోవు వారు – అటువంటి సిద్ధ మహా పురుషులందరు, నన్ను రక్షింతురుగాక, నాకు సంపూర్ణమైన శక్తి నిచ్చెదరుగాక.'' ఈ విధంగా నాగధిలోకి సిద్ధ మహా పురుషులందరి మహిమను ఆవాహనం చేసేవాడిని.

మానవులకు వారి వారి భావాలకు తగినట్టు, పరమాణువులు వారితో కూడా ఉంటాయి. అందువల్ల నేను ధ్యానసమయంలో సాధారణ ప్రజలకు దూరంగా ఉండేవాడిని. కాకభుషుండి ఆశ్రమం చుట్టూ, కొన్ని మైళ్ల దూరం మేర, భగవన్నామ తరంగాలు వ్యాపించి ఉండేవి. కాకభుషుండి ముని ఆశ్రమంలోకి ప్రవేశిస్తూనే జడులు

మూఢులు మందమతులు అందరూ రామనామ ఉపాసకులుగా మారేవారు. రామ నామాన్ని జపించడం మొదలు పెట్టేవారు. పరమపూజ్యులైన నా గురుదేవులు నివసించే స్థలంలో, చుట్టుప్రక్కల అంతా ప్రశాంతంగా మౌనంగా ఎటువంటి ఆలోచనలూ దిగుళ్లూ లేకుండా ఉండేది. బొంబాయి నుంచి వచ్చే భక్తులందరు, ఆశ్రమాన్నీ గురుదేవుడినీ దర్శనం చేసుకుని విచారాలన్నిటినీ మరిచిపోయేవారు. అది, నా గురుదేవుడైన శ్రీ నిత్యానందుడి చుట్టూ ఉండే వాయుమండల ప్రభావం. బొంబాయి నుంచి వచ్చే వారందరు ఎంత చంచల మనస్కులైనా, ఎటువంటి వారైనా, ఒకసారి ఉష్ణకుండంలో స్నానం చేసి, గురుదేవుడి సమ్ముఖానికి వచ్చిన వెంటనే వారి చిత్తచాంచల్యం పూర్తిగా తొలగిపోయి ప్రశాంత చిత్తులయేవారు. భగవాన్ నిత్యా నందుడి భావాలే, ఆయన చుట్టు ప్రక్కల వ్యాపించి ఉండేవి. ఆయన నిర్లిప్తంగా, మౌనంగా ఉండేవారు. మాటలు తక్కువ. వాతావరణం ప్రశాంతంగా ఉండేది. అక్కడ ఉన్న వారందరి మీద దీని ప్రభావం ఉండేది. అందరూ ప్రశాంతంగా ఉండేవారు. క్రమశిక్షణను పాటించేవారు. నిర్లిప్తంగా ప్రశాంతంగా నిర్వికారంగా మౌనంగా ఉండే శ్రీ గురుదేవుల సాన్నిధ్యంలో అందరికీ సులభంగా ధ్యానం కుదిరేది. ప్రతిదినము ధ్యానం చేస్తూండగా నాలో ఉత్సాహం ఎక్కువై అనుభూతులు కూడా ఎక్కువయాయి. దివ్యమైన నా పరమార్థయాత్ర వేగాన్ని పుంజుకుంటున్నట్టు తోచింది.

## రెండవ భాగము

# సాధనాకాలంలో నా అనుభూతులు

మామూలుగా భగవత్కృపా ప్రసాదరూపంలో కలిగే దివ్యాను భూతులు, రహస్యంగా ఉంచవలసిన విషయాలు. కాని, సాధకులకు ప్రయోజనకరంగా ఉండగలవన్న ఉద్దేశ్యంతో కొన్ని అనుభూతులను తెలియచేయాలని సంకల్పించాను.

ఒకటి

# దివ్య దీక్ష

ముందు చెప్పిన విధంగా నేను గురుపూజ, గురు ధ్యానం చేస్తున్నాను. ఒకరోజు సాయంత్రం, భగవాన్ నిత్యానంద దర్శనానికి వెళ్ళాను. దర్శనం చేసుకున్న తర్వాత, మామూలుగా గురుదేవులు, ''వెడుతున్నావా'' అని అడిగేవారు. ఆరోజు ఏమీ అనలేదు. దానితో నేను అక్కడనే ఉండి పోయాను. శ్రీగురు ధ్యానంలో రాత్రి పరమానందంగా గడిచిపోయింది. 1947, ఆగస్టు 15 ఉదయం ఎంత శుభప్రదమైన దినం! అమృతం నిండిన దినం! దివ్యమైన దినం! ఎంతో పుణ్యాన్ని మహాభాగ్యాన్ని తనతో తీసుకు వచ్చిన దినం. నా జీవితంలో సుదినం. నా సంపూర్ణ జీవితంలోనే మంగళమయమైన దినం. చాలా రోజుల తర్వాత జన్మ జన్మాంతరాల తర్వాత వచ్చిన పరమ పవిత్రమైన దినం! అవును. ముమ్మాటికీ అది, ''మంగళా నాంచ మంగళం'' అయిన దినం. శుభోదయమైంది.

సూర్యుడు ఉదయించి కొంచెం పైకి వచ్చాడు. వాతావరణం ప్రశాంతంగా ఉంది. తూర్పు మూల నేను నిల్చుని శ్రీగురువును ధ్యానిస్తున్నాను. హాలు పశ్చిమమూల గురుదేవుడికి వంట చేసి పెట్టే మోనప్ప నిల్చుని ఉన్నాడు. లోపల ధ్యాన మందిరంలో, శ్రీగురువులు, తమ స్వస్వరూప ధ్యానం ముగిసిన సూచనగా ''హుం'' కారం చేస్తున్నారు. కొంత సేపైన తర్వాత గురుదేవులు బయటికి వచ్చారు. ఇవేళ ఆయన రూపమే కొత్తగా ఉంది. అటువంటి రూపాన్ని అంతకు ముందెన్నడూ చూడలేదు. అందమైన పాదుకలను ధరించి ఉన్నారు. వెనుక్కు ముందుకు నడుస్తున్నారు. మందహాసం చేస్తున్నారు. ఒకసారి అటు మూలకు వెళ్లి ఏదో ఒక రహస్య మంత్రాన్ని గానం చేస్తారు. నా ఎదుటకు వచ్చి మందహాసం చేస్తారు. గానం చేస్తారు. ఒక తెల్లటి శాలువ కప్పుకుని ఉన్నారు. శరీరంమీద లంగోటి, పాదాలకు పాదుకలు. మాటిమాటికి నా ఎదుట నిలబడి ''హుం'' శబ్దాన్ని పెద్దగా చేస్తున్నారు. ఆవిధంగా ఒక గంటసేపు గడిచింది.

ఆ తర్వాత గురుదేవులు నా సమీపానికి వచ్చి ఆయన శరీరం, నా శరీరానికి పూర్తిగా తాకుతూ నిల్చున్నారు. నేను ఆశ్చర్యంతో స్తబ్ధమయ్యాను, పశ్చిమాభి ముఖంగా నిల్చుని ఉన్న నా ఎదుట, గురుదేవులు తూర్పు ముఖంగా నన్ను తాకుతూ అతి సమీపంగా నిల్చుని ఉన్నారు. నేను కన్నులు తెఱచి చూడసాగాను. శాంభవీ ముద్రలో గురుదేవుడి కన్నులు పూర్తిగా తెఱచుకుని ఉన్నాయి. ఆయన నేత్రాలు సూటిగా నా నేత్రాల్లోకి చూడడం ప్రారంభించాయి. నా శరీరం శూన్యమైంది. కన్నులు మూతపడడం లేదు. వాటిని తెరిచేందుకుగాని, మూసుకునేందుకుగాని నాకు శక్తిలేకపోయింది. గురుదేవుడి కన్నులనుంచి వెలువడుతున్న దివ్యతేజస్సు నా కన్నులలోకి ప్రవేశించి అక్కడ స్థిరంగా నిల్చి పోయింది. ఆవిధంగా కొంతసేపు గడిచింది. మళ్లీ ''హుం'' కారరూపంలో గురుదేవుడి దివ్యనాదం వినిపించింది. గురుదేవుడు రెండడుగులు వెనక్కువేసి నిల్చున్నారు. నాకు స్పృహ వచ్చినట్టయింది.

''ఇవి తీసుకో, ఈ పాదుకలు వేసుకో'' అంటూ ''నా ఈ పాదుకలు వేసు కుంటావా?'' అని ప్రశ్నించారు.

నేను ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరయి, ధైర్యం తెచ్చుకొని ఈ విధంగా అన్నాను: ''గురుదేవా, ఈ పాదుకలు, నేను ధరించవలసినవికావు, ఇవి నేను పూజించవలసినవి. మీరు అనుగ్రహించినట్టయితే నా అంగవస్త్రాన్ని పరుస్తాను, మీరు మీ పాదాలతోనే వాటిని వస్త్రం మీద పెట్టండి'' అని. పూజ్య గురుదేవులు నామాటకు అంగీకరించారు. ''హుం'' ''హుం'' అంటూ, మొదట ఎడమ పాదాన్ని పాదుకతో సహా ఎత్తి, పాదుకను నేను క్రింద పరచిన అంగవస్త్రం మీద పెట్టారు. తర్వాత ఆ పాదాన్ని కింద పెట్టి, కుడి పాదాన్ని పాదుక సహితంగా ఎత్తి, ఆ పాదుకను కూడా వస్త్రం మీద పెట్టారు. ఆ తర్వాత నా ఎదుట నిల్చున్నారు. నా కన్నులలోకి మరొకసారి దృష్టిపాతం చేశారు. నేను ఎంతో శ్రద్ధగా తిలకించాను. ఆయన కన్నులలోని మధ్య బిందువునుంచి జ్యోతి కిరణం నాలోపలికి ప్రవేశించింది. ఈ కిరణం తేజస్సుతో నిండి, వేడిగా, చురుకుగా తగులుతూ ఉంది. దీని ప్రకాశం, పెద్దశక్తి వంతమైన ''బల్బ్'' ప్రకాశాన్ని పోలి మిరుమిట్లు గొలుపుతూ ఉంది. భగవాన్ నిత్యానందుడి కన్నులలోని మధ్య బిందువు నుంచి జ్యోతికిరణం బయటికి వచ్చి నా కన్నులలోకి ప్రవేశించినపుడు, నేను ఆశ్చర్యం – విస్మయం– భయం– ఆనందంతో రోమాంచితుడినయాను. ఆ కిరణపు రంగును చూస్తూ భగవాన్ ప్రసాదించిన ''గురు ఓం'' మంత్రాన్ని జపించసాగాను. కిరణం



స్వామి ముక్తానంద :  యేవ్‌లా లో యువసాధకుడిగా



స్వామి ముక్తానంద : సూకీలో తన కుటీరం ముంగిట

అఖండం. దానిలో దివ్యమైన వెలుగు ఉంది. దాని రంగు, ఒకసారి, అగ్నిలో తప్తమైన స్వర్ణకాంతిని పోలి, ఒకసారి కుంకుమపువ్వును పోలి, మరొకసారి, ప్రకాశిస్తున్న నక్షత్రానికన్నా ఎక్కువతేజోవంతమై ముదురు నీలపు రంగులో ఉండేది. ఆ తేజోమయ కిరణాలు, నాలోపల ప్రవేశించడం చూచి నేను, స్తబ్ధుడినై అచేతనుడనైనాను. నా శరీరం, జడంగా మారింది. ఆ తర్వాత శ్రీగురుదేవులు కొంత కదిలి, మళ్లీ ''హుం'' కారం చేశారు. అప్పుడు నాజడత్త్వం కొంత వదిలింది. నాకు స్పృహ వచ్చింది. అంగవస్త్రంలో ఉన్న పాదుకలమీద శిరస్సు పెట్టి నమస్కరించాను. తర్వాత సాష్టాంగ ప్రణామం చేశాను. ప్రణామం చేసి పరమానంద భరితుడనై లేచాను.

నేను ఎంతో ప్రేమతో నెమ్మదిగా అన్నాను: ''గురుదేవా, నా దెంత మహా భాగ్యము! నాకు పరమ ప్రాప్తి లభించింది. మీరు ఈ పాదుకల్లో పూర్ణరూపంలో ఉండండి. వాటిని పూజించేందుకు ఆజ్ఞాపించండి. నాకు విధి విధానాలు ఏవీ తెలియవు.'' నేను ఈ మాటలు అన్న వెంటనే ఆయన హాలు పశ్చిమ దిశగా వెళ్లారు. కొన్ని పువ్వులు తెచ్చారు. కూడా రెండు అరిటి పండ్లు, రెండు మూడు అగరువత్తులు, కుంకుమ ఉన్న పొట్లం ఒకటి తెచ్చారు. వాటన్నిటినీ పాదుకల మీద పడవేశారు. నేను ''ఓం గురు ఓం'' జపించసాగాను. ఈ రోజు నేను బాబాజీకి దగ్గరగా నిల్చుని ఉన్నాను. శ్రీగురుదేవులు, కూర్చుని, తమ సూత్ర భాషలో చెప్పడం ప్రారంభించారు. ''అన్ని మంత్రాలు ఒకటే. అన్నీ ఓం. ''ఓం నమఃశివాయ ఓం'' శివోహం గాను, ''శివ శివ'' కూడా శివోహం గాను మార్పు చెందడం అవసరం. అరే! మంత్రజపం అంతరంగంలో జరగడంరా శ్రేష్ఠం, బహిరంగంలో కన్నా.''

''బాబాజీ'' హుం కారం చేసి లోపలికి వెళ్లి పోయారు. ఆయన హుంకారం అన్ని రకాలైన సూచనలకు మంత్రధ్వని. మామూలుగా ఆయన ''హుం'' కారం చేసి, మెడతిప్పి సంజ్ఞ చేసినపుడు, నేను అక్కడనుంచి బయలుదేరుతాను. కాని ఈ రోజు ఇంతవరకు సంజ్ఞ చేయలేదు. అందుచేత నేను నిల్చునే ఉన్నాను. భగవాన్ లోపలినుంచి బయటికి వచ్చారు. చేతిలో నీలంరంగు శాలువ ఉంది. దాన్ని భుజాల మీద కప్పారు. ఎంత అదృష్టం! తెల్లవారు ఝామునుంచి ఇంతవ ఒకదాని తర్వాత మరొకటి మహాప్రసాదం లభిస్తూనే ఉంది. ఆ తర్వాత అతి వేగ నడుస్తూ వంట ఇంటివైపు వెళ్లారు. అక్కడ మోనప్ప అరిటికాయ బజ్జీలు చేస్తున్నాడు. భగవాన్ రెండు చేతులనిండా వాటిని తీసుకొని వచ్చి, నేను పాదుకలు పెట్టుకుని

ఉన్న సంచిలో పడవేశారు. చివరకు ఆయన ప్రసన్నవదనంతో ''హుం'' కారం చేసి, నన్ను వెళ్లిపొమ్మని సంజ్ఞ చేశారు.

ఎంత గొప్ప మంగళకరమైన దినం! ఎంత పవిత్రమైన దినం! నేను బయటికి వస్తూ నా అదృష్టానికి సంతోషపడుతూ ''ఆహా! ఎంత అదృష్టం! ఏమి పుణ్యం చేశానో దాని ఫలితం ఇవేళ ప్రాప్తించింది.'' అనుకున్నాను.

నేను ఆశ్చర్యంలో మునిగిపోయి ఉన్నాను. ఈ విధంగా జరుగుతుందని నేను ఎప్పుడూ అనుకోలేదు. నావంటి వాడికి శ్రీ గురువుయొక్క పాదుకలు లభించడం దుర్లభం. నిత్యానందుడికి పెద్ద పెద్ద భక్తులున్నారు. వారందరూ చాలా పాత భక్తులు. వారిలో చాలామంది వయస్సైనవారు. చాలామంది పెద్ద పెద్ద వ్యాపారులు. తాము మంచి సాధకుల మని, అనుభవజ్ఞులమని, భగవాన్‌కు మిగతా అందరికన్నా సమీపస్థులమని, భావించేవారు, వీరు. నేను ఒక సాధారణ భక్తుడిని. అపరిచితు డిని. కొత్తవాడిని. నేను చేసిన గొప్ప సాధన కూడా లేదు. సాధించినది కూడా లేదు. నాకు భవనంగాని, వ్యాపారం గాని లేదు. నా దశ ఒక దరిద్రుడి దశను పోలినది. అందుచేత, నిత్యానందుడు నాకు పాదుకలను ప్రదానం చేయడం నా సౌభాగ్యం.

నా గురుదేవుడు గొప్ప అవధూత. ఎప్పుడూ పాదరక్షలు ధరించేవాడు కాదు. పాదుకలను ఎప్పుడూ ధరించలేదు. ఆయన, ఈ రోజు, సుర – నర – పూజితము, పాపనాశకము, యోగ జ్ఞానాన్ని దానం చేసేవి అయిన తన పదకమలాలను పాదుకలతో అలంకరించుకున్నాడు. తర్వాత అటు ఇటు తిరిగి, నా ఎదుటికి వచ్చి, తన పాదాలను ఎత్తి పాదుకలను నాకు ప్రసాదించారు. నా తాపం తొలగింది. పాపం నశించింది. జనన మరణాలు లేవిక. అవిద్యయొక్క తెర తొలగింది. ఎంతగొప్ప సంగతి! నిత్యానంద అవధూత మామూలుగా ప్రత్యక్షంగా ఇటువంటి అనుగ్రహాన్ని ఎప్పుడూ ప్రసాదించ లేదు. ఆయన కనుపించని విధంగా కనుపించని క్రియద్వారా మాత్రమే అనుగ్రహిస్తారు. ఆయన నాకు పాదుకలను ప్రదానం చేయడం దాదాపు అసంభవమైన విషయం. ఎప్పుడూ పాదుకలను ధరించని గురుదేవుడు ఆ రోజు పాదుకలను ధరించి, స్వయంగా తన పాదాలతోనే ఈ ఫకీరు చాపిన వస్త్రం మీద పడవేశారు. అంతేకాదు. ఆయన ఎవరి ముఖమూ చూచేవారు కాదు. చూచినా, అటు ఇటు చూచేవారు. ఈ రోజున ఆయన, నా ముఖం జ్ఞాపకం లేనట్లు, పరమశివుడి శాంభవీముద్ర ధరించి, విప్పారిన నేత్రాలతో, నా నేత్రాలను చూచారు. సర్వసిద్ధిప్రదము చితి మయము అయిన

దివ్యకిరణాలతో సహా నాలోకి ప్రవేశించారు. ఆ కిరణాలను చూస్తుండగా నా శరీరంలో కంపన ప్రారంభమైంది. కనుల వెంట అశ్రువులు, శరీరం స్తబ్ధమైంది. క్షణం పాటు నిర్లిప్తత, పరమానందము అనుభవంలోకి వచ్చాయి. ఈ విధంగా గురుదేవుడు నాకు దివ్యదీక్ష నిచ్చాడు. ఆయన నన్ను, తన దగ్గరకు రమ్మని పిలిచాడు! ఎక్కడో మైళ్ల దూరంలో ఉండే పేద సన్యాసికి, భగవాన్ నిత్యానందుడి సమీపానికి వెళ్లే అవకాశం ఈ రోజు దొరికింది. దిక్కులేని ఒక పరదేశి, అందరి సమక్షంలో భగవాన్ సన్నిధిలో కూర్చోవడమే! ఈ రోజు, నా ఆరాధ్యదైవమైన పరమ శివుడు ''అసుతోష్'' (అల్పసంతోషి) అన్న బిరుదును సార్థకం చేసుకున్నాడు. నేను చేసుకున్న సోమవార వ్రతాలు, శివనామ జపం వంటి చిన్నచిన్న పూజలకే ఆనందించి శివుడు, నాకు ఈ గొప్ప ప్రసాదాన్ని అందించాడు. ఒక కవి, శివుడి దానం గురించి ఒక కావ్యంలో ఈ విధంగా వ్రాశాడు:

**ధన్యధన్య భోలేనాథ్।**
**ఆప్ బాంట్ దియా సబ్ జగ్ ఏక్ పల్‌మే ం।**
**తేరే సమ్ దాతా నహీం ఔర్‌కహీం జగ్‌మేం॥**

ధన్యుడిని ధన్యుడిని భోలేనాథ్. నువ్వు పంచి పెట్టావు ఈ జగత్తు నంతటినీ ఒక్క క్షణంలో నీకు సమానమైన దాత ఇంకెక్కడా లేడు ఈ జగత్తులో.

ఇది నా పట్ల నిజమైంది. శ్రీ గురుదేవుడు నన్ను తన సమీపంలో కూర్చుండ బెట్టుకుని, శక్తివంతమైన ''ఓం నమః శివాయ'' మంత్రాన్ని ఉపదేశించి, ''ఓం'' కు అర్థాన్ని చూపించి ''శివోహం'' జపించి, శివుడితో ఐక్యాన్ని జాగృతం చేశారు. మహాతారక మంత్రమైన శివ పంచాక్షరిని ఏ విధంగా జపించవలసినది దాని బహిరంగ అనుష్ఠానమునూ తెలియచేశారు. అంతరంగ హృదయం యొక్క ''నేను శివుడిని'' అన్న భావాన్ని వ్యక్తపరచే ''శివోహం'' మంత్రాన్ని వినిపించి అమరనాథుడి అమర శబ్దాన్ని వినిపించారు. అందరూ ఓం స్వరూపాలేనని బోధించి ఏకాత్మ తత్వాన్ని విశదపరచారు.

ఎప్పుడూ దానం చేయనివాడు, దానం చేయడం మొదలు పెట్టినట్టయితే దానం తీసుకునే వ్యక్తి తీసుకోవడానికే అలిసిపోతాడు. నా విషయంలో కూడా అదే జరిగింది. అనంత కాలం నుంచి ఇంతవరకు అనంతయోనుల్లో పుట్టుతూ గిట్టుతూ ఉన్న

హృదయాకాశములోని అనంత శబ్దాలనూ, నేను - నాది అన్న రూపాలలో కామ - క్రోధ - మోహయుక్తమైన అనంత ప్రకారాలైన అశుభ్రమైన భావాలను, ''శివోహం రే... అవిధంగా కావలె రా'' అని చెప్పి, పరమ శివుడి పరమ తేజోమయ మహామంత్రంతో నాశనం చేశాడు పరమగురువు. కేవల శివరూపము, చిత్‌ప్రకాశమయము, నిత్యజాగృతము, పూర్ణప్రకాశమయము, పూర్ణోహం అన్న సత్యానికి రూపము, విమర్శమయము, శక్తిరూపమైన పరావాక్కు - అయిన మహామంత్రాన్ని హృదయాంతరాళంలో ప్రవేశపెట్టాడు, నిత్యానంద భగవానుడు. జన్మ జన్మాంతరాలుగా సంచితమైన కర్మ భావాలను పాపాలను పరావాగ్రూపమైన తన కృపాగ్ని చేత ధగ్ధం చేశాడు.

తదనంతరం, గొప్పయోధులకు యుద్ధాల్లో ఆయుధాల వల్ల గాయాలు కాకుండా తుపాకి గుండ్లు తగలకుండా కత్తులు బల్లాల వల్ల పోట్లు తగల కుండా కవచాన్ని ధరింపచేసినట్లు, నాకు పాపాలు అంటకుండా, మోహమాయలు నాలో ప్రవేశించ కుండా, రాగ ద్వేషాలనే దొంగల బారినుంచి నన్ను రక్షించేందుకా అన్నట్లు, చక్కటి నీలం రంగు శాలువను నాకు కవచంగా కప్పాడు గురుదేవుడు. ప్రసాదరూపంలో ఇచ్చిన ఈ శాలువ, నన్ను పాప తాపాలకు బాధలకు వ్యాధులకు దూరంగా ఉంచుతుంది. అంతేకాదు, స్వయంగా పురోహితులై, పాదుకల మీద పువ్వులను, పండ్లను, కుంకుమను, అగరువత్తులను పెట్టి పూజించారు, ఎంత అదృష్టం! నగ్న, దిగంబర అలింగ చిహ్నాము అయిన నిత్యానందుడి వంటి మహాపురుషుడు పూజించిన పాదుకలు నాకు పూజ చేసుకునేందుకు లభించాయి. ఆహా, నా దెంత భాగ్యము! ఆ తర్వాత - ఇది ఆయన కృప యొక్క పూర్ణమైన మహిమ - హుంకారం చేస్తూ లోపలికి వెళ్లి రెండు చేతుల నిండా వేడి వేడి అరిటి కాయ బజ్జీలను తెచ్చి, వాటిని కూడా పాదుకల మీద పెట్టారు. పురోహితుడి చేతుల ద్వారా నైవేద్యం కూడా జరిగింది. అభయదానమిచ్చేహస్తం పూజ చేసింది. దివ్యమైన చిన్మయమైన కరకమలాలు, నైవేద్యం పెట్టాయి. ఎంతభాగ్యము! భాగ్యం వరదలై, పాతస్మృతులు నదీ ప్రవాహం వలె ప్రవహించసాగాయి. ఎన్ని జన్మల పూజాఫలమిది!

బయటికి వచ్చి, పాదుకలను పదేపదే శిరస్సున పెట్టుకున్నాను. బజ్జీలు

ఒక్కొక్కటిగా తిన్నాను. పువ్వులను వాసన చూచాను. శాలువ నాణ్యము, అందము, పనితనము, తనివితీర చూచి ఆనందించాను. గురుదేవుడి స్మరణలో ఏకాగ్రమూ స్తబ్ధమూ నిష్క్రియమూ అయిన మనస్సు, ఇప్పుడు చంచలము, చపలము అయింది. కాని ఇప్పటి చాంచల్యంలో శుష్కత్వంలేదు. మూఢత్వం లేదు. క్లేశం లేదు. ఉదాసీనం- జడత్వం- చింత లేవు. ఇప్పుడు ఎంతో ఆనందం, ఎంతో తన్మయత్వం, ఎంతో ఉల్లాసం, ఎంతో ఉత్సాహం. అవును, గురుదేవుడిచ్చిన పాదుకలను అప్పుడప్పుడు ఎంతో ఆప్యాయంగా చూచేవాడిని. మనస్సు ఉల్లాసంతో వెల్లివిరిసేది. గురుపాదుకాష్టకంలోని ఈ పంక్తులను పాడుకునే వాడిని.

**జ్యాచ్యా కృపేచా మజ లాభ ఝాలా జన్మాంతరీచా భవతాపగేలా,**
**శ్రీదత్త ఐసా ఉపదేశ కేలా విసరూఁ కసా మీ గురుపాదుకాఁలా.**

ఆయన కృపా ప్రసాదం లభించింది. అనేక జన్మల బాధ తొలగింది. దత్తాత్రేయుడి బోధన అటువంటిది. గురువు పాదుకలను నేను ఏ విధంగా మఱువగలను!

నేను నా అదృష్టానికి పొంగిపోతూ అంతకు ముందు ఉపాసించిన పరమశివుడి మహాకృపా ప్రసాదాన్ని ప్రశంసిస్తూ, మెల్లగా నా స్థానానికి నడవడం ప్రారంభించాను. దారిలో, గురుభావము గురుభక్తి మళ్ళీ పెల్లుబకడం ప్రారంభమైంది. గురువును ఉపాసించే పద్ధతిలో ''లోపల గురువు-వెలుపల గురువు'' అని మననం చేసుకుంటూ మనస్సు తన్మయత్వంలో మునిగి పోయింది. గురుభావం వేగంగా ఎక్కువ కాసాగింది. శిరస్సు మీద శ్రీ గురుదేవుడి పాదుకలున్నాయి. దారిలో గాంధీస్క్వేర్ దాటి వెడుతున్నాను. అక్కడ ఒక చిన్న వంతెన వంటిది ఉంది. అక్కడినుంచే ''గురుదేవ ఆశ్రమం'' (ప్రస్తుతం గురుదేవ సిద్ధపీఠం) హద్దు ప్రారంభమౌతుంది. ఆ చిన్న వంతెనను ఆనుకుని ఒక మేడి వృక్షముంది. అక్కడికి చేరుకునే సమయానికి దివ్యమైన గురుభావం బ్రహ్మ భావంగా మారింది. అంతరంగంలో వెలుపలా అంతా ఒకటేనన్న బ్రహ్మ భావం. ''ఏకత్వంలో భిన్నత్వాన్ని'' చూపే భేద ప్రవృత్తి ఒక్క క్షణకాలంలో తొలిగిపోయింది. ''భిన్నత్వంలో ఏకత్వభావం'' అనుభవంలోకి వచ్చింది. ''గురు ఓం'' ''గురు ఓం'' జపిస్తూ, అంతరంగంలో వెలుపలా గురువు వ్యాపించి ఉన్నట్టు భావిస్తూ నడుస్తూండగా, అంతకు ముందు వివిధ ఆచార్యుల దగ్గర అధ్యయనం చేసిన బ్రహ్మ సిద్ధాంతం మళ్ళీ మనసులో స్ఫురించింది.

వరుణ దేవుడికి కూడా కృపకలిగింది. సన్నగా చినుకులు పడడం ప్రారంభమైంది. చల్లటిగాలి మెల్లగా వీస్తూ ఉంది. నేను నా నేత్రాలను మూసుకుంటూ తెరుస్తూ నడుస్తున్నాను. అంతరంగంలో అనంతమైన జ్యోతుల కిరణ సమూహం ప్రకాశిస్తున్నది. మెరుస్తున్న చిన్న చిన్న నిప్పురవ్వలు, మూసుకుని ఉన్న నా కనుల ఎదుట కోట్ల సంఖ్యలో కనిపిస్తున్నాయి. సంభ్రమంతో చూస్తున్నాను. ఎంత సుందరమైన దృశ్యమిది. అతి సూక్ష్మమైన నిప్పురవ్వలను పోలినవి, నక్షత్రాల వంటివి. ధగద్ధగాయమానంగా మెరుస్తున్నాయి. అవి నాలోపల అన్ని అంగాలలోను కనిపిస్తున్నాయి. వాటి గమనం ఆశ్చర్యకరంగా ఉంది. వాటి వేగము వాటి సంఖ్య, ఆశ్చర్యాన్నీ ఆనందాన్నీ కలిగిస్తూన్నాయి. కనులు తెరిచి నపుడు, వెలుపలకూడా అదే దృశ్యం. అనంతమైన స్ఫులింగాలు మెరుస్తున్నాయి. అణువుకన్నా చిన్నవి. నీలం రంగులో మెరుస్తూ వరుసగా పరుగెడుతున్న దృశ్యం. చూస్తూ తన్మయత్వం చెందాను. ఒకటే ఆశ్చర్యంగా ఉంది. ఒక కొత్త విచిత్రమైన దృశ్యం అది. బొమ్మ కాదు, నా చుట్టూ ఉన్న దృశ్యమిది. నేను మెల్లగా నడుస్తు న్నాను. నేను దారిలో నడుస్తున్నానా, లేక దారి నా వెంట వస్తూ ఉందా అన్న భ్రమ కలిగింది. గాంవ్ దేవి మందిర సమీపానికి చేరుకుని ఆగాను. గణేశపురివైపు వెనక్కు తిరిగి చూచాను. ప్రియమైన గురుదేవుడి జ్ఞాపకం వచ్చింది. మనస్సులోనే నమస్కారం చేసుకున్నాను. దారి అంచున నడుస్తున్నాను. వరుణ దేవుడి కృపారూపంలో ఇప్పుడు కూడా సన్నగా చినుకులు పడుతున్నాయి. చల్లటి వర్షపు తుంపర మెరుస్తున్న నీలంరంగు కిరణాలతో కలిసి, చూచేందుకు అద్భుతంగా ఉంది. నేను హృదయంలోనే సర్వాత్మభావ స్వరూపుడైన శ్రీ గురువును స్మరించు కుంటూ శ్రీగురువు పాదుకలను శిరస్సున ధరించి మెల్లమెల్లగా నడుస్తున్నాను. ఇప్పుడు కూడా ఏకత్వం యొక్క అనుభూతి స్ఫురణలో ఉంది. ఆ చిన్న చిన్న నీల బిందువులు ఇప్పుడుకూడా కనిపిస్తున్నాయి.

నడుస్తూ నడుస్తూ, వజ్రేశ్వరి మందిరం చేరుకున్నాను. ఈ మందిరంలో మహాశక్తి యోగమాత వజ్రభవాని పేరుతో విరాజమానమై ఉంది. వజ్రభవాని మందిరం వెనకవైపున ఒక చిన్న దత్త మందిరం ఉంది. నేను అక్కడ ఉంటూ ఉండేవాడిని. రోజు కొకసారి భోజనానికి, తల్లి వజ్రభవాని మందిరపు మహంతు – బాబా సాహిబ్ దగ్గరకు వెళ్లే వాడిని. ఆయన నాకు రోజూ ఎంతో శ్రద్ధగా భోజనం పెట్టేవాడు. నేను,

గురుపాదుకలను ఆ దత్తమందిరంలో పెట్టి రోజూ, పూజ ధ్యానం చేయ సాగాను. ధ్యానం రాత్రిపూటనే చేసేవాడిని. ఆ విధంగా కొన్నిరోజులు వజ్రేశ్వరిలో ఉన్నాను. ప్రతిరోజూ స్నానానికి గణేశపురి వెళ్లేవాడిని. తర్వాత గురువు దర్శనం. ప్రతిదినం ఇదీ కార్యక్రమం. ఈ విధంగా శ్రీగురువు పట్ల నిష్ఠ – భక్తి – శ్రద్ధ, రోజురోజుకు ఎక్కువ కాసాగాయి.

వజ్రేశ్వరి దేవి ఆలయం సిద్ధులను ప్రదానం చేసే మహాగొప్ప స్థానం. అది ఒక గొప్ప సిద్ధ పీఠం. ప్రాచీన కాలంలో చాలా మంది సిద్ధయోగులు, ఋషులు, మునులు, ఇక్కడ నివసించారు. శ్రీరాముడు కూడా ఇక్కడికి వచ్చినట్టు చెబుతారు. ఈ ప్రదేశానికి నాలుగువైపులా చిన్న – పెద్ద పర్వతాలున్నాయి. వ్యాధులను నివారించే ఉష్ణ కుండాలున్నాయి.

ఒక చిన్న నది అక్కడ ప్రవహిస్తుంది. ఎంతో అందంగా ఉంటుంది, చూడడానికి. ప్రాచీన కాలంలో చాలామంది సిద్ధులు ఈనది ఒడ్డున తపస్సు చేసుకున్నట్టు ప్రతీతి. మంచిది. నేను చిదంబ వజ్రభవాని తల్లి యొక్క కృపా పూర్ణమైన ఆశ్రయంలో చాలాకాలం ఉన్నాను. అక్కడి నీటిని సేవించాను. అక్కడి అన్నం తిన్నాను. ఆ విధంగా కొన్నిరోజులు గడిచాయి.

నేను ఒకరోజు ఉదయం శ్రీ గురుదేవుడి దర్శనం చేసుకుని అక్కడే నిల్చున్నాను. ఆయన ''హుం'' కరించి, ఒక పండు ఇచ్చి, ''వెళ్లు'' అన్నారు. నేను అక్కడి నుంచి కదలలేదు. గురుదేవులు మళ్లీ అన్నారు. ''వెళ్లు... నీకుటీరం అక్కడ ఉంది... యేవ్‌లా ...యేవ్‌లా... అంతే... అంతే.. నీధ్యానం జ్ఞానం అక్కడ... వెళ్లు''. నేను వెళ్లిపోయాను. నాకు బాధ కలిగింది. విచారం కలిగింది. కాని గురువాజ్ఞను పాలించేందుకు నేను పూర్తిగా సిద్ధపడ్డాను. శ్రీ గురువాజ్ఞను నేను ఇంతకుముందుకన్నా ఎక్కువ విలువైనదిగా పరిగణిస్తున్నాను. **గురు ఆజ్ఞాపాలనమే తపస్సు. గురు ఆజ్ఞాపాలనమే జపం. గురు ఆజ్ఞాపాలనమే సాధన. గురు ఆజ్ఞాపాలనమే ప్రధాన కర్తవ్యం. గురు ఆజ్ఞాపాలనను మించిన శుభప్రదమైన కర్మ, శిష్యులకు మరొకటి లేదు.** నా విశ్వాసం అటువంటిది. గురుసేవ మహాపూజ, గురుసేవ విశ్వపూజ. గురు ఆజ్ఞాపాలనమే శిష్యుడి శ్రేష్ఠమైన కర్తవ్యమని భావించి, ఆ మరుసటిరోజే యేవ్‌లా బయలు దేరాను. ఇక్కడ గురుదేవుడు, గాంవ్‌దేవి

ఆలయాన్ని మరమ్మతు చేయిస్తున్నారు. మూడు చిన్న గదులను కట్టిస్తున్నారు. ఇప్పుడు ''శ్రీగురుదేవ ఆశ్రమం'' హాలుగా మారినవి ఈ మూడు గదులు.

నేను యేవ్‌లా వెళ్లాను. రెండో రోజు యేవ్‌లా నుంచి సూకీ వెళ్లాను. అక్కడ నేను సాధన చేసుకునే కుటీరం ఉంది. అక్కడ సాధన చేసుకునేందుకు వెళ్లాను. కుటీరానికి రెండువైపులా, తూర్పున - పశ్చిమంలో రెండు మామిడి వృక్షాలు న్నాయి. వాటి మధ్య నా కుటీరం. ఉత్తరపు వైపున ద్వారం. రెండు మామిడి వృక్షాలు, నా కుటీరం, నాకోసం ఎదురుచూస్తున్నట్టు ఉన్నాయి. నేను, గురు దేవుడి పాదుకలను కుటీరంలో పెట్టి, ఆయనిచ్చిన పండుతిని, ధ్యానానికి కూర్చున్నాను.

రెండు

# మనోభ్రమ

రెండవరోజు తెల్లవారు ఝామున నా పరిస్థితి విచిత్రంగా మారింది. కారణం నాకు తెలియలేదు. అశాంతిగా ఉంది మనస్సు. శరీరమంతా నొప్పి ప్రారంభమైంది, శరీరమంతా సూదులు గుచ్చినట్టు. హఠాత్తుగా ఏమైనదీ తెలియలేదు। ఆ తన్మయత్వం, ఆనందం ఎక్కడ మాయమైనట్టు। నా స్వాభిమానం గర్వం నశించాయి. మళ్లీ పూర్వం మోస్తరు దరిద్రుడిగా దీనుడిగా మారాను. నా మనసు పశ్చాత్తాప పడసాగింది. ఆ తన్మయత్వం ఎక్కడికి పోయినట్టు. ఏం జరిగింది. పరిపూర్ణమైన పారవశ్యంతో కూడిన కొత్తప్రపంచం ఎక్కడికి ఎగిరిపోయిందో? ఇంతవరకు ఏ విధంగా ఉన్నాను। ఇప్పుడేమైంది? అతి సుందరమైన నగరం ఒకటి దురదృష్ట వశాత్తు ఛిన్నాభిన్నమైనపుడు ఆ నగర పరిపాలకుడు దిగ్భ్రాంతి చెంది ఆ నగర శిథిలాలను చూస్తూ నిశ్చేష్టుడై నిలుచుండి పోయినట్టు అయింది, స్వామి ముక్తానంద పరిస్థితి. కుటీరం నుంచి బయటికి వచ్చి నా నిర్వికార మిత్రుడైన మామిడిచెట్టు కింద కూర్చున్నాను. ఇదంతా ఏ విధంగా జరిగింది? ఎందుకు జరిగింది? ఇదే ఆలోచన నన్ను దహించి వేస్తూ ఉంది. రాత్రి నిద్రలో చాలా దుస్వప్నాలు కలిగాయి. ఉదయం నిద్రలేస్తూనే అశాంతి. స్థిమితం లేదు. మనస్సులో విషాదం. రాత్రిపూట నాకుతోడుగా ఒక మనిషి, బాబూరావ్ పహల్వాన్ పడుకునే వాడు. చాలాకాలంగా పరిచితుడు. అతడిని ఇంటికి పంపించి వేశాను. అతడు వెళ్లిపోయాడు. నా పరిస్థితి విచిత్రంగా ఉంది. గణేశపురిలో లభించిన తన్మయత్వం, కొత్త ఆనంద సామ్రాజ్యం ఎక్కడికి పోయినట్టు? ఇదే ఆలోచన మనస్సును వేధిస్తూ ఉంది. మొదట తన్మయత్వం అధికమైనట్టే ఇప్పుడు విచారం, నానారకాలైన తర్క-కుతర్కాలతో గడిచింది. శరీరమంతా బాధ. తల విపరీతంగా వేడెక్కింది. దానితో క్రోధం- భయం - విచారం, నన్ను అతలకుతలం చేశాయి.

పదకొండున్నర గంటలైంది. నా కుటీరం ఉన్న ప్రదేశపు యజమాని భోజనం

తీసుకొని వచ్చాడు. ఆ రోజుల్లో సజ్జరొట్టె, కూరతినేవాడిని. కొంచెం పాలు కూడా తాగేవాడిని. భోజనానికి కూర్చున్నాను. కొంచెం కూడా రుచించలేదు. బలవంతంగా సగం రొట్టెతిని, మంచినీళ్లు తాగి లేచాను. వెలుపలికి వచ్చాను. నా సాధనలో మిత్రుడైన మామిడి చెట్టుకు ఒక ఉయ్యాల కట్టి ఉంది. దానిమీద కూర్చున్నాను. అప్పటికీ మనస్సులో ఉత్సాహం లేదు. దృష్టి ఏ వస్తువు మీద లగ్నమైనా, భయ కంపితమై వెనుక్కు మళ్లేది. గురుదేవుడికి చాలా దూరంలో ఉన్నాను. ఈ విషయం గురించి అడిగేందుకు ఎవరిదగ్గరకు వెళ్ళను? ఉయ్యాల మీద నుంచి లేచాను. మామిడిచెట్టు మీదికి ఎక్కి, కొంత శాంతపడి కూర్చున్నాను. ఒకటి రెండు క్షణాలు మాత్రమే. మళ్లీ అశాంతి, బాధ. మానసిక చాంచల్యం ఎక్కువైంది. మనస్సులో అతిక్షుద్రమైన భావాలు తల ఎత్తాయి. వాటి గురించి చెప్పడానికి లేదు. నిజం. ఈవిధంగా క్షుద్రమైన పాపమైన ద్వేషపూరితమైన ఆలోచనలతో మధ్యాహ్నం మూడు గంటలైంది. మళ్లీ ఆ ప్రదేశపు యజమాని త్రాగడానికి వేడి పానీయం తెచ్చిపెట్టాడు. త్రాగాను. కుటీర సమీపంలో తూర్పునుంచి పడమటి దిక్కుగా, పశ్చిమం నుంచి తూర్పు దిక్కుగా పచార్లు చేశాను. మధ్యమధ్యలో దగ్గరలో ఉన్న గ్రామాల ప్రజలు వచ్చేవారు. వారితో కూడా ఎక్కువ మాట్లాడేది లేదు. వారేదైనా అడిగినప్పుడు సరిగ్గా సమాధానం చెప్పేది లేదు. ఇక్కడ కాసేపు కూర్చోవడం, అక్కడ కాసేపు కూర్చోవడం. మామిడి చెట్టు నీడలో కూర్చుంటే ఇంతకు ముందు ఎంతో హాయిగా ఉండేది. ఇప్పుడది లేదు. ఎక్కడ కూర్చున్నా ఒకటే అసంతృప్తి.

నా గురుదేవుడు ఒకసారి శివరామ శెట్టికి ఒక కథ చెప్పాడు. నా స్థితి కూడా అదే విధంగా ఉండడంతో నాకిప్పుడు ఆ కథ గుర్తుకు వచ్చింది. కథ ఇది: ఒక సోమరి, దరిద్రుడు, ఎందుకూ పనికిరాని వ్యక్తి ఒకడున్నాడు. ఎక్కడికి వెళ్లినా కూడా దరిద్రము, దౌర్భాగ్యము, అతనితో వెళ్లేవి. ఈ దరిద్రుడు ఎవరైనా ధనవంతుడి దగ్గరకు వెళ్లినట్టయితే ఆ పుణ్యాత్ముడైన ధనవంతుడు, దరిద్రుడుగాను లోభిగాను మారేవాడు. ఒక రోజు ఈ దౌర్భాగ్యుడు కైలాసానికి బయలు దేరాడు. అతనికి ముందు మరొక వ్యక్తి నడుస్తున్నాడు. ఈ దౌర్భాగ్యుడు వేగంగా నడిచి అతన్ని చేరుకున్నాడు. ''అయ్యా నువ్వు ఎక్కడికి వెడుతున్నావో పద, ఇద్దరం కలిసి వెడదాం'' అన్నాడు. ముందు నడుస్తున్న వాడు సాక్షాత్తు దరిద్రదేవతామూర్తి. అతనన్నాడు: ''దౌర్భాగ్య మానవుడా! నేను నీతో పాటు నడవలేను; ఎందువల్ల నంటావా, నేను నీ దౌర్భాగ్యానికి చాకిరి

చేస్తున్న వాడిని. నీకు ముందుగా వెళ్లి నీకు స్వాగతం చెప్పడానికి గాను, లేమి-దరిద్రము – కాఠిన్యము – అశాంతి – మానసికక్షోభ – మూఢత్వం – వంటివాటిని అక్కడ పోగుచేసి పెట్టడం నావిధి. అందువల్ల నన్ను నీకన్న ముందు వెళ్ల నివ్వు.'' దౌర్భాగ్యుడు కైలాసం వెళ్లినా అక్కడ కూడా అన్నిరకాల దరిద్రాలు అతడికి స్వాగతం చెబుతాయని, గురుదేవుడు, ఈ కథ రూపంలో బోధించాడు.

మన ఆశ్రమానికి వచ్చే కొత్తవారిలో కొంతమందికి కూడా ఇటువంటి దశే పడుతుంది. ఇటువంటి భాగ్యహీనులు, సిద్ధపీఠంలో ఉన్నా, సిద్ధపురుషుల సాన్నిధ్యంలో నివసిస్తున్నా సత్సంగంలో ఉన్నా, విచారంగా సంతోషం లేకుండా అశాంతిగా కళాకాంతి లేకుండా దేనిలోనూ ఉత్సాహం లేకుండా ఉంటారు. వారికి బొంబాయి గుర్తుకు వస్తుంది. అక్కడి సినిమాలు, క్లబ్బులు, అక్కడి విలాసమయమైన విశ్రాంతిమయమైన జీవితం పదేపదే జ్ఞాపకం వస్తూ ఉంటుంది. తిరిగి బొంబాయికి ఎప్పుడు వెడదామా అన్న ఆలోచన అటువంటివారిని తినేస్తూ ఉంటుంది.

ముక్తానంద పరిస్థితి కూడా ఆ దరిద్రుడి విధంగా తయ్యారైంది. మామిడి చెట్ల కింద ఆసనం వేసుకుని ఎంత ఆనందంగా కూర్చునేవాడిని! ఈ రోజున అదే మామిడి చెట్లు నన్ను కూర్చోనివ్వకుండా లేవనెత్తుతున్నాయి. యేవ్‌లా నుంచి సత్సంగం కోసం వచ్చే మంచి మిత్రులు కూడా నచ్చడం లేదు ఇప్పుడు. ఇంతలో ఆరుగంట లైంది. బాబు వచ్చాడు. కూడా ఒక వృద్ధ వనిత వచ్చింది. ఈమె ఇంతకు ముందు ప్రతిరోజు మధ్యాహ్నం వచ్చి అభంగాలను పాడి వినిపించేది. ఆమె రాగానే కోరాను, నాకిష్టమైన అభంగాన్ని పాడమని. నేను చెప్పగానే ఆమె పాడడం ప్రారంభించింది.

**శేవటిలీ పాళీ తేవ్‌హాఁ మనుష్యజన్మ! చుకలీయా వర్మ ఫేరా పడే॥**
**ఏక్ జన్మీఁ ఓళఖీ కరా ఆత్మారామ్ । సంసార సుగమ భోగూఁ నకా।**

ఇది శ్రీ నామదేవుడి విరచిత అభంగము. మహా మార్మికమైనది. ఆయన అంటున్నారు: ''ఈ శరీరంలోనే ఆత్మారాముడిని వెతుకు. మానవజన్మ, ఎన్నోజన్మల అనంతరం లభిస్తుంది. దీన్ని శ్రద్ధగా సంరక్షించుకో. లేనట్టయితే మళ్లీ పుట్టవలసి వస్తుంది.'' ఈ అభంగాన్ని వృద్ధురాలు ఎంతో భావయుక్తంగా పాడింది. ఇంతమంచి అభంగం కూడా నాకు ఆ సమయంలో రుచించలేదు. పేలవంగా ఉంది.

మరొక అభంగం ఉంది. నామదేవుడి ప్రియ శిష్యురాలైన జనాబాయి వ్రాసినది.

ఎంతో భావయుక్తమైనది. దాన్ని పాడవలసిందని నేను వృద్ధురాలిని అర్థించాను. అభంగం తాత్పర్యమిది: జనబాయి యొక్క గురుభక్తిని చూచి భగవాన్ విఠల రాయుడు, జనాబాయి ఇంటికి వెళ్లి, జనాబాయికి ఆమె అత్తగారు చెప్పే పనులన్నిటినీ చేసి పెట్టేవాడు. గురుభక్తి మహిమ ఎంతటిది! జనాబాయి గొప్ప యోగిని, భక్తురాలు, జ్ఞాని, ఎంతో తెలివైనది, గురుభక్తి పరాయణి. ఆమె తన అభంగాల్లో ''నామాచీ జనీ'' ''నామయాచీ దాసీ'' అని వ్రాసుకుని శ్రీ గురువు పట్ల తన దాసభావాన్ని వ్యక్తం చేసేది. దాసి జనాబాయి యొక్క సేవాధర్మాన్ని గుర్తించి ప్రసన్నుడై, యోగులకు కూడా దుర్లభుడైన పాండురంగ విఠలుడు ఆమెతో పాటు గుడ్డలుతికేది, తిరగలి విసిరేది, ఇల్లు శుభ్రం చేసేది, పాటలు పాడేది, ఆమెతో మాటలాడేది, రాత్రింబగళ్లు జనాబాయితోనే గడిపేది. దీనిలో ఆశ్చర్యమేముంది? గురుభక్తి అంత అద్భుతమైనది. పశ్చాత్తాపంతో కూడిన ఆ అభంగం ఈ విధంగా ఉంది:

**నాహీఁ కేలీ తుఝీ సేవా దుఃఖ వాటతసే మాఝే జీవా 1**
**నష్ట పాపిణ మీ హీన నాహీఁ కేలేఁ తుఝే ధ్యాన 2**
**జేఁజేఁ దుఃఖ ఝూలేఁ మలా తేఁత్వాఁ సోసిలేఁ విఠలా 3**
**రాత్రందివస మజపాశీఁ దళూంఁ కాండూంఁ లాగలాసీ 4**
**క్షమా కరావీ దేవరాయా దాసీ జనీలాగే పాయాఁ 5**

దాసి జనాబాయి అంటున్నది: ''ఓ భగవంతుడా! నేను నీకు ఎటువంటి సేవ చేయలేదు. అందువల్ల నాకు చాలా దుఃఖంగా ఉంది. నేను పాపిని. నీ ధ్యానం కూడా చేయలేదు. అయినప్పటికీ ఓ విఠలా నాకు ఎంత సహాయం చేశావు! నాకు బాహ్యజగత్తులో కలిగిన అన్ని రకాల బాధలను, ఇతరులు పెట్టిన కష్టాలను అన్నిటినీ నువ్వు నా పట్ల వాత్సల్యం చేత స్వయంగా అనుభవించావు. రాత్రింబగళ్లు నాతోకూడా ఉండి,నేను చేయవలసిన కఠినమైన పనులన్నిటిని క్షణంలో చేశావు. రుబ్బడం, దంచడం కూడా చేశావు. ఓ ప్రభు నా కోసం నువ్వు ఎన్ని కష్టాలననుభవించావు. ప్రభు! క్షమించు. నామదేవుడి దాసి-జనీ దీనంగా ప్రార్థిస్తూ ఉంది.'' ఈ అభంగం ఎప్పుడూ నా హృదయంలో అమృతాన్ని వర్షిస్తుంది. ఈ రోజు అది కూడా పనిచేయలేదు. శుష్కంగా ఉంది. నాలో మంచి అనేది పోయింది. ప్రేమలేదు. అయ్యయ్యో! ఏమైంది. ఎంత దౌర్భాగ్యం!

పాడుతున్న వృద్ధురాలిని వెళ్లి పొమ్మన్నాను. మళ్లీ కుటీరంలోకి వెళ్లాను. వికృతమైన

వికారమైన బాధలు. చేతులు కాళ్లలో క్రియలు. భ్రమ ఎక్కువ కావడం ప్రారంభమైంది. సూర్యుడస్తమించాడు. బాబూ దీపం వెలిగించాడు. అగరువత్తులను వెలిగించాడు. ఆరతి ఇచ్చాడు. ధూపాన్ని వెలిగించాడు. తర్వాత తంబూర తీసుకుని భజనలు పాడడం ప్రారంభించాడు. కొంత సేపటికి, నా శ్వాసలో వికృతి ప్రారంభమైంది. హఠాత్తుగా పొట్ట ఉబ్బుతుంది. మళ్లీ శ్వాసను గట్టిగా ఒదులుతాను. లోపలికి పోయిన శ్వాస ఒక్కొక్కసారి అక్కడే నిలిచి పోతుంది. భయం మరీ ఎక్కువైంది. మనసంతా విచారం. భ్రమించిన మనసుతో కుటీరం బయటికి వచ్చాను. రాత్రి ఎనిమిది గంటలైంది. చల్లటి వెన్నెల. కాని నాకు చీకటే కనిపిస్తూ ఉంది. దూరం నుంచి విచిత్రమైన శబ్దాలు వినవస్తున్నాయి. మనస్సు మరీ భయపడింది. నేను బాబూరావును పిలిచి చెప్పాను: ''బాబూ, నువ్వు ఇంటికి వెళ్లు. నా హృదయ స్పందనం, మనః స్థితీ బాగాలేవు. ఈ రాత్రి నాకు చావు తప్పదని అనిపిస్తూ ఉంది. హార్ట్‌ఫెయిల్ అయిపోతుంది. అందువల్ల నువ్వు వెళ్లిపో. లేకపోయినట్టయితే అందరూ నిన్ను వేధిస్తారు. నేను బతకడం కష్టం. ఒకవేళ బతికినా పిచ్చివాడినౌతాను. నా మనస్సు పాడైపోతూ ఉంది. నువ్వు నా ఆజ్ఞను పాలించు వెళ్లు''. బాబూరావు ఎంతో బాధపడుతూ వెళ్లిపోయాడు.

రాత్రి గడుస్తూ ఉంది. వాతావరణం నిశ్శబ్దంగా నీరవంగా ఉంది. వెన్నెల అంతటా వెల్లి విరిసి ఉంది. నృత్యం చేయాలనీ గట్టిగా అరవాలనీ ఎగరాలనీ అనిపిస్తూ ఉంది. ఈ కోరిక బలవత్తరమౌతూ ఉంది. మతి భ్రమణ కలిగినట్టు అనర్థకములైన ఆలోచనలు వస్తున్నాయి. శరీరం వేడెక్కుతూ ఉంది. శిరస్సు భారమైంది. దేహమంతటా ఒకటే బాధ. శ్వాస వెలుపలికి పోయినట్టయితే, మళ్లీ లోపలికి రావడం లేదు. లోపలికి వెళ్లినట్టయితే అక్కడే ఉండి పోతున్నది. శ్వాస ఈ విధంగా ఉండడంతో, ఈ ప్రాణం ఇక ఎంతో కాలం ఉండదనిపించింది. నేను మళ్లీ కుటీరం బయటికి వచ్చాను. ఈ భూమండలం, ఆకాశం, వృక్షాలు – అన్నీ గిర్రున తిరుగుతున్న భావన. లేస్తాను, మళ్లీ అక్కడే కూర్చుంటాను. ఇదంతా నాకు ఏ మాత్రం అర్థం కావడం లేదు. ఏం జరుగుతున్నది? ఎందుకు జరుగుతున్నది? ఎవరివల్ల ఈ విధంగా జరుగుతున్నది? మామిడి చెట్ల దగ్గరకు వెడదామని కోరిక కలిగింది. అటువైపు చూచాను. రెండు వృక్షాల మధ్య గురుదేవుడు నా వైపు ముఖం పెట్టి కూర్చుని ఉండడం కనిపించింది.

రాత్రి తొమ్మిది గంటలైంది. నా కన్నుల్లో ఒక ఆకారం స్థిరమై ఉంది. కొద్ది కొద్దిగా

కనిపిస్తూ ఉంది. చెట్లవైపు చూచాను. అక్కడ గురుదేవుడు కనిపిస్తున్నాడు. మళ్లీ ఆయన కూడా అదృశ్యమయేవాడు. ఈ విధంగా జరుగుతూ ఉంది. నా శరీరం లోకి ఏదో ఒక శక్తి ప్రవేశించి నా చేత కొన్ని పనులను చేయిస్తున్నట్లు నాకు తోచింది. నాకున్న స్వేచ్ఛ పోతున్నట్లు, పూర్తిగా పిచ్చిపడుతున్నట్లు తోచింది. చిత్తం పూర్తిగా చంచలమైంది. మామిడి చెట్టుకు మూడుసార్లు ప్రదక్షిణం చేశాను. గురుదేవుడికి నమస్కారం చేశాను. తర్వాత కుటీరంలోకి వెళ్లిపోయాను. లోపలికి వెళ్లిన వెంటనే, కిటికీలోనుంచి భయానకమైన దృశ్యం కనిపించింది. చెఱుకు తోటలో అగ్ని వ్యాపించింది. అతి త్వరగా విస్తరిస్తూ ఉంది. నా భయం ఎక్కువైంది. ప్రజలు భయంతో హాహాకారాలు చేస్తున్న ధ్వని వినివించింది. ఆరడుగులనుంచి యాభై అడుగుల దాకా ఎత్తున్న యక్షుడూ, రాక్షసుడూ కాని మానవాకారం ధరించిన ఒక విచిత్రమైన ప్రాణి నోరంతా తెరచుకుని నగ్నంగా నృత్యం చేస్తూ కనిపించింది. భయంకరమైన ప్రళయకాల చీత్కారాలు వినిపించాయి. నేను పూర్తి స్పృహలోనే ఉన్నాను. కాని, పిచ్చి పట్టిన భావం కూడా స్పష్టంగా కనిపిస్తూ ఉంది. కొంత సేపటికి మరణం గురించి మళ్లీ జ్ఞాపకం వచ్చింది.

నేను ఆసనం మీద కూర్చున్నాను. కూర్చుంటూనే పద్మాసనం ఏర్పడింది. నాలుగువైపులా చూచాను. నాలుగువైపులా అగ్నిజ్వాలలు విస్తరించి ఉన్నాయి. బ్రహ్మాండమంతా మండిపోతున్నట్టు దృశ్యం. ఆ విధంగా మండుతూండగా సముద్రం పొంగింది. పొంగి భూమండలాన్నంతటినీ ఆవరించింది. భూత పిశాచాలు నన్ను చుట్టు ముట్టాయి. ఈ లోపున నా పద్మాసనం గట్టి పడింది. కనులు మూత పడ్డాయి. నా కంఠం మూసుకుపోయింది. శ్వాస వెలుపలికి రావడం లేదు. ఆ తర్వాత వీపు కిందిభాగంలో మూలాధారంలో ఉన్న నాడుల కూటమిలో విపరీతమైన బాధ కలిగింది. కనులు తెరుచుకున్నాయి. లేచి పరుగెడుదామన్న కోరిక కలిగింది. కాని కాళ్లు పద్మాసనంలో ఉండిపోయాయి. విడిపడడం లేదు. కాళ్లకు చీలలు కొట్టి పెట్టినంత గట్టిగా ఉంది పద్మాసనం. చేతులు కూడా పూర్తిగా పట్టుకుపోయినట్టు ఉంది. అదే సమయంలో జరుగుతున్నఇదంతా భ్రమ అన్న జ్ఞానం కూడా ఉంది. కాని, భయం నన్ను ఆవరించి ఉంది. కనులు మూసుకునే ప్రయత్నం చేశాను. కాని వెంటనే తెరుచుకున్నాయి. ఇప్పుడుకూడా పృథ్వి అంతా జలమయమై ఉన్నట్లు కనిపిస్తూ ఉంది. నేను తప్ప మిగతా ప్రపంచమంతా నాశనమైంది. నా కుటీరం మాత్రం మిగిలి

ఉంది. ఇంతలో బయటినుంచి ప్రళయ జలంలో తేలియాడుతూ చంద్రుడి ఆకారంలో నాలుగడుగుల ఎత్తున్న ఒక గోళం, లోపలికి వచ్చి, నా ఎదుట ఆగింది. తెల్లటి ప్రకాశంతో కూడిన ఈ గోళం నా కనులతో ఢీకొని, నా లోపలికి ప్రవేశించింది. ఇవన్నీ నేను ప్రత్యక్షంగా చూచిన సంఘటనలు. స్వప్నంలో జరిగినవి కావు. అసత్యమైన దృష్టాంతాలు కావు. ప్రత్యక్షంగా చూచినవి. ఆకాశంనుంచి దిగిన ఆ శ్వేతగోళం, నాలోపలికి ప్రవేశించింది. ఈ విద్యుత్ జ్యోతి నాడుల్లోకి ప్రవేశించిన తర్వాత ఒక క్షణం నా నాలుక లోపల అంగిట్లో నిలిచిపోయింది. కనులు మూతపడ్డాయి. తలలో ధగధగ మెరుస్తున్న జ్యోతిని చూచి, నేను చాలా భయపడ్డాను. పద్మాసనంలో ఉండగానే శిరస్సు భూమిని తాకింది.

కొంత సేపైన తర్వాత కనులు తెరుచుకున్నాయి. తేలికైన ఎరుపురంగులో అతి సుందరమైన మృదువైన జ్యోతి ఒకటి మిలమిలమెరుస్తూ అటూ ఇటూ ఊగుతూ కనిపించింది. దాని నుంచి అనంతమైన స్ఫులింగాలు విశ్వమంతా వ్యాపించాయి. ఆ జ్యోతిని చూస్తుండగా నా పద్మాసనం విడిపడింది. శరీర భావం యథాప్రకారం కలిగింది. ఆసనం మీది నుంచి లేచాను. బయటికి వెళ్లాను. కుడివైపు ఎడమవైపు చూచాను. అంతా ప్రశాంతంగా ఉంది. ఆశ్చర్యంగా ఉంది నాకు. నమ్మలేకుండా ఉన్నాను. ఏమేమి చూచానో వాటిగురించి ఆలోచించాను. మళ్లీ లోపలికి వెళ్లాను. కన్నులు మూసుకున్నా ఆ చక్కటి జ్యోతి, అదేవిధంగా కనిపిస్తూ ఉంది. కన్నులు తెరిచి బయటికి వెళ్లి చూచాను. ఏమీలేదు. ఈ విధంగా జరుగుతూ, రాత్రి బాగా పొద్దుపోయింది. నిద్రపోయేందుకు ప్రయత్నించాను. నిద్రరాలేదు. తల భారంగా ఉంది. ఈ అవస్థలో ఉండగా తెల్లవారు జామున నాలుగు గంటలైంది. స్నానం చేశాను. పూర్వాభిముఖుడనై కూర్చుని గురుధ్యానం ప్రారంభించాను. ధ్యానానికి కూర్చుం డగానే మనస్సు పూర్తిగా అంతర్ముఖమైంది. ఆసనంలో కూర్చున్న శరీరం గిర్రున తిరగడం ప్రారంభించింది. వెనుకవైపు మూలాధారంలో నొప్పి పుట్టింది. హృదయా కాశంలో మనస్సును ఉల్లాసపరచే ఒక జ్యోతి కనిపించింది. దాని దర్శనం చేసుకుంటూ అంతస్సులోనుంచి వినవస్తున్న ''గురుఓం'' దివ్యనాదాన్ని వింటూ శరీరం ఊగడం ప్రారంభించింది. ఈవిధంగా ఒకటిన్నర గంటసేపు ధ్యానం చేసుకోగా ఒక కొత్త క్రియ ప్రారంభమైంది.

ఒక్కొక్క సారి ఒంటె అరిచినట్టు, ఒకసారి పెద్దపులి అరిచినట్టు ధ్వనులు చేసేవాడిని.

పులి అరిచినట్టు అరిచినపుడు చుట్టుప్రక్కల జనం విని, నిజంగానే పెద్దపులి, చెఱుకుతోటలోకి వచ్చి ఉంటుందని భావించారు. ఈ క్రియలు కొంతకాలమే జరిగాయి. మరల ప్రశాంతమైంది మనస్సు. ధ్యానం ముగిసిన తర్వాత ఆసనం మీది నుంచి లేచాను. శరీరమంతా ఒకటేనొప్పి. జడంగా మారింది. పూర్తిగా స్పృహ వచ్చిన తర్వాత కుటీరం వెలుపలికి వచ్చి ఉయ్యాల మీద కూర్చున్నాను. వాతావరణం ప్రశాంతంగా ఉంది. తూర్పుదిక్కున సూర్యనారాయణుడు ఉదయిస్తున్నాడు. మామిడి వృక్షాల్లో పక్షులు 'కలకల' శబ్దాలు చేస్తూ నాకు ఈ సంగతిని తెలియచేస్తున్నాయి. ఈ లోపున పొలం యజమాని వచ్చాడు. నా ధూపకుండంలో ధూపం వేసి కుటీరం నాలుగువైపులా ధూపాన్ని చూపాడు. సుగంధిత ధూపం యొక్క సువాసన ధ్యాన కుటీరం నాలుగువైపులా వ్యాపించి, వాతావరణం సువాసనభరితమైంది. తర్వాత నాతో అన్నాడు: ''బాబాజీ ఈరోజు ఏమైందో తెలుసా. నేనిక్కడకు వచ్చినప్పుడు మీరు ధ్యానంలో కూర్చుని ఉన్నారు. ఈ రోజు తోటలోకి పెద్దపులి వచ్చినట్టుంది. నేను నిజం చెపుతున్నాను, బాబాజీ. పొలం అవతలివైపు నుంచి వచ్చాను. కనీసం అరగంట సేపు పులి గర్జన వినిపించింది''. అతడు ఎంతో ఆశ్చర్యచకితుడై ఈ మాటలన్నాడు. ఈలోగా నేను వేడి పానీయంత్రాగే సమయం అయింది. అది, మామూలుగా నేను కుటీరంలోనే తయారు చేసుకుంటాను. ఈ రోజు అతడు చేశాడు. నేను త్రాగాను. ఈ సంఘటన గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. ధ్యానంలో నేను, పులిగర్జించినట్టు శబ్దాలు చేసిన మాట వాస్తవమే. కాని, ఆ ధ్వని అంతదూరానికి ఏ విధంగా వినిపించింది అన్న విషయం నాకు అర్థం కాలేదు. నేను ఎవరికైనా నిజం చెప్పినట్టయితే నన్ను పిచ్చివాడిగా భావిస్తారు. ఆ కారణం చేత ఏమీ చెప్పకుండా ఊరుకున్నాను. **ఇటువంటి పరిస్థితి గురించి నేను ఎక్కడా చదవ లేదు, వినలేదు; వేదాంతం గురించి పెద్దపెద్ద మాటలూ వాటి అర్థాలూ విన్నాను కాని.**

ఉయ్యాల మీద ప్రశాంతంగా కూర్చున్నాను. ఈ రోజు బాబు పొద్దున్నే, త్వరగా వచ్చాడు. నవ్వుతూ వచ్చాడు. నేను క్షేమంగా ఉండడం చూచి చాలా సంతోషపడ్డాడు. ''బాబా మరణించనూ లేదు, పిచ్చిపట్టనూ లేదు'' అన్న సంగతిని చూచాడు, నమస్కారం చేసి ఎదురుగా కూర్చున్నాడు. నా ప్రియ మిత్రుడు పాటిల్ ప్రతిదినము చీపురుతో ఆ ప్రదేశాన్నంతా శుభ్రం చేసేవాడు. అతను కూడా వచ్చి శుభ్రం చేయడం ప్రారంభించాడు.

బాబు అడిగాడు: ''మీరెట్లున్నారు? 'నేను చనిపోతాను లేదా పిచ్చి అయినా



స్వామి ముక్తానంద : సూకీలో తన కుటీరం ముంగిట



స్వామి ముక్తానంద : కసారాలో

పడుతుంది' అన్నారు కదా. నేను భగవంతుడిని ప్రార్థించాను 'అటువంటిది ఏదీ జరుగకుండా రక్షించు ప్రభూ' అని. జరగదని నాకు నమ్మకమే.''

నేనన్నాను : ''ఎందుకు జరగలేదు. రాత్రి మరణమే వచ్చింది. ప్రపంచమంతా దగ్ధమైంది. పృథివి అంతా నీట మునిగింది. నేను మాత్రం బతికి బయట పడ్డాను. బాబూ, రాత్రి నా పరిస్థితి ఏమీ బాగుండలేదు. నేను పూర్తిగా పిచ్చివాడినై పోయాను. బయటికి ఆ విధంగా కనిపించనప్పటికీ, లోపల పూర్తిగా పిచ్చిపట్టినట్టయింది.'' ఆ తర్వాత బాబూరావు కుటీరంలోనుంచి తంబూర తెచ్చి భజనలు పాడడం ప్రారంభించాడు. నా ధ్యాన కుటీరానికి ఒక నియమం ఉంది. ఎవరూ అక్కడికి రారాదు. వచ్చినా ప్రశాంతంగా కూర్చుంటారు. అందువల్ల వాతావరణం నిశ్శబ్దంగా ఉంది. నేను ఏకాగ్రంగా వింటున్నాను. ''శృతి కీ టేర్'' నుంచి ఈ గీతం :

**తూ ఆప్ అప్‌నీ యాద్ కర్, ఫిర్ ఆత్మ కో తూ ప్రాప్త్ హో**
**నా జన్మ లే మర్ భీ నహీం, మత్ తాప్ సే సంతప్త హో.**

**జో ఆత్మ సో పరమాత్మ హై, తూ ఆత్మ మే సంతృప్త్ హో**
**యహ ముఖ్య తేరా కామ్‌హై, మత్ దేహ మే ఆసక్త హో .**

(నీ ఆత్మను ధ్యానించు, నీ ఆత్మను ప్రాప్తించుకో. నీకు పుట్టుకలేదు, చావులేదు. తాపంవల్ల రోదించవద్దు. ఆత్మే పరమాత్మ, ఆత్మలోనే సంతృప్తి చెందు. ఇది నీ ప్రధాన కర్తవ్యం, శరీరం మీద మమకారం పెట్టుకోవద్దు.) వింటూండగా నా అంతరంగంలో దివ్యమైన భావం జాగృతమైంది. నా శరీరం మెలికలు తిరగడం మొదలు పెట్టింది. కుటీరంలోకి వెళ్లిపోయాను. ధ్యానం ఆరంభమైంది. నేనుగా ధ్యానం చేయడంలేదు. ధ్యానమే నన్నావహించింది. ప్రతి అంగంలో ధ్యానం జరుగుతూ ఉంది. శరీరమంతటా రక్తకణాలు వడివడిగా తిరుగుతున్నాయి. వాయువు అతివేగంగా నాడుల్లో ప్రవహిస్తూ ఉంది. కూర్చుంటూ ఉండగానే ఒక ఎర్రటి జ్యోతి అతివేగంగా నాముందుకు వచ్చింది. కాని అది, నాలోపలే నివసిస్తున్నట్లు తోచింది. కింది నుంచి పైవరకు, ఆ రెండడుగల జ్యోతి యొక్క ప్రకాశం మిరుమిట్లు గొల్పుతూ నిండి పోయింది. నేను స్వయంగా దగ్ధమౌతున్నట్టు, స్పష్టంగా చూడ కలుగుతున్నాను. కాని, బయటినుంచి అగ్నియొక్క ఉష్ణం తగలడం లేదు. అగ్ని మండుతున్నపుడు వినిపించే చర-చర, పట-పట శబ్దాలు అతి త్వరగా వెలువడుతున్నాయి. జ్యోతిని తదేక ధ్యానంలో చూడడంలో తన్మయుడి నయాను, కాని లోపల జరుగుతున్న వాటిని పరిశీలించ

కలుగుతున్నాను కూడా. కొంతసేపటికి అగ్ని జ్యోతి యొక్క రక్తజ్వాల మూలంగా లోపల వేడి ఎక్కువైంది. మరల మహాగురు పూజ ప్రారంభమైంది. తర్వాత ధ్యానం భంగమై ధ్యానం వల్ల కలిగిన తన్మయత్వం తగ్గింది. మరల బయటికి వచ్చి నా మిత్రుడైన మామిడి చెట్టుకింద ఉయ్యాలలో కూర్చున్నాను. కూర్చుని : ''ఇదంతా నిజంగా చూచానా నేను? ఏ విధంగా జరిగింది ఇదంతా? ఏమేమి చూచాను?'' అనుకుంటూ జరిగినది మననం చేసుకుంటున్నాను. అంతరంగంలో కలిగే భావాలను మననం చేసుకుంటున్నాను. వాటిగురించి ఆలోచిస్తున్నాను. ధ్యాన కాలంలో జరిగిన క్రియలను, కనిపించిన దృశ్యాలను జ్ఞాపకం చేసుకుంటున్నాను. ఎవరితోనూ ఎక్కువ కలిసేవాడిని కాదు. ఎవరినీ తాకే వాడిని కాదు. ఎవరితోనూ కూర్చునేవాడిని కాదు. ఒంటరిగా కూర్చునే వాడిని. మరల అవే ఆలోచనలు, శరీరమంతా నొప్పి. అనేక రకాల ఆలోచనలు, అనంతమైన కోరికలు పుట్టడం, భ్రమ కలుగడం, ఈ విధంగా రోజంతా గడిచిపోయేది.

బాబూరావు ప్రతిదినం ఉదయమే వచ్చి, రాత్రికి తిరిగి వెళ్లి పోయేవాడు. అక్కడికి వచ్చే వారందరికీ ఒక కొత్త నియమం పెట్టాను: ''ఉదయం ఎవరూ రాకూడదు. సాయంకాలం మాత్రమే దర్శనానికి రావచ్చు. వచ్చి, వారుకూడా వెంటనే వెళ్లి పోవలె.'' ఈ నియమాన్ని ఒక అట్టమీద వ్రాసి, కుటీరం వెలుపల కట్టించాను. నా స్వభావము నా నియమాలు యేవ్‌లా వాసులందరికీ బాగాతెలుసు. అందరూ ఎంతో ప్రేమతో ఆదరంతో ఈ నియమాన్ని పాటించసాగారు. యేవ్‌లాలోను, ఆచుట్టు ప్రక్కలా నివసించే వారందరికీ నా పట్ల చాలా ప్రేమ. నేను యేవ్‌లాలోనే పెరిగి పెద్దవాడినయాను. మరాఠీ భాషను యేవ్‌లాలోనే నేర్చుకున్నాను. ఇప్పుడు నా పునర్జన్మ యేవ్‌లాకు సమీపంలోని సూకీలో ఉన్న నా సాధనా కుటీరంలో సంభవించింది. యేవ్‌లా నివాసులైన భక్తులందరూ ప్రతిరోజు సాయంకాలం దర్శనానికి వచ్చేవారు. వారితో బాటు పలురకాలైన నైవేద్యాలు తెచ్చేవారు. సాయంకాలం దాన్ని అందరికీ ప్రసాదంగా పంచి పెట్టేవాడిని. యేవ్‌లాలోని చిన్న పెద్ద అందరికీ నేను ప్రియమైన బాబాను. సాయంత్రం అందరూ వెళ్లి పోయిన తర్వాత ధూపం వెలిగించి గురుదేవుడి ధ్యానం, మహాపూజ చేసేవాడిని. ఆవు పాలు కొంచెం త్రాగేవాడిని. నాకు ఇష్టమైన ఆవు ఒకటి నాతో ఉండేది. ఆ ఆవు పాలు త్రాగేవాడిని.

ధ్యానంలో అనేకరకాల భావాలు కలిగేవి. ఒక్కొక్కసారి ఎర్రటి జ్యోతి ప్రకాశిస్తూ

కనిపించేది, దాన్ని చూస్తూ తన్మయత్వం చెందేవాడిని. అప్పుడప్పుడు ఒంటి భావం, పక్షుల భావం కలిగేది. ఒకప్పుడు ఆనందం, మరొకప్పుడు విచారం, బాధ, చెడు ఆలోచనలు – మళ్ళీ గురుపూజ, ఆ విధంగా ధ్యానం పూర్తయేది. బయటికి పోయి మామిడి చెట్టు కింద కూర్చుని ధ్యానంలో కలిగిన అనుభవాలను మననం చేసుకునే వాడిని. మరల మనసులో మలినమైన ఆలోచనలు అనేకం కలిగేవి. ఇప్పుడు, జనం, నా దర్శనం చేసుకోవడం గాని, నా పాదాలను తాకడంగాని నిషేధించాను. దానికి కారణం: ''నా మనస్సు మలినంగా ఉంది. హృదయంలో చెడు ఆలోచనలున్నాయి. అంతఃకరణం మురికిగా ఉంది. నేను మూర్ఖుడిని. నన్ను మాయ కప్పేసి ఉంది. ఇతరుల చేత పూజ చేయించుకుని ఆ పాపాన్ని కూడా నేను మూట కట్టుకోవడ మెందుకు'' అని భావించి, ఎవరూ నా పాదాలను తాకరాదని నివారించాను. మనసులో నాకు ఈ విధంగా తోచేది: ''అరె! నువ్వు సంపూర్ణంగా పరిశుద్ధం కాలేదు. బాబారూపం దాల్చి, ఇతరులను ఎందుకు మభ్య పెడతావు?'' ఈ భావాన్ని ఇతరులకెప్పుడైనా తెలియ చేసినట్టయితే వారు అంగీకరించేవారు కాదు. నేనేదో దాచుకుంటున్నా నన్న భావం వారికి కలిగింది. భగవాన్ నిత్యానందుడి దగ్గరనుంచి నాకేదో లభించిందనీ దాన్ని నేను రహస్యంగా దాచుకోదలచాననీ ప్రజల్లో ఒక అభిప్రాయమేర్పడింది. అందువల్ల, వచ్చే వారి సంఖ్య ప్రతిరోజు ఎక్కువ కాసాగింది. ప్రతిరోజు ఏకాంతంగా నియమానుసారం ధ్యానం చేసేవాడిని. అనేక రకాల అనుభూతులు కలిగేవి. ఒక్కొక్కసారి సంతోషం, ఒక్కొక్కసారి దుఃఖంతో నా యాత్ర ముందుకు సాగింది.

మెల్లగా బయటివారిని కలుసుకోవడం తగ్గించాను. కారణం, ఎవ్వరైనా వచ్చినపుడు వారితో సంభాషణ, అనవసరమైన మాటలతో ధ్యానం బాగా జరిగేది కాదు. మనసులో దుఃఖం కలిగేది. ధ్యానంలో ఇబ్బంది లేర్పడేవి. దృశ్యాలు కనిపించేవి కాదు. జ్యోతి కూడా దర్శనమిచ్చేది కాదు. మనస్సు బాధ పడేది. అంతే కాదు. నా పవిత్రత నశిస్తుండేది. సాధనలో కలుగవలసిన అనుభూతులు సమయానికి కలగడం లేదు.

మొదటి రోజు చూచిన ప్రళయం వంటి అనేక దృశ్యాల గురించి, జ్యోతియొక్క దివ్యమైన ప్రకాశాన్ని గురించి, అప్పుడు నాకేమి తెలియదు. తర్వాత తెలిసింది, ఇవన్నీ 'శక్తిపాతం' యొక్క ప్రక్రియలని. **పరమగురువు యొక్క పూర్ణానుగ్రహము లేదా సిద్ధకృప లేదా శాంభవీ కటాక్షానికి, శక్తిపాతము అని పేరు.** అనుభవ

జ్ఞులు దీనిని కుండలిని జాగృతం కావడం అంటారు. మామిడి చెట్టుకింద కూర్చున్నప్పుడు కలిగిన అనుభవాలు, శ్రీగురు కృప వల్ల కలిగినవే. అవి గురుదేవుడు నిత్యానందుడి ప్రసాదమే. ఈ అనుభూతులు భగవాన్ నిత్యానంద కృపవల్ల జరుగుతున్నవేనని, ఆరోజు పాదుకలతో సహా శాలువతో సహా మంత్ర రహస్యాన్ని తెలియచేసి కృపారూపంలో అనుగ్రహించిన ప్రసాద ఫలితమే ఈ అనుభూతులు అని, ఆరోజు నాకు తెలిసి ఉన్నట్టయితే, ఆ క్రియలను నేను అమృతప్రాయంగా అనుభవించి ఉండేవాడిని. ఆ తర్వాత ఎప్పుడో నాగద్‌కి వెళ్లినపుడు, అక్కడ ఒక పుస్తకంలో దీనిగురించి కొంత చదివాను. అప్పుడు తెలిసింది ఈ అనుభూతులన్నీ నిత్యానందుడి కృపాఫలమేనని.

మన ప్రాచీన ఋషులు మునులు ఇటువంటి అనుభవాలను, తమ కావ్యాల్లో, సులభంగాఅర్థంకాని భాషలో వర్ణించి ఉన్నారు. జ్ఞానేశ్వర మహారాజ్, సంత్ తుకారామ్, జనార్దనస్వామి, వంటి మహానుభావులు, వీటి గురించి తమ గ్రంథాల్లో వర్ణించి ఉన్నారు. సిద్ధజ్ఞానులు ఋషులు మునుల ప్రవచనాలు మానవులకు సత్యాన్ని పరమాత్మను చూపించే మార్గాలు. పరమాత్మ గురించీ జీవాత్మ గురించీ పూర్తిగా విచారణ చేసి సాధన ద్వారా తెలుసుకున్న సత్యాన్నే వ్రాశారు. సాధకుల అర్హతకు తగిన విధంగా కొంతమందికి సత్యం అనుభవంలోకి వస్తుంది. కొంత మందికి రాదు. సిద్ధయోగ పూజారుల అనుభవాలు అనంతాలు. ఈ అనుభవాలను మామూలుగా ఎవరూ చెప్పుకోరు. పుస్తకాల్లో అంతకన్నా లభించవు. ఎక్కడైనాలభించినా సులభంగాఅర్థంకాని భాషలో ఉంటాయి. వాటిని వివరించి చెప్పేందుకు సాధనలో సిద్ధిపొందిన సాధకులు లభించరు. ఈ కారణంచేత సాధకులు సాధన సమయంలో సంభవించే చిత్రవిచిత్రమైన క్రియలను అర్థం చేసుకొనలేరు. మనస్సు భయ భీతమౌతుంది. సాధన ఆగిపోతుంది. చాలామంది సాధకులు నాతో అన్నారు. ''బాబాజీ, సాధనకు కూర్చున్న వెంటనే పాము కాటు వేసేందుకు వస్తుంది. నేను భయ పడిపోతాను''. ''బాబాజీ, నేను సాధనకు కూర్చోగానే ఒకనగ్నస్త్రీ దర్శన మిస్తుంది. నేను భయపడిపోతాను.'' ''బాబాజీ, సాధన చేసే సమయంలో నా మనస్సులో చెడు ఆలోచనలు కలుగుతాయి.'' ఇటువంటి అనేక ఇబ్బందులు సాధకులకు కలుగుతాయి.

సాధన సమయంలో, సిద్ధయోగేశ్వర ప్రేరితమైన పారమేశ్వరి శక్తి యొక్క

అనుగ్రహమూ-అనుకంపా వల్ల అనంతమైన క్రియలు సంభవించి సాధకుడు అప్పుడప్పుడు భయకంపితుడవుతాడు. సాధకుడు బెదిరి, సాధనను విడిచిపెట్ట వచ్చు కూడా. సాధన మార్గం గురించి పూర్తిగా తెలియకపోవడమే దీనికి కారణం. అజ్ఞానం చేత సాధనను విడిచిపెట్టిన సాధకుడు ఇతరులను కూడా భయపెడతాడు. ''ఈ మార్గం మంచిది కాదు. దీనివల్ల నీ బుద్ధి చెడిపోతుంది. నీకు పిచ్చి పడు తుంది.'' ఈ విధంగా చెప్పడం ప్రారంభిస్తాడు.

ఒక ఉదాహరణ చెబుతాను. పోయిన సంవత్సరం జరిగిన సంగతి. నాదగ్గర బాగా సాధన చేస్తున్న ఒక సిద్ధవిద్యార్థికి యౌగిక క్రియలు జరుగుతూండగా, ఒక సన్యాసి మహాశయుడు చూచాడు. తాను పూర్ణుడననీ అన్ని సాధనలను పూర్తి చేసిన వాడిననీ ఆయనకు గొప్ప నమ్మకం. ఆ సన్యాసి, సిద్ధవిద్యార్థి వెంట పడ్డాడు. అతడిని ఒక ఏకాంత స్థలానికి తీసుకువెళ్లి ఈ విధంగా బోధించాడు: ''చూడు! నువ్వు చాలా గొప్ప పొరపాటు చేస్తున్నావు. ఇది యోగంకాదు, తమ్ముడూ! నిన్ను హెచ్చరిస్తున్నాను. సంపూర్ణ సమాధిని సాధించినవాడిని కనుక చెబుతున్నాను. నువ్వు అనుసరిస్తున్న పద్ధతి వల్ల నీకు ఏమీ లభించదు. కొన్ని రోజుల్లో నీకు పిచ్చిపడుతుంది. లేనట్టయితే మరణిస్తావు.'' అని చెప్పడం చాలక, మరింత భయపెట్టడానికి ఈ విధంగా అన్నాడు: ''నీకు కొన్ని రోజుల్లోనే మృత్యువు ఆసన్నమౌతుంది. లేనట్టయితే, ఒకటి రెండు నెలల్లో పూర్తిగా పిచ్చివాడివై పోతావు.'' ఆ విద్యార్థి నాకు లేఖ వ్రాశాడు. ''బాబాజీ, ఇక్కడ ఒక సన్యాసి నాకు ఇటువంటివన్నీ చెప్పి భయపెడుతున్నాడు, ఈ మాటలు సిద్ధయోగం గురించి బాగా తెలిసిన శర్మబాబుకు చెప్పవద్దని కూడా చెబుతున్నాడు'' అని.

ఈ లేఖకు నేను కొన్ని నెలలపాటు సమాధానం రాయలేదు. తర్వాత, ''ప్రియమైన సిద్ధవిద్యార్థీ, నీ గడువు ఈ పాటికి పూర్తయి ఉంటుంది. రెండు నెలలే కాక నాలుగు నెలలైనది. నీ సాధన కూడా బాగా జరుగుతూ ఉన్నది. సాధన ప్రక్రియకూడా మారింది. ''మనస్సు ఆనందంతో నిండి పోతున్నది'' అన్న నీ అనుభూతి చాలా మంచిది. సాధనవల్ల కలిగే ఫలితాలను అనుభవిస్తూ సంతోషంగా ఉండు. ఇంకొక మాటకూడా గుర్తుంచుకో. ఆ సన్యాసి మళ్లీ కనిపించినట్టయితే ఆయన ఆరోగ్యాన్నీ మెదడునూ పరీక్ష చేయించుకోమని చెప్పు. డాక్టరిచ్చే రిపోర్టును నువ్వు జాగ్రత్తగా చూడు. ఆ సన్యాసికి ఈ విధంగా చెప్పు: ''ఓహో! సర్వజ్ఞులైన ఓ స్వామీ, భవిష్యవాణి పలికితిరిగదా, నేను రెండు నెలల్లో మరణిస్తాను లేదా నేనొక మెంటల్ కేస్ ఔతానని, ఆ

రెండింటిలో ఏదీ జరుగలేదు. మీరు ఇతరులను మోసపుచ్చుతున్నారు. విద్వత్తు లేకుండా, విద్య ఉన్నట్టు నటిస్తున్నారు. అధ్యయనమేదీ చేయకుండా సర్వజ్ఞులైనట్టు మాటలాడు తున్నారు. ఈ విధంగా మోసపుచ్చుతూ మీ అన్నపానాలకు పూర్తిగా ఇతరుల మీద ఆధారపడి ఉన్న మీకే నిజానికి పిచ్చి. మీ బుద్ధి పాడై పోయింది. మీకు శిష్యవర్గపు తెలివిలేని ప్రశంసలను వినాలనే పిచ్చి, ప్రవచనాలను బోధించవలె నన్నపిచ్చి పట్టుకుంది.'' మంచిది. ఇటువంటి సందర్భాలు వచ్చినట్టయితే మానవుడు సాధన భ్రష్టుడవుతాడు. అందువలన అనుభూతులతో కూడిన గ్రంథాలు, అనుభవజ్ఞుడైన గురువు అత్యంత అవసరం.

మూడు

# రక్తేశ్వరి

నా సాధన దినదిన ప్రవర్ధమానమౌతూ ఉంది. ధ్యానం ఎక్కువ కాగా, మిల మిల మెరిసే ఇదివరకటి ప్రకాశం అంతరించేది. నా ఆకారంలో ఉండే ఎరుపురంగు జ్యోతి వచ్చి నన్ను చుట్టుముట్టి నిలిచేది. ఈ జ్యోతిని చాలాకాలం చూచాను. దీనిలో లెఖ్ఖలేనన్ని చిన్నచిన్న కిరణాలు మెరిసేవి. చూస్తూ ఉండగానే ధ్యాన మగ్నుడి నౌతాను. ధ్యానంలో ఒక్కొక్కసారి శరీరం ఊగేది. ఒక్కొక్కసారి ఆడేది. ఒక్కొక్కసారి తటస్థంగా ఉండేది. క్రియలు సంభవించేవి. అనేక రకాల ఆసనాలు, నేనంతకు ముందు ఎప్పుడూ చేయనివి, సులభంగా జరిగేవి. అప్పుడప్పుడు కప్పగంతులు వేసేవాడిని. ఎవరో దేవత ఆడించినట్టు శరీరంలోని అవయవాలు ఆడేవి. ఇదంతా నిజం. శ్రీగురురూప మహాదేవుడు, చిత్‌శక్తి రూపంలో అంతరంగంలో వ్యాపించి ఆ శక్తితో నన్ను ఆవహించి ఉన్నాడు. మంచిది.

ఈ అనుభూతులకు ప్రమాణంగా, నా సాధనక్రమానికి అనురూపంగా, జ్ఞానేశ్వర్ మహారాజ్ వ్రాసిన ఒక అభంగాన్ని సాధకులకు సహాయంగా ఉండగలదని వ్రాస్తున్నాను.

**ఆకాశాచా శేండా కమళ నిరాళేం। త్యాసీ చార్ దళేంశోభతాతీ,1**
**ఔట్ హాత్ ఏక్ అంగుష్ఠ దూసరేం। పర్వార్ధ మసురేం ప్రమాణ హేం,2**
**రక్త శ్వేత శ్యామ నీలవర్ణ ఆహే। పీత కేశర హే మాజీం తేథేం, 3**
**తయాచా మకరంద్ స్వరూప తేం శుద్ధ। బ్రహ్మాదికా బోధ హాచీ ఝాలా. 4**
**జ్ఞానదేవ మ్హణే నివృత్తి ప్రసాదేం। నిజరూప గోవిందేం జనీం పాహతాం,5**

పూజ్యులు, ప్రాతః స్మరణీయులు, సర్వగురుజనుల పూర్ణాత్మ యోగీశ్వరుడు, జ్ఞానులకు చక్రవర్తి, ప్రేమికులకు సామ్రాట్టు అయిన జ్ఞానేశ్వరుడు తన ఈ అభంగంలో సిద్ధయోగానికి సంబంధించిన అన్ని విధులను, గురుకృపచేత ప్రాప్తించే స్థితిని, సాధన సమయ అనుభూతులలో కనిపించే సూక్ష్మాతి సూక్ష్మమైన దృశ్యాలను వర్ణించాడు.

దీనికి మించిన ప్రమాణం లేదు. పరమ సత్యం. పరమార్థ పథానికి మార్గదర్శక మంత్రం. సాధకులకు మార్గదర్శకమైన – 'గైడ్.'

అభంగానికి భావార్థం ఇది: ''ఆకాశాచా శేండా'' అనగా నఖశిఖ పర్యంతం శరీరరూపంలో ఉన్నది ఒక కమలం. ఈ కమలానికి నాలుగు దళాలున్నవి. ఈ నాలుగు దళాలు నాలుగు విధాలైనవి, నాలుగు రంగులవి, నాలుగు పరిమాణాలలో ఉన్నవి. ఒక్కొక్క దళానికి ఒక్కొక్క మహిమ ఉంది. **మొదటి దళం** మనం ప్రత్యక్షంగా చూస్తున్న ఈ స్థూల శరీరం. ఇది ఎఱుపురంగులో ఉంది. **రెండవ దళం** సూక్ష్మ శరీరం. దీని

**జీవాత్మ యొక్క నాలుగు శరీరాలు**

| శరీరం | స్థూలం | సూక్ష్మం | కారణం | మహాకారణం |
|---|---|---|---|---|
| ప్రమాణం | ఎనిమిది జానలు | అంగుష్ఠం | ఉంగరపు వ్రేలుచివర | పప్పుగింజ |
| రంగు | ఎఱుపు | తెలుపు | నలుపు | నీలం |
| స్థితి | జాగృతం | స్వప్నం | సుషుప్తి | తురీయం |
| పేరు | విశ్వ | తైజస | ప్రాజ్ఞ | తుర్య |
| స్థానం | నేత్రాలు | కంఠం | హృదయం | సహస్రారం |
| అక్షరం లేదా శబ్దం | 'అ' కారం | 'ఉ' కారం | 'మ' కారం | 'ఁ' అర్ధమాత్ర |

కొలత అంగుష్ఠమంత. రంగు తెలుపు. ఈ సూక్ష్మ శరీరంలోనే మనం నిద్రపోతాము, కలలు కంటాము. **మూడవదళం** కారణ శరీరం. దీని కొలత అనామిక వ్రేలి అగ్రభాగమంత. రంగు, నలుపు. **నాల్గవదళం** మహాకారణ శరీరం. ఇది నువ్వు గింజంత చిన్నది. నీలం రంగుది.

ఈనాల్గవ శరీరం అత్యంత మహత్తరమైనది. అత్యంత తేజోమయమైనది. సాధనకు మూలం. అంతరంగానికి ఇది అత్యున్నతమైన దృష్టాంతం.

శ్రీ గురువు యొక్క కృపాశక్తి సూక్ష్మరూపంలో శిష్యుడి శరీరంలోకి ప్రవేశించి గొప్పపనులను చేయిస్తుంది. గడ్డిలో పడిన అతిచిన్న అగ్ని కణం మహావేగంతో బ్రహ్మాండమైన అగ్నిగా పరిణమించే విధంగా, సిద్ధవిద్యార్థుల అంతరంగంలోకి ప్రవేశించిన చిత్‌శక్తి, వారిలో ఉన్న శక్తితో మిళితమై అనంతమైన పనులను చేయిస్తుంది. మొదటిపని రక్తదళానికి సంబంధించినది. దీని ప్రమాణం నఖశిఖ పర్యంతం, మూడున్నర మూరలు. సుఖదుఃఖాలను అనుభవించేది ఈ శరీరమే. పాప పుణ్యకర్మలు రెండింటినీ ఈ శరీరమే చేస్తుంది. ఈ శరీరమే జీవాత్మకు మోక్షాన్ని ప్రసాదించే సాధనం కూడా. జీవాత్మ, పంచజ్ఞానేంద్రియాలు – పంచకర్మేంద్రియాలు – పంచప్రాణాలు – అంతఃకరణం యొక్క నాలుగు వృత్తులు – వీటి ద్వారా స్థూలశరీరంలో స్థూలభోగాలను అనుభవిస్తూ, నేత్ర స్థానంలో ఉంటుంది. జాగ్రదవస్థను అనుభవించేది ఈ ఎఱుపురంగు ఎనిమిది జానల శరీరమే. ఈ శరీరం లేక పోయినట్టయితే జీవాత్మ ఉన్నప్పటికీ అది కనిపించదు. ఓం కారంలోని నాలుగు అక్షరాల్లో మొదటి అక్షరం 'అ'కారం. దీని అధిదేవత 'విశ్వ' అన్న పేరుగల ఈ ఎనిమిది జానల శరీరం.

శక్తి జాగృతమైన తర్వాత స్థూల శరీరాల్లో అనేకానేకక్రియలు జరుగుతాయి. ఇవి అర్థం లేనివి కావు. ఈ క్రియల వల్ల రోగాలు నశిస్తాయి. నాడులు శుభ్రపడుతాయి. ఈ క్రియలు, ఇతర మూడు శరీరాల్లో జరిగే క్రియలకు భిన్నమైనవి. మామూలుగా ఈ క్రియలు చాలాకాలం కొనసాగుతాయి. రక్తజ్యోతిని ధ్యానం చేసినపుడు ప్రతిదినమూ రకరకాల అనుభూతులు కలుగుతాయి. దీనివల్ల ఏకాగ్రత రోజురోజుకు ఎక్కువవుతుంటుంది. అదే సమయంలో నాడులు శుభ్రపడుతుంటాయి.

నాలుగు

# తంద్రాలోకం

ఇంతవరకు కూడా దివ్యమైన శక్తిపాతం లభించిందన్న సంగతి నాకు పూర్తిగా తెలియదు. రెండు రోజుల వరకు రక్తజ్యోతితోపాటు అనేక ఇతర జ్యోతులు కూడా దర్శన మిచ్చేవి. ధ్యానంలో స్పృహ ఉండేది. సంతోషం కూడా ఉండేది. జ్యోతుల దర్శనమవుతున్న సమయంలో నగ్నపురుషులు లేదా బాలకులు లేదా ఆవులు లేదా మేలుజాతి పోరాట గుఱ్ఱాల సమూహాలు కనిపించేవి. అప్పుడప్పుడు చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలలోని దేవాలయాలు, అక్కడి విగ్రహాలు కనిపించేవి. ఉదయం, సాయంత్రం, రెండు వేళలా నేను రెండు గంటలసేపు, అంతకన్న ఎక్కువ సేపు కూడా శ్రద్ధగా ధ్యానం చేసుకునేవాడిని. ఎంతో ప్రేమతో చేసుకునేవాడిని. అప్పుడప్పుడు ధ్యానసమయంలో సాత్వికమైన మత్తువంటిది కలిగేది. ఎంత పారవశ్యం! కాని ఆ మత్తును జీర్ణం చేసుకునే శక్తి అప్పుడు నాకు లేదు. మత్తులో తన్మయం చెంది నిద్రపోయేవాడిని. కూర్చుని ఉంటూనే నేను తంద్రాలోకం లోకి పోయేవాడిని. నిద్రపట్టినట్లు ఉన్నా, రోజూ నేను నిద్రపోయే స్థానం అదికాదు. రోజూ ప్రాతఃకాలం నేను నిద్రనుంచి లేచినప్పుడు ఇంత పారవశ్యంతో కూడిన అనుభూతులుండేవి కావు. దృష్టాంతాలుకూడా ఉండేవి కావు. అందువల్ల, నేను మామూలుగా పోతున్న నిద్రకాదు ఇది అని తెలిసింది. ధ్యాన - తంద్రావస్థలో పట్టే నిద్రలో ఏమైన దృష్టాంతాలు కనిపించేవి. అవి నిజంగా జరిగేవి. ఈ తంద్రావస్థలో నేనేదైనా ముందు జరుగబోయే సంఘటనను చూచినట్టయితే ఆవిధంగానే జరిగేది. ఎవ్వరైనా రాబోతున్నట్టు చూస్తే, అదే విధంగా వారు వచ్చేవారు. ఈ విధంగా ధ్యాన - తంద్రావస్థలో ఏదైనా మరొక లోకానికి వెళ్లి అక్కడ కొంతకాలం ఉండేవాడిని. పరమానందమయమైన అవస్థను మళ్లీ మళ్లీ అనుభవించేవాడిని. ధ్యానం సమాప్తమైన తర్వాత ఆరోజు ఎంతో ఆనంద దాయకంగా ప్రేమమయంగా, ఉల్లాసపూరితంగా ఉండేది. శరీర దౌర్బల్యాలన్నీ తొలిగిపోయేవి.

తంద్రాస్థానం, స్వప్నం - నిద్ర - ఈ రెండు స్థానాలకు భిన్నమైనది. ఈ స్థానం సర్వజ్ఞమైనది. ఈ అవస్థలో కనిపించేవన్నీ సత్యాలే. ఇటువంటి అనుభూతులు

కలుగడంతో, మన ప్రాచీన ఋషులూ మునులూ సర్వజ్ఞులూ, దివ్యదృష్టి కలిగిన వారన్న విశ్వాసం దృఢపడింది.

తంద్రావస్థ ముగియగానే మళ్లీ మామిడి చెట్టుకింద ఉయ్యాలలో కూర్చునే వాడిని. కూర్చుని, ఈ రోజు తంద్రాస్థితి ఏ విధంగా ప్రాప్తించినదీ నేను ఏలోకం దర్శించినదీ వీటి గురించి ఆలోచించే వాడిని. ఇటువంటి తంద్రాస్థితి, శక్తి ప్రేరణ చేత యథేచ్ఛగా తనకు తానుగా కలిగేది.

ప్రతిరోజు ధ్యానం ఈ విధంగా నడిచేది. అప్పుడప్పుడు శరీరం, పాములా మెలికలు తిరిగేది. లోపలినుంచి బుసకొట్టిన శబ్దం కూడా వినిపించేది. నా సాధనా కుటీరానికి సమీపంలో మేలురకం జాతికి చెందిన సర్పమొకటి నివసించేది. వయసుమళ్లినది. ఎంతో తెలివైనది. రోజూ కాకపోయినా వారంలో ఒకటి రెండుసార్లు కనిపించేది. చాలాకాలంగా అక్కడ నివసిస్తున్నది. అది శ్వేత, అనగా తెల్లజాతి నాగం. ఇతరులక్కూడా అప్పుడప్పుడు కనిపించేది. నాకు ఆ పాముతో స్నేహితమేర్పడింది. యోగ సాధన జరిగే చోట యోగీశ్వరుడి విభూతి ఏదైనా ఒకటి ప్రత్యక్షంగా ఉంటుందని, నేను విని ఉన్నాను. పరమ శివుడైన యోగీశ్వరుడి ప్రత్యక్షమైన విభూతుల్లో నాగు ఒకటి. పాము దర్శనమైన రోజున నా ధ్యానం అత్యంత ఆనందదాయకంగా ఉండేది. నేను ఆ నాగనాథుడిని ''బాబా నాగేశ్వర్'' అని పిలిచేవాడిని. నాగులకు అంతః కరణముంటుంది. మంచివారిపట్ల వాటికి ఆదరాభిమానాలుంటాయి. నా అదృష్టం ఎప్పుడూ బాగానే ఉండేది. సుకీలోకూడా, నా సాధనకు అనుకూలంగా సేవాభావం ఉన్న చాలా మంది నాకు సహాయం చేసేవారు.

ఆ తర్వాత నేను భోజనం తగ్గించాలని నిర్ణయించుకున్నాను. ఆహారాన్ని మార్చాను. కొద్దిగా అన్నం, ఒకటి రెండు మామూలు కూరలు తీసుకోవడం మొదలు పెట్టాను. రాత్రిపూట పాలు త్రాగి ఊరుకునే వాడిని. ధ్యానం చేయగా చేయగా లోపలినుంచి సద్భావాలతో పాటు చెడు భావాలు కూడా స్ఫురించేవి. అనవసరంగా కోపం, మోహం, కాఠిన్యం, ఎందుకో కలిగేవి. పది సంవత్సరాల క్రితం ఎవరో ఒక మనిషి నా పట్ల ద్వేషభావంతో వ్యవహరించిన సంగతి ఇప్పుడు జ్ఞాపకం వచ్చి, ఆ మనిషిపట్ల ఎంతో కోపం వచ్చేది. కొంతసేపటికి కోపం పోయి పశ్చాత్తాపం కలిగేది. సిగ్గుకూడా కలిగేది.

రక్తవర్ణ జ్యోతి దర్శనం తర్వాత కలిగేధ్యానం, స్థూల శరీరానికి సంబంధించినది. రక్తవర్ణజ్యోతి తరచు దర్శనం కావడం. దానితో ధ్యానం కూడా ఎక్కువ కావడం ప్రారంభమైంది. ఈ స్థితిలో శరీరం కొంత క్షీణించడం జరుగుతుంది. బరువు తగ్గింది.

మందులతో అవసరం లేకుండా పొట్ట తగ్గడం ప్రారంభమైంది. రెండు చేతుల్లోని నాడుల్లో ఏదో సంచరిస్తున్నట్టు అప్పుడప్పుడు అనిపించేది. వీపు అడుగు భాగంలోని నాడుల్లో వాయువు అతి వేగంగా సంచరించేది. లోపలి ఈ క్రియలకు ఎవరు కారణమో? అప్పుడప్పుడు నా కంఠం అతివేగంగా కదిలేది. 'చటపట' శబ్దం కూడా వినిపించేది. ఇది వాయు ప్రకోపం కాదు గదా అన్నభయం కలిగేది! ఇటువంటి ఆశ్చర్యకరమైన క్రియలు అనేకం కలిగేవి. మెడ అతివేగంగా తిరుగుతూ తిరుగుతూ వెనుకవైపుకు కూడా తిరిగేది. అప్పుడు వీపు కనిపించేది! వేగం తగ్గిన తర్వాత శాంతపడేవాడిని, కాని ఈ క్రియల గురించిన జ్ఞానం లేక పోవడం చేత, భయం ఎప్పుడూ ఉండేది. వీటి గురించి ఆలోచిస్తూ ఉండేవాడిని. కొన్నిరోజుల తర్వాత తెలిసింది, కుండలిని మహాదేవి మేరుదండం మధ్యనుంచి శిరస్సులోని సహస్రారానికి వెళ్లే ప్రక్రియ ఇది అని. ఇది ఒక హఠయోగ క్రియ. మెడ తిరుగుతూ తిరుగుతూ నా గడ్డం, కింద ఉన్న కంఠకూపంలో తగుల్కొని నిలిచి పోయేది. ఇది ఒక దివ్యమైన హఠయోగక్రియ. దీనికి 'జాలంధర బంధమ'ని పేరు. పై భాగంలో జాలంధర బంధం జరిగిన వెంటనే, క్రింది భాగంలో మరొక క్రియ జరిగేది; గుదం తనంతట తానుగా మూసుకునేది తెలుచుకునేది.

ధ్యానసమయంలో శరీరంలోని నాడీ మండలమంతా కనిపించేది. నాడుల్లో ప్రాణగమనం అతి స్పష్టంగా కనిపించేది.

ఆహార విహారాదులు నియమ బద్ధంగా లేకపోవడం చేత ప్రాణం, నాడుల మధ్యలో నిలిచి పోతుంది. రోగాలకు వృద్ధాప్యానికీ కూడా ఇదే కారణం. సిద్ధయోగ క్రియల అనుభవం ద్వారా నేనీ సంగతిని తెలుసుకున్నాను. ప్రియతరమైన కుండలిని శ్రీ గురుదేవుడి ఆత్మరూపమైన కుండలిని, అనంతరూపాలను ధరించి, నా శరీరంలో వ్యాపించి స్థూలక్రియలను చేస్తూ ఉండేది. అప్పుడప్పుడు పద్మాసనంలో కూర్చుని శిరస్సును భూమి మీద ఉంచి యోగ ముద్రలో చాలసేపు ఉండేవాడిని. ఈ క్రియలన్నీ వాటంతట అవే జరిగేవి. ఈ విధంగా యోగం గురించిన జ్ఞానం అంతరంగంలో ప్రేరణవల్ల కలుగుతుండేది. అప్పుడప్పుడు నా శిరస్సు పూర్తిగా వెనక్కు వాలి ఉంటుంది, కనులు ముక్కు పై భాగం మీద కేంద్రీకృతమై ఉండేవి. ఆ సమయంలో, కమ్మరి తిత్తిమోస్తరు నా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు బలంగా జరిగేవి. అప్పుడప్పుడు ఈక్రియలో లోపలి ప్రాణం పూర్తిగా బయటికి వచ్చేది. ఇది భస్త్రికా ప్రాణాయామమని ఆ తర్వాత తెలిసింది. భస్త్రిక ఒక ప్రాణాయామ క్రియ. దీనివల్ల ఉదరానికి సంబంధించిన అనేక రోగాలు నశిస్తాయి. ప్రాణం పూర్తిగా శుభ్రపడుతుంది.

ఐదు

# విషయవాంఛా విమోచనము

ప్రతిరోజు కొత్త కొత్తక్రియలు జరుగుతుండేవి. శరీరంలోని కొన్ని అంగాలలో వికృతమైన క్రియలు, ఇంద్రియ వికారాలు ప్రారంభమైనవి. జరుగకూడని ఇటువంటి వికారాలు ఎందుకు జరుగుతున్నవో అర్థం కాలేదు. నాకు ఎటువంటి విషయవాంఛ లేదు. భోగలాలస కూడా లేదు. ప్రపంచంలో అన్నిరకాల ప్రజల జీవితాలను చూచాను. మహారాజులనుంచి సాధారణ మానవులవరకు, వారు ఏవిధంగా జీవించినదీ వారికి ఎటువంటి గతి ప్రాప్తించినదీ చూచాను. గణేశపురిలో నాగురుదేవుడి దగ్గరకు ప్రతి రోజు అనేక రకాల ప్రజలు, వ్యాపారులు – ధనవంతులు – గొప్పకళాకారులు – ప్రసిద్ధ సినిమా నటులు – గాయకులు – వక్తలు – పెద్ద అధికార్లు వచ్చేవారు. మహాపురుషులు అందరికీ కావలసిన వారేకదా? వీరందరూ ఏదో ఒక కొఱత గురించి మాట్లాడేవారు. వారి దగ్గర ఎన్ని ఉన్నా, ఒక వస్తువు మాత్రం కొఱత పడేది. అది శరీర ఆరోగ్యం, వారు ఈ విధంగా చెప్పేవారు : భగవాన్, నా దగ్గర అన్నీ ఉన్నాయి. కాని, 'హార్ట్' బాగలేదు. డాక్టర్లు నన్ను ప్రయాణం చేయరాదన్నారు. కడుపునిండా తిననివ్వరు. నా ఇంద్రియాలు బలహీనంగా ఉన్నాయి''. ''బాబాజీ, నాకడుపులో భరించరాని బాధ. అమెరికా వెళ్లాను. ఇంగ్లాండు వెళ్లాను. లక్షాలాది రూపాయలను ఖర్చు చేశాను. కాని వ్యాధి కుదరలేదు.'' ''భగవాన్! నాకు అన్నీ ఉన్నాయి, కాని, అన్నం జీర్ణం కాదు. రాత్రిపూట నిద్రపట్టదు, మందులకు చికిత్సకు రెండులక్షల రూపాయలను ఖర్చు చేశాను.'' ఇదీ వరస. కొందరికి చూపు సరిగా ఉండదు. మరికొందరికి చెవిలో నొప్పి. ఈ విధంగా అందరూ తమదుఃఖాలనూ బాధలనూ భగవాన్ నిత్యానందకు చెప్పుకునేవారు. అందరికీ ఏదో ఒక కొఱత. ఏదో ఒక దుఃఖం. ఏదో ఒక దారిద్ర్యం. శ్రీమంతుడికి అనారోగ్యం. ఆరోగ్యంగా ఉన్న వ్యక్తికి డబ్బుండదు. విద్యాహీనుడికి విద్య దారిద్ర్యం. కురూపికి రూప దారిద్ర్యం. ఒకరికి భర్తలేదు. మరొకరికి భార్య లేదు. ఇంకొకరికి సంతానం లేదు. ఈ విధంగా వచ్చేవారందరికి ఏదో ఒక దారిద్ర్యం. వచ్చి తమ రోదనను వినిపిస్తారు. వీరందరి కథలను ప్రశాంతంగా వినే వాడిని. వీరినుంచి

నేను ఏమి నేర్చుకోగలను అని ఆలోచించేవాడిని. నిజానికి నా స్థితికూడా అటువంటిదే కారణం: నేను, సాధన – ఆత్మ జ్ఞానం– సాక్షాత్కారం పొందలేని ఒక దరిద్రుడిని. నేను వారందరినీ పరిశీలనగా చూచేవాడిని. తేజోహీనులు, సమదృష్టిలేనివారు. రోగులు, సంపద ఉండీ సంతోషం లేని వారు – వారిలో బలపరాక్రమాలు కూడా లేవు. వారిలో కొత్త కొత్త రోగాలు ఎక్కువ కావడమే చూచాను. దీనికి ఒక కారణం అర్థమైంది. రేతస్సుక్షీణం, ఇంద్రియలోలత్వం, ముఖ్యంగా క్రమ శిక్షణ లేని జీవితం. ''నేను అదృష్టవంతుడిని, అన్ని భోగాలను అనుభవించడం నా హక్కు,'' అన్న భ్రాంతిలో ఉంటాడు మానవుడు. భోగాలు, మనలను భోగిస్తున్న సంగతి మానవుడికి తెలియదు. భోగాలు మనలను ఉపయోగించుకుని చివరకు, అనేక రకాల విచిత్రమైన రోగాలను సంక్రమింప చేస్తాయి. మానవులు ఈ విధంగా రోదించడం ఇప్పుడుకూడా జరుగుతూ ఉంది. ఇప్పుడుకూడా కొత్తకొత్త రోగాలకు గురవుతున్నవారు. నా దర్శనానికి వస్తుంటారు. ఆరోజుల్లో బాబాజీ దగ్గరకు వచ్చే భక్తుల్లో ఈ దుర్దశను చూచిన తర్వాత నాకు సాధన ఒక్కటే ఆశాకిరణంగా కనిపించింది.

నా పరిస్థితి అటువంటిదైనప్పటికీ, నాకీ వికారాలు ఎందుకు కలుగుతున్నట్టు? సూకీ కుటీరంలో ధ్యానం చేసుకునేవాడిని. ధ్యానంలో రక్తవర్ణపు జ్యోతి దర్శనమిస్తూనే ఉంది. సంతోషం కూడా కలుగుతూ ఉంది. అయినప్పటికీ అప్పుడప్పుడు ఒకక్రియ జరిగేది. దానికి నేను ఎంతో సిగ్గుపడేవాడిని. ఇటువంటి సిగ్గుపడవలసిన క్రియనాకు ఎందుకు కలుగుతూ ఉంది? దాని గురించి ప్రస్తావించడం కూడా నిషేధం. ఎవరితోనైనా చెప్పినట్టయితే, నన్ను బుద్ధిహీనుడనని అంటారు. సాధారణ గృహస్థుతో చెప్పినట్టయితే ''ఈ రోజుల్లో సన్యాసులు ఇటువంటి వారే, సోమరులుగా జీవిస్తారు. కాదామరి. దీని కన్న గృహస్థ జీవితం ఎంతో మేలు. అన్నిభోగాలను అనుభవిస్తూనే పరమార్థాన్ని కూడా పొందవచ్చు'' అంటారు.

నేనిప్పుడొక సిగ్గు పడవలసిన సంగతి చెబుతాను. నాకు ప్రియమైన మాతృ సమానులైన అమ్మలారా! ప్రియమైన శక్తి సంపన్నులైన తోబుట్టువు లారా! దయచేసి నేను చెప్పబోతున్న హేయమైన సంగతి విని, నామీద కోపం తెచ్చుకొనకండి. దీనికి గల కారణాన్నీ ప్రయోజనాన్నీ తెలుసుకుని నన్ను ఆశీర్వదించండి. ప్రియమైన పాఠకులారా, ఇతర సాధకులారా, మీరు కూడా ఈ సంగతిని వ్రాయవలసి వచ్చిన అవసరాన్ని అర్థం చేసుకొనండి.

ధ్యానంలో కూర్చుంటూ ఉండగానే, రక్త వర్ణపు దివ్యమైన జ్యోతి దర్శన మిచ్చేది. ఒకరకమైన భావావేశం కలిగేది. నేను ఊగి పోయేవాడిని. గంతులు వేసే వాడిని. గుండ్రంగా తిరిగేవాడిని. శ్రీ గురువుకు మహాపూజ చేసేవాడిని. అంతరంగంలో గురుధ్యానం, బాహిరంలో గురుధ్యానం చేయగా చేయగా 'గురు ఓం' 'గురు ఓం' జపిస్తూ శ్రీ గురుభావంలో సంతోషంతో తన్మయుడినైనపుడు, అనర్థ దాయకమైన ధ్యానం కలిగేది. దీని పేరు విషయ వాంఛా ధ్యానం. భోగలాలస గురించిన ధ్యానం. ఛీ! ఛీ! ఆ సమయంలో కూడా రక్త జ్యోతి కనిపిస్తూనే ఉంది. రంగులో మాత్రం కొంత పరివర్తన వచ్చింది. ప్రాతః కాలంలో తూర్పు దిక్కున కనిపించే అత్యంత మృదువైన ఎఱ్ఱటి ప్రకాశం, మెరుస్తూ, ఎనిమిది జానల పొడవున కనిపించేది. వెంటనే, ధ్యానం వల్ల లభించేప్రేమ తన్మయత్వం తొలగిపోయేవి. నిత్యానంద భావం నశించేది. గురుమహాపూజ కూడా కొనసాగేది కాదు. 'గురు ఓం' 'గురు ఓం' మంత్రం కూడా ఉండేదికాదు. కామవాంఛ పూర్తిగా తల ఎత్తేది. ఇది ఇంతకాలం ఎక్కడ దాగి ఉన్నదీ తెలియదు! ఈ వాంఛకూడా ఎంతో బలవత్తరంగా ఉండేది. నాకే ఆశ్చర్యం కలిగేది. కేవలం ఒక మాంసపు ముద్దలో ఇంత బలం ఎక్కడినుంచి వచ్చింది. అని. ఇంద్రియం అత్యంత వికలమయేది. అయ్యో! అయ్యో! మొదటి రోజున కలిగిన ప్రళయానుభవం కన్నా ఇది అధ్వాన్నమైన పరిస్థితి. ఇంద్రియ ప్రవృత్తి బహిర్ముఖమైంది. కామం... కామం.. కామం... ఇదొక్కటే భావం. కాని నా ఆసనం మాత్రం స్థిరంగా ఉండేది. విడిపడేది కాదు. ఆ విధంగానే దృఢంగా ఉండేది. సర్వాంగాలలో కామవాంఛే స్ఫురిస్తూ ఉండేది. ఇంద్రియంలో విపరీతమైన బాధ. వర్ణించడం కష్టం. మనస్సుకు ఎంత చెప్పినా అర్థం చేసుకొనడం లేదు. కనులు మూసుకున్నట్టయితే ఎదుట ఒక నగ్నసుందరి నిలుచున్నట్టు కనిపించేది. ధ్యానంలో ఎఱ్ఱటి జ్యోతి లోపల, అతి అందమైన బాలిక కనిపించేది. నేను చూడకపోయినా కనిపించేది. భయపడిపోయే వాడిని. దుఃఖం కలిగేది. పశ్చాత్తాప పడేవాడిని. కనులను తెఱిచిన తర్వాత కూడా అప్పుడప్పుడు ధ్యానంలో కనిపించిన రక్తేశ్వరి జ్యోతి కనిపించేది. కాని ఈ జ్యోతిలో కూడా జగదంబ వస్త్రహీనయై నిల్చున్నట్టు అగుపడేది. కనులు మూసుకున్నా కనులు తెఱుచుకున్నా అదే దృశ్యం. ఇప్పుడు నేనేం చేయను? లజ్జాకరమైన ఈ పరిస్థితి గురించి ఎవరికి చెప్పుకోను? ఇది దౌర్జన్యం. నా కేమీ తోచకుండా ఉంది. ఒక ఇంద్రియానికి ఇంతటి బలవత్తరమైన వికారమా! దీని గురించి భగవాన్ నిత్యానందకు మాత్రమే తెలిసి ఉంటుంది; లేదా ఈ అవస్థను అనుభవించిన సాధకుడెవరైనా

ఉన్నట్టయితే అటువంటివారికి తెలిసి ఉంటుంది. మంచిది. దీనితో నా ధ్యానం ఆగిపోయేది. మనస్సు అంతా దుఃఖంతో నిండిపోయేది. ధ్యానంలో కలిగిన కామ వాంఛ జ్ఞప్తికి వచ్చేది. భయం పుట్టేది. మనస్సులో భయం, లజ్జ, అసంతృప్తి కలిగేవి. దీనితో బుద్ధికూడా మార్పు చెందడం ప్రారంభమైంది. ''మృత్యువు రానప్పటికీ నేను ఆత్మహత్య చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడ వచ్చు. నాలో జరుగుతున్న ఈ అనర్థం, నేను చేసిన ఏ మహాపాపానికో ఫలితం'' ఈ విధంగా ఆలోచిస్తూ నా దిగులు ఎక్కువైంది.

కుటీరం బయటికి వస్తాను. ఉయ్యాలలో కూర్చుంటాను. మళ్లీ అదే ఆలోచన. నా దుఃఖాన్ని ఎక్కువ చేసే ఆలోచన. ''నావల్ల ఏమీ తప్పు జరిగింది. ఏమి పొరపాటు జరిగింది. అయ్యో! ఇప్పుడేమి చేయను'' ఈ విధంగా ఆలోచిస్తూ మధ్యాహ్న మవుతుంది. మళ్లీ కొంతసేపు ధ్యానం. ధ్యానంలో మళ్లీ నగ్నస్త్రీ ప్రత్యక్షం. నవ్వుతుంది. మందహాసం చేస్తుంది. కూర్చుంటుంది. లేచినిల్చుంటుంది. ఈ దృశ్యాన్ని చూచి చూచి అలసి పోయాను. ఇంద్రియాలను శాంతపరచి సాత్వికం చేసే దృశ్యం, హృద యంలో ప్రేమరసాన్ని ప్రవహింపచేసే దృశ్యం, పరమానందాన్ని ఆస్వాదింపచేసే దృశ్యం ఇప్పుడు లుప్తమైంది. దానికి వ్యతిరేకంగా ఉంది పరిస్థితి. ఇప్పుడు ఇంద్రియం వికలమై ఉత్తేజకరమై బలంగా తయారైంది. సిగ్గు పడవలసిన విషయాలు మరికొన్ని కూడా జరిగేవి. అప్పుడు వెంటనే లేచే వాడిని.

రాత్రి ధ్యానంలో కూడా మళ్లీ ఇదే జరిగేది. మొదట ధ్యానం కుదిరేది. తర్వాత రక్తేశ్వరి జ్యోతి... ఉల్లసితమైన మనస్సు... ఆహ్లాదితమైన హృదయం... ఎంతో భక్తి శ్రద్ధలతో గురుమహాపూజ...గురుభావంలో ఐక్యమైన భావ సమాధి. ఆ విధంగా జరుగుతూండగా తృటిలో జ్యోతిలో పరివర్తన వచ్చేది. మళ్లీ నన్ను వెంటాడే ఆ నగ్న స్త్రీ! నా ఎదుట కొంతదూరంలో ఆమె నాట్యం చేసేది. హావ భావాలను చూపేది. గిర్రున తిరుగుతుంది. దుముకుతుంది.కన్నులు తెఱచి నట్టయితే ఆమె ప్రత్యక్ష మౌతుంది. ఇంద్రియాలు పట్టుతప్పుతున్నట్టు అనిపించేది. ఏదో అనర్థం సంభ విస్తుందని భయం పుట్టేది. శరీరాన్ని కొంత బలహీనంగా ఉంచాలని పాలు త్రాగే వాడిని కాదు. మంచి నీళ్లు త్రాగే వాడిని. మనస్సు దుఃఖించడం చేత రాత్రి బాగా పొద్దుపోయే వరకు నిద్ర పట్టేది కాదు. మనస్సులోనే నిత్యానందుడిని ధ్యానం చేసుకునే వాడిని. గణేశపురిని జ్ఞాపకం చేసుకునేవాడిని. నమస్కారం పెట్టి నిద్రపోయేవాడిని. తెల్లవారు ఝూమున త్వరగా లేచేవాడిని. మూడు గంటలకు లేచి స్నానం చేయడం, అప్పుడప్పుడు కాళ్లూచేతులు మాత్రం కడుక్కునే వాడిని. ఒళ్లంతా మంత్రించిన విభూతి పూసుకుని



స్వామి ముక్తానంద: సూకీలో మామిడి చెట్టు క్రింద ఉయ్యాలలో



జిప్రు అణ్ణా

ధ్యానానికి కూర్చునే వాడిని. వెంటనే ధ్యానంలోకి పోయేవాడిని. 'ఎనిమిది జానల' రక్తజ్యోతి వెంటనే దర్శనమిచ్చేది. శ్రీ గురువుకు సంపూర్ణమైన మహాపూజ జరిగేది. కొంత సేపటిలోనే భావ సమాధి కలుగుతుండగా క్షణంలో కామస్మరణ. నగ్నభవాని నన్ను వెంటాడుతూ నా ఎదుట నిల్చుంటుంది. నన్ను విపరీతంగా వేధించ సాగింది. ఒకే ఒక కోరిక ఆమెకు! ఇంకే విషయమై కూడా ఆమె నన్ను వేధించలేదు. నేను చేపట్టిన, గొప్పదైన, పవిత్రమైన వ్రతనియమం మీద ఆమె దృష్టి కేంద్రీకృతమై ఉంది. ఈ విచిత్రమైన స్త్రీ, పిలువకుండానే ఎక్కడ నుంచి వస్తున్నదో తెలియడం లేదు.

ప్రతి ఒక్కరి వెంట ఒకస్త్రీ ఉంటుంది. ఏదో ఒక నెపంతో వేధిస్తూ ఉంటుంది. ఒకరు అన్నానికి వేధిస్తే, మరొకరు వస్త్రాలకు, ఒకరు సువర్ణాభరణాలకు వేధిస్తే, మరొకరు భర్తను అతడి బంధువులనుంచి దూరం చేసేందుకు, ఇంకొకరు మిత్రులకు సజ్జనులకు దూరంగా ఉంచేందుకు ప్రయత్నిస్తారు. కటువైన పలుకులతో హృదయాన్ని గాయపరచి, పతిని ప్రేతంగా మారుస్తారు, కొందరు. ''నీ చేయి పట్టుకున్న వేళా విశేషం. నాకీదుర్దశ పట్టింది. నా తండ్రి నన్ను ఎంతో ప్రేమతో పెంచి పెద్దచేశాడు. పాలలో స్నానం చేశాను. నెయ్యి త్రాగేదానిని, రోజూ విమానంలో ప్రయాణం చేసేదానిని. నువ్వొక దరిద్రుడివి నాపాలబడ్డావు. నీ చేయి పట్టుకున్నప్పటి నుంచీ నాకు దుఃఖమే'' ఈ విధంగా పలికి పలికి పతి దేవుడిని పిచ్చివాడినిగా చేసి వేస్తుంది, ఒక మహా ఇల్లాలు. ఇటువంటి స్త్రీలలో స్త్రీత్వమే ఉండదు. మంచిది.

ఈ జగదంబను నేను ఆహ్వానించలేదు, అయినా హాజరువుతుంది. నేను ఆమెను సన్మానించలేదు, ఆమె నన్నేమీ అడగదు. నా ధ్యానాన్ని మాత్రం భంగం చేస్తుంది. ఇంద్రియవికారం కలుగ చేస్తుంది. నా వ్రతానికి భంగం కలుగచేసేందుకు అన్నివిధాలా ప్రయత్నం చేస్తుంది. ఏమి దశ ఇది! నా జీవితంలోనే ఇది అతి దుఃఖకరమైన సంగతి. ఇటువంటి కష్టం నాకెప్పుడూ కలగలేదు. కొంత సేపటిలోనే నా ధ్యానం భంగమయేది. వెలుపలికి వచ్చి, ప్రతిరోజూ కూర్చునే మంచం మీద కూర్చునేవాడిని. కూర్చుని ఈ విధంగా ఆలోచించేవాడిని. ''నేనేం చేయను? ఈ చిక్కునుంచి ఏ విధంగా బయటపడడం.'' దిగులు – విచారం – కొంత పిచ్చి, ఎక్కువ కావడం ప్రారంభమైంది. విచారంగా కూర్చునే వాడిని. ఇప్పుడు స్త్రీలను చూస్తే చాలా భయంగా ఉంది. ధైర్యం పోయింది. అదుపు తప్పి ప్రవర్తిస్తానేమో నన్న భయం ఏర్పడింది. ప్రాచీన కాలపు యోగభ్రష్టులు, పదభ్రష్టులు, కర్మనష్టులు అయిన సాధకుల వృత్తాంతాలు

పదే పదే గుర్తుకు వచ్చేవి. అజామిళుడు, సూరదాసు, తులసీదాసు కథలు కూడా గుర్తుకు వచ్చి రోదించేవాడిని. కామ దేవుడి శక్తి నన్ను భయభ్రాంతుడిని చేసింది. సిద్ధాసనంలో పరిపూర్ణతనూ ఇంద్రియ నిగ్రహాన్నీ సాధించానని భావించాను. కాని, మృత ప్రాయమై ఉండిన ఇంద్రియం విజృంభించింది. ఆశ్చర్యం! మహా ఆశ్చర్యం! పాతకథలు జ్ఞాపకం వస్తున్నాయి. పరాశరమహర్షి నావలో ఏంచేశాడు? అటువంటి అనేక సంఘటనలు గుర్తు చేసుకుంటూ మనస్సు క్షోభించింది. మధ్యాహ్నవేళ ధ్యానంలో కూడా ఇంద్రియవికారం ఎక్కువయేది. కుటీర స్థలం యజమాని భార్య, నాకు భోజనం వండిపెట్టేది. ఇప్పుడాయనతో, నాకెవరైనా పురుషుడి చేత మాత్రమే వంట చేయించవలసిందని చెప్పాను. ఇప్పుడు కొద్దిగా అన్నం మాత్రమే తింటున్నాను. కూరలు తినడం మానేశాను. సగం కడుపుకే తిని లేస్తున్నాను. మిగతా కడుపును నీటితో నింపుకుంటున్నాను.

ఒకరోజు బయటికి వచ్చి ఆలోచించాను: వీటన్నిటి నుంచి తప్పించుకునే మార్గమేదైనా ఉన్నదా? ఎవరు చెప్తారు? సిద్ధాసనం ద్వారా నిశ్చేష్టమైన ఇంద్రియం పునర్జీవితమైంది. ఇప్పుడు నా లక్ష్యాన్ని సఫలం చేయగల ఉపాయం ఏదైనా ఉన్నదా? ఈవిధంగా ఆలోచిస్తూ ఉండగా నా దుఃఖం, అసంతృప్తి, విచారం ఎక్కువయాయి. సాయంత్రమైంది. నేనున్న ప్రదేశానికి ఇరవైమైళ్ల దూరంలో ఉన్న వైజాపురంలో ''హరిగిరి'' అన్న బాబా ఒకరున్నారు. ఆయన గొప్ప సిద్ధ పురుషుడు. ఆయన్ను చూడాలనిపించింది. ఆయన రక్షించినట్టయితే నేను ఈ విపత్తునుంచి బయట పడతాను. లేనట్టయితే రేపు నాకు చాలా చెడ్డ దినం. అతి గోప్యంగా ఉంచవలసిన విషయమిది. ఎవరికీ చెప్పడానికి లేదు. అందువల్ల నాకు చాలా దుఃఖం వచ్చింది. ఏడ్చి ఏడ్చి, తల భారమైంది. చెవులు మూసుకు పోయాయి. రాత్రయింది. నేనేమీ తినలేదు, త్రాగలేదు. కొంతసేపటికి బాబూరావు వచ్చాడు. ఏదో చెప్పాడు. కాని నేను చెవిలో వేసుకోలేదు. నాతో నేను మాట్లాడుకుంటున్నాను: ''ఓ మనసా నిబ్బరంగా ఉండు'' అని.

రాత్రి ధ్యానం నియమానుసారం ప్రారంభించాను. ఉచ్చస్థాయి ధ్యానం. యోగుల భాగ్యమైన రక్త జ్యోతి దర్శనమిచ్చింది. జ్యోతి దర్శనమైన వెంటనే కుంకుమ పువ్వు రంగులో ఉన్న చిన్న చిన్న జ్యోతి కిరణాలు, మిల మిల మెరుస్తూ ఎదుటికి వచ్చాయి. ఆ తర్వాత శ్రీ గురుదేవుడికి మహాపూజ చేశాను. గురు భావంతో తన్మయత్వం పొందాను.

అనేక రకాల క్రియలూ భావాలూ కలుగుతూ లోపలినుంచి ఒక అలౌకికమైన శబ్దం వినిపించ సాగింది. ఆనందంతో పారవశ్యం చెందాను. ఈ విధంగా పారవశ్యం చెందుతూండగానే వస్త్రహీనస్త్రీ మరల దర్శనమైంది. కాని, ఇప్పుడామె అలంకృత. ఆమె దర్శనం అయిన వెంటనే కనులను తెరిచాను. కాని ఆమె,వెలుపల కూడా దర్శనమిచ్చింది. ఈ విధంగా జరుగగానే పారవశ్యం తొలగిపోయింది. ఆసనం చెదిరి పోయింది. మెల్లగా లేచాను. బయటికి వచ్చాను. మామిడి చెట్టు కింద కూర్చున్నాను. రాత్రి పన్నెండు గంటల వేళ లోపలికి వెళ్లి నిద్రపోయాను. నిద్ర పోతూ ఉన్నా, మామూలుగా నిద్రలో లభించే ప్రశాంతత లేదు. పిచ్చివాడి విధంగా భ్రాంతుడి విధంగా అశాంతి, నిద్ర రాలేదు. అటూ ఇటూ పొర్లుతూ మూడు గంటలైంది. కొంతసేపు కనులు మూతపడ్డాయి. వెంటనే లేచాను. స్నానం చేశాను. ధ్యానానికి కూర్చున్నాను. మనసు ఏమీ బాగలేదు. నాకు వ్యాధి ఏమీ లేదు. అయినా అశాంతి. పిచ్చిపట్టినట్టుంది. అన్ని దిక్కులకు నమస్కారం చేసి, అందరు దేవతలకు మనసులోనే మొక్కుకున్నాను. అందరికీ నమస్కారం పెట్టుకుని ధ్యానానికి కూర్చున్నాను. వెంటనే ధ్యానంలోకి వెళ్లిపోయాను. తంద్రాస్థితిలోకి వెళ్లాను. రక్తజ్యోతి, లోపల వెలుపలకూడా ప్రకాశించడం ప్రారంభించింది. క్రియలు జరుగుతున్నాయి. క్షణం సేపు కంఠం మూసుకుపోయింది. మూల బంధమూ జాలంధర బంధమూ ఏర్పడ్డాయి. కాని, వెంటనే విడిపడ్డాయి. అంతరంగంలో నుంచి అస్పష్టమైన ఒక ధ్వని వినిపించ సాగింది. చిత్తవృత్తి, అక్కడ, ఆ ధ్వనిలో స్థిరమైంది. ఇప్పుడిక అనందమే ఆనందం. ఎఱ్ఱటి జ్యోతితో పాటు, కోడిగుడ్డు ఆకారంలో, అహమదాబాదు పెద్దరేగుపండు కన్న పెద్దది, తెల్లటి జ్యోతి క్షణం కనిపించి అదృశ్యమైంది. ఇప్పుడు గురుధ్యానం, గురుపూజ ఈ రెండూ, కొత్త అనుభవాలతో పాటు, ఎంతో ప్రేమతో కొనసాగాయి. అందరు దేవతలకు మొక్కుకున్నాను కదా. దాని వల్లలనే ధ్యానం బాగా కుదిరిందని మనసులోనే అనుకున్నాను. క్షణంలో రక్తజ్యోతి మారిపోయింది. దాని రంగు కొంతమారింది. కాని ఎఱుపు రంగులోనే ఉంది. అరె! ఏమి జరుగుతున్నది? మళ్లీ ఆ స్త్రీ వచ్చింది. నేను కలవర పడ్డాను. ఇప్పుడు ఆ స్త్రీ ఎంతో శృంగారం చేసుకుని ఉంది. ఎంత అందంగా ఉంది! మనస్సు అశాంతమైంది. ఇంద్రియం అతివేగంగా వికలమైంది. కనులు తెఱుచుకున్నాయి. బయట కూడా కనిపిస్తూ ఉంది ఆమె. కనులు మూసు కున్నట్టయితే లోపల. నేను కట్టుకుని ఉన్న లంగోటి చినిగి పోయింది. ఉపస్థేంద్రియం త్రుటిలో నాభికి కొట్టుకుని అక్కడ కొంతసేపు ఉంది. నన్ను ఎవరు ఈ విధంగా

బలాత్కారం చేస్తున్నారు? పూర్తిగా స్పృహలో ఉన్నాను. ధ్యానం విడిపడింది. ధ్యానం చేసుకునే సమయంలో నూలు లంగోటి ఒకటి మాత్రమే ధరించి ఉండేవాడిని. ఒంటి మీద ఇంకే వస్త్రమూ ఉండేది కాదు. లంగోటి చినిగి పోవడం చూచి నాకు చాలా ఆగ్రహం కలిగింది. మెదడుకు మబ్బు పట్టినట్టయింది. తెల్లవారు ఝామున అయిదుగంటలైంది. లేచి, కొత్త లంగోటి కట్టుకున్నాను. కుటీరం నుంచి బయటికి వచ్చాను. నన్ను ఎవరూ ఎరగని ప్రదేశానికి ఎక్కడికైనా వెళ్లిపోవాలని నిశ్చయించు కున్నాను. మనస్సుపూర్తిగా పాడైంది. "నాకు పిచ్చిపడుతుంది. సందేహంలేదు. లేదా ఏదో ఒక అనర్థం చేస్తాను." ఈ విధంగా ఆలోచిస్తూ కూర్చున్నాను. నా కర్మను తలుచుకుంటూ విచారిస్తున్నాను.

బాగా తెల్లవారింది. ఉయ్యాలలో ప్రశాంతంగా కూర్చుని ఉన్నాను. ఆలోచిస్తు న్నాను: "ఎక్కడికి వెళ్లడం. ఈ దశ మంచిది కాదు. ఇది సాధన కానే కాదు. ఇది భగవత్కృప ఎంత మాత్రమూ కాదు. గతంలో నేను చేసిన పాపాలకు ఫలితమిది." అని తలపోస్తూ ఉండగా తంద్ర కలిగింది. లోపలికి వెళ్లి ధ్యానంలో కూర్చున్నాను. క్షణంలో ధ్యానం కుదిరింది. మళ్లీ సింహగర్జన ప్రారంభమైంది. నా నాలుక పూర్తిగా బయటికి వచ్చింది. అరగంటసేపు సింహగర్జన కొనసాగుతూనే ఉంది. భయకంపితుడి నయ్యాను. 45 నిమిషాల తర్వాత ధ్యానం ముగిసింది. ఇప్పుడు ఆ కామ వాంఛలేదు. కాని, ఒక దాని నుంచి తప్పించుకుంటే, మరొకటి వచ్చి పడింది. ఆకాశం నుంచి పడ్డాడు, ఈతచెట్టులో చిక్కుకున్నాడు, అని లోకోక్తి. ఇప్పుడు సింహభావంతో మనస్సులో గ్లాని మరింత ఎక్కువైంది. ఇక్కడి నుంచి వెళ్లడం ఉత్తమమని నిశ్చయించుకున్నాను. అనేక రకాలైన ఈ భావావస్థలు, సిద్ధయోగంలో సిద్ధకృపవల్ల జరిగే దివ్యక్రియలు. కాని తెలియక పోవడం వల్ల, ఆనందానికి బదులు వాటి వల్ల భయభ్రాంతి కలిగింది. మంచిది.

కొంతసేపటికి, నేనున్న కుటీరం ముందు వైపున్న తోటలోకి ఒక గుఱ్ఱపు బండి రావడం కనిపించింది. బండి ముందర, బండితోలే మనిషి కూర్చుని ఉన్నాడు. వెనక కూర్చున్న మనిషి ఎవరైనదీ తెలియలేదు. గుఱ్ఱపు బండి మామిడి చెట్టు దగ్గరకు వచ్చింది. ఎవరో దిగారు. ఎవరో కాదు. సాక్షాత్తు హరిగిరి బాబా. ఆయన ఒక గొప్పసిద్ధ యోగి. అసాధారణమైన అవధూత. ఎంతో సంతోషం కలిగింది. ఉయ్యాల నుంచి లేచి నిల్చున్నాను. ఆయన అక్కడి నుంచే కేకలు పెడుతూ వస్తున్నారు. "ఓ రాజా! ఓ మహారాజా! ఓ స్వామీ! లేలే" అంటూ కిలకిలమని ఒక్కటే నవ్వు. ఈ

మహాపురుషుడు సంపూర్ణమైన సర్వజ్ఞుడు. ఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు. పాదాలకు మంచిజోళ్లు, కోటుపైన కోటు, దానిపైన మరొకటి, ఆ విధంగా మూడు నాలుగుకోట్లు. తలమీద పట్టు పాగా ధరించి, నది ఒడ్డున సంచరించేవాడు. ఆకలైనపుడు ఎవరినో ఒకరిని ''పెట్టు, తినడానికి పెట్టు'' అని అడిగి, పెట్టించుకునేవాడు. తిన్నవెంటనే చేతులు కడుక్కుని అక్కడనుంచి వెళ్లిపోయేవాడు. పిశాచప్రవృత్తిగల మహాత్ముడు. నది ఒడ్డున చిన్న చిన్న గుండ్రటి రాళ్లను ఏరుకునేవాడు. వాటిని మార్చి మార్చి చూస్తూ తనలో తాను మాట్లాడుకునేవాడు: ''ఆః.. ఆః.. బాగుంది; శుభం,... నువ్వు రెండులక్షల పెట్టు.'' అనుకుంటూ ఒంటరిగా తిరిగేవాడు. అతిత్వరగా నడిచేవాడు. రాత్రి రెండుగంటలకు కూడా నది ఒడ్డుకు వెళ్లేవాడు. తెల్లవారు ఝామున తిరిగి వచ్చేవాడు. ఏదైనా అడిగినట్టయితే సమాధానం చెప్పేవాడు, కాని అర్థమయేది కాదు.

హరిగిరి బాబా ముందుకు వచ్చాడు. నేను నమస్కారం చేశాను. హరిగిరి బాబా పట్ల నాకు అమితమైన ప్రేమ. ఆయనకు కూడా నాపట్ల చాలా ప్రేమ. నేను అన్నాను: ''బాబా నాకు దుర్దశ పట్టింది. నా పరిస్థితి ఏమీ బాగలేదు'' అని ఆయన ''మలా మాహీత ఆహే, దోన్ రూపయే దేశీల్ తర్ సాంగేన్'' (నాకు తెలుసు రెండురూపాయ లిస్తే చెప్తాను) అన్నాడు. పరిహాసం చేసే ఆయన స్వభావం నాకు బాగ తెలుసు. ఆయన ఎప్పుడొచ్చినా ఏదైనా అడిగితే డబ్బులిమ్మంటాడు. ఇప్పుడూ అదే చేశాడు. రెండు రూపాయలిచ్చాను. హరిగిరి బాబా మరాఠీ భాష మాట్లాడేవాడు. ఆయనన్నాడు: ''అరె మహారాజా, తుఝీగతి చాంగ్‌లీ ఆహే, తుఝే చాంగలే హోణార్ ఆహే, తూ దేవ బనశీల్, తులా హితజ్వర ఝాలా ఆహే, తుఝ్యా జ్వరాచ్యా సంసర్గానే ఫార్ లోకాంచే రోగ్ ఆణి దుఃఖ జాయిల్. తులా ఫార్ లోక్ భేటతీల్.'' (నీ స్థితి బాగుంది. నీకు శుభం జరుగుతుంది. నువ్వు దేవుడివి అవుతావు. నీకు హితజ్వరం వచ్చింది. ఇది ఇతరులకు కూడా సోకి వారి రోగాలు దుఃఖాలు నశిస్తాయి. నిన్ను కలసు కునేందుకు చాలా మంది వస్తారు). ఈ విధంగా చెప్పి ఆయన బయలు దేరాడు. ఆయనతో కూడా కొంత దూరం వెళ్లాను నేను. ఆయన నన్ను వెనక్కు వెళ్లమన్నాడు: ''జా, జా, గేల్యానేచ యేఊ. శకశీల ఘాబరూ నకోస్.'' (వెళ్లు, వెళ్లు, వెళ్లినపుడే మళ్లీ రాగలం, భయపడవద్దు) ఈవిధంగా చెప్పి ఆయన వెళ్లి పోయాడు. చుట్టుప్రక్కల జనమంతా ''హరిగిరి బాబా వచ్చాడు'' అంటూ పరుగెడుతూ వచ్చారు.

నేను తిరిగి వచ్చి ఉయ్యాలమీద కూర్చున్నాను. మళ్లీ అశాంతి ప్రారంభమైంది. ఉదయం కలిగినవికారభావాలు గుర్తుకు వచ్చాయి. సింహభావం కూడా గుర్తుకు

వచ్చింది. భ్రాంతి ఎక్కువ కాజొచ్చింది. దీనికి కారణం, మనస్సు ఏ విషయం గురించి అదేపనిగా ఆలోచిస్తుందో, ఆ విషయంగా మారిపోతుంది. మనస్సు దేని గురించి మననం చేస్తుందో దానిలో పూర్తిగా లీనమై, అదే రూపం ధరిస్తుంది. నాకెంతో ఇష్టమైన పద్యమొకటి :

**జో మన నారికి ఓర్ నిహారత, తౌమన హోతహి తాహికు రూపా,**
**జో మన కాహుసూఁ క్రోధ కరై పుని, తౌ మన హై తబహీ తదరూపా,**
**జో మన మాయహిమాయ రటైనిత, తౌమన బూడత మాయకే కూపా.**
**సుందర జో మన బ్రహ్మ విచారత తౌ మన హోతహి బ్రహ్మస్వరూపా॥**

''మనస్సు రాత్రింబగళ్లు తన్మయత్వంతో స్త్రీ గురించే చింతన చేసినపుడు, ఆ మనసు, నారీరూపాన్ని పొందుతుంది. మనస్సు క్రోధం చెంది చెంది తనలోని రక్తకణాలన్నిటినీ క్రోధంతో నింపివేసినట్టయితే అది క్రోధాగ్నిలో మండుతుంది. మనస్సు ఎప్పుడూ మాయ గురించి ఆలోచిస్తూ ఉన్నట్టయితే మనస్సు మాయ అన్న గుంటలో మునిగి పోతుంది. మనస్సు ఎల్లవేళలా పరబ్రహ్మ స్వరూపుడైన పరమేశ్వరుడి గురించి చింతన చేసినట్టయితే అటువంటి మనస్సు పరబ్రహ్మలో లీనమై పూర్తిగా బ్రహ్మమైపోతుంది''? గొప్ప తత్వ నిష్ఠాస్వరూపుడు, మహాత్ముడు అయిన కవి సుందరదాసు రచన ఇది. ఇది అక్షరాలా నిజం.

ఇంద్రియవికారము, సింహభావము ఈ రెండు భ్రాంతులు నన్ను పూర్తిగా చుట్టుముట్టాయి. యేవ్‌లాలోచాలాకాలంగా గౌరవంగా బతికాను. ఆత్మగౌరవం ఉన్న మనిషిని. నేననుకున్నాను: ''నా దుర్దశ గురించి ఇక్కడి ప్రజలకు ఎందుకు తెలియడం? అడవిలోకి దూరంగా వెళ్లి పోతాను. అక్కడ నన్ను గుర్తు పట్టేవారు ఎవరూ ఉండరు?'' తక్షణమే అక్కడినుంచి వెళ్లిపోవాలని నిశ్చయించుకున్నాను. లేచాను. పూజ చేసుకునే గురుదేవుడి పటాన్ని హృదయానికి హత్తుకున్నాను. ''క్షమించు గురుదేవా! నేనేం చేయను. నేను దురదృష్టవంతుడిని. నువ్వు గొప్ప దాతవు'' అని క్షమాపణ చెప్పుకుని ప్రియమైన గురుదేవుడికి అనేక నమస్కారాలు చేశాను. పటాన్ని అక్కడే పెట్టాను. కుటీరానికి చెప్పాను. ''నా ప్రియమైన కుటీరమా, మళ్లీ ఎప్పుడు చూస్తానో నిన్ను. ఇక్కడ ఇంతకాలం నేను ఎంతో సుఖంగా ఉన్నాను. నీకు నమస్కారం''. ఉయ్యాలను స్పృశించాను. దానికి కూడా నమస్కారం చెప్పాను.

నా ప్రియమిత్రుడైన మామిడి వృక్షాన్ని ఆలింగనం చేసుకున్నాను. ''నీ నీడలో ఎంతోకాలం ఉన్నాను. ఏం చేయను? గత్యంతరం లేదు. ఇప్పుడు నిన్ను విడిచి వెళ్లక తప్పదు'' అన్నాను. మళ్లీ కుటీరం లోపలికి వెళ్లాను. కాషాయ వస్త్రాలను తొలగించాను. వాటన్నిటినీ మూటగట్టి బయట వృక్షానికి వ్రేలాడగట్టాను. నా సన్యాస ధర్మానికి కళంకం ఏర్పడరాదు, అన్న దృష్టితో ఈ పని చేశాను. ఆ తర్వాత చాలా కాలం, నేను తెల్ల వస్త్రాలే ధరించాను. కుటీరం తలుపును తెరిచే ఉంచాను. ఒక లంగోటి ధరించి ఉన్నాను. ఒక శాలువను భుజం మీద వేసుకున్నాను. చేతిలో కమండలం పట్టుకుని, ఎవ్వరితోనూ మాటైనా చెప్పకుండా తూర్పు వైపుగా బయలుదేరాను. కొంత దూరం వెళ్లి ఆగాను. అక్కడినుంచి కుటీరం కనిపిస్తుంది. కుటీరానికి మరొకసారి నమస్కారం చేశాను. ఎంతో దుఃఖం కలిగింది. బాధ కలిగింది పర్వతాలవైపు నడక సాగించాను. సహ్యాద్రి పర్వతశ్రేణిలో భాగమిది. పర్వతాల మధ్య నుంచి నడుస్తూ ముందుకు సాగాను. చాలా దూరం వెళ్లాలని నిశ్చయించు కున్నాను. ఆ తర్వాత శరీరం ఎక్కడ పడిపోయినా దిగులులేదు.

నడుస్తూ దౌలతాబాదు నుంచి శ్రీక్షేత్రమైన ఘృష్ణేశ్వరం మీదుగా నాగద్ చేరుకున్నాను. సహ్యాద్రి పర్వత శ్రేణిలోనికి ఒక శిఖరం మీదికి చేరుకుని ఉత్తర దిశగా చూచాను. అక్కడినుంచి క్రిందికి చూచినప్పుడు బత్తాయి, నారింజ చెట్లున్న పెద్దతోట కనిపించింది. చెఱుకు, మామిడి తోటలు చిన్నవీ పెద్దవీ కనిపించాయి. చాలా ఆకలిగా ఉంది. అక్కడినుంచి బయలుదేరి ఒక తోటలోకి వెళ్లాను. అక్కడ ఒక భూస్వామి ఉన్నాడు. అతడు ధనవంతుడు. యోగాభ్యాసం చేసినవాడు. సాధు, సన్యాసుల పట్ల అమితమైన అభిమానం. అతని పేరు దగడూసింగ్. అతను నా దగ్గరకు వచ్చి కుశలప్రశ్నలు వేశాడు. నన్ను తనతో తీసుకువెళ్లాడు. నా కోసం ఎంతో ప్రేమతో కిచిడీ వండించాడు. నేను అటు ఇటు చూచాను. ఒక చిన్న కుటీరం కనిపించింది. అక్కడ ఒక యోగి సాధన చేసుకునేవాడు. ఆ కుటీరంలో నేను నివసించేందుకు దగడూసింగ్ ఏర్పాట్లు చేశాడు. నేను కుటీరంలోకి వెళ్లి కూర్చున్నాను. కూర్చున్నవెంటనే పద్మాసనం అమరింది. ధ్యానం ప్రారంభమైంది. నాకు ప్రియమైన రక్తజ్యోతి ప్రత్యక్షమైంది. అంతరంగంలో నుంచి ఒక వాణి వినిపించింది: ''ఆ బీరువా తెరిచి చూడు. అక్కడ ఉన్న గ్రంథాలను చదువు'' అంటున్నది ఆ వాణి. మొదట నేను అంత పట్టించుకోలేదు. కాని ఆ వాణి రెండవసారి మూడవసారి కూడా వినిపించడంతో, నా ధ్యానం భంగమైంది.

కనులు తెరిచి చూడగా ఒక పాత బీరువా కనిపించింది. తెఱిచాను. ఒక గ్రంథం కనిపించింది. బయటికి తీసి తెఱిచాను. గ్రంథాన్ని తెఱిచిన చోట, నాకు ఆ సమయంలో జరుగుతున్న క్రియల గురించి ఉంది. దాన్ని చదివిన తర్వాత నాకు చాలా సంతోష మైంది. ఒక్క క్షణంలో సందేహాలన్నీ తీరిపోయాయి. మనసు చల్లబడింది. నా భ్రమ తొలగిపోయింది. విచారం నాశనమైంది. అంతవరకు జరుగుతున్న క్రియలన్నీ, గురుదేవుడు భగవాన్ శ్రీ నిత్యానంద యొక్క సంపూర్ణమైన కృపాప్రసాదమేనని అర్థమైంది. సిద్ధమహాయోగం యొక్క క్రియలేనని తెలిసింది. పరమార్థ సాధనకు యాత్ర ఇది. మనస్సు కుదుట పడడంతో కిచిడీ ఎంతో సంతోషంగా తిన్నాను. తర్వాత మంచి నిద్ర పట్టింది.

నేను కొంతకాలం నాగద్‌లోనే సాధన చేసుకున్నాను. సాధకుడు ఊర్ధ్వ రేతస్కుడు కావడానికి కామవాంఛను తెలిపే క్రియతో సంబంధమున్నట్లు ఇప్పుడు అర్థమైంది. ఊర్ధ్వరేతస్కుడు కావడం వల్ల లభించే బలం చేతనే, శక్తిపాతం చేయగల సామర్థ్యం లభిస్తుంది. ఈ క్రియ, కామవాంఛను శాశ్వతంగా నాశనం చేస్తుంది. స్వాధిష్ఠాన చక్రభేదం వల్ల కామ ప్రకోపం ఎక్కువవుతుంది. సాధకుడుని ఊర్ధ్వరేతస్కునిగా చేసేందుకు, సాధకుడి కామవాంఛను శాశ్వతంగా నాశనం చేసేందుకు ఈ విధంగా జరుగుతుంది. ఈ క్రియ ఎంత గొప్పది, ఎంత ముఖ్యమైనది అర్థమైన తర్వాత చాలా సంతోషం కలిగింది. ఇప్పుడు ఏమి వ్రాయను? ముందు కలిగిన ఆనందం మళ్లీ కలిగింది. నా ధ్యానంలో వస్త్ర హీనంగా కనిపించిన ఆ తల్లి, నా అజ్ఞానం కారణంగా, నా భ్రమ కారణంగా ఇంత ఇబ్బంది పెట్టింది. ఆమె సాక్షాత్తు మహాదేవి కుండలిని, నేను తల్లిని క్షమాపణ కోరాను. స్తోత్రాలను పఠించాను. తర్వాత అక్కడ ధ్యానం చాలా బాగా జరిగింది.

రెండవ రోజునకూడా మాతృశ్రీ కుండలిని, రక్తజ్యోతిలో వచ్చి నిలుచుంది. ఇప్పుడు ఆమె సౌందర్యం అలౌకికమైనది. ఆమె ప్రియదర్శిని, పరమేశ్వరి, అనుగ్రాహిక శక్తి. ఆమె దర్శనం అయినవెంటనే నా అదృష్టానికి సంతోష పడి నమస్కారం చేశాను. నమస్కారం చేసిన వెంటనే ఆ పరమేశ్వరి రక్తవర్ణపు జ్యోతిలో లీనమైంది. ఇప్పుడు ఆ శక్తే నా గురువు. జ్ఞానం లేని నానగ్న హృదయానికి ఆమె

నగ్నంగా కనిపించింది. ఆ దేవి, మహాశక్తి కుండలిని అని అర్థంచేసుకొనక పోవడంతో నాలో కామవాంఛ ప్రకోపించింది. నేను ఆమెను సాధారణ స్త్రీగా, భవరూపిణిగా భావించాను. నా ఆ బాధకు కారణం ఈ అజ్ఞానమే. ఇప్పుడు ఆ ఆవేదన అంతా తొలగిపోయింది.

నాగద్ ఏకాంతమైన ప్రదేశం, రమణీయమైన ప్రదేశం. ధ్యానం చేసుకునే కాలం కూడా దానంతట అదె ఎక్కువ కావడం ప్రారంభమైంది. ధ్యాన యోగానికి సహాయంగా ఉండే గ్రంథాలు కొన్ని అనుభవ వర్ణనలతో కూడినవి, 'మహా యోగ విజ్ఞానము' వంటివి పఠించాను. 'యోగవాణి', 'శక్తిపాతం' వంటి గ్రంథాలను కూడా తెప్పించుకున్నాను. ఈ గ్రంథాలలో కొన్ని అనుభూతులను వర్ణించి ఉన్నారు. వాస్తవానికి శైవసిద్ధాంతంలో మహాయోగానికి ఎక్కువ ప్రాముఖ్యముంది. శివ సూత్రాలు – ప్రత్యభిజ్ఞాహృదయం తంత్రాలోకం – శివదృష్టి మొదలైన గ్రంథాలలో అనుభవజ్ఞులైన మహాపురుషులు శక్తిపాతం – సిద్ధకృప – శ్రీవాత కుండలిని క్రియావిలాసం గురించి వ్రాసిన విషయాలున్నాయి.

ఆరు

# యౌగిక క్రియలు

ఇప్పుడు నా సాధన అతివేగంగా కొనసాగుతున్నది. దివ్యమైన శక్తిపాతం ఒకటి, ఒక గొప్పసిద్ధ పురుషుడి కృప రెండు, పరమాత్మను ప్రాప్తించుకోవాలన్న పూర్ణమైన అభిలాష మూడు. ఈ మూడూ తోడయ్యాయి. కాని ఒక్కటే కొఱవ పడింది. శక్తిపాతం తర్వాత ఎటువంటి యౌగిక క్రియలు జరుగుతాయి? ఎటువంటి అనుభూతులుంటాయి? వీటి గురించిన జ్ఞానం లేకపోయింది. ఇప్పుడు ఈ విషయం కూడా కొన్ని గ్రంథాలు దొరికిన తర్వాత పూర్తిగా అర్థమైంది. ఇక నాకేమి కొదువ?

నా సాధన, బ్రహ్మాండమైన నది పొంగి ప్రవహించేటంత వేగంగా కొనసాగుతూ ఉంది. ప్రతిరోజూ కొత్త కొత్త క్రియలు జరుగుతున్నాయి. తెల్లవారు ఝామున మూడు గంటలకే బ్రహ్మముహూర్తంలో లేచి ధ్యానం చేసేవాడిని. ధ్యానంలో కూర్చుంటూండగానే ఒక వేగం వచ్చేది. వేగం వచ్చిన వెంటనే రక్తేశ్వరి మెరిసేది. రక్తేశ్వరిలో కోడిగుడ్డు ఆకారంలో ఒక కొత్త తెల్లటి జ్యోతి కనిపించి మాయ మయ్యేది, మళ్లీ కనిపించేది, మళ్లీ మాయమయ్యేది. ఆ తదుపరి రక్తేశ్వరి సంపూర్ణంగా ఉండేది. శ్రీ గురుపూజ బ్రహ్మాండంగా జరిగేది. లోపలా వెలుపలా కూడా గురుపూజ చేస్తూ చేస్తూ మనసు పూర్తిగా నిశ్చలమయేది. త్రిబంధాలు వాటంతట అవి జరిగేవి. నా కాలిమడిమ, మలద్వారానికి కొట్టుకునేది. దాన్ని గట్టిగా అదిమి కుంచించుకునేట్టు చేసేది. దీనితో అపానవాయువు పైకి వెళ్లేది. ఈ క్రియను ''**మూలబంధము**''ని వ్యవహరిస్తారు. ఇది ప్రాణాన్నీ అపానాన్నీ సమానం చేస్తుంది. వృద్ధాప్యం, వ్యాధులు మొదలైన వాటిని నాశనం చేస్తుంది. సాధకుడు పద్మాసనంలో కూర్చుని ఈ ముద్ర ద్వారా ప్రాణాన్ని జయించి, శూన్యంలో స్థిరమై ఉండగల సామర్థ్యాన్ని సంపాదించ కలుగుతాడు. ఈ ముద్రలోనే మండూక క్రియ జరుగుతుంది.

దీనితో బాటు, లోపలినుంచి ప్రాణవాయువు బయటికి వస్తుంది. పొట్టను లోపలికి లాగినట్టవుతుంది. ఈ విధంగా పొట్టలో ఒక చిన్న గుంటమోస్తరు తయారవుతుంది.




సూక్ష్మచైతన్య కేంద్రాలు

ప్పుడు నాభిక్రింది నుంచి గాలినిపైకి లాగినట్టు అనిపిస్తుంది. ఈ క్రియకు "ఉడ్డియాన బంధమ"ని పేరు. హఠయోగ గ్రంథాలలో ఉడ్డియానబంధం చాలా గొప్పదని పేర్కొంటారు. దీనివల్ల మృత్యువును కూడా జయించవచ్చున చెబుతారు. అంతగొప్పదన్న మాట. దీనివల్ల నాడులూ ప్రాణమూ శుభ్రపడతా నాడులు శుభ్రమైనప్పుడు జఠరాగ్ని క్రియా శీలమౌతుంది. ప్రాణం శుభ్రమై, యొక్క చాంచల్యాన్ని నాశనం చేసి, దానిని స్థిరంచేస్తుంది. దీని తర్వాత జరిగే క్రియలో నా గడ్డం, కంఠకూపానికి గట్టిగా ఒత్తిడితెస్తూ కొట్టుకుంటుంది. దీన్ని '**జాలంధర బంధము**'ంటారు. జాలంధర బంధం చాలా మహత్తు కలది. సహస్రారంనుంచి అమృతబిందువులు పడినప్పుడు, నాభిచక్రంలో ఉన్న సూర్యుడూ, అగ్నీ వీటిని కాల్చివేస్తారు. ఈ బంధం వల్ల అమృతరసం కిందికి పోయేమార్గం మూతపడుతుంది. అప్పుడు అగ్ని, దాన్ని భస్మం చేయజాలదు. ఈ ముద్ర సహాయంతో యోగి యొక్క మనస్సు, అతి త్వరగా ప్రశాంతమౌతుంది, స్థిరమౌతుంది. ఈ మూడు బంధాలు, మూల-ఉడ్డియాన-జాలంధర బంధాలు, చాలా గొప్పఫలితాలను ప్రసాదించేవి.

మెల్లమెల్లగా నా ప్రాణము అపానము సమానమయ్యాయి. నా పద్మాసనం కూడా పూర్తిగా స్థిరమైంది. ఎవరైనా ఒకయోగి మూడు గంటలసేపు ఒకే ఆసనంలో స్థిరంగా కూర్చున్నట్టయితే, అటువంటి యోగికి 'ఆసన సిద్ధి' కలిగిందంటారు. త్రిబంధాలు జరుగడంతో, నేను పద్మాసనంతో పాటు మండూక క్రియను కూడా చేసేవాడిని. అనగా, కుటీరంలో ఒక చోటినుంచి మరొక చోటికి కప్పగంతులను వేసేవాడిని. ఇప్పుడు ఏక్రియ జరిగినా ఆనందమే. ధ్యానసమయంలో మహాముద్ర, మహాబంధం, మహావేధ ముద్ర, విపరీత కరణి ముద్ర, వజ్రోలి ముద్ర మొదలైన అనేక రకాల ముద్రలు జరిగేవి. అప్పుడప్పుడు కుడికాలిమడిమ లేదా ఎడమ కాలి మడిమ, మలద్వారాన్ని గట్టిగా అదిమేది. ఒక్కొక్కసారి కుడికాలుగాని, ఎడమకాలుగాని చాచి, రెండుచేతులతో ఆ కాలివేళ్లను గట్టిగా పట్టుకునేవాడిని. తలను రెండు చేతుల మధ్య అదిమి పెట్టేవాడిని. దీనిని '**మహాముద్ర**' అంటారు. ఈ ముద్రవల్ల కుండలిని వేడెక్కి ప్రాణవాయువుతో కలిసి సుషుమ్నలోకి ప్రవేశిస్తుంది. దీనితో శరీరంలోని నాడులన్నీ క్రియాశీలమై శరీరంయొక్క జడత్వం నశిస్తుంది. దీనివల్ల "**బిందు ధారణ**" కూడా జరుగుతుంది. దీనితో శరీరం ప్రశాంతమౌతుంది, జఠరాగ్ని తీవ్రమౌతుంది, దేహం కాంతివంతమౌతుంది. ఇంద్రియాలు సంయమిత మౌతాయి. వృద్ధాప్యం దగ్గరకు

రాదు. దీనిని ఎప్పుడూ అభ్యాసం చేయడం వల్ల క్షయ కుష్ఠువంటి వ్యాధులు, గుహ్యరోగాలు, గుల్మము, అజీర్ణము నశిస్తాయి. ఒక్కొక్కసారి కుడి లేదా ఎడమకాలు మడిచి, ఎడమలేదా కుడి తొడమీద పెట్టుకునేవాడిని. అప్పుడు పొట్టలో గాలి నిండుతుంది. జాలంధర బంధము కుదిరి శ్వాస నిలిచిపోతుంది. తర్వాత మెల్ల మెల్లగా గాలి బయటికి వస్తుంది. దీన్ని **'మహాబంధముద్ర'** అంటారు. దీని అభ్యాసం వల్ల ప్రాణవాయువు సుషుమ్నలోకి ప్రవేశిస్తుంది. శరీరం శక్తివంతమౌతుంది. అస్థిపంజరము గట్టిపడుతుంది. తర్వాత **'మహావేధ బంధం'** ఏర్పడుతుంది. అనగా మహా బంధం కుదిరినపుడు ఉడ్డియాన బంధం ఏర్పడుతుందన్నమాట. ప్రాణవాయువు పూర్తిగా వెలుపలనే నిలిచిపోయి, బాహ్య కుంభకం ఏర్పడుతుంది. ఈ బంధం ద్వారా కూడా ప్రాణవాయువు సుషుమ్నలోకి ప్రవేశిస్తుంది. బ్రహ్మ - విష్ణు - రుద్రగ్రంధులు మూడింటి భేదనము జరుగుతుంది. కుండలిని సహస్రారం వరకు పోవడము రావడమూ ప్రారంభమౌతుంది. దీనివల్ల **'ప్రాణ సిద్ధి'** కలుగుతుంది. వృద్ధాప్యం నాశనమౌతుంది. నేను ఒక్కొక్కసారి రెండు అరచేతులను దోసిలిగా నేలపైపెట్టి వాటిమీద నాశిరస్సు నుంచి రెండు కాళ్లను నిటారుగా నిలిపి స్థిరంగా ఉండిపోతాను. దీన్ని **'విపరీత కరణి ముద్ర'** లేదా **'శీర్షాసనం'** అంటారు. దీనివల్ల ఎన్నో లాభాలున్నాయి. జఠరాగ్ని ఎక్కువవుతుంది. శరీరం ముడతలు పడడం, తలనెరిసిపోవడం ఆగిపోతుంది. దీనివల్ల సహస్రారంనుంచి దిగే అమృతబిందువులు కిందికి పడడం ఆగిపోతుంది. వృద్ధాప్యం నశిస్తుంది. ఒక్కొక్కసారి ఈ ఆసనంలోనే రెండు అరచేతులు నేలమీద పడతాయి. వాటిని ఆధారంగా చేసుకుని, కాళ్లనుపైకి నిటారుగా పెట్టి స్థిరమౌతాను. శిరస్సు రెండు చేతులమధ్య వ్రేలాడుతుంటుంది. ఇది **'వజ్రోలి ముద్ర'**. దీనివల్ల **'బిందుసిద్ధి'** తప్పకుండా కలుగుతుంది. బిందువు ప్రవహించడం లేదా పడడం ఆగిపోతుంది. బిందుధారణ సామర్థ్యం లభిస్తుంది. దీనివల్ల సాధకుడు దీర్ఘాయుస్సును పొందుతాడు.

ఇంకా అనేక రకాల ప్రాణాయామాలు జరగడం ప్రారంభమైంది. వీటిలో కొన్నిటి గురించి చెబుతాను. అప్పుడప్పుడు నోరు **'భుజంగిని ముద్ర'** ధరించి వాయుపానం చేస్తుంది. ఒక్కొక్కసారి నాలుక అంగిట్లో తగులుకుని కుంభకం జరుగుతుంది. ఇది **'నభోముద్ర'**. దీనివల్ల రోగాలు పోతాయి. నాలుక కపాల కుహరంలోకి ప్రవేశించే యోగ్యతను సంపాదిస్తుంది. ఆ తర్వాత **'ఖేచరి ముద్ర'**

యొక్క క్రియ జరిగేది. ఒక్కొక్కసారి నాలుకను కాకిముక్కును పోలినట్టుచేసి, గాలిని లోపలికి పీల్చుకుంటాను. ఇది **'కాకి'** లేదా **'శీతలి'** ముద్ర. దీనివల్ల దీర్ఘాయువు కలుగుతుంది. రక్తశుద్ధి జరుగుతుంది. జ్వరం పిత్తం వంటి అవలక్షణాలు నాశనమౌతాయి. ఒక్కొక్కసారి కపాలం భయంకరంగా కొట్టుకుంటుంది. కనుగుడ్లు పైకి తిరిగి, దృష్టి భ్రూమధ్యంలో స్థిరమైపోతుంది. ఇది **'శాంభవి ముద్ర'**. దీని వల్ల ఎంతో విశ్రాంతి లభిస్తుంది. దీనివల్ల మనస్సు స్థిరమౌతుంది. దీనిద్వారా యోగి శంభు సమానుడౌతాడు. మనస్సు భ్రూమధ్యంలో స్థిరమై ఆత్మ చైతన్యస్థితి ప్రాప్తమౌతుంది.

ఇప్పుడు సింహభావం కూడా ఎక్కువైంది. సింహగర్జన ఎంత ఎక్కువగా ఉండేదంటే, ఆ శబ్దానికి, కొంతదూరంగా కట్టి ఉన్న ఆవులు, తాళ్లను తెంపుకుని అటూ ఇటూ పరిగెత్తేవి. అంతపెద్ద శబ్దం. కుక్కలు ఒకటే అరవడం ప్రారంభించేవి. అందరూ పరుగున వచ్చేవారు. వచ్చి చూస్తే తెలిసేది - ఈ శబ్దాలు చేస్తున్నది బాబాజీయేనని. వారికి ఒకటే ఆశ్చర్యం! ఏమి జరగుతున్నదీ వారికి అర్థం కావడంలేదు. జనానికి దర్శనం ఇవ్వడం ఇవ్వకపోవడం మాటే మరిచిపోయాను. కుండలిని యొక్క మహాక్రియలను మాటిమాటికి దర్శనం చేసుకుంటున్నాను. రోజుకు మూడుసార్లు ధ్యానానికి కూర్చుంటున్నాను. తెల్లవారుజామున మూడుగంటలకు, మధ్యాహ్నం పదకొండుగంటలకు, సాయంత్రం ఏడునుంచి తొమ్మిది గంటలవరకు. అప్పుడప్పుడు సర్పాకారంలో వంకరటింకరలుగా, నేలమీద పాకేవాడిని. కప్ప గంతులను వేసేవాడిని. పులి అరిచినట్టు అరిచేవాడిని. ఈ విధంగా చిత్‌శక్తి భగవతి యొక్క అలౌకికమైన అంతర్‌భావాలను చూచిచూచి మనస్సు అత్యంత మంత్ర ముగ్ధమయ్యేది.

ఈ ప్రకారంగా ప్రతిరోజు ఆసనం మీద కూర్చున్న వెంటనే అదే రక్తజ్యోతి, కోడిగుడ్డు ఆకారంలో, అత్యంతసుందరమైన శ్వేత వర్తులం ఇంకా ఎక్కువగా దర్శనమివ్వడం ప్రారంభమైంది. మెల్లమెల్లగా ప్రతి దినము స్థిరం కాజొచ్చింది. ఇప్పుడు ధ్యాన సమయంలో కొత్తరకమైన నిద్ర కూడా రావడం ప్రారంభమైంది. నా ప్రియమైన గురువు, కుండలినీ శక్తి, ప్రథమంలో నాకు నగ్నంగా దర్శనమిచ్చిన తల్లి, అప్పుడు నన్ను భయభ్రాంతుడిని చేసిన తల్లి, ఇప్పుడుకూడా అప్పుడప్పుడు ధ్యానంలో దర్శనమిచ్చేది. కాని ఇప్పుడు నాకు ధ్యానంలో మహాపారవశ్యం. నేను చాలా రకాల గ్రంథాలను

తెప్పించుకునే వాడిని. ధ్యానానికి సంబంధించిన అవస్థల గురించి తెలుసుకోనిదే సంతోషం కలిగేదికాదు.

నాకు పరిచయం ఉన్న మహాపురుషుల్లో మరొకరు జిప్రుఅణ్ణా. ఆయన గొప్ప సిద్ధ పురుషుడు. జిప్రుఅణ్ణా దిగంబరంగా ఉండేవాడు. నసీరాబాద్ సందుగొందుల్లో తిరుగుతూ ఉండేవాడు. అయినప్పటికీ ఆయన్ను అందరూ మహాత్ముడుగా భావించేవారు. చిన్నా పెద్దా అందరూ ఆయన్ను ప్రేమగా 'అణ్ణా' అని పిలిచేవారు. ఆయన గ్రామ ప్రజలకు దూరంగా, పడిపోయిన మొండి గోడలమధ్య, కూలిపోయిన పూరిండ్లలో, నిర్జన ప్రదేశాల్లో నివసించేవాడు. యోగమార్గంలో అత్యంత ఉన్నతమైన స్థితిని ప్రాప్తించుకున్నవాడు, ఆయన. భూత భవిష్యత్తులను స్పష్టంగా చూడకలిగినవాడు. ఆయన శరీరం, యోగాగ్నిలో పరిశుద్ధమై పోయింది. పెంట కుప్ప మీద కూర్చున్నా ఆయనకు మలినం అంటేది కాదు. అంత పరిశుద్ధమైనది ఆయన శరీరం. నాకు ఎంతో ఆశ్చర్యం కలిగేది. ఈ మహాపురుషుడు తన శరీరాన్ని కూడా ఇటువంటి ఉన్నత స్థితికి తీసుకువచ్చాడు కదా అని. యోగుల అంతరాత్మ మాలిన్యరహితమైన విధంగానే, జిప్రుఅణ్ణా శరీరం కూడా మాలిన్యరహితమైనది. నేను మొదట ఆయన దర్శనం చేసుకున్నపుడు ఆయన మలవిసర్జన చేస్తూ కనిపించాడు. దగ్గరకు వెళ్లాను. ఆయన ఆ మలాన్ని తమ శరీరానికి పూసుకుంటున్నారు. నేను, ఆయన ప్రక్కన వెళ్లి కూర్చున్నాను. ఆయన శరీరం నుంచి మలం యొక్క దుర్గంధానికి బదులు, సువాసన వస్తూ ఉంది. రెండవసారి దర్శనానికి వెళ్లినపుడు, పెంటకుప్పమీద కూర్చుని ఉన్నాడు. అయినప్పటికీ ఆ పెంట ఆయనకు ఏ మాత్రం అంటలేదు. ఆయన దగ్గరకు వెళ్లేందుకు ధైర్యం చాలలేదు. దూరంగానే నిల్చున్నాను. కొంతసేపటికి ఆయన అక్కడినుంచి లేచివచ్చాడు. ఆయన పాదాలను కడిగాను. ఆయన శరీరం నుంచి అష్టగంధాన్ని పోలిన ఒక కొత్త సువాసన వెలువడుతూ ఉంది. జిప్రుఅణ్ణాకు నాపట్ల అమితమైన ప్రేమ. ఈ మహాపురుషుడి ఆచార వ్యవహారాలు ఈ నాటికీ నన్ను ఆశ్చర్యచకితుడిని చేస్తాయి. నేను ఆయన్ను అడిగాను: ''అణ్ణా! ఎందుకు ఇంత మురికిలో కూర్చుంటారు?'' అని. ఆయనన్నారు: ''ముక్తానంద, లోపల మురికి ఉందే, అది దీనికన్నా ఎక్కువ మురికి. నువ్వు ఆలోచించి చూడు. మానవ శరీరం మలమూత్రాల పేటిక కాదా?'' ఇది విని నేను మరి ప్రశ్నించలేదు. అటువంటి అవధూత శిరోరత్నం జిప్రుఅణ్ణా.

ఇప్పుడు ఆయన దర్శనానికి వెళ్లాను. ఎంతో ప్రేమతో ఆదరించారు. నా శరీరానికి ఆయన శరీరం తాకుతూ అతి దగ్గరగా కూర్చున్నారు. సూకీ కుటీరంలో నా అనుభవాల గురించి ఆయనకు చెప్పాను. ఆయన అన్నారు. ''ఇది మహాపురుషుల అనుగ్రహం, దీక్ష, కృప, లేదా శక్తిపాతం, గొప్ప కృపా ప్రసాదం లభించినపుడే ఇటువంటి ప్రక్రియలు జరుగుతాయి. మహదగ్ని, భూతపిశాచాలు, యక్షులు, నాగులు, కిన్నెరులు, పరమ శివుడి భూతగణముల దర్శనమౌతుంది. అవే జరిగాయి నీకు''. కామ వికారం కలిగిన కారణంగా నాకు పట్టిన దుర్దశగురించి అడగ్గా, ఆయన, ''జననేంద్రియం పైకి లేచి నాభికి తగలడం అన్నది అపురూపంగా జరిగే సంగతి. కారణం, యోగం యొక్క మహిమాన్వితమైన పారమేశ్వరి కృప ఇది. జననేంద్రియం సాధారణమైనదిగా భావించవద్దు. అందరిపుట్టుకకు కారణమైన ఇంద్రియమిది. దీనివల్లనే పురుషుడు లేదా స్త్రీ అన్నభావం కలుగుతుంది. లేనట్టయితే మానవుడిని నపుంసకుడు అంటారు. ఎంతో గౌరవింపదగిన మానవుడి యొక్క జననేంద్రియాన్ని సాధ్యమైనంతవరకు వ్రతనియమాలలో ఉంచడం మంచిది. ఈ ఇంద్రియం లేచి నాభికి తగిలి, అక్కడ కొంతసేపు ఉండడంవల్ల, అండకోశం యొక్క వీర్యమంతా పైకి, హృదయంవైపు, ప్రవహించడం ప్రారంభమౌతుంది. తర్వాత జఠరాగ్నిలో తప్తమై, పైకి, మస్తిష్కంవైపు వెడుతుంది. దీనివల్ల మస్తిష్కంలోని జ్ఞానతంతువులు బలపడతాయి. వీటి బలంతో యోగి యొక్క జ్ఞాపకశక్తి ఎక్కువవుతుంది. మేధావి అవుతాడు''. ఆయన ఇంకా అన్నారు: ''అరె స్వామీ! అటువంటి యోగిని సంపూర్ణమైన 'ఊర్ధ్వ రేతస్కుడు' అంటారు. ముందు ముందు, దీని బలంవల్లనే నువ్వు గురువువై అనుగ్రహాన్ని ప్రసాదిస్తావు. నీకు ''వజ్రోలి'' అన్నక్రియ కలిగింది కదా. దానివల్ల, ముందు ముందు శక్తి పాతాన్ని ఇచ్చేందుకు అవసరమైన ఆంతరిక శక్తిని సమకూర్చుకుంటావు. నీకు కలిగిన కామ వికారం ద్వారా మహాశక్తి కుండలిని, నీలోని ఇదివరకటి కామ వికారాలన్నింటినీ తొలగించివేసింది. ఇక నీలో కామ స్ఫురణ ఉండదు. కేవలం ప్రేమస్ఫురణ మాత్రమే ఉంటుంది. నీ ప్రేమ కిరణాల పుంజం, ఎందరినో ప్రేమమయం చేస్తుంది''.

నాకు ధ్యానంలో ప్రత్యక్షమయే నగ్నస్త్రీ గురించి చెప్పాను. నేనన్నాను: ''ధ్యానం చేసేముందు శివకవచాన్ని ధరించి దిగ్బంధనము చేసి కూర్చుంటాను. అటువంటి స్థానంలోకి ఒకనగ్నస్త్రీ ఏ విధంగా ప్రవేశించింది?'' ఈ ప్రశ్న వింటూనే జిప్రు

అణ్ణాహుంకరిస్తూ మెఱుపువలెమెరిశారు. కొంత గంభీరమైన స్వరంతో ఈ విధంగా అన్నారు: ''అరె స్వామీ, నీ అంతరంగంలోకి ధ్యానం యొక్క జ్యోతిర్మయ నగరంలోకి ఎవరు ప్రవేశించగలరు? అది, భగవతి చిత్‌శక్తి యొక్క గొప్ప తేజోమయభూమి. అక్కడ చిత్‌శక్తికీ చిత్స్వరూపుడైన దేవుడికీ శ్రీ గురువుకూ తప్ప అన్యులెవరికీ ప్రవేశం సాధ్యం కాదు. స్త్రీ గురించి నీకున్న అభిప్రాయం వల్ల నువ్వు భ్రాంతిలోపడ్డావు. నగ్నం ఏముంది? వస్త్రధారణ ఏముంది? భగవతి అన్ని రూపాలనూ ధరిస్తుంది. ఆస్త్రీ దర్శనం అయినవెంటనే నీకు భగవతి చిత్‌శక్తి స్మరణకు వచ్చి ఆమెను ఆ దృష్టితో చూడవలసినది. అక్కడ మరెవరికీ ప్రవేశం లేదు. నీ భావానికి తగినట్టు ఫలితం లభిస్తుంది. ఇక మీద నీకు సద్భావాలుగాని కుభావాలుగాని ఏవి కలిగినా, వాటన్నిటినీ చిన్మాత్రరూపాలుగా అర్థం చేసుకో. హృదయంలో దర్శనమిచ్చే ఆ నగ్నస్త్రీని పరమభగవతిగా భావించడంవల్ల, ఆమె దివ్యమైన దేహధారి అవుతుంది. చిత్‌శక్తి చమత్కారాలు అనంతాలు. ఆమె అతి వేగ వాహిని. అంతరంగంలో రక్తవర్ణం కలిగిన సూక్ష్మాతి సూక్ష్మమైన పరమాణువులు ఎంతో వేగంగా పరుగెడుతూ ఉన్నది నువ్వు చూచే ఉంటావు. వాటిలో స్థితమై ఉన్న అనంతలోకాల గతిని నువ్వు ముందు ముందు చూస్తావు. త్రుటిలో అనంతరూపాలను ధరించగల ఈ చిత్‌శక్తి, ఒకే దానిలో అనంతమైన ఆకారాలను చూపించగల మహామాయ, సాక్షాత్తు యోగమాత కుండలిని. అరె స్వామీ, జరిగినదంతా మంచిదే. ముందు జరుగబోయేది కూడా మంచిదే. ఎల్లవేళలా కుండలినీ స్వరూపాన్నీ ఆమె స్వభావాన్నీ జ్ఞాపకం పెట్టుకో.''

''మరొకమాట. సిద్ధమార్గంలో ఉన్న యోగి ఈ మాటను సదా గుర్తుంచుకొనడం అవసరం. హృదయంలో చిత్‌శక్తి ప్రేరితమైన జ్యోతిలో అప్పుడప్పుడు కనిపించే దృశ్యాలు, పెద్దవీ – చిన్నవీ మంచివీ – చెడువీ, స్వీకరించతగినవీ – త్యజించవలసినవీ, చూడ తగినవీ – చూడతగనివీ, శుభప్రదమైనవీ – అశుభప్రదమైనవీ, ఎటువంటివైనప్పటికీ, అవి పూర్తిగా చిత్‌శక్తి యొక్క స్వరూపాలే. చిత్‌శక్తి తప్ప అన్యులెవరూ అక్కడ ఏమీ చేయజాలరు. అక్కడ దర్శనమిచ్చే అనంతరూపాలూ, జరిగే అనంతమైన క్రియలూ, నీ దృష్టిలో ఎటువంటి వైనప్పటికీ, నిజానికి భగవతి చిన్మాత్ర క్రియలే.'' ఈ మహాబోధ విన్న వెంటనే నేను జిప్రేశ్వరుడి పాదాలకు ప్రణమిల్లాను. ఏమి భోధ! ఏమి సత్యం! యదార్థాన్ని ఎంతో చక్కగా చూపించాడు! ''ఓ బాబా! నా బాబా!'' అంటూ ఆయన్ను ఆలింగనం చేసుకున్నాను. ఆయన నన్ను తన ఒడిలో కూర్చుండ

బెట్టుకున్నారు. శిరస్సును మూర్కొన్నారు. చేతితో తల నిమిరారు. ''నీ కీర్తిలత ఆకాశాన్ని అంటుతుంది'' అని దీవించారు. ఆరోజుల్లో నాకు విపరీతమైన తలనొప్పి వచ్చేది. ఆ రోజు నుండి ఆ బాధ కూడా తొలగిపోయింది. జిప్రుఅణ్ణా నా సమస్యలన్నిటినీ పరిష్కరించారు. నాకు ఆయన పట్ల ఎంతో భక్తి, ప్రేమ, గురుతుల్యమైన గౌరవము ఉండేవి. నన్ను భగవాన్ నిత్యానందుడి దగ్గరకు పంపించినది ఆయనే. ఆయనన్నారు: ''నీపని ఆయన దగ్గరే పరిపూర్ణమౌతుంది. అక్కడ నీ భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది'' అని . మంచిది.

నాకు ప్రియమైన సిద్ధయోగ విద్యార్థులారా, ఒక మాట జాగ్రత్తగా వినండి. ఒకసారి గురుకృప లభించిన తర్వాత ఎటువంటి భయసందేహాలు పడనవస రంలేదు. ఒకటి మాత్రం గుర్తుంచుకో. సిద్ధయోగంలో గురువాజ్ఞను తు.చ. తప్పకుండా పాటించడం అవసరం. ''గురువాక్యమేవ కేవలం''. ఈ గొప్ప సత్యాన్ని అర్థం చేసుకొనడం ముఖ్యం. ''అణ్ణా'' చెప్పినది గుర్తుంచుకొనడం అవసరం. లోపల, హృదయంలోని సూక్ష్మస్థానంలోకి ఇంతపెద్ద స్త్రీ విగ్రహం ఎక్కడనుంచి ప్రవేశించింది? మంత్ర తంత్రాలతో ప్రేరితమైన నీ దిగ్బంధకవచాన్ని ఛేదించుకుని ఒక సాధారణ స్త్రీ ప్రవేశించగలదా? చిద్రూపిణి అయిన కుండలిని ఉదయించినవెంటనే, రక్త జ్యోతిలో నీకు అన్నీ దర్శనమిస్తాయి. ఇటువంటి దర్శనం చిన్మాత సంకల్పం లేకుండా జరుగగలదా? ఆలోచించి చూడు. గుర్తుంచుకో. హృదయంలో అతి సూక్ష్మమైన స్థానం ఒకటి ఉంది. ఆ స్థానంలోకి కుండలిని తప్ప అన్యులెవరూ ప్రవేశించజాలరు. అందుచేత, నీకున్నవీ నీకుదర్శనమిస్తున్నవీ, నీకు జరుగుతున్న క్రియలూ అన్నిటినీ పారమేశ్వరి చిన్మాత ప్రసాదంగా భావించు. అన్నిటినీ ఆమెకే అర్పించు. ''జరిగినవన్నీ నా మంచికే'' అని అర్థం చేసుకో. చిత్‌శక్తి కలిగించే భావాలను, జరిపే క్రియలను, చూపే రూపాలను, రంగులను, వీటిలో ఒక్కొక్కదానిని, చిత్‌శక్తి రూపంగా భావించి మనస్సులోనే ప్రణామం చేయి. ఆవిధంగా చేయడం వల్ల నువ్వు వెంటనే శాంతపడతావు. ఆవిధంగా కాక, వాటిని మరొక విధంగా అర్థం చేసుకున్నట్టయితే ముక్తానంద వలెనే పశ్చాత్తాప పడతావు.

జిప్రుఅణ్ణా దగ్గరనుంచి తిరిగివచ్చిన తర్వాత నాగద్‌లోని నా ప్రియమైన కుటీరంలో సాధనను శ్రద్ధగా కొనసాగించాను. ధ్యానం చాలా బాగా జరిగేది. ఎఱ్ఱటి జ్యోతి మధ్యలో, పొడవైన గులాబ్ జామున్ ఆకారంలో ఒక తెల్లటి వర్తులాకారం కనిపించేది. ఇప్పుడు

అది చాలా స్థిరంగా ఉంటున్నది. ''ఎనిమిది జాన'' ల రక్తేశ్వరి మధ్యలో అంగుష్ఠమంత శ్వేత జ్యోతి కనిపించసాగింది. దీన్ని ఎఱ్ఱటి జ్యోతి చుట్టుకుని ఉంది. ధ్యానంలో నాకు రుచి ఎక్కువ కావడం ప్రారంభమైంది. ధ్యానంలో ఏమి కనిపించినా చిత్‌శక్తి పరమేశ్వరిగానే భావించే వాడిని. మనస్సులోనే ఆమెకు నమస్కారం చేసేవాడిని.

ఇప్పుడు ఆనందం కూడా ఎక్కువ అయింది. అప్పుడప్పుడు నృత్యం చేయాలన్నంత సంతోషం కలుగుతుంది. నృత్యం చేయాలన్న కోరిక ఇంత బలంగా ఎందుకు కలుగుతుందో తెలియదు. ప్రతి అంగంలోనూ నృత్యం చేయాలన్న భావం కలుగుతుంది. దానితోపాటు ఎఱ్ఱటి జ్యోతి దర్శనమిస్తుంది. దానితో కూడా అంగుష్ఠమంత తెల్లటి జ్యోతి దర్శనమిస్తుంది. బాహ్య శరీరం యొక్క క్రియలు కూడా బాగా ఎక్కువయాయి. హఠయోగ ముద్రలు, ఆసనాలు, బాగా ఎక్కువయాయి. ఆ తర్వాత ఎఱ్ఱటి ప్రకాశం మధ్యలో స్వర్ణాకాశపు మహాతేజస్సు, రజతాకాశపు శుభ్రమైన తేజస్సు కనిపించసాగాయి. నేను ఇదివరలో చూచి ఉన్న హిమాలయ శిఖరాలూ, నేను చూడనివీ కూడా కనిపించసాగాయి. ఈ విధంగా ఒక అంతశ్చక్షువు లభించింది. ఈ అంతశ్చక్షువు గురించి నాకేమీ తెలియదు. ఈ అంతశ్చక్షువే ''**ఎనిమిదిజానల శరీరం**''లో చాలా స్థానాలను చూచేది. ఈ రక్తజ్యోతి, వ్యష్ఠిరూపంలో మూడున్నర మూరలుంటుంది. కాని సమిష్ఠిరూపంలో తూర్పునుంచి పడమరవరకు, ఉత్తరంనుంచి దక్షిణంవరకు, పైనుంచి కిందివరకు, వ్యాపించి ఉంది. సమస్త బ్రహ్మాండం దీనిలోనే ఇమిడి ఉంది.

ఇప్పుడు నాకు ఆసనాలు రోజూ అమరడం లేదు. రెండు మూడు రోజుల కొకసారి జరుగుతున్నాయి. ధ్యానంలో, దేశంలోని పుణ్యక్షేత్రాలు కొన్ని కనిపించేవి. రక్తవర్ణపు జ్యోతితో పాటు శ్వేతజ్యోతి, దానితో పాటు అనంతమైన సర్వవ్యాపకమైన ఒక ప్రదేశం కూడా కనిపించసాగింది. పర్వతాల వరుసలు, వాటి మధ్యవనాలు, ఉపవనాలు కనిపించసాగాయి. ధ్యానమూ బాగా జరిగేది. ధ్యానం తర్వాత దృష్టాంతాలు కూడా బాగుండేవి. ఏమి జరుగుతున్నదీ నాకు తెలుస్తు న్నది. దానితో పాటు ఆనందం కూడా కలుగుతున్నది.

ఇప్పుడు శరీరం సన్నబడడం ప్రారంభమైంది. కాని బలం ఎక్కువవుతూ ఉంది. శరీరం పరిశుభ్రం కావడం ప్రారంభమైంది. అప్పుడప్పుడు కొద్దిగా జ్వరం వచ్చేది. వెంటనే తగ్గిపోయేది. జలుబుకూడా చేసేది. కాని వెంటనే తగ్గిపోయేది. అతిసారం

కూడా అప్పుడప్పుడు కలిగేది, వెంటనే తగ్గిపోయేది. ఆ కాలంలో ఏ వ్యాధి వచ్చినా, ధ్యానం వల్లనే తగ్గిపోయేది. వేదాంతంలో మనం స్థూల శరీరంగురించి చదివే వర్ణన ఈ రక్తవర్ణ జ్యోతి స్వరూపంగురించేనని ఇప్పుడు తెలిసింది. అన్ని క్రియలు జరిగేది ఈ శరీరంలోనే. ఓం కారంలోని ప్రథమ శబ్దమైన 'అ' కారం ఇదే. ఈ శరీరానికి దేవత విశ్వుడు. జాగ్రదవస్థ ఉండేది ఈ శరీరంలోనే. స్థూలభోగాలను అనుభవించేది, స్థూలకర్మలకు కారణమైనది, ఈ శరీరమే. జ్ఞానహీనులైన మానవులు అంతరాత్మ దృష్టికి, ద్రష్టభావానికి ఎప్పుడూ దూరమే, కనుక, నేను ఈ దేహాన్ని, అని భావిస్తారు. ఘటాన్ని **''ఇది ఘటం''** అని భావించే వ్యక్తి, ఘటంకన్న భిన్నమే కదా. **''ఇది మోటరు కారు''** అని భావించేవ్యక్తి, ఆ కారులో కూర్చుని ఉన్నప్పటికీ ఆ కారుకన్న భిన్నమేకదా. అదే విధంగా రక్తవర్ణ జ్యోతిలో ఉంటూ, ఆ జ్యోతికి సాక్షిగా ఉంటూ, ఆ జ్యోతిని ''ఇది'' అని తెలుసుకున్నపుడు, అది, జ్యోతికి భిన్నమైన, పరిశుభ్రమైన, పరమాత్మ తత్వమే. ధ్యానానికి లక్ష్యం ఆ పరమాత్మ తత్వమే.

నిజానికి జడము, చేతనము – వీటి అర్థం, జ్ఞానప్రాప్తికి పూర్వం కూడా కొంత తెలిసి ఉంటుంది. జ్ఞానప్రాప్తి తర్వాత, ద్రష్ట– దృశ్యము ఒకే ఒక పరమ చైతన్యము, పరాశక్తి రూపము అవుతాయి. స్థూలంలో మిళితమై, స్థూలంగా కనిపించే ఆ ద్రష్ట పురుషుడు, అందరి ఆత్మ. శాస్త్రాలు, దీన్నే **''విజ్ఞాన మానంద బ్రహ్మ''** అని పేర్కొన్నాయి. శ్రీ గురుకృపవల్ల జాగృతమైన కుండలినీశక్తి 72 కోట్ల నాడుల్లోకి ప్రవేశించి రక్త ప్రసరణాన్నీ ప్రాణవాయు ప్రసరణాన్నీ క్రమబద్ధం చేసి, అన్ని నాడులకూ శక్తి నిచ్చి, ప్రాణ శక్తిని అన్ని నాడులలోకి ప్రవహింపచేసి, శరీరానికే ఒక కొత్తరూపు నిచ్చి, ప్రతి నిత్యము కొత్త కొత్త పనులను చేయిస్తుంది. మేరుదండం మధ్య ఉన్న సుషుమ్న నాడిలోకి ప్రవేశించి, చక్రాలను భేదిస్తూ తన శక్తి చేత శరీరాన్ని ఆధ్యాత్మిక మార్గానికి అనుకూలంగా మారుస్తుంది. సిద్ధ విద్యను అభ్యసిస్తున్న సాధకులారా, ఈ సంగతిని జ్ఞాపకం పెట్టుకొనండి. పరాశక్తి మీ లౌకిక జీవితాన్ని కూడా తీర్చిదిద్దుతుంది. మీ పిల్లల జీవితాలను తీర్చి దిద్దుతుంది. మీకు ఈ జీవితంలో అవసరమైన వస్తుజాలాన్నంతటినీ సమకూరుస్తుంది. వాటిని రక్షిస్తుంది కూడా. మీరు ఎటువంటి పని చేయవలసి ఉన్నా దాని గురించి పరిజ్ఞానాన్ని మీకు కలుగచేస్తుంది. పండితులు సంసారమనీ, పరమార్థమనీ విభజన చేసినప్పటికీ తరచి చూచి నట్టయితే రెండూ ఒకటే. ఈ ప్రపంచము చిద్విలాసము, చిన్మయము; చిత్‌శక్తికి భిన్నమైనది కాదు; చిత్‌శక్తి యొక్క

కార్యము; అనాది కాలంనుంచి అనంతకాలం వరకు చిన్మాత యొక్క కొత్త కొత్త రూపాలను ధరిస్తూ ఉంటుంది. అందుచేత ఈ ప్రపంచం, చిదంబ స్వరూపమే. సిద్ధవిద్యార్థులు ఈ సంగతిని ఎన్నడూ విస్మరించరాదు. జడము, శూన్యము, నశ్వరము, దృశ్యము మొదలైన భావాలు లేదా విభజన, సంపూర్ణమైన జ్ఞానం కలిగేవరకు మాత్రమే ఉంటాయి. తుకారామ్ మహారాజ్ అంటారు: ''నేను ధ్యానం చేసి, అంతర్శక్తి వల్ల కలిగిన అనుభవం ద్వారా, అన్నీ పరమేశ్వరుడేనని తెలుసుకున్నాను''. ఆయన ఒక అభంగంలో ఈవిధంగా పేర్కొన్నారు :

**రక్త శ్వేత కృష్ణ పీత ప్రభా భిన్న। చిన్మయ అంజన సుదలేఁ డోళాఁ॥1**
**తేణేఁ అంజన గుణేఁ దివ్యదృష్టి ఝూలీ। కల్పనా నివాలీ ద్వైతా ద్వైత॥2**
**దేశకాల వస్తు భేద మావళలా। ఆత్మా నిర్వాళలా విశ్వాకార ॥ 3**
**నఝూలా ప్రపంచ ఆహే పరబ్రహ్మ। అహం సోహం బ్రహ్మ ఆకళలేఁ4**
**తత్వమసి విద్యా బ్రహ్మానంద సాంగ। తేఁచి ఝూలా అంగేఁ తుకా ఆతాఁ 5 .**

అనగా, నా గురువైన శ్రీ బాబాజీ కృపవల్ల ప్రాప్తించిన అనుభూతి - ఎఱుపు, తర్వాత తెలుపు, తర్వాత నలుపు, తర్వాత పసుపు రంగు జ్యోతి– దీనికన్న కూడా భిన్నమైన ఒక వెలుగు ప్రత్యక్షమైంది. ఈ చిన్మయి, అతిసూక్ష్మమైనది. అటువంటి దివ్యమైన ఆత్మజ్యోతిని నేను దర్శించాను. ఆ చిన్మయ అంజనం నా కనులకు తగిలింది. తగులుతూనే నాకు దివ్యదృష్టి లభించింది. దానితో ద్వైత, అద్వైత భావం నశించింది. నా దృష్టిలో అంతవరకు ఉన్న దేశకాల వస్తు భేదాలన్నీ తొలగిపోయాయి. దేశమూ లేదు, కాలమూలేదు. ఎటువంటి వస్తువూ లేదు. భేదభావమే లేదు. నా ఆత్మే విశ్వాకారంగా కనిపించసాగింది. ప్రపంచం అని అంటున్న ఈ విశ్వం, ఆత్మాకారంగా కనిపించసాగింది. ప్రపంచమే లేదు. ఉన్నది పరబ్రహ్మమే. ''అహం సోహం''ను ''నేనే బ్రహ్మను''గా ప్రత్యక్షంగా అపరోక్షజ్ఞానము అనుభవించాను. ''తత్త్వమసి'' అన్న వేదాంత వాక్యాన్ని అవగాహన చేసుకొనడం వల్ల బ్రహ్మానందం లభిస్తుందని చెబుతారు. ఆ బ్రహ్మానందం స్వయంగా నేను అయ్యాను. సాధనకాలంలో భిన్నభిన్నంగా కనిపించే ప్రపంచం నిజానికి పరమేశ్వరుడేనని అనుభవంలోకి వచ్చింది. తుకారామ్ చెబుతున్నాడు: ''నేను స్వయంగా పరిపూర్ణుడను'' అని. మంచిది.

మనం కూడా ధ్యానం ద్వారా ''ఎనిమిది జాన''ల రక్తేశ్వరి దర్శనం చేసుకున్న

తర్వాత, అంగుష్ఠ ప్రమాణంలో ఉన్న శ్వేత జ్యోతిలో ప్రవేశించి, అటువంటి సంపూర్ణమైన అనుభూతిని పొందవలసి ఉంది. అప్పుడే, ప్రపంచ వ్యాప్తంగా, ప్రపంచ రూపంలో పరమాత్మయే వ్యాపించి ఉన్నట్టు కనిపిస్తుంది.

చిచ్ఛక్తి సాధన వలన కుటుంబ జీవనం కూడా మెరుగవుతుంది. దీనిలో అతిశయోక్తిలేదు. శ్రీ శంకరాచార్యుల వారు చెబుతున్నారు:

**సర్వోఽపి వ్యవహారస్తు బ్రహ్మణా క్రియతే జనైః**
**అజ్ఞానాన్న విజానంతి మృదేవ హి ఘటాదికమ్ ॥65॥**

– అపరోక్షానుభూతి

అనగా మానవుడిద్వారా జరిగే వ్యవహారాలన్ని బ్రహ్మ యొక్క శక్తి వల్లనే జరుగుతాయి. కాని అజ్ఞానం వల్ల మానవుడికి ఇది తెలియదు. నిజానికి కుండవంటి మట్టి పాత్రలన్నీ మట్టితో చేసినవే కదా! సాలెపురుగు తన గూడును తన నుంచే తయారు చేసుకుని దానిలో తనే విహరిస్తుంది, చివరకు దానిని తనలోనే ఇముడ్చుకుంటుంది.

ఈ ప్రపంచమంతా చిత్‌శక్తిమయం కావడం చేత, ప్రపంచంలోని జడపదార్థాలన్నీ చిన్మాత్రరూపాలే కావడం చేత, ప్రపంచ వ్యాప్తంగా స్త్రీ – పురుషరూపాలలో ఉన్నది చిదంబే కావడం చేత, చిత్‌శక్తి కుండలిని జాగృతమైన తర్వాత, మీ వ్యావహారిక జీవనానికి కూడా మంచి జరుగుతుంది అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదని ఘంటా పథంగా చెప్పవచ్చు. మీరు మీ వైవాహిక జీవితంతోపాటు, మీ దైనందిన వ్యవహారాలతో పాటు మీ సాంసారిక జీవనంతోపాటు, పరాశక్తి కృపకు పాత్రులై మీ జీవితాన్ని సుఖమయము ఆనందమయము చేసుకోవచ్చు. మంచిది.

నేను ధ్యానం చేసుకునే సమయం రోజు రోజుకు ఎక్కువ కావడం ప్రారంభమైంది. ప్రతిదినము కొత్తకొత్త అనుభవాలు కలుగుతున్నాయి. ధ్యానంలో రక్తజ్యోతిలోని ఏదో ఒక స్థానంలో నాకు ఒక దివ్య చక్షువు లభించేది. దానితో నేను అక్కడ ధ్యానంలో కూర్చుని, సుకీలోని కుటీరాన్ని చూచేవాడిని. ఈ బ్రహ్మాండాన్నంతటినీ ప్రత్యక్షంగా చూడకలిగే వాడిని. ధ్యాన పరిధి ఎంతో విస్తరించి బ్రహ్మాండం దానిలో ఒక అంశంగా చూచాను. సాధక జనులారా, మీరు ఆశ్చర్యపడవద్దు. సందేహపడవద్దు. నేను మీకు ఆధునిక జడ విజ్ఞానం యొక్క ఉదాహరణ ఒకటి చెబుతున్నాను. అది మీ ఎదుటే ఉంది. దాన్ని మీరు సత్యంగా భావించి ఉపయోగించుకుంటున్నారు. మీరు

బొంబాయి నగరానికి చాలా దూరంలో కూర్చుని ఒక చిన్న రేడియో సహాయంతో బొంబాయి రేడియో స్టేషను నుంచి చెప్పే వార్తలను వింటున్నారు. ఒక చిన్న ముల్లును అటు ఇటు కదిలించి, ఢిల్లీ రేడియో స్టేషనునుంచి, కలకత్తా రేడియో స్టేషనునుంచి కూడా వార్తలను వినగలరు. దీని గురించి మీకు పూర్తి ఎఱుక ఉంది. ''వేవ్– బాండు'' మార్చినట్టయితే ఢిల్లీ కేంద్రం వస్తున్న స్థానంలోనే బహుశః అమెరికా లేదా ఇంగ్లాండు నుంచి వార్తలను వినగలరు. విభిన్న నగరాలు, విభిన్న దేశాలనుంచి శబ్దాలు, ఒకే అంగుళపు పరిధిలో వినిపిస్తాయి. ఇటువంటి జడపదార్థాల సహాయంతో, యంత్ర పరికరాల సహాయంతో, ఇంట్లో కూర్చుని, దేశదేశాల వార్తలు మనం వినకలుగు తున్నపుడు ధ్యానంలో విభిన్న స్థానాలనుంచి సమాచారాన్ని పొందడంలో ఎటువంటి ఇబ్బంది ఉండగలదు? ఎంత ఆశ్చర్యం! అంతేకాదు. ఇప్పుడు మరొక కొత్త యంత్రం కూడా వచ్చింది. టెలివిజన్. ఇది మీ విజ్ఞాన శాస్త్ర పరిజ్ఞానాన్ని మరింత బలపరు స్తుంది. వార్తలు చెప్పేవ్యక్తీ, వార్తలకు సంబంధించిన దృశ్యాలూ అన్నీ టెలివిజన్‌లో కనిపిస్తాయి. అందువల్ల మీ అంతర్జ్యోతిలో మొత్తం ప్రపంచం కనిపించడంలో విశేషమేమీ లేదు.

నా ధ్యాన సాధన రోజురోజుకు ఎక్కువకావడం ప్రారంభమైంది. ధ్యానంలో కూర్చుంటూ ఉండగానే ఒక కొత్తరకపు తంద్రావస్థ అనుభవంలోకి వచ్చేది. ఇప్పుడు పసుపురంగు జ్యోతి కనిపించడం ప్రారంభమైంది. అప్పుడప్పుడు ఎఱుపు, తెలుపు రంగులు కలిసిన జ్యోతికూడా కనిపించేది. అతి సుందరమైన పసుపురంగు జ్యోతిని తంద్రావస్థలో చూచినపుడు, కొన్ని ఇతర దేశాలు కూడా కనిపించేవి. ఈ కొత్త అవస్థ, సమాధి అవస్థను పోలినది. కాని ఈ సమయంలో నాకు స్పృహ పూర్తిగా ఉంటున్నది. ద్రష్ట– దృశ్య భావం ఉండేది. ఈ అవస్థలోకి ప్రవేశించిన కొంతసేపటికే ఎంతో ఆనందం కలిగేది. నా అలసట అంతా తొలగిపోయేది. ఇప్పుడునేను ధ్యానం చేసే సమయాన్ని ఎక్కువ చేశాను. శరీరం బలహీనం కాజొచ్చింది. కాలి పిక్కలు కూడా బలహీనం కావడం ప్రారంభమైంది. సప్తధాతువులు శుభ్రపడుతున్నాయి. అన్నం మామూలుగానే తింటున్నాను. మల మూత్రవిసర్జన తగ్గిపోతూ ఉంది, మలం గట్టిగా రాయిమోస్తరుగా ఉండేది. దానిలో దుర్గంధం తగ్గిపోయింది. చెమటలోకూడా దుర్గంధం తగ్గిపోయింది. శరీరం, ఇదివరకు ఉన్న విధంగానే పుష్టిగా కనిపించినప్పటికీ, తేలికగా, చురుకుగా, ఉత్సాహంగా ఉండేది. ప్రేమ భావం కలిగి, తన్మయత్వంతో తోటలోని ఏకాంత ప్రదేశంలో అప్పుడప్పుడు వేగంగా నాట్యం చేసేవాడిని.

పద్మాసనం బాగా స్థిరపడింది. ఒక్కొక్కసారి మూడుగంటలసేపు ఏకధాటిగా కూర్చునేవాడిని. ఆ తర్వాత నాలుకకు కూడా ఒక కొత్త విచిత్రమైన క్రియ ప్రారంభమైంది. ఒక్కొక్కసారి నాలుక ఊమ్ము వరకు వచ్చేది. ఒక్కొక్కసారి పైన అంగిట్లో తగిలి కొంత సేపు అక్కడనే ఉండేది. కాని ధ్యానం ముగిసిన తర్వాత మామూలు స్థితికి వచ్చేది. ఈ విధంగా అనేక ప్రకారాలైన అలౌకికమైన క్రియలు జరుగడం ప్రారంభమైంది. తంద్రావస్థలో చాలాసార్లు దృష్టాంతాలు కనిపించేవి. సాధనలో ధైర్యమూ, గురుదేవుడి పట్ల భక్తి శ్రద్ధలూ చిన్మాతపట్ల సంపూర్ణమైన సమర్పణ భావమూ ప్రారంభమయ్యాయి. ధ్యానంలో ఏదో ఒక రూపం వచ్చి, ఈ విధంగా చెప్పేది: ''నీ నాలుక కిందికి దిగి, హృదయ కమలాన్ని తెరిచే గొప్పపని చేస్తూ ఉంది. పైకి వెళ్లి అంగిట్లో కొట్టుకోవడం ఉన్నదే, అది, 'ఖేచరి' ముద్ర. దీనివల్ల నీకు ఉన్నతమైన స్థితి లభిస్తుంది.'' నాలుక, పైన అంగిట్లో తగలడం వల్ల, సహస్రారానికి మార్గం తెలుచుకుంటుంది. సహస్రారంలో సహస్రకిరణాలమధ్య విరాజమానమై ఉన్న పరమశివుడిని కలుసుకునేందుకు, జాగృతమైన మహాశక్తి కుండలిని యొక్క ప్రక్రియే ఇది. అప్పుడప్పుడు అన్ని చక్రాల దేవతల దర్శనం, అక్కడ ప్రకాశిస్తున్న జ్యోతుల దర్శనం కూడా అయేది. కాని ఈ క్రియలన్నీ నా అధీనంలోలేవు. ఇవి పరాశక్తి ప్రేరితాలు. గురుకృపాప్రసాదం వల్ల మాత్రమే కలిగేవి. అప్పుడప్పుడు ధ్యాన సమయంలో నా రెండు కాళ్లు గట్టిపడిపోయి ప్రాణరహితమైనట్టు అనిపించేది. కాని ధ్యానం ముగిసిన తర్వాత మళ్లీ మామూలుగా ఉండేవి.

నేను ఆసనం మీద కూర్చుని ధ్యానం చేసుకొనడంలో ఒక విశేషం ఉంది. ధ్యానం కుదిరినా కుదరక పోయినా, నేను అనుకున్నంత సమయం కూర్చునే ఉండేవాడిని, చిత్తం ఏకాగ్రమైనా కాకపోయినా, అనుకున్నంత సమయం కూర్చు నేవాడిని. దీనివల్ల నాకెంతో ఉపయోగం ఉండేది. నా ప్రియమైన సిద్ధవిద్యార్థులారా జ్ఞాపకం పెట్టుకొనండి. పద్మాసనం వల్ల, 72 కోట్ల నాడులూ పూర్తిగా పరి శుభ్రమౌతాయి. నాడులు శుభ్రం కావడమే, నిజంగా పరిశుభ్రం కావడం. నాడుల్లో మురికి, దుర్గంధం, మలవికారాలతో కూడిన దోషాలు ఉన్నంతకాలం ఎటువంటి సుఖమూ లేదు. సాధక జనులారా, ఈ సంగతిని బాగా అర్థం చేసుకొనండి. మీరు నివసిస్తున్న ఇంట్లో మూలమూలల్లో మురికి నిండి, దుర్వాసనవస్తూ, ఈగలూ దోమలూ జుంయ్యిమని ఎగురుతూ మురికి కాలువనుంచీ పాకీ దొడ్డి నుంచీ దుర్వాసనవస్తూ ఉంటే మీరు హాయిగా ఉండగలరా? అదే విధంగా శరీరం మురికిగా రకరకాల వ్యాధులను కలిగి, నోరుదుర్వాసన కలిగి,

ముక్కునుంచి నీరుకారుతూ, గంటకు రెండు మూడు రుమాళ్లు అవసరమౌతూ, మీ నుండి వెలువడుతున్న దుర్గంధం మీ ప్రక్కన కూర్చున్నవారికి జుగుప్సను కలిగిస్తూ ఉన్నపుడు మీరుహాయిగా ఉండగలరా? బయటి శరీరానికి పూసుకునే అత్తరువంటి సుగంధద్రవ్యాలవల్ల, శరీరం లోపలి దుర్గంధం తొలగిపోతుందా? నటీనటులు అలంకరణకుపయోగించే రంగు రంగుల పవుడర్లు, పెదవులకుపయోగించే రంగు పదార్థాల వల్ల మీ ముఖం, మీరు కోరుకున్న విధంగా కాంతివంతమౌతుందా?

గుర్తుంచుకొనండి! **''శరీరమాద్యం ఖలు ధర్మ సాధనం''**. మూడుగంటల సేపు ఏకధాటిగా పద్మాసనంలో కూర్చున్నట్లయితే నాడులు పరిశుభ్రమౌతాయి. నాడులు పరిశుభ్రపడిన వెంటనే ప్రాణం, దానంతట అదే శుభ్రపడుతుంది. ప్రాణాయామం, ప్రయత్నపూర్వకంగా కాక సహజంగా జరుగుతుంది. శక్తిపాత సాధనలో, శ్రీగురుదేవుడి కృపద్వారా, ధ్యానసమయంలో ప్రాణాయామం దానంతట అదే జరుగుతుంది. నాడీ మండలం పరిశుభ్రపడిన తర్వాత ప్రాణం శుభ్రపడి, అంతఃకరణం యొక్క వ్యాపారాలు కూడా పరిశుభ్రపడతాయి. దీనివల్ల ధ్యానావస్థ, పై అంతస్థులకు వెడుతుంది. అందువల్ల ఆసనంలో కూర్చోవడాన్ని బాగా అభ్యాసం చేయండి. మంచిది.

ఇప్పుడు నా శరీరంలో ఒక విధమైన వేడి ఎక్కువ కావడం ప్రారంభమైంది. శరీరమంతా విపరీతంగా వేడెక్కేది. సహించలేక, చల్లబరచేందుకు ఎన్ని ఉపాయాలను చేసినా తగ్గేది కాదు. నిప్పులో ఉన్నట్టు ఉండేది. శరీరం క్షీణించడం మొదలు పెట్టింది. ముక్కునుంచి కనులనుంచీ నీరు కారడం ప్రారంభమైంది. అన్నానికి బదులు గంజి త్రాగడం ప్రారంభించాను. దాహం, విపరీతంగా ఎక్కువైంది. చల్లటి నీటిగుంటలో కూర్చున్నప్పటికీ చల్లగా ఉండేది కాదు. ఈ విధంగా ఉండగా, గణేశపురి నుంచి నిత్యానంద భగవానుడి సందేశం వచ్చింది. యేవలా నుంచి నేను హఠాత్తుగా వెళ్లిపోవడం, అక్కడి ప్రజలకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అక్కడి కుటీరపు కిటికీ తలుపులను కూడా వేయలేదు. అక్కడి నుంచి వెళ్లిపోయే ముందు ఎవరికీ చెప్పనుకూడా లేదు, వెళ్లిపోతున్నట్టు. వారు నిత్యానంద బాబాకు ఎఱుకపరచారు. నేను, చాలీస్‌గాఁవ్ పరిసరాల్లో ఉన్నట్టుకూడా ఆయనకు చెప్పారు. ఇప్పుడు ఆయన సందేశం వచ్చింది. నా సాధన సక్రమంగా జరుగుతూ ఉందనీ, నాకు జరుగుతున్నవన్నీ యదార్థమైనవనీ అంటూ, నన్ను, ధైర్యంగా సాధన చేసుకుంటూ ఉండవలసిందని కోరారు. నాకు చాలా సంతోషమైంది.

నా ప్రియమైన గురుదేవుడినుండి మరొక సందేశం కూడా వచ్చింది. సందేశం తెచ్చినవారు, నిత్యానందబాబా పరమభక్తుడైన శ్రీ నారాయణ సేండే. మా ఇద్దరికీ చాలా స్నేహం. ఆయనవస్తూనే, జేబునుంచి మేలురకం వట్టివేరు అత్తరు సీసా ఒకటి తీసి ఇచ్చారు. ''నాకోసం అత్తరు తెచ్చారా'' అని అడిగాను. ఆయన అన్నారు: ''స్వామీ, భగవాన్ నిత్యానందకు ఇచ్చేందుకు తీసుకువెళ్లాను దీన్ని ఇవ్వబోతుండగా ఆయనన్నారు: ''నువ్వు చాలీస్‌గాంవ్ - నాగద్ వెళ్లి అక్కడ ఇవ్వుదీన్ని'' అని. తీసుకోండి అన్నారు సేండే. తీసుకున్నాను. భగవాన్ ప్రసాదమిది. ఆ భావనతో మూతతెరిచి కొద్దిగా పూసుకున్నాను. మంచి సువాసన. భగవాన్ నిత్యానంద గురించి మాటలాడుకున్నాం. కొన్ని సంగతులు తెలిశాయి. ధ్యానం, సాధన ఇప్పుడు ఇంకా బాగా సాగుతున్నాయి. రెండవ రోజే భగవాన్ నిత్యానంద, ధ్యానంలోని తంద్రావస్థలో దర్శనమిచ్చారు. అక్కడకూడా వట్టివేరు అత్తరుసీసా ఇస్తూ అన్నారు: ''ధ్యానం యొక్క వేడి ఎక్కువవుతుంది. అది యోగం యొక్క దహించి వేసే తేజస్సు. ప్రతిరోజూ కొద్దిగా అత్తరు పూసుకో''. ఈ విధంగా ధ్యానంలో అత్తరూ, దానితో పాటు ఆయన సందేశమూ లభించాయి. ఎంతో సంతోషమైంది.

నేను ప్రతిదినము ధ్యానానంతరం భోజనం చేసి, మామిడి చెట్టుకింద కూర్చుని యోగాభ్యాసానికి సంబంధించిన పుస్తకాలను చదువుకునేవాడిని. యోగసాధన చేసేవారు సుగంధ పుష్పాలను ధరించాలని ఒక చోట పేర్కొని ఉంది. యోగాభ్యాసంవల్ల కలిగే వేడి, పుష్పధారణవల్ల, అత్తరువల్ల తగ్గే అవకాశం ఉంది. మనసంస్కృతి గుర్తుకొచ్చింది. మన సంప్రదాయంలో భగవంతుడిని మంచివాసన ఉన్న పుష్పాలతో కూర్చిన మాలతో అలంకరిస్తాం. మహాత్ముల దర్శనానికి వెళ్లే భక్తులు, సుగంధ పుష్పహారాలను తీసుకువెళ్లడానికి ఇదే కారణం. ఇవి అమూల్యమైన వనడంలో అతిశయోక్తిలేదు. పాదాలకు గంధం ఎందుకు పూస్తారో ఇప్పుడు అర్థమైంది. ఇప్పుడు రోజు తెల్లవారు జామున, మల్లెపూలదండ మెడలో వేసుకుని, ధ్యానానికి కూర్చుంటున్నాను. ధ్యానం తర్వాత అప్పుడప్పుడు ''హీనా'' లేదా ''వట్టివేరు'' అత్తరు పూసుకునే వాడిని. ధ్యానం బాగా ఎక్కువైంది. పసుపు - నీలం రంగులు కలిసిన ఒక జ్యోతి కనిపించడం ప్రారంభించింది. ఒక ప్రత్యేకమైన తంద్రావస్థ కలుగుతూ ఉంది. అప్పుడు కలిగే అనుభవం అత్యంత సుఖప్రదమైనది. జాగ్రదవస్థలో ఆహార పానీయాలవల్ల, దృశ్యాలను చూడడం వల్ల కలిగే సుఖం కన్నా ఇది గొప్పది. రాత్రిపూట స్వప్నాలతో కూడిన

నిద్రాలోకంలో అనుభవించే సుఖం కన్నా ఇది ఎక్కువ. ఇది ధ్యానానంతరం కలిగే తంద్రావస్థ సుఖం. నేను అప్పుడప్పుడు నిద్రావస్థను బాగా పరిశీలించాను. నిద్రవంటి తంద్రావస్థ ముందు నిద్ర ఎందుకూ పనికిరాదు. ఇవన్నీ పేలవమైనవని తెలియవచ్చింది. తంద్రావస్థలో లభించే సుఖాన్ని ఎక్కువ పరిమాణంలో అనుభవించసాగాను.

అప్పుడప్పుడు మూలాధారం నుంచి కంఠంవరకు వెండిరంగులో అందమైన స్తంభాన్ని పోలిన సన్నటి నాళం నిటారుగా కనిపించేది. ఎంతో ఆకర్షణీయంగా ఉండేది. అంతసన్నటి నాళంలో వెండిరంగు ప్రకాశం ఎక్కడిదో అర్థం కాలేదు. ఒక్కొక్కసారి ఒక్కొక్క చక్రంలో ఎవరో ఒక దేవత కనిపించేది. చక్రస్థానంలో కొద్దిగా బాధకూడా కలిగేది. ఒక్కొక్క సారి ధ్యానసమయంలో నాడీ మండలం, రక్తకోశం, మలకోశం, అన్నకోశం, తెఱుచుకుని కనిపించేవి. నాడులన్నిటిలో అనేకరంగులతో నిండిన జ్యోతి విస్తరించి ఉండేది. ఆ ప్రకాశంలోనే నాకు నాడులన్నీ స్పష్టంగా కనిపించేవి. శక్తియొక్క వేగం ఎక్కువకావడం, నాడుల్లోని స్పందనం ద్వారా కనిపించేది. ధ్యానానికి కూర్చుంటూనే, ప్రతిదినమూ, మొదట శరీరంలో ప్రాణవాయువు వేగంగా సంచరించేది. ఆ తర్వాత ఎఱుపు - తెలుపు జ్యోతులు దర్శనమిచ్చేవి. ధ్యానం జరుగుతూ జరుగుతూ లోకలోకాంతరాలు కనిపించేవి. దేవతలు, శివలింగం కూడా మాటిమాటికి దర్శనమిచ్చేవి. శ్వేతజ్యోతి కనిపించినవెంటనే, ధ్యానం సూక్ష్మ శరీరంలో జరిగేది. అంతరంగంలోనూ వెలుపలా వ్యాపించి ఉన్న స్థూల ప్రపంచం సూక్ష్మరూపంలో కనిపించేది. అటువంటిస్థితిలో సంపూర్ణమైన తంద్రావస్థ కలిగి, అనేక రకాల నాగులను, భయంకరమైన వాటిని చూచేవాడిని. వాటిని చూచినపుడు కొంతభయం కలిగేది. తర్వాత, ధ్యానంలో కలిగిన అనుభూతులను సూక్ష్మంగా మననం చేసుకునే వాడిని. ఇప్పుడు మాటలాడడం బాగా తగ్గిపోయింది. చదువుకొనడానికీ; ధ్యానానికీ, విశ్రాంతికి ఎక్కువ సమయం తీసుకోవడమే దీనికి కారణం. ఎప్పుడైనా భక్తమండలి వచ్చినపుడు వారితో కొంత సంభాషణ జరిగేది. కాని వేళ తప్పినట్టయితే తంద్రావస్థ కలిగేది కాదు. అటువంటి రోజున ఆనందం కూడా బాగా తక్కువగా ఉండేది. (ఇక్కడ పాఠకులు ఒకసంగతి గమనించడం అవసరం. తంద్రావస్థ కలిగేస్థానాన్ని ఇకమీద తంద్రాలోకం అని పేర్కొంటాను). మానసికంగా గాని, దైనందిన వ్యవహారాలకు సంబంధించిగాని ఏదైనా ఒకసమస్య ఉత్పన్నమైనట్టయితే ధ్యానలోకానికీ తంద్రాలోకానికీ వెళ్లడం

సాధ్యపడేది కాదు. అటువంటి రోజు కొంత విచారంగా ఉండేది. అందుచేత ఇతరులను కలుసుకోవడం వారితో మాటలాడడం మానుకున్నాను.

ఇప్పుడు నాకు ధ్యానంలో అప్పుడప్పుడు బాహ్య జగత్తులో జరిగే సంఘటనలు కనిపించేవి. దీనితో బాహ్య జగత్తుకు సంబంధించిన జ్ఞానం ఎక్కువ కావడం ప్రారంభమైంది. ధ్యానంలో శ్వేత జ్యోతి కనిపించినపుడు మధ్యలో హృదయ కమలం కూడా కనిపించేది. అక్కడి దివ్యమైన తేజస్సుతో కూడిన జ్యోతి, ఒక్క క్షణం మాత్రమే కనిపించేది. కాని ఆ క్షణం మాత్రం నన్ను మంత్ర ముగ్ధుడిని చేసేది. హృదయం యొక్క జ్యోతి, మెరుపు వేగంతో మెరుస్తూ ఉన్నపుడు అత్యంత సుఖప్రదము ప్రేమమయము అయిన పారవశ్యంతో పరిపూర్ణమైన ఆనందం ప్రాప్తిస్తుంది. అటువంటి సమయంలో మామిడిచెట్టు సమీపంలో ఉన్నట్టయితే ప్రేమతో దాన్ని గూడ ఆలింగనం చేసుకునేవాడిని.

ఏడు

# శ్వేతేశ్వరి

మెల్లమెల్లగా రక్తేశ్వరి తర్వాత పరిపూర్ణమైన శ్వేతేశ్వరి ధ్యానంలో స్థిరపడసాగింది. ఇప్పుడు అంగుష్ఠమంత శ్వేతజ్యోతి ఎట్ట ఎదుటవచ్చి నిల్చుంటున్నది. ధ్యానం స్థూల శరీరాన్ని విడిచిపెట్టి సూక్ష్మ శరీరంలో జరగడం ప్రారంభమైంది. ఇంతవరకు శ్వేతేశ్వరి అని వ్యవహరిస్తున్నది, అంగుష్ఠమంత ఆకారంలో ఉన్న సూక్ష్మ శరీరం. జీవాత్మ స్వప్నావస్థను అనుభవించేది ఈ శరీరంలోనే. జాగ్రదవస్థలో పడిన శ్రమనంతటినీ పోగొట్టుకుని కొంత విశ్రాంతిని అనుభవిస్తుంది. వేదాంతంలో 'సూక్ష్మశరీరం' గా వ్యవహరించేది దీన్నే. స్థూల శరీరానికి ఆధారం ఇదే. ఈ సూక్ష్మ శరీరం, ఓం కారంలోని రెండవ అక్షరమైన 'ఉ' కారం. ఈ శరీరంలో జీవాత్మను 'తైజస్' అని వ్యవహరిస్తారు. దీని ఉనికి కంఠస్థానం. శ్వేతజ్యోతి దర్శనం లేదా స్వప్నానుభూతి ఈ స్థానంలో ప్రత్యక్ష అనుభవంలోకి వస్తుంది. ఇటువంటి ప్రత్యక్షానుభవం లేని వేదాంతం నిరర్థకం, **'దర్వీపాక రసం యథా'** వంటిది, అనగా గరిటెకు సమానం. గరిటెకు వంట రుచి తెలియదుగదా.

ఇప్పుడు సూక్ష్మధ్యానం పై మెట్టుకు పోయింది. ప్రారంభంలో ధ్యానంలో నిద్రకొంత ఎక్కువగా వచ్చేది. తర్వాత తగ్గిపోయింది. సూక్ష్మధ్యానం ఎక్కువయ్యేకొద్దీ ముందు ముందు జరుగబోయేవాటి గురించి దృష్టాంతాలు చాలా కలిగేవి. ఎక్కడో జరుగబోయే అగ్నిప్రమాదం కనిపించేది. కారు ప్రమాదం కనిపించేది. రెండుమూడు రోజుల తర్వాత, అవి నిజంగా జరిగినట్లు తెలిసేది. దీనితో ధ్యానంలో రుచి ఎక్కువయ్యేది. ధ్యానం ఎంత గొప్పదో అని నా మనస్సు ప్రశంసించేది.

ఒక రోజు ధ్యానం ప్రారంభమౌతూనే, ఒక ఉయ్యాలలో ఒక అందమైన బాలుడు కనిపించాడు. ఒకటిన్నర సంవత్సరాల శిశువు, మెడలో ముత్యాలహారం, తలకు బంగారు కిరీటం, బాలుడి అలంకరణ అత్యంత అపూర్వమైనదిగా ఉంది. ఉయ్యాల బంగారంతో చేసినది. నవరత్నాలు పొదిగినది. అత్యంత అందమైన ఈ ఉయ్యాలలో

బాలుడు ఊగుతున్నాడు. పిల్లవాడిచుట్టు ప్రక్కల ఎవరూలేరు. అనేక రంగులు కలిపిన జ్యోతి మధ్య ఈ చక్కటి బాలుడు కనిపించాడు. నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకముంది, ఆ దృశ్యం. ఆ పిల్లవాడు నావైపు తిరిగి హాయిగా కిలకిలా నవ్వాడు. చిన్నచిన్న కన్నులతో నన్ను పిలుస్తున్నాడు. ఈ ధ్యానం ఎంత సంతోషదాయకమైనది! ఆరోజు నేను తంద్రాలోకాన్ని కూడా దాటి వెళ్ళాను, అక్కడ చాలాసేపటి వరకు ఏమీ కనిపించలేదు. నిరామయమైన స్థితి. ధ్యానం ముగిసింది. మళ్ళీ కనులు మూసుకొని ఆ బాలుడిని మనస్సులో ఊహించు కొన్నాను. కాని కనిపించలేదు. ఆ బాలుడు శ్రీహరి అని నాకు తోచింది. బాలుడి దర్శనమైన తర్వాత నా సాధన మరింత బాగా కొనసాగింది. ముఖ్యంగా రెండు మూడు రోజులు చాలా బాగా జరిగింది. ఒకసారి రాసి పోసి ఉన్న ముత్యాల హారాలు కనిపించాయి. మరొకరోజు ఒక అందమైన పాలిచ్చే ఆవు తన దూడతో పాటు నిల్చుని కనిపించింది. ఈ దూడ రంగుకూడా నాకు ధ్యానంలో బంగారపుటుయ్యాలలో కనిపించిన బాలుడి రంగే. ఈ చక్కటి దూడ, తల్లి దగ్గర పాలు త్రాగడం కూడా చూచాను.

ఇప్పుడు ధ్యానానికి కూర్చునేముందు ఒక కొత్త కుతూహలం కలిగేది. ఇవేళ ఏమికనిపిస్తుంది? ఇవేళ త్వరగా చీకటి పడితే బాగుండునే అనిపిస్తుంది. రాత్రి అనుకుంటాను, త్వరగా తెల్లవారితే బాగుండును, ధ్యానం చేసుకోవచ్చును, అని. ధ్యాన సమయంలో కనిపించే కొన్ని దృశ్యాలు నన్ను ఎంతగానో ఆకర్షించడమే దీనికి కారణం. ఇప్పుడు ఇది ఒక వ్యసనంగా మారింది. ధ్యానానంతరం, ధ్యానంలో కనిపించిన దృశ్యాలను పదేపదే నెమరు వేసుకునేవాడిని. శరీరం పులకితమయ్యేది. పారవశ్యంతో నా అదృష్టానికి పొంగిపోయేవాడిని.

ఆ విధంగా ధ్యానంలోనూ, ధ్యానంలో కనిపించిన దృశ్యాలను స్మరించుకోవడంలోనూ రాత్రీ పగలూ గడిచిపోయేవి.

ఎనిమిది

# కృష్ణేశ్వరి

శ్వేత ధ్యానం తరువాత ఇప్పుడు కృష్ణ ధ్యానం ప్రారంభమైంది. కృష్ణ అనగా భగవాన్ శ్రీకృష్ణుడు కాదు, కృష్ణవర్ణపు జ్యోతి. దీని పరిమాణం పర్వార్థం. అనగా, వేలి చివరి భాగమంత. ఇప్పుడు ధ్యానం మరొకమెట్టు పైకిపోయింది. ధ్యానం హృదయంలోగాని లేదా భ్రూమధ్యంలోగాని సహజంగానే స్థిరపడసాగింది. మొదట ఎఱుపు, తెలుపు, నలుపు జ్యోతులలో స్థిరపడేది. ఎఱుపు జ్యోతి మధ్యలో తెల్లటి జ్యోతి, తెల్లటి జ్యోతి మధ్యలో నల్లటి జ్యోతి కనిపించేది. ఈ మూడు జ్యోతులను చూస్తుండగా మధ్య మధ్యలో, అనేకరంగులు కలిసిన, మెరుస్తున్న జ్యోతులు కూడా కనిపించేవి. నల్లటి జ్యోతి కనిపించినప్పుడు మాత్రమే ధ్యానం పూర్తిగా జ్యోతిలో స్థిరపడేది. మనస్సు ప్రశాంతంగానే ఉండేదికాని, దానితోపాటు ఒక ఔత్సుక్యం, ఒక ఆశకూడా ఉండేది। ముందు ముందు ఇంకా ఏమి కనిపిస్తాయోనని. అందుచేత అప్పుడప్పుడు ప్రశాంతత తగ్గినట్లుగా అనిపించేది.

ఈ సమయంలో నేనొక్కొక్కసారి ధ్యానంలో అత్యంత భయానకమైన అంధకారాన్ని చూచేవాడిని. అటువంటి అంధకారాన్ని బాహ్య జగత్తులో ఎన్నడూ చూడలేదు. ఈ అంధకారంవల్ల, ధ్యానానికి కూర్చోవడానికే భయంగా ఉండేది. అయినప్పటికీ ఈ అంధకార స్థితిలో చాలా సేపు గడిపేవాడిని. తర్వాత తృటిలో దృశ్యం మారిపోయేది. మళ్ళీ అవే సుపరిచితమైన జ్యోతులు: రక్త - శ్వేత - కృష్ణ జ్యోతులు. వీటి ప్రకాశంలో మళ్లీ మళ్లీ ఆనందం కలిగేది. ఈ సమయంలో తలలోనూ భ్రుకుటిలోనూ ఎంతో నొప్పి పెట్టేది. అక్కడి చక్రాల్లో కూడా బాధకలిగేది. ఈ బాధ, కొన్ని రోజుల వరకు ఉంది. ఈ విధంగా జరుగుతూ జరుగుతూ నా రెండు కనులు గుండ్రంగా ఒకటే తిరిగేవి. విపరీతమైన నొప్పి పుట్టేది. ఎందుకో తెలిసేది కాదు. రెండు కనుగుడ్లు పైకి వెళ్లేవి. రెండు కనులు, చక్రాలు తిరిగినట్టు తిరిగేవి. ఈ విధంగా ఒక కొత్త అనుభవం ప్రారంభమైంది. కనులు తిరుగుతూ ఉన్నప్పుడు ప్రాణం కూడా మందగమనంలో, కంఠం నుంచి భ్రుకుటివరకు మాత్రమే సంచరిస్తున్నట్టు అనిపించేది. ఈ సమయంలో

నాకు ధ్యానంలో అనేక రకాల సువాసనలు వచ్చేవి. ఈ సువాసనలు మన ఈ ప్రపంచానికి చెందినవా కాదా అన్నది కూడా తెలియదు. అప్పుడప్పుడు ఈ సువాసనలు నాకు సమీపంగా ఉన్నవారికి కూడా తగిలేవి. నేను ధ్యానం చేసుకుంటున్న కుటీరం అంతా సువాసనలతో నిండిపోయేది. మధ్య మధ్యలో కనులు తిరగడం ఆగిపోయేది. అప్పుడప్పుడు కనుగుడ్లు పైకి పోయేవి. ఒక్కొక్కసారి కన్నులు కపాలంలోపలికి చూచేవి. అక్కడ నాకు ఒక సూర్యుడు కనిపించేవాడు. అతి దివ్యమైన తేజస్సు, ఈ సూర్యుడిది. అక్కడ కొన్ని నక్షత్రాలు కూడా కనిపించేవి. తర్వాత ధ్యానం ముగిసేది. తర్వాత శాంతంగా కుటీరం వెలుపల ఉన్న మామిడి చెట్టు కింద కూర్చునేవాడిని. నేను చూచే చిన్న-పెద్ద వస్తువులు - విషయాలన్నిటిని, తర్వాత మనస్సులో నెమరు వేసుకునేవాడిని. ధ్యానంలో కనిపించిన వాటిగురించి ఆలోచించేవాడిని.

తొమ్మిది

# పాముకాటు

ఒకరోజు తెల్లవారుజామున రక్త - శ్వేత - కృష్ణేశ్వరి మధ్యలో ధ్యానం స్థిరమైన వెంబడే మహా అంధకారమయమైన నగరం కనిపించింది. ఆ నగరంలో నేను ఎంత దూరం వెళ్లానో తెలియలేదు. ఆవిధంగా వెడుతూ, చాలా దూరం వెళ్లాను. జ్యోతిలోని దృశ్యం అతి త్వరగా మారిపోయింది. ఇదివరకటి రక్త - శ్వేత - కృష్ణేశ్వరిని చూస్తూ చూస్తూ నేను ఒక దట్టమైన అడవిలోకి ప్రవేశించాను. ఒక చెట్టు క్రింద కూర్చున్నాను. ఒక నల్లటి పాము అతివడిగా వచ్చి నన్నుకాటు వేసింది. దాని విషం నా శరీరంలో వ్యాపించింది. దానితో నాకు అంతిమ ఘడియలు సమీపించాయి. ఈలోపున యేవ్లాకు చెందిన ఒక సోదరుడు నాకు స్నానానికి ఏర్పాటు చేసేవాడు, అప్పుడప్పుడు వంట కూడా చేసిపెట్టేవాడు - వచ్చాడు. నన్ను రక్షించవలసిందని పరమ శివుడిని ప్రార్థించాడు. ప్రార్థనముగిసిన తర్వాత నేను, విషగ్రస్తమైన ఆ క్లిష్ట పరిస్థితి నుంచి బయట పడ్డాను. ఇదంతా నాటకం జరిగినట్టు జరిగింది. ఆ సంఘటన ఈ నాటికీ కనులకు కట్టినట్టు ఉంది. ఆ తర్వాత సాధనకు సంబంధించిన గ్రంథమొకటి లభించింది. ధ్యానంలో పాము కరవడం, సిద్ధయోగమార్గంలో ఒక గొప్ప అభయ చిహ్నమనీ, దృష్టాంతమనీ ఆ గ్రంథం చదివిన తర్వాత తెలిసింది. సాధకుడి ధ్యానమార్గం, ముందు ముందు ఇంకా పురోగమించగలదన్న విషయానికి ఇది తార్కాణం.

ఇప్పుడు ధ్యానం, ఒక్కొక్కసారి శ్వేతజ్యోతి మధ్య, ఒక్కొక్కసారి కృష్ణజ్యోతి మధ్య జరిగేది. కృష్ణజ్యోతి మధ్యలోనే నేను శ్రీశైలం ఆది పర్వతాలనూ అక్కడి పెద్ద పెద్ద గుహలనూ, ఆ గుహల్లో నివసిస్తున్న ఋషుల స్థావరాలనూ చూచాను. అప్పుడప్పుడు గిర్నార్ పర్వతాల్లోని గుహల్లో అనేక రకాల వెలుగులను చూచే వాడిని. ఎటు చూచినా ఎఱుపు - నీలం - పసుపు రంగులు కలిసిన ఒక అందమైన జ్యోతి ప్రకాశం కనిపించేది. ఆ దివ్యమైన తేజస్సు వెలుగులో అక్కడ ఉన్నవన్నీ నాకు కనిపించేవి. పాము కాటు తర్వాత మూడు నాలుగు రోజులకు నేను నాగలోకం చూచాను. నాలుగువైపులా పాములే పాములు. వాటికోసం అన్నివైపులా పూలతోటలు. అవి నీలపు ప్రకాశంతో మెరు

ష్తున్నాయి. అక్కడ ఒక పెద్ద తేజోవంతమైన పాము కనిపించింది. అటువంటివే అనేక దృశ్యాలు, అనేక నగరాలు, మనస్సులో కనిపించేవి. ఎంతో ఆనందాన్నిచ్చేవి.

ధ్యానం భంగమైన తర్వాత ప్రశాంతంగా ఉండేది. రోజు రోజుకూ మనస్సు కూడా ప్రశాంతమౌతూ ఉండేది. జ్యోతులు, జాగ్రదవస్థలో కూడా కనిపించ సాగాయి. గురుభావంలో పూర్తిగా లీనమైనప్పుడు, జాగ్రదవస్థలో వ్యావహారికంలో కూడా మూడు జ్యోతులు ఎట్ట ఎదుట కనిపించేవి. ఇప్పుడిక ఆనందపు వెల్లువ ఎక్కువకాజొచ్చింది. రక్త–శ్వేత–కృష్ణేశ్వరులు ధ్యానంలోనూ జాగ్రదవస్థలోనూ కూడా కనిపించేవి. తోటలో ఎక్కడికి వెళ్లినా అవే జ్యోతులు. నేను ఎక్కడ చూచినా అవే జ్యోతులు. ఇది ఎటువంటి అద్భుతమైన స్థితి అని ఆశ్చర్యం కలిగేది. నాగరాజు కాటులో ఎంత చమత్కారం. బహుశః పురోగమన పథంలో ముందడుగు వేసేందుకు గాను నాగేశ్వరుడు ప్రసాదించిన అనుగ్రహమేమో ఇది.

ఇప్పుడు నా చెవుల్లో నొప్పి ప్రారంభమైంది. నొప్పి చాలా ఎక్కువగా ఉండేది. కాని త్వరగా తగ్గిపోయేది. కనుగుడ్లు గుండ్రంగా తిరుగుతూనే ఉండేవి. కనులరెప్పలు మూతపడడం లేదు. రెండుగంటలసేపు తెరుచుకునే ఉండేవి. కనులు పెద్దవిగా కనిపించసాగాయి. వాటిని చూచి అందరూ తమలో తాము అనుకునేవారట, బాబా చాలా కోపంగా ఉన్నారు అని. ఎందువల్లనో అందరినీ కనులు పెద్దవి చేసి చూచేవాడిని. శాంతపడినట్లు నమ్మకం కుదిరిన తర్వాత అడిగేవారు: ''బాబా మీకు అంత కోపం ఎందుకు వచ్చింది'' అని. నేను సమాధానం చెప్పేవాడిని, నాకు కోపమూ లేదు తాపమూ లేదని. మంచిది.

ఈ విధంగా ఒకవైపు అన్ని అవయావలలోని నాడులలోను చిత్ర విచిత్రమైన క్రియలూ, మరొకవైపున ధ్యానానికి సంబంధించిన అనంతమైన అనుభూతులూ జరుగుతుండేవి. సాధన ముమ్మరంగా కొనసాగుతూ ఉంది. ఇప్పుడు ధ్యానంలో నేను చంద్రలోకం వెళ్లడం ప్రారంభించాను. చంద్రలోకం నిజంగానే ఉన్నది. అక్కడ ఉన్న వారందరూ సమవయస్కులు. అక్కడ ఒక ఉద్యానవనంలో పుష్పాలతో నిండి ఉన్న ఒక మార్గంలో స్త్రీ, పురుషులు నడుస్తూండగా చూచాను. అందరూ వయసులో ఉన్నవారే. అందరూ ఆరోగ్యంగా ఉన్నారు. నేను మాత్రం ఉద్యానవనాన్ని చూస్తూ ఆ మార్గానికి ఒకవైపున కూర్చున్నాను. అక్కడ సూర్యుడి తాపం లేదు. చల్లటి వెలుగు వ్యాపించి ఉంది. అక్కడ వర్షంగాని ఎండగాని ఉన్నట్లు లేదు. అక్కడి నగరాన్ని చూచిన నాకు ఆ విధంగా తోచింది. అన్ని గృహాలు వెండిబంగారాలతో కట్టి ఉన్నాయి. అక్కడ వృద్ధులే లేరు.

పది

# నరకము, యమధర్మరాజు దర్శనము

ఈ విధంగా కొన్ని రోజులు గడిచాయి, ఎంతో ఆనందంగా. మళ్లీ కృష్ణధ్యానం ప్రారంభమైంది. ఒకసారి ఒకలోకం కనిపించింది. మహామురికిగా ఉంది. సిద్ధ విద్యార్థులు ఈ విషయాన్ని అత్యంత శ్రద్ధగా చదవడం అవసరం. ఆ రోజు ధ్యానానికి కూర్చుంటూ ఉండగానే నా శరీరం మొత్తం అతివేగంగా కంపించడం ప్రారంభించింది. ఎవరి శరీరంలోనైనా భూత పిశాచాలుగాని లేదా దేవతలుగాని ప్రవేశించి సంచరిస్తున్నపుడు ఏ విధంగా ఉంటుందో ఆ విధంగా. ఈ అవస్థలో ఉంటూ, నేను ఎక్కడికో దూరంగా వెడుతున్నట్టు ధ్యానంలో చూచాను. ఎక్కడికి ఏ విధంగా వెడుతున్నదీ తెలియలేదు. నేను ఆసనం మీదే కూర్చుని ఉన్నాను. కాని, ధ్యానావస్థలో నేను చేరుకున్న ఆ ప్రదేశం అతిమురికిగా నరకతుల్యంగా ఉంది. నేను మాలిన్యం మధ్యలో ఉన్నాను. స్పృహ ఉంది నాకు. ముక్తానంద చెబుతున్నాడు, సిద్ధ విద్యార్థులారా దీన్ని శ్రద్ధగా చదవండి. ఎక్కడ చూచినా నరకతుల్యంగా ఉంది. ఇంతమాలిన్యం ఎన్ని యుగాలుగా పేరుకుని ఉందో! మహాబలేశ్వర్ మధ్యలో నిల్చుని ఎటువైపు చూచినా పర్వతాలే కనిపిస్తాయి. అదే విధంగా ఇక్కడ నాలుగువైపులా మలమే రాసిపోసి ఉన్నట్టుంది. ఎన్ని సంవత్సరాలుగా పేరుకున్నదో! కొంత దూరం వెళ్లిన తర్వాత నా పాదాలు దానిలోకి కూరుకుపోతున్నట్టు అనిపించింది.

నాలుగువైపుల నుంచి దుర్గంధం. వమనం చేసుకుంటే బాగుండుననిపించింది. తల తిరగడం ప్రారంభించింది. అక్కడి వీధులు సరిగాలేవు. నీళ్లు తక్కువ. ఉన్నవి కూడా మురికిగా ఉన్నాయి. స్త్రీ-పురుషులు ఎక్కువ మంది లేరు. ఉన్న కొంత మంది స్త్రీ-పురుషులు కూడా కురూపులూ వస్త్రహీనులూ, పెంట కుప్పల మీద విచారంగా కూర్చుని ఉన్నారు. ఇదంతా చూచి జుగుప్సకలిగింది. అతి కష్టం మీద ముందుకు సాగేందుకు ప్రయత్నించాను. అక్కడ వెలుగుమాత్రం ఉంది కాని సూర్యుడు కనిపించలేదు. సాధకులారా! నా ఈ అనుభవాన్ని గుర్తుంచు కొనండి. ఇక్కడికి వచ్చి నా తేజస్సునంతటినీ పోగొట్టుకున్నాను. ఎంతో కష్టపడి బయటపడే

మార్గాన్ని వెదికాను. కాని అదికూడా మలంతో నిండి ఉంది. ఇక్కడికి వచ్చి, ఎండిపోయిన ఒక పెంటకుప్పను చూచాను. పెద్ద పర్వతమంత ఉన్నది. దీనిమీద స్త్రీ-పురుషులు కూర్చుని ఉన్నారు. అంతా ఆశ్చర్యమయంగా ఉంది.

దీని తర్వాత నేను మరొక లోకంలోకి ప్రవేశించాను. పండ్లచెట్లు, పూల చెట్లతో నిండిన వనాలు ఉపవనాలు అనేకరకాల పశువులు గుఱ్ఱాలు మొదలైనవి కనిపించాయి. అక్కడ కొంత మంది మానవులను చూచాను. వారు దాదాపు 20 అడుగుల పొడవున్నారు. నల్లగా ఉన్నారు. దంతాలు పెద్దవి. అందరి చేతుల్లోనూ అయిదార డుగుల మెరుస్తున్న కత్తులున్నాయి. పెద్దపెద్ద అంకుశాలు కూడా ఉన్నాయి. కొంత మంది పట్టువస్త్రాలను ధరించి ఉన్నారు. కొంతమంది తోలు వస్త్రాలను మరికొంతమంది మామూలు వస్త్రాలను ధరించి ఉన్నారు. అందరి కన్నులు కోపంతో ఎఱ్ఱగా ఉన్నాయి. ఈ లోకంలో ఎక్కడా స్త్రీ కనిపించలేదు. నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అక్కడ నాకు ఇరవై అడుగుల ఎత్తు ఉన్న నల్లటి బఱ్ఱెలు కనిపించాయి. ఆ తర్వాత నేను అత్యంత ఆకర్షణీయమైన ఒక సరోవరాన్ని చూచాను. దానికి నాలుగువైపులా చక్కటి పక్షులు కలకల శబ్దం చేస్తున్నాయి. సమీపంలోనే ఒక అందమైన నది ప్రవహిస్తూ ఉంది. నాలుగు వైపులా ఉజ్వలమైన ప్రకాశం ఉన్నది అది సూర్యుడి ప్రకాశమా లేక మరొక వస్తువేదైనా ఉన్నదా తెలియలేదు. ఈ వెలుగు మధ్యలో పువ్వులతో అలంకరించిన కృష్ణ వర్ణపు బఱ్ఱె వీపు మీద పట్టు దుప్పటి పరచుకుని, ఒక నల్లటి దేవతాపురుషుడు కూర్చుని ఉన్నాడు. బఱ్ఱె కొమ్ములకు బంగారు పొదివి ఉంది. కాళ్లకు బంగారు గజ్జెలున్నాయి. దేవతాపురుషుడు ఎఱ్ఱరంగు పట్టువస్త్రం ధరించి ఉన్నాడు. మెడలో యజ్ఞోపవీతం, శిరస్సుమీద రత్నఖచిత కిరీటం ఉన్నాయి. ఆయన నాకు దాదాపు పదిఅడుగుల దూరంలో ఉన్నాడు. నేను ఆయన్ను చూచి మందస్మితం చేశాను. ఆయన కూడా నన్ను చూచి అభయ ముద్ర వహించి నవ్వాడు. ఇది జరిగిన కొంతసేపటికి ఇద్దరు యమదూతలు వచ్చి, నన్ను నరకకూపంలో నుంచి వెనక్కు తీసుకు వెళ్లి బయట పడవేశారు. నాకు యమధర్మరాజు దర్శనం అయిందని నేనెంతో సంతోషపడ్డాను. అప్పుడు ధ్యానం భంగమైంది. కుటీరంనుంచి బయటికి వచ్చాను. హృదయం ఎండిపోయి నట్టయింది. మంచినీళ్లు తాగుదామని ప్రయత్నించాను. కాని, వమనం కావడం ప్రారంభించింది. హృదయం గ్లానితో నిండిపోయింది. మూడు రోజులు భోజనం చేయలేక పోయాను. ఇప్పుడు కూడా ఆనాటి దృశ్యం జ్ఞాపకం

వచ్చినట్టయితే గ్లాని కలుగుతుంది. ఈ విధంగా ధ్యానం కలుగుతూ కలుగుతూ ఒకవేగం పుంజు కుంటుంది. నాలుక, పైన అంగిట్లో తగుల్కొంటుంది. కనుగుడ్లు పైకి పోతాయి. బాహ్యంలో జ్యోతి దర్శనమౌతుంది. ఈ విధంగా జరుగుతూ ఉంది. ధ్యానం బాగా జరుగుతూ ఉంది. మధ్యమధ్యలో తన్మయావస్థకూడా వస్తూ ఉంది. అటువంటి తన్మయ భావంలో, హృదయంలో హఠాత్తుగా మరణ భయం ఏర్పడుతుంది. ఇప్పుడే మరణిస్తాను. మృత్యువు వచ్చేసింది అన్నభయం కలిగి, ధ్యానం భంగమౌతుంది. అప్పుడప్పుడు హృదయాకాశంలో అంగుష్టాకృతిలో దివ్యమైన జ్యోతి దర్శనమిచ్చేది. దీనివల్ల ఎంతో సంతోషం కలిగేది. ఇప్పుడు ధ్యానక్రమం ఈ విధంగా జరుగుతూ ఉంది: తంద్రాలోకంలో ప్రవేశం, బాహ్య ప్రపంచంలోని అన్ని వస్తువులు మిశ్రమ జ్యోతిలో కనిపించడం, మృత్యువు ఎక్కడ వస్తుందో నన్న భయం కలిగి ధ్యానం భంగం కావడం.

పదకొండు

# బిందు భేదం

ఇప్పుడు రెండుకనుపాపలు సమానంగా ఉన్నాయి. రెండు కనులకూ మామూలు చూపు ఏర్పడి, ఒకే వస్తువు కనిపించడం ప్రారంభమైంది. దీన్ని శాస్త్రాల్లో ''బిందు భేదం'' అంటారు. ఆ తర్వాత కన్నులలో నీలపురంగు వచ్చింది. ఇది, శాంభవీముద్రకు పూర్వ సన్నాహం. సాధకుల్లో **నీలపు వెలుగు** కనిపించినపుడు వారి అదృష్టం ఫలించినట్లు చెప్పవచ్చు. బిందుభేద క్రియ జరిగినపుడు సాధకులు భయపడతారు, చూపు ఎక్కడ పోతుందోనని. నాకు బిందు భేదం జరిగినపుడు నా కనుపాపలు ఎంతో వేగంగా పైకీ కిందికీ అటూ ఇటూ తిరిగేవి. కనులు బయటికి వచ్చేస్తాయేమోనని అనిపించేది. చూచేవారికి కూడా భయం కలిగేది. కాని భగవతిని పూర్తిగా నమ్ముకున్నట్టయితే, అనగా – నేను చేస్తున్నది ఏదీ లేదు, అంతరంగంలోని పరమాత్మశక్తి వీటన్నిటినీ చేయిస్తున్నది – అన్న భావంతో ఉన్నట్టయితే అన్ని భయాలు తొలగిపోతాయి. కనుగుడ్లు తిరగడంవల్ల నేత్ర చక్రాల ఛేదనం జరుగుతుంది. చక్షుశ్చక్ర భేదనం వల్ల చక్షుర్దేవత ప్రసన్నమౌతుంది. మన శరీరంలోని ప్రతి ఒక్క ఇంద్రియానికి ఒక అధిష్ఠాన దేవత ఉన్న సంగతిని సాధకులు విస్మరించరాదు. చక్రాలు శుభ్రపడనంత వరకు ఇంద్రియాలు మామూలుగానే పనిచేస్తుంటాయి. కాని పరిశుభ్రపడిన తర్వాత వాటికి దివ్యమైన శక్తి లభిస్తుంది. చక్షుశ్చక్రాలు పరిశుభ్రపడిన తర్వాత చక్షుర్దేవత దివ్యదృష్టిని ప్రసాదిస్తుంది. దానితో దూరంగా ఉన్నవాటిని చూడగల శక్తి లభిస్తుంది.

ధ్యానంలో ఇప్పుడు కేవలం ఆనందమూ స్ఫూర్తీ ఎక్కువకావడమేకాదు, దానితోపాటు కనుల్లో చెవుల్లో భ్రూమధ్యంలో బాధకూడా కొంత ఎక్కువైంది. నొప్పితో పాటు రక్తేశ్వరి తర్వాత శ్వేతేశ్వరిలో, ఆ తర్వాత కృష్ణేశ్వరిలో ధ్యానం స్థిరం కాజొచ్చింది. ధ్యానానికి కూర్చుంటూ ఉండగానే, కొన్ని శారీరక క్రియలూ, నాడుల్లో ప్రాణ సంచారమూ, ఖేచరి ముద్రా జరిగేవి. ఆ తర్వాత ధ్యానం బాగా స్థిరమయ్యేది. ఈ విధంగా జరుగుతూ ఎంతో ఆనందం కలిగేది. కేవలం ఆనందం యొక్క స్ఫురణ మాత్రమే కాదు, నాకు జరుగుతున్నవన్నీ అర్థ మౌతున్నాయి కూడా. ఈ ఎఱుకలో

ఇప్పుడుకూడా ఎటువంటి మార్పు రాలేదు. అది యధాతథంగా ఉంది. ఇటువంటి ఎఱుక చాలా గొప్పది. అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది, నేను అర్థం చేసుకునే పద్ధతి కూడా కొత్తగా ఉన్నట్టు. సూక్ష్మాతి సూక్ష్మమైన విషయాలు కూడా జ్ఞాపకం ఉంటున్నాయి. మరిచిపోవడం లేదు. ఈ విషయంలో ఎంతో మెలకువగా ఉంటున్నాను. ఈ విషయంగురించీ, నా బుద్ధి పనిచేస్తున్న తీరుగురించీ తెలుసుకునేందుకు ప్రయత్నించేవాడిని.

ఇప్పుడు కామవాంఛ పూర్తిగా తొలగిపోయింది. ఒక కొత్త ప్రేమభావం ఉదయించింది. అది పెరిగి పెద్దదై అందరిపట్ల ప్రవాహంగా మారింది. నా మనస్సు విచారణ ప్రారంభించింది. ''ఇది మమత కాదా? ఇది మోహం కాదా? ఇది ఆసక్తి కాదా? నేను ఇప్పుడిప్పుడే కదా నాగద్ వచ్చాను. నాకు ఈ మామిడి చెట్ల పట్ల ఆసక్తి ఏవిధంగా కలిగింది?'' ఈ విధంగా విచారణ చేయగా తెలిసింది. వృక్షాలపట్ల ఆసక్తి పరమేశ్వరుడి ప్రేమకు ప్రతిబింబమని. భగవంతుడు అందరినీ అన్నిటిని ప్రేమిస్తాడు. దానికి కారణమంటూ ఉండదు. ఆయన ప్రేమ చాలా గొప్పది. పక్షపాతం లేనిది. భగవంతుడి ప్రేమ, మానవుల ప్రేమను పోలిన వ్యావహారికమైన ప్రేమకాదు. వ్యవహారిక ప్రేమ నిజానికి ప్రేమకాదు. అది వ్యాపారం. ఇచ్చి పుచ్చుకునేది. కసాయివాడు గొఱ్ఱెలను ఎంతో ప్రేమతో పోషిస్తాడు. దాన్ని ప్రేమ అనవచ్చునా? డబ్బు ఆర్జన దృష్టితో ప్రేమిస్తాడు. గొల్లవారు, ఆవులను బఱ్ఱెలను ప్రేమతో చూచుకుంటారు. పాలవ్యాపారానికే గదా? దాన్ని ప్రేమ అనగలమా? కర్షకుడు, తన పొలాన్ని ప్రేమిస్తాడు. దానికోసం ఎంతో శ్రమపడతాడు. ఇదంతా నిజమైన ప్రేమ అనగలమా? ప్రేమతోకూడిన ఈ వ్యవహారాలన్నీ ఇచ్చిపుచ్చుకునే వ్యాపారాలు మాత్రమే. నిజమైన ప్రేమ లేనిచోట ఏమి సుఖముంటుంది?

**ప్రేమ, హృదయం యొక్క అవ్యాజమైన స్నేహం.** మానవుడి ప్రేమకు ఏదో ఒక కారణముంటుంది. అది ప్రేమకాదు. స్వార్థం. భగవంతుడిప్రేమ ఒక్కటే నిర్మలమైనది. ఆయన స్వభావమే ప్రేమే. ఆయన కృపకూడ ప్రేమే. ఆయన ఇచ్చేది ప్రేమ. తీసుకునేది ప్రేమ. యావత్తు ప్రపంచం పట్ల భగవంతుడి దృష్టి ఒకేరకమైనది. భగవంతుడి ఈ సమదృష్టి వల్లనే, ఆయన ప్రేమపూర్వకమైన కిరణాలవల్లనే ఈ ప్రపంచం నడుస్తూ ఉంది. సాధకుడిలో అటువంటి పరమాత్మ భావం ఉదయించినపుడు అందరిపట్ల ప్రేమభావం ఉదయిస్తుంది. అప్పుడు సేవకుడు–సేవితుడు అన్నభావం ఉండదు. **గుణరహితమైన కరుణా భావమే ప్రేమ.** మంచిది.

ధ్యానంలో ఇప్పుడు మరొక అద్భుతం జరిగింది. నల్లటి అంధకారమయమైన లోకం తర్వాత, నా ఎదుట అందంగా అలంకరించిన ఏనుగును చూచాను. దానికి ఏడు ముఖాలున్నాయి. అందమైన వస్త్రాలతో అలంకరించి ఉన్న ఈ ఏనుగు మెడలో బంగారు–ముత్యాలు–మణులతో చేసిన హారాలున్నాయి. ఉదయపు సూర్యకాంతిలో ఈ ఆభూషణాలు మెరుస్తున్నాయి. ధ్యానంలో చాలాసేపు ఈ ఏనుగునే చూస్తూ ఉన్నాను. దానిగురించే ఆలోచిస్తున్నాను. ధ్యానం పూర్తయిన తర్వాత పురాణగ్రంధమొకటి చదివాను. దానిలోరాసి ఉంది, ఈ ఏనుగు ఇంద్రలోకానికి చెందిన ఐరావతమని. దీని దర్శనం పుణ్యప్రదమని కూడా తెలుసుకున్నాను. ఇప్పుడు ధ్యానం మళ్లీ ఉప్పెనలా వచ్చింది. ఎంతో ఉత్సాహం కలిగింది. రాత్రీ పగలూ ధ్యానం చేద్దామా అన్నంత ఉత్సాహం. కాని అది సాధ్యం కాదు. ధ్యాన వేగానికి, దాని వల్ల కలిగే అలసటకు, తాపానికి, ధ్యానం యొక్క మహిమకు తట్టుకునేందుకు శక్తి అవసరం. ధ్యానాన్ని మనస్వభావానికి అనుకూలంగా జీర్ణం చేసుకునే శక్తిని మనం సమకూర్చుకొనడం అవసరం. దానికి మంచి భోజనం – మంచి పనులు – బ్రహ్మచర్యం – వ్రత నియమాలను క్రమబద్ధంగా పాటించడం అవసరం. సంయమం లేనిచోట ధ్యానం వల్ల పూర్తి ఫలితం ఉండడం చాలా కష్టం. ధ్యానం చేసే వ్యక్తి, తననూ తన గొప్పతనాన్నీ పూర్తిగా అర్థం చేసుకొనడం ముఖ్యం. విశృంఖలంగా వ్యవహరించడం, అతిగా నవ్వడం లేదా రోదించడం, అనవసరమైన మాటలు, హద్దుమీరిన ఆహార విహారాదులు పనికిరావు. మీతోపాటు, మీ గొప్పతపస్సు ఫలితంగా ఉన్నపారమేశ్వరి అనుగ్రాహికా శక్తికి ఎటువంటి అపచారమూ జరుగకుండా చూడండి. ఆ విధంగా జరిగినట్టయితే మంత్రసిద్ధి, దూరదృష్టి, ఇష్టదేవతా దర్శనమూ, ఐహిక సంపద, వీటిని పొందడం నిలిచిపోతుంది.

నాకు బాగా జ్ఞాపకం ఉంది. ఎవరో అన్నారు: ''బాబాజీ, ధ్యానమైతే జరిగింది కాని ఆనందం లభించలేదు'' అని. మరొకరు అంటారు ''నాకు ధ్యానంలో అనేక దృష్టాంతాలు కనిపించాయి కాని ఒకటికూడా నిజం కాలేదు. అన్నీ అబద్ధాలే అయినాయి'' అని. ఈ విధంగా అనేవారందరికీ నేను చెప్పే మాట ఒకటే: ''మీరు ధ్యానానికి సంబంధించిన నియమనిష్ఠలను అన్నిటినీ సరిగా పాటించడం లేదు'' అని. ఒకరన్నారు : ''ధ్యానానికి కూర్చున్నపుడు భయం కలుగుతుంది'' అని. మరొకరు అన్నారు: ''ధ్యానంలో దిగుళ్లు ఎక్కువవుతున్నాయని''. ప్రియమైన సిద్ధ విద్యార్థులారా! మీ అంతరంగంలో క్రియారూపమై ఉంటున్న మహాశక్తి పట్ల

అపచారమూ అవహేళనా జరగడమే దీనికంతటికీ కారణం. ఎక్కడపడితే అక్కడ కూర్చోనడం, అయోగ్యులతో స్నేహం చేయడం వంటి చర్యల వల్ల పూర్ణ సిద్ధి ప్రాప్తించదు. ఆవిధంగా కాకపోయినట్టయితే సాధకుల్లో ప్రవేశించే ఒకే ఒక శ్రీగురుశక్తి, ఫలితాలను హెచ్చుతగ్గులుగా ఎందుకు ప్రసాదిస్తుంది? మంచిది.

ఇప్పుడు రెండు కనుపాపలు, గుండ్రంగా తిరుగుతూ తిరుగుతూ కేంద్రానికి చేరుకున్నాయి. రెండింటి బిందువులూ సమానమయ్యాయి. కన్నులు, ధ్యానంలో తిరుగుతూ తిరుగుతూ ఒకసారి పైకీ ఒకసారి కిందికీ వచ్చాయి. ఆ విధంగా జరుగగానే నువ్వుగింజంత చిన్నదీ ఎంతో ప్రకాశంతోకూడినదీ అయిన ఒక నీలబిందువు, కన్నులనుంచి విద్యుచ్ఛక్తి వేగంతో బయటికి వచ్చి, మళ్లీ కన్నులలోకి పోయింది. ఇది ఒక రహస్యమయమైన, గుప్తమైన, ఆశ్చర్యకరమైన క్రియ. చిన్న నీలబిందువు క్షణంలో దశదిశలను ప్రకాశవంతం చేస్తుంది. నేను పూర్వాభి ముఖంగా కూర్చుని ఉన్నట్టయితే పూర్వదిశ ప్రకాశించేది. దక్షిణాభిముఖంగా కూర్చుని ఉన్నట్టయితే దక్షిణదిశ ప్రకాశించేది.

సిద్ధవిద్యార్థులారా, మీకు ఆ బిందువు యొక్క మహిమ గురించి చెప్పనా? దాని గమనం, విద్యుచ్ఛక్తి వేగం కన్నా తీవ్రమైనది, చంచలమైనది. దానిని చూస్తుండగానే మనస్సులో అనేక రకాలైన భావాలు తల ఎత్తేవి. దానితోపాటు ''రాముడు-కృష్ణుడు-లేదా నా పరమారాధ్య దైవమైన పరమశివుడు కనిపిస్తారా? ఐరావతం తర్వాత ఎవరు వస్తారు?'' ఈ విధంగా దర్శనాలగురించి ఆశ ఎక్కువైంది. అయినప్పటికీ మనస్సులో సంతోషం, ఆనందం ఉన్నాయి. ఇప్పుడు నా దైనందిన కార్యకలాపం మారిపోయింది. పైన పేర్కొన్న ఫలితాల మూలంగా అంతరాత్మ సంతృప్తి చెంది, ఈ విధంగా అంటూండేది: ''నీకు భగవతి కుండలిని ప్రసాదం లభించింది'' అని. నేను మనస్సులోనే అందరినీ గౌరవించడం ప్రారంభించాను.

కనుగుడ్లు గుండ్రంగా తిరగడం ఆగిపోయింది. పైకి మాత్రమే తిరిగి ఉండేవి. నేనుకూడా పైకే చూస్తూ ఉండేవాడిని. కిందికి చూడడం కష్టంగా ఉండేది. అప్పుడప్పుడు కన్నులు తెఱుచుకునే ఉండేవి. భ్రుకుటిలో నొప్పిగా ఉండేది. దీనివల్ల రాత్రిపూట నిద్రపట్టేది కాదు. ఆ తర్వాత ధ్యానంలో, భ్రుకుటిలో ద్విదళ చక్రమధ్యంలో, దేవుడికి హారతినిచ్చినప్పుడు ఉండే వెలుగును పోలిన జ్యోతి ఏ మాత్రం కదలిక లేకుండా స్థిరంగా ఉండేది. దాని తేజస్సు, రూపము అనంతము. దాని సమక్షంలో

నా దర్శనశక్తి శిథిలమైపోయింది. నేను స్పృహను కోల్పోయినట్టు దానినే చూస్తూ ఉండేవాడిని. జాగృతమైన కుండలిని, సహస్రారానికి వెళ్లేమార్గం దీని ప్రక్కనే ఉంది. అదే సిద్ధమార్గం. గురువు యొక్క కృప పరిపూర్ణంగా ఉన్నపుడే, ఆ మార్గం దారి ఇస్తుంది. ఎంత భక్తి ఉన్నా, ఎంత ధ్యానం చేసినా, ఎంత తపస్సు చేసినా, ఎన్నిరకాల యోగాభ్యాసాలు చేసినా గురుకృప లేనిదే ఈ మార్గం తెలుసుకోవడం కష్టం. దీనికి ఒక్కటే ఉపాయం "**గురుకృపాహి కేవలం, గురోరాజ్ఞాహి సాధనం.**"

ఇక్కడ కూడా చక్ర భేదనమైంది. ప్రాణశక్తి పైకి వెళ్లడం ప్రారంభమైంది. వత్తిలేని దీపపు జ్యోతి కూడా కనిపించింది. ఇప్పుడు మనస్సు ఆనంద పారవశ్యంలో ఓలలాడుతూ ఉంది. నేను జ్యోతిని చూచిన స్థానం, మన దేశంలోని పవిత్రమైన నదులను పోలిన తల్లులు, తమ పాతివ్రత్యానికి చిహ్నంగా ప్రతిదినము కుంకుమ ధరించేచోటు. నిజానికి ఈ కుంకుమ బిందువును భర్త పేరిట ధరించినా, అలవాటు ప్రకారం ధరించినా, నారీధర్మంగా భావించి ధరించినా, దాన్ని పెట్టుకునే స్థానం మాత్రం గురుపీఠం. గురుపీఠాధ్యక్ష దేవత, రెండక్షరాల ఆత్మ, హం-క్షం అన్న అక్షరాలతో పాటు నివసించేది ఈ స్థానంలోనే. మన ఉనికికి ఇదే మూలం. ఆ జ్యోతి సాక్షాత్తు మహాగురుదేవుడి రూపమే. మన తల్లులు, అక్కడ కుంకుమ ధరించి పరమాత్మకు నిత్యమూ పూజచేస్తున్నారు. ఇప్పుడు ఎటువంటి రోజులు వచ్చాయో తెలియదు కాని కొంతమంది తల్లులకు ఈ సంగతి జ్ఞాపకం కూడా ఉండడం లేదు. పరిస్థితులు విపరీతంగా మారిపోతున్నాయి.

అటువంటి దివ్యజ్యోతిని నేను చూస్తున్నాను. ఒక జ్యోతిగురించి ధ్యానం చేయగా చేయగా ఇప్పుడు నాలుగు జ్యోతులు కనిపిస్తున్నాయి. రక్తేశ్వరి నుంచి శ్వేతేశ్వరి, శ్వేతేశ్వరినుంచి కృష్ణేశ్వరి, కృష్ణేశ్వరి నుంచి నీలేశ్వరి, ఒకదాని తర్వాత మరొకటి కనిపించసాగాయి. ధ్యానానికి చెందిన ఒక్కొక్క స్థానాన్ని దాటుతూ పై మెట్టుకు వెడుతున్నకొద్దీ నా ఆనందం కూడా ఎక్కువ కాజొచ్చింది. ఈ ఆనందం మరొక రకమైనది. దృష్టాంతాలు కూడా మంచి మంచివి, కనిపిస్తున్నాయి. అవి నిజమవుతున్నాయి కూడా. నీలేశ్వరి దర్శనమైనప్పటి నుంచి, శరీర అవస్థ – మనఃస్థితి – అవగాహన చేసుకునే విధము – వీటన్నిటిలోనూ కొత్త మార్పులు కనిపించసాగాయి. సంతోషం ఎక్కువైంది. అత్యంత పవిత్రమైన, ఉన్నతమైన భావాలు స్ఫురించేవి. బాహ్య

వ్యవహారాల పట్ల ఆసక్తి లేదు. ఎప్పుడూ ధ్యానం గురించే ధ్యాస. ఇవేళ ధ్యానంలో ఏం కనిపిస్తుంది – అన్న ఒకే ఒక ఆశ, ఒకే ఒక రుచి. ఈ ఒక్క విషయమే, నా నిత్యకర్మ, నిత్యధ్యానము అయింది.

ఒకరోజు బ్రహ్మ ముహూర్తంలో లేచి ధ్యానానికి కూర్చున్నాను. శ్మశానంలో మండుతున్న చితి- జ్వాల కనిపించింది. దాని మధ్యలో ఒక తల్లి కూర్చుని ఉంది. ఆమె చుట్టూరా మంటలు వ్యాపించి ఉన్నాయి. ఆమె, మంటల మధ్య కూర్చుని ఉన్నా పూర్తిగా ధ్యానంలో మగ్నమై ఉంది. మంటల మధ్య కూర్చుని ధ్యానం చేసుకుంటున్న ఆస్త్రీని చాలాసేపు చూచిన తర్వాత నా ధ్యానం ముగిసింది.

ఇప్పుడు ధ్యానం పట్ల నా కోరిక, లోభికి ధనం పట్ల ఉన్న లోభాన్ని పోలి ఉంది; ధ్యానం గురించిన ఆలోచన, ప్రేమికుడు తన ప్రియురాలి గురించి ఆలోచించే విధంగా ఉంది; ధ్యానం గురించిన స్మరణ, పిచ్చివాడు ఒకే ఒక విషయం గురించి పదే పదే చెబుతున్నట్టు ఉంది. ఆ మరుసటి రోజు నుంచి, అర్ధరాత్రి 12 గంటలకే ధ్యానం ప్రారంభించాలని నిర్ణయించుకున్నాను. దీనికి కారణం, ఇప్పుడు ధ్యానం బాగా సూక్ష్మమైంది. బయటిశబ్దాలనూ ఏవైనా అంత రాయాలనూ సహించలేకుండా ఉన్నాను. ఎవరైనా కొద్దిగా గట్టిగా మాటలాడినా, ధ్యానం భంగమయేది. ఎవరైనా నవ్వినా, కుక్కలు అరిచినా ధ్యానం భంగమయేది. అలవాటైన పరిజనులు కూడా ఒక విధంగా అవరోధంగా అనిపించేవారు. వీరందరూ వెళ్లిపోతే బాగుండునని కూడా అనిపించేది. అటువంటి స్థితిలో, నాగద్‌లోని కుటీరంలో రాత్రి 12 గంటలకు ధ్యానానికి కూర్చోనడం ప్రారంభించాను.

ధ్యానం, ఎంతో ఉత్సాహంతో ప్రేమతో భక్తి శ్రద్ధలతో చేసేవాడిని. ఎవరికో భయపడికాదు. ఎవరినో ప్రసన్నం చేసుకునేందుకూ, ఏదైనా లాభానికీ, ఏదైనా కోరికతో, ఏదైనా లేదా ఎవరినైనా పొందడానికీ ధ్యానం చేయడం లేదు. శారీరిక మానసిక రోగాలనుంచి విముక్తి పొందేందుకు ధ్యానం చేయడం లేదు. సిద్ధులను పొంది పేరు ప్రఖ్యాతులను తెచ్చుకోవాలన్న కోరికతో ధ్యానం చేయడంలేదు. ధ్యానం చేయవలసిందని నన్ను ఎవరూ ఆజ్ఞాపించలేదుకూడా. ''ధ్యానం చేయడం మంచిది'' అని మన ధర్మశాస్త్రాల్లో పేర్కొని ఉన్నారు కనుక నేను ధ్యానం చేయడంలేదు. కేవలం భగవంతుడిపట్ల ప్రేమతో భగవతి చిత్‌శక్తి ఆకర్షణకు లోనై స్వస్వరూపం గురించి తెలుసుకునేందుకు ధ్యానం చేస్తున్నాను. ధ్యానానికి కూర్చున్న వెంటనే ధ్యాన నిమగ్నుడిని

అయేవాడిని. ఇంద్రియాలలో ఆయా ఇంద్రియాల అధిష్ఠాన దేవతలు దర్శనమిచ్చేవారు. ఒక ప్రత్యేక రకమైన – అనేక రంగులతో కూడిన జ్యోతి ఒకటి, 72 కోట్ల నాడుల్లో విద్యుద్వేగంతో ప్రవహించేది. దాన్ని చూస్తూ ఉండగానే రక్త–శ్వేత–కృష్ణ వర్ణ జ్యోతులతో పాటు ఇప్పుడు నీలేశ్వరి కూడా క్షణంసేపు దర్శనమిచ్చేది. ఈ జ్యోతులు ఒక దానిలో మరొకటి సూక్ష్మరూపంలో, ఒకదాని పట్ల మరొకటి కార్య–కారణ భావంతో, పెద్ద జ్యోతిలో చిన్నజ్యోతి – ఈ విధంగా ఒకదానికి మరొకటి ఆధారమై ఉండేవి.

పన్నెండు

# ఇంద్రలోక గమనం

ఒకరోజు ధ్యానంలో నేను ఒక మహానగరం చూచాను. దాన్ని చూస్తూండగానే నాకు గాఢ నిద్ర వచ్చినట్టయింది. దానితో నేను అక్కడ ఏమీ చూడలేకపోయాను. ఏమీ అర్థం కూడా కాలేదు. నేను అక్కడి ప్రేమజలంలో మునిగిపోతూ ఉన్నట్టు అనిపించింది. ఆ అంధకారంలో నుంచి నేను తంద్రాలోకంలోకి ప్రవేశించాను. అక్కడ, దూరంనుంచి ఒక రథం వస్తూ కనిపించింది. దాని నిర్మాణం విచిత్రంగా ఉంది. మానవులు అటువంటి రథాన్ని రూపొందించలేరు. రథంలో అమూల్యమైన రత్నాలు పొదిగి ఉన్నాయి. ఈ రత్నాలు జడం కాదు, చిన్మయ మైనవి. ఈ రథానికి చక్రాలు కనిపించలేదు. రథం అడుగుభాగంలో నాలుగు చిన్న చిన్న స్థంభాలున్నాయి. రథం నుంచి దివ్యమైన వెలుగుకిరణాలు బయటికి ప్రసరిస్తున్నాయి. ఆ కిరణాలనుంచి వెలువడుతున్న వెలుగు, ఎంతో మంది సూర్యుల ప్రకాశానికి సమానంగా ఉంది. రథం చుట్టూ వెలుగువ్యాపించి ఉంది. రథం భూమిని తాకకుండానే నడుస్తూ ఉంది. దాన్ని చూచి నాకు చాలా ఆనందమైంది. రథం నా సమీపానికి వచ్చి నిల్చుంది. దానిలోపలినుంచి మానవ రూపం ధరించిన ఒక దేవతాపురుషుడు బయటికి వచ్చాడు. ఆ దేవతా పురుషుడు తెల్లటి పట్టు వస్త్రాలను ధరించి ఉన్నాడు. పాదాలకు రత్నాలు పొదిగిన పాదుకలు. నడుముకు బెల్టు వంటి ఆభూషణం, మణులు చెక్కి ఉన్నది. ఇది ఈరోజుల్లో పురుషులు ధరించే తోలు బెల్టుకాదు. యజ్ఞోపవీతం ధరించి ఉన్నాడు. కంఠానికి ముత్యాలహారాలు, తలపైన రత్నఖచిత కిరీటం. ఆయన నుంచి వెలువడుతున్న అలౌకికమైన ప్రకాశం, నాముఖం మీద పడి విస్తరించింది. సమీపంలో ఉన్న మామిడి చెట్ల మీద కూడా పడింది. ఆయన చెవులకున్న కుండలాలు మెరిసిపోతున్నాయి. చేతిలో మెరుస్తున్న శస్త్రాన్ని ధరించిన ఆ దేవతా పురుషుడు, నన్ను చూచి మందహాసం చేశాడు, దేవభాషలో ''రథే ఉపవిశ'' (అనగా, 'రా, రథంలో కూర్చో') అన్నాడు.

నాకు సంస్కృత భాష అంత బాగా రాదు అప్పుడు. కాని, ఆయన చెప్పినది

మాత్రం అర్థమైంది. వెంటనే లేచి రథంలో కూర్చున్నాను. కూర్చున్నవెంటనే నాకు ఒక కొత్తరకమైన అనుభవం కలిగింది. బయటినుంచి, ఆ రథం, పది చదరపుటడుగుల మేర ఉన్నట్టు తోచింది. కాని లోపల చూద్దును కదా, చాలా పెద్దది. దానిలో అన్ని రకాల వసతులున్నాయి. నీళ్ళున్నాయి, చిన్న స్నానపు గది ఉంది. పడుకునేందుకు విడిగా ఒక గది ఉంది. పరుపుల అందం ప్రత్యేకమైనది. అవి అన్నీ నవరత్నాలతో పొదిగి ఉన్నాయి. ఈ నవరత్నాల వల్లనే వెలుగు విస్తరించి ఉంది. అక్కడ కూర్చునే స్థానం ఒకటి కనిపించింది. అది ఎంతో ఆకర్షణీయంగా ఉంది, విశ్రాంతిని కూడా కలిగించింది.

ఇంత చక్కటి రథగృహం లోపల అంతా చూపించి ఆ దేవతా పురుషుడు, నన్ను వాకిటి గదిలోకి తీసుకువచ్చాడు. వెంటనే రథం అక్కడినుంచి కదిలి విద్యుత్ వేగంతో ప్రయాణం చేస్తున్నట్టు నాకు తోచింది. నేను ఒక ఆసనంలో కూర్చున్నాను. ఆ దేవతాపురుషుడు, నా ఎదుట మరొక ఆసనంలో కూర్చుని ఉన్నాడు. ఆయన ధరించి ఉన్న రెండు రత్నాల వెలుగు నా మీద పడుతూ ఉంది. మేము ఒక విలక్షణమైన నగరంలోకి ప్రవేశించాము. అక్కడ అనేక రకాల సువాసనలను వెదజల్లుతున్న రంగురంగుల పుష్ప వృక్షాలు, తియ్యటి ఫలవృక్షాలు, కలకలనాదం చేస్తూ ప్రవహిస్తున్న నదులూ, రకరకాల ధ్వనులను చేస్తున్న పక్షులూ అనేకరకాల పశువులూ ఉన్నాయి. ఒక చోట నీలం-తెలుపు-పసుపు-నలుపు రంగుల్లో అందమైన హంసలు తిరుగాడుతున్నాయి. మరొక చోట బంగారు వన్నె కలిగిన జింకల మందలు నిర్భయంగా గంతులు వేస్తున్నాయి. వాటిలో కొన్నిటికి వజ్రపుకాంతీ వైడూర్యపు కాంతీ నీలాల కాంతీ కూడా ఉంది. మేలురకం జాతికి చెందిన ఆవులు-దూడలు కూడా కనిపించాయి. దివ్యమైన సువాసన భరితమైన గాలి వీస్తూ ఉంది. వీటన్నిటినీ చూచి ఎంతో సంతోషమైంది.

కొంతసేపైన తర్వాత రథం, నగరానికి ఒకవైపున కిందికి దిగింది. మళ్లీ లోపలి వైపు వెళ్లింది. ఆ నగరంలోని ప్రతి ఒక్క వస్తువు ప్రత్యేకంగా ఉంది. ఇటుకలు మట్టికూడా అలౌకికమైనవి. కాలువలు కూడా చిన్నచిన్నవి. అందంగా ఉన్నాయి. అది నిజంగా స్వర్గమే. అక్కడి వెలుగు, సూర్యుడి ప్రకాశానికి భిన్నంగా ఉంది. వెండి రంగుతో మిలమిలా మెరిసిపోతూ ఉంది, ఆ నగరం. చల్లగా ఉంది. వేడి ఏమాత్రం లేదు. చెట్లకున్న ఆకులన్నీ పచ్చగా ఉన్నాయి. కింద పడి ఉన్న ఆకులుకూడా

ఎండిపోలేదు. పాఠకులారా! గుర్తుంచుకొనండి. నేను ఈ దృశ్యాలన్నిటిని నాగద్‌లోని నాకుటీరంలో ధ్యానం చేసుకుంటూ తంద్రావస్థలో చూస్తున్నాను. మేము రథం దిగినచోట ఒక మహలు ఉంది. దాన్ని చేరుకునే మార్గం పొడవునా పువ్వులు పరచి ఉన్నాయి. మార్గానికి ఒకవైపున పురుషులు చేతుల్లో పూలమాలలను ధరించి ఉన్నారు. మరొకవైపున స్త్రీలు హారతిపళ్లాలను పట్టుకుని ఉన్నారు. మేం ఉభయులం, రథం దిగిన వెంటనే నామీద పుష్పవర్షం కురిసింది.

ఇప్పుడు నాకు అర్థమైంది, నాతో కూడా ఉన్న దేవతాపురుషుడు, స్వర్గలోకపు అధిష్ఠాన దేవత, శతక్రతువులను చేసిన ఇంద్రుడేనని. అతడు మానవ యోనిలోనే జన్మించి ఎన్నో పుణ్యకార్యాలను చేసి, ఈ లోకానికి రాజు అయే యోగ్యతను సంపాదించుకున్నాడు. నిజానికి ఇంద్రుడు అన్నిలోకాలకూ రాజు. మా ఇద్దరికీ హారతి ఇవ్వడమైంది. ఈ నగరంలోని ప్రజలందరూ నిరోగులు - శోకహీనులు - తరుణవయస్కులు. అందరిలోనూ ఒక వెలుగు ఉంది. శరీరం సన్నగా ఉన్నా పుష్టిగా ఉన్నారు. నేను ఇంతవరకు సంచరించిన ప్రదేశం, ఇంద్రుడి నివాసప్రదేశం. ఆ తర్వాత నేను ఇతర చోట్లకు వెళ్లాను. అక్కడ కూడా నాకు స్వాగతం లభించింది. ఇంద్రుడు నాతోపాటే ఉన్నాడు. అన్ని మార్గాల్లోనూ పువ్వులను చల్లి ఉన్నారు. ప్రతిచోటా బాలికలూ స్త్రీలూ మాకు హారతులనిచ్చారు. అన్ని ప్రదేశాలనూ చూచి మహలులోకి వెళ్లినప్పుడు అక్కడ-గాయకుల బృందం కనిపించింది. వారందరూ శాస్త్రీయ సంగీత విద్వాంసులు. ఈ ఇంద్రలోకం, కోరికలను తీర్చే పుణ్యలోకం. భోగప్రదానమైనది కావడం చేత దీన్ని **సకామలోకమని** కూడా వ్యవహరిస్తారు. చూస్తూండగానే నామెడలో ఒక ముత్యాలహారము ఒక పుష్పహారము వేశారు. ఈలోగా, మండపాన్ని పోలిన విమానరూపంలో ఉన్న, రత్నాలు పొదిగిన ఆ రథం మాముందుకు వచ్చి నిల్చుంది. ఇక తిరిగి వెళ్ల వలసిన సమయం వచ్చింది అనుకున్నాను. నేనూ ఇంద్రుడూ లోపలికి వెళ్లి మా పూర్వస్థానాల్లో కూర్చున్నాము. కొంత సేపటికి నేను మళ్లీ నాగద్ చేరుకున్నాను. చేరుకుంటూనే నా ధ్యానం ముగిసింది.

కనులు తెఱిచినా ఎదుట అదే దృశ్యం. మళ్లీ కనులు మూసుకున్నాను. అదే దృశ్యం కనిపిస్తూ ఉంది. ఆ దృశ్యాలు జ్ఞప్తికి వచ్చినపుడు ఎంతో ఆశ్చర్యం కలిగేది. బయట అటు ఇటు తిరగడంతో ధ్యానంలో వచ్చిన తంద్రావస్థ పూర్తిగా

తొలగి పోయింది. ప్రశాంతంగా కూర్చుని చూచిన వాటిని మననం చేసుకొనడం ప్రారంభించాను. అప్పుడు అది బాగా జ్ఞాపకం ఉంటుంది. ఆ విధంగా ముక్తానందుడి, అనంత మైన అనుభూతులతో నిండిన ధ్యానయోగం యొక్క యాత్ర ముందుకు సాగుతూ ఉంది.

స్వర్గ-నరక-నాగలోకాలను చూచిన తర్వాత, నాకు, శాస్త్రాల్లో పరిపూర్ణమైన శ్రద్ధ ఏర్పడసాగింది. నేను అంతవరకు ఆత్మప్రాప్తినే సత్యంగా భావిస్తూ వచ్చాను. స్వర్గం-నరకం-దేవలోకం వంటి వాటిలో నాకు శ్రద్ధలేదు. కాని, **శాస్త్రాలు సత్యమని ఇప్పుడు పూర్తి విశ్వాసమేర్పడింది.** మనకు అర్థం చేసుకొనడం చేతకాలేదు. ప్రాచీన కాలపు ఋషులు దూరదృష్టి కలవారు. వారు తమ యోగ బలంతో సర్వజ్ఞులైన పిమ్మటనే శాస్త్రాలను రచించారు. అందువల్ల అవి అన్నీ సత్యమే. నిజానికి మనం కొద్దిపాటి సాధనతోనే కొంత జ్ఞానాన్ని పొందుతున్నాము గదా, అటువంటప్పుడు పూర్తిగా సాధన చేసిన ఆ మహాపురుషులకు తెలయనిది ఏముంటుంది?

పదమూడు

# ప్రతీక దర్శనం

ఇప్పుడు నాకు ఒక కొత్త అనుభవం ప్రారంభమైంది. ధ్యానంలో జ్యోతులు కనిపించిన వెంటనే, నా ఎదుట, నేనే కూర్చుని ఉన్నట్టు కనిపించేది. కన్నులు తెఱచిన తర్వాత కూడా నేను ఎదుట కూర్చుని ఉన్నట్టు కనిపించేది. నేను ఏ పని చేసినా, ధ్యానంలో కూడా అదే పని చేస్తున్నట్టు నాకు కనిపించేది. కమలాపండ్ల తోటలో తిరుగుతున్నట్టయితే అక్కడకూడా అదే దృశ్యం కనిపించేది. ఇది ఒక కొత్త అనుభవం. ఇప్పుడు గురుదేవుడి జ్ఞాపకం మళ్లీ పదే పదే రాసాగింది. ఎప్పుడు అక్కడికి వెళ్లడం తటస్థిస్తుందో? నన్ను ఎప్పుడు పిలిపిస్తారో? ఈ విధంగా అనుకుంటూ ఉండగా నన్ను కలుసుకునేందుకు నా ప్రియమిత్రులు ముగ్గురు వచ్చారు. వీరు, సర్వశ్రీ నిగుడ్కర్ గురుజీ, జీవన్‌జీ దేసాయి, బాబూశెట్టి. వారు తెచ్చిన సందేశం విని గురుదేవుడి దర్శనానికి గణేశపురి వెళ్లాను. కొన్ని రోజులు అక్కడ ఉన్నాను. ఆ తర్వాత గాంవ్ దేవిలో భగవాన్ నిత్యానంద కట్టించిన మూడుగదుల ఇంటిలో నేను ఉండేట్టు ఆజ్ఞ లభించింది. ఇప్పుడు, నా నివాస స్థానం గురుదేవుడి సమీపంలోనే. గురుదేవుడిని చూడాలని అనిపించినపుడు దర్శనానికి వెళ్లేవాడిని. ప్రతిరోజు ఉదయమూ సాయంత్రమూ దర్శనానికి తప్పకుండా వెళ్లేవాడిని. అప్పుడప్పుడు గురుదేవుడి దగ్గర రాత్రంతా ఉండేవాడిని. ఇప్పుడు ధ్యానంలో ఒక్కొక్కసారి, నాకు, నేను కనబడేవాడిని. ఒక్కొక్కసారి గురుదేవుడు కనిపించేవాడు. నది ఒడ్డున ధ్యానం చేసుకునేవాడిని. అక్కడకూడా స్వయంగా నన్నే చూచుకునేవాడిని. గురుదేవుడికి దీని గురించి చెప్పాను. ఆయన అన్నారు : ''హుం బాగుంది'' అని. ఆ తర్వాత యోగ శాస్త్ర గ్రంథాలను అధ్యయనం చేసినపుడు తెలిసింది, దీన్ని ''**ప్రతీక దర్శనం**'' అంటారని. శరీరం పూర్తిగా పరిశుభ్రపడినట్టు దీనివల్ల తెలుస్తుంది. ఇప్పుడు శరీరం కృశించింది కాని శక్తివంతంగా ఉంది.

ధ్యానం ఇప్పుడుకూడా జరుగుతూ ఉంది. కృష్ణేశ్వరి ధ్యానం పూర్తయిన తర్వాత ఇప్పుడు ధ్యానంలో నీలేశ్వరి యొక్క మహత్తు ఎక్కువకాజొచ్చింది. నిజానికి కృష్ణేశ్వరి, కారణశరీరం. జ్ఞానేశ్వర మహారాజ్ దీన్ని **పర్వార్థం** అన్నారు. దీని స్థానం హృదయంలో

ఉంది. ఈ శరీరంలో సుషుప్తి అవస్థ కలుగుతుంది. ఇది ఓంకారంలోని 'మ'కారం. ఇది, నిరామయమైన, ఇంద్రియాతీతమైన అవస్థ. ప్రగాఢమైన నిద్రకలిగే స్థానమిది. స్వప్నాలవంటివి ఉండని స్థానం. ఏ కోరికలూ ఉండవు, కేవలం ఆనందాన్ని అనుభవించడం మాత్రం ఉంటుంది. ఈ స్థానంలో జీవాత్మను **ప్రాజ్ఞ** అని వ్యవహరిస్తారు.

ఈ విధంగా స్థూల-సూక్ష్మ-కారణ-మహాకారణ శరీరాల ద్వారా ప్రత్యక్ష అనుభూతులను పొందవచ్చు. నేను అనుభవించిన కృష్ణేశ్వరి అన్న కారణ శరీరం, తామరపువ్వుయొక్క మూడవ దళం. దీన్నే నేను పర్యార్థ ప్రమాణంగా పేర్కొన్నాను. మొదటి దళం రక్తవర్ణం, రెండవదళం శ్వేతవర్ణం, మూడవ దళం కృష్ణవర్ణం. సిద్ధ విద్యార్థులారా! మీరు ధ్యానంలో దీని అనుభూతిని పూర్తిగా పొందండి. ఇది యోగశాస్త్రానికి సంబంధించిన విషయం. క్రమబద్ధంగా అభ్యసించినట్టయితే ఇది ప్రాప్తమవుతుంది. ఋషులు, మునులు, దీన్ని **దేవయాన మార్గము** అంటారు. కుండలిని యోగం, మహాయోగం. అంతే కాదు, ప్రత్యక్ష ఈశ్వర వాదం. ఈ యోగంలో ప్రపంచము పరమార్థానికీ ఈశ్వరుడికీ భిన్నంకాదు. దీనికి 'సిద్ధమార్గమ'ని పేరు. ఇది ప్రత్యక్ష మోక్షమార్గము. మంచిది.

ఇప్పుడు ధ్యానంలో నీలాకాశం కనిపించసాగింది. దానితోపాటు అంత రంగంలో నుంచి అనంత సామర్థ్యపూర్ణమైన ఒక బిందువు కనిపించసాగింది. దానికి కన్నులు చెదిరిపోయేటంత వెలుగు. కనురెప్పలు మూసుకొనవు, తెఱుచుకొనవు. ఆ బిందువు నన్నెంతో ఆకర్షించింది. వెలుపలకూడా ఒక కొత్త జ్యోతి కనిపించసాగింది. ధ్యానం కుదిరిన వెంటనే కుండలిని మహామాయ అనేక రకాల రూపాలను ధరించి కనిపించేది. కాని ఇప్పుడు ఆమె ఎటువంటి రూపంలో కనిపించినా నేనుమాత్రం ఆమెను పరాశక్తిగాను, చిన్మాతగాను మాత్రమే భావిస్తున్నాను. నీలజ్యోతి కూడా వస్తూపోతూ ఉంది. ఈ విధంగా జరుగుతూ కనులు భ్రుకుటి వెనుక కొద్దిగా పైకి వెళ్లేవి. అప్పుడు కనులు ఎక్కడికో వెళ్లిపోయినట్టు ఉండేది. ఆ సమయంలో కపాలంలో కొన్ని ప్రత్యేకమైన క్రియలు జరిగేవి. అక్కడ కూడా కొన్ని చక్రాలున్నాయి. అవి పరిశుభ్రమయేందుకే ఈ క్రియలు జరిగేవి.

పద్నాలుగు

# నీలేశ్వరి

నా ధ్యానం ఇప్పుడు కృష్ణేశ్వరి నుంచి ముందుకు పురోగమించి నీలేశ్వరిలో జరిగేది. ధ్యానానికి కూర్చున్న వెంటనే శరీరమంతటా ప్రశాంతమైన క్రియలు, క్రియల అనంతరం నాడుల్లో కొత్తగా శక్తి ప్రసారం, దానితో పాటు రక్త- శ్వేత- కృష్ణ- నీల జ్యోతుల దర్శనం. ధ్యానం బాగా స్థిరంగా ఉండేది. అప్పు డప్పుడు గాఢమైన తంద్రావస్థకలిగేది. ఆ అవస్థలో లోకాంతరాల్లో పర్యటించే వాడిని. కూర్చుని ఉండే, అన్నిటినీ చూచేవాడిని. రోజూ ఏదో ఒక అనుభవం ఉండేది. శరీరం తేలికగా సన్నగా చురుకుగా ఆరోగ్యంగా శక్తివంతంగా తయారవుతూ ఉంది. ఇప్పుడు ధ్యానంలో మధ్యనాడి (సుషుమ్న) పూర్తిగా కనిపించేది. దాని రంగు, బంగారు కలిసిన వెండి రంగు. స్థంభాన్ని పోలి ఉండేది. అన్ని నాడులకూ స్ఫూర్తి కలిగేది అక్కడినుంచే. సాధకులు ధ్యానం చేసుకునే సమయంలో, వెనుక వైపున మూలాధారంలో నొప్పి పుట్టినట్టయితే దానికి కారణం, మధ్యనాడినుండి ఇతరనాడులకు శక్తి ప్రసరించడమే. అప్పుడప్పుడు హృదయంలో ఒక కొత్తక్రియ జరిగేది. ఆ క్రియ జరుగుతూనే కోడిగుడ్డు ఆకారంలో ఉన్న తేజస్సు దృష్టి గోచరమయేది. ఇదే అంగుష్ఠ ప్రమాణంగల జ్యోతిర్మయ పురుషుడి దర్శనం. శ్వేతాశ్వతర ఉపనిషద్ (3-13)లో దీని గురించి ఈ విధంగా వర్ణించి ఉన్నారు :

**అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మ సదా జనానాం హృదయే సంనివిష్టః**

అంతరాత్మ మానవుల హృదయాల్లో అంగుష్ఠమంత పరిమాణంలో సదా ఉపస్థితమై ఉంటుంది.

## పదిహేను

# సర్వజ్ఞ లోకం

ఇప్పుడు నాకు ధ్యానంలో రక్త-శ్వేత-కృష్ణ-నీల జ్యోతులకు భిన్నమైన ఒక జ్యోతి కనిపించసాగింది. దృష్టి గోచరమవుతూనే దానిలో అనేక లోకాలు కనిపించేవి. ఈ జ్యోతి లేత కేసరి వర్ణంలో ఉండేది. దీని మధ్యలో లేత నీలపు రంగులో అనంతమైన నిప్పురవ్వలు ఉండేవి. ఈ కేసరి వర్ణపు జ్యోతిలో లేత బంగారువన్నె కాంతి కూడా కనిపించేది. ఇది ఎంతో అందంగా హాయిగా ఉండేది, చూచేందుకు. నాకు ఇదివరలో ధ్యానంలో కనిపిస్తూ వచ్చిన నాలుగు జ్యోతుల మధ్యలోనే ఇది కూడా కనిపిస్తూ ఉంది. ఈ కొత్త జ్యోతి దర్శనమిచ్చినపుడు నా అంతరంగం ఈ దృశ్యాన్ని అతి జాగ్రత్తగా పరిశీలించేది. కారణం ఈ జ్యోతిలో నాకు అనేక దృష్టాంతాలు కనిపించేవి. ధ్యానం చేస్తూ చేస్తూ తంద్రాలోకానికి చేరుకున్నట్టుగానే జ్యోతిర్మయమైన ఈ లోకానికి కూడా చేరుకునే వాడిని. ఈ స్థానాన్ని ఇకమీద **సర్వజ్ఞలోకం** అని వ్యవహరిస్తాను.

ఈ స్థానం ప్రాప్తించిన ఋషులు, మునులు, సర్వజ్ఞులవుతారు. మన ప్రాచీన మహా ఋషులు, ధ్యానయోగం ద్వారా ఈ స్థానాన్ని ప్రాప్తించుకున్నారు. ఆ మహా ఋషులకు ఈ స్థానం, వారి ఇచ్ఛానుసారం జాగ్రదవస్థలో కూడా అనుభవంలోకి వచ్చేది. ధ్యాన యోగంలో పారమేశ్వరి పరాశక్తి కృపవల్ల మాత్రమే అప్పుడప్పుడు అక్కడికి వెళ్లే అవకాశం లభిస్తుంది. మనస్సు సర్వజ్ఞ లోకంలో స్థిరపడిన తర్వాత, నేను, చాలాదూరంలో ఉన్న అనేక లోకాలను చూచాను. నేను అవన్నీ చూడడం సత్యం. అప్పుడప్పుడు బాహ్యాజగత్తులో జరిగే ప్రమాదాలను, అగ్నిప్రమాదాలు - వరదలు వంటి వాటిని ధ్యానంలో చూచేవాడిని. ఇవి ఆ తర్వాత నిజంగా జరిగేవి. ఇటువంటి దృశ్యాలను నేను స్వప్రయత్నంతో చూడలేదు. కేవలం చిన్మాత భగవతియొక్క కృప మూలంగానే, ధ్యాన సమయంలో సర్వజ్ఞలోకంలోకి ప్రవేశించడం వల్ల ఇటువంటి భవిష్యత్ సంఘటనలు కనిపించేవి. అటువంటివే చాల ఆశ్చర్యకరమైన దృశ్యాలు కూడా కనిపించేవి.

కొంతమంది యోగులకు సిద్ధులు ప్రాప్తించేది ఇక్కడినుంచే. **మామూలు సిద్ధులు ధ్యాన సమయంలో త్వరగా లభిస్తాయి. కాని మంచి సాధకుడికి పూర్ణత్వాన్ని సాధించాలన్న కోరిక ఉంటుంది. అటువంటి సాధకుడే నిజమైన గురుపుత్రుడు. అటువంటి సాధకుడికి ఇటువంటి సిద్ధుల గురించి తెలియదు. తనకు ప్రాప్తించిన సిద్ధులగురించి ఇతరులకు ఏమీ చెప్పడుకూడా. ధ్యానయోగాన్ని అభ్యసిస్తున్న విద్యార్థులారా విద్యార్థినులారా, గొప్పదైన గురుభక్తి చేత మీ అంతరంగంలో ప్రత్యక్షంగా క్రియాశీలమై ఉంటున్న గురుకృపా శక్తిని భక్తిశ్రద్ధలతో సంరక్షించుకొనండి. మీ మహత్తును, గాంభీర్యాన్ని, భక్తిశ్రద్ధలను, పవిత్రమైన మీ శరీరాన్ని జాగ్రత్తగా కాపాడుకొనండి.**

ఇప్పుడు ప్రతిదినమూ నీలేశ్వరి యొక్క ధ్యానం జరుగుతూ ఉంది. అనేక దృష్టాంతాలు కనిపిస్తున్నాయి. నీలేశ్వరి యొక్క ధ్యానంలో ఆనందానుభూతి కలుగుతూనే నా చెవుల్లో లోపలినుంచి దివ్యమైన సంగీతం వినిపించసాగింది. మొదట ఎడమచెవిలో వినిపించింది. ఎడమచెవిలో నాదం వినిపించిన కొంత కాలానికే మృత్యువు సంభవిస్తుందని ఏదో ఒక గ్రంథంలో చదివాను. చాలామంది మిత్రులు నన్ను భయపెట్టసాగారు. నేనన్నాను: ''మృత్యువు నిర్ణీత సమయానికి – ముందు రాసిపెట్టిన విధంగా మాత్రమే వస్తుంది'' అని. ఈ విధంగా చెప్పి, నేను ధ్యానం చేసుకునే సమయాన్ని ఎక్కువ చేశాను. ఎంతో ప్రేమతో నీలేశ్వరిని ధ్యానం చేసేవాడిని. సంగీతధ్వనితోపాటు ఎడమ చెవిలోపల ఒకసూక్ష్మమైన ధ్వని వినిపించసాగింది. ధ్యానం, ఇంతకుముందుకన్నా ఎక్కువ సూక్ష్మమైంది. దీనికి రెండుకారణాలు, ఒకటి జ్యోతుల దర్శనం, రెండు సంగీత శ్రవణం. వీణ మీటిన ధ్వని కూడా అప్పుడప్పుడు వినిపించేది.

నాదం గురించి గురుదేవుడిని అడుగుదామని ఒకసారి కోరిక కలిగింది. గురుదేవుడి దర్శనానికి నేను ఎప్పుడూ ఒక నిర్ణీత సమయంలో వెళ్లేవాడిని. ఆరోజు మరొక సమయంలో వెళ్లాను. ఎదురుగా నిల్చున్నాను. నాకు తెలుసు, సర్వజ్ఞుడైన ఈ మహాముని తల పంకిస్తూ ప్రశ్నిస్తాడు ''ఏమి సంగతి?'' అని. అదే అయింది. ''హుఁ'' అంటూ ''ఏమిసంగతి'' అన్నట్టు తల ఆడించారు. నేను చెప్పాను, ''బాబా ఎడమ చెవిలో నాదం వినిపించినట్టయితే మరణం సంభవిస్తుందని అంటున్నారు''

అని. బాబా అన్నారు: '' ఎడమ ఏమి? కుడి ఏమి? రెండూ రాముడివేరా. అవును రెండు చెవులూ రాముడివే. నాదం చెవిలో కాదురా, కర్ణమూలంలో, **అంతరాకాశంలో''** ఇది వాస్తవం. నాదం ఎడమవైపున కాదు, కుడివైపునకాదు, ముందుకాదు, వెనకకాదు. అది, అంతరాకాశంలో వినిపించే దివ్యమైన రసభరితమైన దైవసంగీతం. అది చిదాకాశం నుంచి వెలువడే ధ్వని. అది అమంగళమైన మృత్యువును సూచించే ధ్వని కాదు. ఈ నాదం పరమాత్మ పదాన్ని ప్రసాదిస్తుంది. పశ్యంతి వాక్కుకూ చిన్మాత స్ఫూర్తికీ చెందిన మంత్రమిది. ఈ నాదం సహాయంతోనే యోగులు, జ్ఞానులు తమ మూలస్థానం గురించి తెలుసుకుంటారు. జ్ఞానేశ్వరమహారాజ్ అంటారు: **నాదాచీయే పైల తీరీ., తురీయాచియే మాఝే ఘర్.** అనగా, నాదానికి ఆవలివైపున నా తురీయ రూపగృహం ఉంది, అని అర్థం. అటువంటి మంగళప్రదమైన నాదం మృత్యు సూచకం కాదు. అది అమరత్వానికి సూచకం.

ఇప్పుడు నేను నీలేశ్వరిలో చిన్మాతయొక్క అద్భుతాలను చూస్తున్నాను. శ్రావ్యమైన నాదాన్ని వింటున్నాను. రోజూ ధ్యానం చేసుకుంటున్నాను. ధ్యానంలో తప్ప అన్యవిషయాల్లో రుచి ఉండడం లేదు. ఒకసారి ధ్యానం చేస్తూండగా రెండు కనులు పైకి వెళ్లిపోయాయి. పైకి వెళుతూనే తల క్రిందులుగా తిరిగాయి. తిరిగి అక్కడే స్థిరపడ్డాయి. పైన మధ్యలో తెల్లటి జ్యోతులతో నిండిన ఆకాశాన్ని చూచాను. ఆ ఆకాశానికి నాలుగు వైపుల దివ్యమైన నాదాన్ని వింటూ వింటూ ధ్యానం అక్కడనే స్థిరపడింది. ఆ క్షణంలో ఒక అత్యంత సుందరమైన దేదీప్యమానమైన నీల నక్షత్రం కనిపించింది. అది నీల బిందువు కాదు. కాని అనుపమ కాంతివంతమైనది. భూమి మీద ఒక్కొక్కప్పుడు సాయంత్రం పూట పశ్చిమం లోనూ, మరొకప్పుడు సూర్యోదయానికి ముందు తూర్పుదిశలోనూ మెరుస్తూ కనిపించే శుక్రగ్రహాన్ని పోలి ఉంది ఈ నక్షత్రం. అటువంటి రమణీయమైన ఈ నక్షత్రం సహస్రారంలోని ఊర్ధ్వాకాశం మధ్యలో స్థిరంగా స్థితమై ఉంది. దీన్ని చూస్తూ చూస్తూ ధ్యానకాలం పూర్తయింది. తంద్రావస్థ ముగిసింది. నేను బయటికి వచ్చి అటూ ఇటూ తిరుగుతున్నాను. గాంవ్‌దేవి మందిరం వెనుకవైపున ఉన్న పర్వతం మీదికి వెళ్లాను. ఆ నక్షత్రం ఏద్రై ఉంటుందని ఆలోచించసాగాను. గురుదేవ సిద్ధపీఠంలో ప్రస్తుతం తురీయ మందిరం ఉన్న చోట కూర్చున్నాను. అప్పుడు అక్కడంతా అడివి. అప్పుడప్పుడు నేను అక్కడ రాత్రి ఎనిమిది తొమ్మిది గంటల వరకు కూర్చునే వాడిని. ఆ రోజు అక్కడ కూర్చుని ఉన్నపుడు, ఒక

నక్షత్రం ఆకాశం నుంచి దిగివచ్చి, మళ్లీ దూరంగా వెళ్లిపోయింది. ఈ నక్షత్రం కూడా నేను ధ్యానంలో చూచిన నక్షత్రాన్ని పోలి ఉంది. నేను చూచిన నక్షత్రం ఏమై ఉంటుంది. అన్న ఆలోచన కలిగింది. అర్థం కాలేదు. మళ్లీ ధ్యానం – ఆనందం – పారవశ్యం – ప్రేమభావం కలిగేవి. ఈ విధంగా జరుగుతూ ధ్యానంలో మళ్లీ ఆ నక్షత్రం, ఆకాశం కనిపించసాగాయి. ఆ నక్షత్రం యొక్క తేజస్సు స్థిరంగా ఉంది. నిజానికి ఆ నక్షత్రం, శిరస్సు మధ్యలో సహస్రారంలో కనిపిస్తూ ఉంది.

ఇప్పుడు ధ్యానం అతి సూక్ష్మరూపాన్ని దాల్చింది. ఈ అవస్థలో ధ్యాన యోగులు అత్యంత సావధానంగా ఉండడం అవసరం. **నీలబిందు దర్శన మాత్రం చేత ముక్తి లభిస్తుంది. కాని, పరమాత్మ సాక్షాత్కారం సంపూర్ణంగా కలుగదు.** కొంతవరకే కలుగుతుంది. నీలేశ్వరిలోకి, దానిలోపల ఉన్న ఆత్మలోకి ప్రవేశించడం అవసరం. ముముక్షువులు నీలేశ్వరిని చూడకపోయి నట్టయితే, వారిస్థితి, శరీరాన్ని మాత్రమే చూస్తూ ఆత్మను చూడలేని అజ్ఞానులను పోలి ఉంటుంది. కానీ నీలేశ్వరి దర్శనం వల్ల సంతృప్తి మాత్రం తప్పకుండా కలుగుతుందన్నది మాత్రం సత్యం.

ఈశ్వరుడిని పూర్తిగా సాక్షాత్కరింపచేసుకున్న అదృష్టవంతుడు, భక్త శిరోమణి శ్రీ తుకారామ్ తన అమరకావ్యంలో ఈ విధంగా అంటున్నాడు :

**తిళా ఏవఢేఁ బాఁధూని ఘర్ । అంతరాహే విశ్వంభర్ 1**
**తిళా ఇతుకేఁ బిందులేఁ । తేణేఁ త్రిభువన కోందాటలే 2**
**హరిహరా చ్యా మూర్తీఁ । బిందుల్యాంత ఏతీ జాతీ 3**
**తుకామ్హణే హే బిందులే । తేణేఁ త్రిభువన కోందాటలే . 4**

సాక్షాత్కారానికి గాను సాధన చేసేవారు అంతఃసాక్షాత్కారాన్ని ప్రత్యక్షంగా చేసుకుంటారు. తుకారామ్ మహరాజ్ తమ ఈ కావ్యంలో అంటున్నారు :. విశ్వంభరుడైన పరమాత్మ నువ్వుగింజంత చిన్న గృహాన్ని నిర్మించుకుని దానిలోనే నివసిస్తాడు. విశ్వాన్నంతటినీ భరిస్తూ పోషిస్తున్నాడు కనుక ఆయన్ను విశ్వంభరుడని అంటారు. విశ్వానికి అధిపతి జీవులకు పరమాత్మ–ప్రాణులకు పరమగతి–యోగుల జ్ఞానుల భక్తుల ఆంతరిక జ్ఞానరూపి – సర్వజ్ఞుడు అయిన విశ్వంభరుడు, నువ్వుగింజంత గృహాన్ని నిర్మించుకుని దానిలో నివసిస్తాడు. నాలుగువైపుల విస్తరించిన బ్రహ్మాండమైన

చెట్టుకు మూలం ఒక చిన్న విత్తనం అయినట్లు అనంతమైన ఆకారాలను అనంతమైన శరీరాలను అనంతమైన రూపాలను ధరించే విశ్వంభరుడు నువ్వుగింజంత చిన్న ఇంటిలో ఉంటాడు. మరొక విధంగా కూడా చెప్పవచ్చు. నాలుగువైపుల విస్తరించి ఉన్న వృక్షానికి మూలం చిన్న బీజం. పెద్దవృక్షం, చిన్న బీజంలో ఇమిడి ఉంది. కాని బీజరూపంలో బీజానికి విడిగా అస్తిత్వం ఉంది. అదే విధంగా విశ్వంభరుడు, విశ్వమంతటా అన్నిటా పూర్తిగా వ్యాపించి ఉన్నప్పటికీ, బిందువుకన్నా చిన్నదైన ఇంటిలో ఉంటున్నాడు. ఒక బీజం నుంచి పుట్టిన వృక్షం నుంచి అనేక బీజాలు ఉత్పత్తి అయినప్పటికీ అది ఒకటే అయినట్టుగ, ఒక బిందువు అనేక రూపాలను ధరించినప్పటికీ తన మూలరూపాన్ని రక్షించుకుంటుంది. ఆ బిందువులో స్థితమై ఉన్న పరమాత్మ యొక్క ఏకత్వం నశించదు. దాని మూల శక్తి నశించదు. అది తన మహిమలో పరిపూర్ణము మరియు నిర్వికారము.

మరొక ఉదాహరణ ద్వారా దీన్ని మరింత స్పష్టం చేయవచ్చు. మానవుడు, మానవుడి నుంచే జన్మిస్తాడన్న సంగతి మనకు తెలుసు. అదికూడా పూర్తిగా అదే విధంగా. తండ్రియొక్క ఒక వీర్య బిందువు చేత పుత్రుడు ఉదయిస్తాడు. పుత్రుడు జన్మించిన తర్వాత, తండ్రియొక్క పూర్ణత్వం నశించదు. తండ్రియొక్క శక్తిసామర్థ్యాలు అంతకుముందున్న విధంగానే ఏలోపమూ లేకుండా, పరి పూర్ణంగా ఉంటాయి. తండ్రియొక్క బిందువునుంచి పుట్టిన పుత్రుడుకూడా తండ్రిని పోలిన పూర్ణుడు. పుత్రుడి రూపం, తండ్రిని పోలి ఉంటుంది. నడవడిక అలవాట్లు మొదలైనవి కూడా తండ్రిని పోలి ఉంటాయి. తండ్రే పుత్రుడి రూపంలో ఉన్నాడా అనిపిస్తుంది. అనగా పుత్రుడు పుత్రుడుకాదు, తండ్రి. ఈ సిద్ధాంతమే జగత్తుకు మూలం. పరమాత్మ స్వయంగా చిత్‌శక్తి సహాయంతో అనంతమైన జగత్తును తనలోనే సృష్టిస్తాడు. తను స్వయంగా దాని నుంచి వేరు అయినప్పటికీ, దానిలోనే వ్యాపించి ఉంటాడు. స్వయంగా తనలో ఒక గృహం నిర్మించుకుని దానిలో తనే నివసిస్తాడు. తుకారామ్ మహరాజ్ అంటున్నాడు: ''తిళా ఏవఢేం బాంధూని ఘర్, ఆంతరాహే విశ్వంభర''. ఎంత సత్యం! అనుమానాలను శంకలను తొలగిస్తుంది ఈ వాక్యం.

నువ్వుగింజంత చిన్నదైన బిందువు ఉన్నదే, అది ఆత్మయొక్క గృహం. దాని లోపల పరమేశ్వరుడుంటాడు. ఆయన పరిపూర్ణరూపుడైన ఆత్మదేవుడు. నీకు బిందువు దర్శనం

అయినట్టయితే, నీ అంతరాత్మ దానిలోపలే ఉందని తెలుసుకో. దాన్నే నేను నీలేశ్వరి అని వర్ణించాను. అదే నీలేశ్వరి. ''తిళా ఇతుకే''– అనగా నువ్వుగింజ పరిమాణం గల ఇల్లు వంటిది అని అర్థం. ఆ ఇంటిలో పరమాత్మ నివసిస్తాడు. తుకారామ్ అంటున్నారు: ''తిళా ఇతుకే బిందులే. తేణే త్రిభువన కోందాటలే.'' నిజానికి ఆ బిందువులో త్రిభువనాలు ఉన్నాయి. విచారణ చేయి. స్వర్గలోకం– మృత్యులోకం– పాతాళలోకం అనగా **భూర్భువః స్వః,** ఈ త్రిభువనాలు దానిలో ఇమిడి ఉన్నాయి.

జీవాత్మకు ఒకదానిలో మరొకటి ఇమిడిన నాలుగు శరీరాలు ఉన్నాయి. వీటిని నేను రక్తేశ్వరి, శ్వేతేశ్వరి, కృష్ణేశ్వరి, నీలేశ్వరి అని వర్ణించి ఉన్నాను. రక్తేశ్వరి, మీ స్థూల శరీరం. శ్వేతేశ్వరి, సూక్ష్మ శరీరం. కృష్ణేశ్వరి, కారణ శరీరం. నీలేశ్వరి, మహాకారణ శరీరం. మహాకారణం, నువ్వుగింజంత పరిమాణంలో నీలేశ్వరి మధ్య ఉంది. నువ్వు గింజంతటి ఆ నీల బిందువులో త్రిభువనాలు త్రిశరీరాలు ఉన్నాయి. ఈ సంగతిని మీరు ధ్యానసమయంలో పరిపూర్ణంగా అర్థం చేసుకుంటారు. అంతేకాదు, **హరిహరాచ్యా మూర్తీ, బిందుల్యాంత యేతీ జాతీ.** హరి – హరుడు – బ్రహ్మ – వీరు ముగ్గురు ఈ బిందువు నుంచే వస్తూపోతూ ఉంటారు. ఈ ముగ్గురికీ నివాసస్థానం ఈ బిందువు. సిద్ధమార్గంలో ఉన్న విద్యార్థులారా, మీకు ధ్యాన సమయంలో మీలోపల కనిపించిన ఆ బిందువు ఎంత గొప్పది; ఎంత పరిపూర్ణమైనది; ఎంత ఉన్నతమైనది; ఇప్పుడు గ్రహించగలరు. మీలోపల ఇంత చిన్న నీలేశ్వరిలో త్రిభువనాలకు చక్రవర్తి అయిన పరమేశ్వరుడు నివసిస్తున్నాడు. అందుచేత ఓ మానవుడా, పరమాత్ముడిని సగౌరవంగా, సత్సంగం ద్వారా నీలోపలే దర్శించుకో. నీలోపల అన్వేషించకపోయినట్టయితే నువ్వు ఏమి చూచినట్టు? పారిస్ – లండన్ – న్యూయార్క్ వంటి మహానగరాలను చూచిన తర్వాత కూడా నువ్వు ఈ భూప్రపంచంలో చూచినది ఒక మూల కొంత భాగం మాత్రమే. నీలోపల పరమేశ్వరుడు త్రిభువనాలతో పాటు నివసిస్తున్నాడు. ఈ మాటలు, కేవలం వినడానికీ వాటి గురించి ఆలోచించడానికీ కాదు. అభ్యాసం చేసి సాధ్యం చేసుకోవలసినవి. సాధ్యమయేవి.

ఈ నీలేశ్వరి మహాపవిత్రమైన తీర్థరూపం. జ్ఞానేశ్వరమహరాజ్ ఈ విధంగా చెప్పారు:

**డోళాంచీ పాహే డోళాఁ శూన్యాచా శేవట**
**నీళ బిందూ నీట లఖలఖీత.**

అనగా కంటికి కన్ను అయిన నీలబిందువు శూన్యానికి ఆవల ఉంది. ఇది మహాతేజోవంతమైనది. మిలమిల మెరుస్తూ ఉంటుంది. ఆ విధంగా మెరిసి పోతున్న నీలేశ్వరిని ధ్యానంలో ప్రత్యక్షంగా చూడవచ్చు. ఓ సిద్ధ విద్యార్థులారా, విద్యార్థినులారా, మీరు దీని దర్శనం చేసుకోవచ్చు. కాని ఒకటి గ్రహించండి. ఇంత గొప్ప వస్తువు దర్శనానికి మీరు అర్హతను పొందవద్దా? మీ ఆచార వ్యవహారాలు, మీ సాంగత్యం - భాష - ఆలోచనలు, ఉన్నతమైనవిగాను, పరమాత్మతో నిండి పోయినవిగాను మారినపుడు నీలబిందువు దర్శనం సాధ్యమవుతుంది. నీలబిందువు దర్శనం అయిన వ్యక్తి ఎంత పుణ్యాత్ముడు! స్కంద పురాణంలో ఈ విధంగా ఉన్నది:

**కులం పవిత్రం జననీ కృతార్థా**
**వసుంధరా పుణ్యవతీ చ తేన.**
**అపార సంవిత్సుఖ సాగరేస్మి-**
**ల్లీనం పరే బ్రహ్మణి యస్య చేతః.**

చిత్‌శక్తి జాగృతమైన సాధకుడి కులం యావత్తు పవిత్రమౌతుంది. ఈ శక్తి అందరినీ పవిత్రం చేస్తుంది. అటువంటి కుమారులను కుమార్తెలను కన్న తల్లి కృతార్థఅవుతుంది. అటువంటివారిని భరించే ఈ ధరిత్రిని కూడా పుణ్యవతి అంటారు. అటువంటి పుణ్యాత్ములు జన్మించిన కులం శ్రేష్ఠమైనది. చిత్‌శక్తి వికసించిన స్త్రీ, పురుషులు, బాల, బాలికలు, ఉన్న గృహం సర్వతీర్థాలతో నిండినది. దీనిలో సందేహం లేదు. అటువంటి పుణ్యాత్ముల అంతర్శక్తి వికసించిన వారి చిత్తము అపారమైన జ్ఞానానికి మరియు సుఖానికీ నిలయమైన పరబ్రహ్మలో లీనమౌతుంది. ధ్యానయోగ మార్గాన్ని అవలంబిస్తున్న విద్యార్థులు విద్యార్థినులు ఉన్న ప్రదేశం సకల తీర్థాల సంగమం. అటువంటి వారు పవిత్రమైన వారు. వారి దర్శనం చేసుకొనడం వల్ల పుణ్యం లభిస్తుంది. శ్రీమద్ భాగవతంలో కృష్ణ భగవానుడంటాడు:

**వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం**
**రుదత్య భీక్షణం హసతి క్వచిచ్చ**
**విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ**
**మద్భక్తి యుక్తో భువనం పునాతి.** (11-14-24)

గురుకృపా ప్రభావం వల్ల అంతర్శక్తి జాగృతమైన తర్వాత సాధకుడిలో దివ్యమైన ప్రేమ ఉదయిస్తుంది. కంఠస్వరం గద్గదమౌతుంది. మాటలాడినపుడు, నాలుగు వైపులా అపారమైన ఆనందాన్ని వెదజల్లుతాడు. మనస్సు ప్రేమతో పొంగిపొరలు తుంది. ప్రేమావేశంలో రోదిస్తాడు, నవ్వుతాడు, అభిమానాన్ని ఒదిలి గట్టిగా గానం చేస్తాడు, నృత్యం చేస్తాడు. సిద్ధయోగాన్ని అభ్యాసం చేస్తున్న అటువంటి సాధకుడు భగవంతుడికి పరమభక్తుడై మూడులోకాలను పవిత్రం చేస్తాడు. ప్రేమానందమయమైన చిత్‌శక్తి క్రియాశీలమైనపుడు నీలేశ్వరి దర్శనమైన వెంటనే అంతరంగంలో నుంచి ప్రేమ ప్రకటితమౌతుంది. దానితో కంఠం గద్గదమౌతుంది. మనస్సు ద్రవీభూతమౌతుంది. ధ్యాన నిమగ్నుడైన అటువంటి సిద్ధవిద్యార్థి, తన శరీరాలనన్నిటినీ పవిత్రం చేసుకుంటాడు. అటువంటి సాధకుడు ధ్యానం చేసుకునే ప్రదేశం పవిత్రమౌతుంది. అటువంటి భక్తులు తమ సంసర్గం చేత తీర్థస్థానాలనుకూడా పవిత్రం చేస్తారు. వారి హృదయంలోని చిత్‌శక్తి స్ఫురణయే శాస్త్రరూపంలో ప్రకటమౌతుంది కనుక శాస్త్రాలను పరమసత్యమైన శాస్త్రాలుగా మారుస్తారు. అన్ని కర్మలను మంగళ ప్రదం చేస్తారు. వారు చేసే కర్మలన్నీ చిత్‌శక్తి ప్రేరితమే కనుక అటువంటివన్నీ సత్కర్మలే అవుతాయి. నా గురుదేవుడు ఆశీర్వదించిన వారికందరికీ శుభమే జరిగింది. ఆయన చేత తిట్లు తిన్నవారికి కూడా శుభమే జరిగింది. అటువంటి మహాపురుషుల కర్మలన్నీ చిత్‌శక్తి ప్రేరణలేకదా. ఆయన భుజించగా మిగిలిన ఆహారంలో కూడా చిత్‌శక్తి ప్రవహించేది. ఆయన స్నానం చేసే గదిలో, అన్ని శుభాలను చేకూర్చే చిత్‌శక్తి పుంజం విరాజమానమై ఉండేది.

ఒకసారి వ్రాసుకుంటూండగా నా శరీరంలో తీవ్రమైన వేగం వచ్చింది. నా సమీపంలో కాలేజి పిల్లవాడొకడు నిల్చుని ఉన్నాడు. కొత్తవాడు. నేనన్నాను: ''నా తల భారంగా ఉంది, కొద్దిగా తలపట్టు'' అని. ఆ పిల్లవాడు తలపట్టాడు. పడుతూ పడుతూ నిల్చుని ఉండగానే అతడి శరీరంలోకి చిత్‌శక్తి ప్రవేశించింది. ఆ పిల్లవాడికి దివ్యమైన శక్తిపాతం కలిగింది. మహాముద్రవంటి ముద్రలను చేయడం ప్రారంభించాడు. ఈ విధంగా ఆ పిల్లవాడికి ఉన్నతస్థాయికి చెందిన యోగానుభవాలు కలిగాయి. చిన్మాత మహిమ అనంతమైనది. ఈ సంగతి, అనుభవించిన వ్యక్తికే తెలుస్తుంది. హృదయం నశించి, మనస్సు భ్రష్టమై, క్లేశాలతో నిండిన మూఢులకు చిత్‌శక్తి యొక్క గొప్పతనమూ రహస్యాలూ ఏ విధంగా తెలుస్తాయి? శూన్యంలో ఎటువంటి సాధన సంపత్తి లేకుండానే అనుపమమైన రమణీయమైన విశ్వాన్ని నిర్మించగల తల్లి, గురువుద్వారా ఏమి చేయించజాలదు?

మీకు ఒక ఆశ్చర్యకరమైన విషయాన్ని చెబుతాను. నేనుస్నానం చేసే గది ఎంతో బాగుంటుంది, అందంగా ఉంటుంది. నా స్నానాల గదిలో ఇంకెవరినీ స్నానం చేయనివ్వను. ఎన్నో సంవత్సరాల క్రితం దీక్ష పొందిన నా ప్రియ శిష్యుడు వెంకప్పను తప్ప ఇంకెవరినీ, దాన్ని శుభ్రం చేయడానికి కూడా అనుమతించను. అటువంటి చక్కటి పవిత్రమైన స్నానాలగది, శక్తి పాత దీక్షను ఇచ్చే యోగులకు చాలా అవసరం. మా గురుదేవుడు స్నానం చేసిన నీటిని తీర్థంగా భావించి మేము త్రాగేవారము. దాని నిండా చిత్‌శక్తి కిరణాలు ఉంటాయని మా విశ్వాసం. అందువల్ల ఎవరినీ నా స్నానాల గదిలోకి వెళ్లనిచ్చేవాడిని కాదు. ఒకరోజు, సిద్ధయోగాన్ని అభ్యాసం చేస్తున్న నాకు ప్రియమైన విద్యార్థి ఒకడు – ఎర్‌లైన్స్‌లో ఆఫీసరు – నా స్నానాలగదిని శుభ్రం చేసేందుకు అనుమతిని కోరాడు. ''సరే'' అన్నాను నేను. అతడు, గదిని శుభ్రం చేస్తూ చేస్తూ నాలుగు గంటల సేపు అక్కడే ఉన్నాడు. స్నానాల గదిలోని చిత్‌శక్తి కిరణాలు, అతడిని చుట్టుముట్టి, అతడి లోపలికి ప్రవేశించాయి. అతడికి శక్తిపాతం కలిగింది. నాలుగు గంటలసేపు సమాధి అవస్థలో ఉన్నాడు. '' ఇంతవరకు రాలేదేమా'' అని నేను అనుమానించి వెళ్లి చూద్దునుగదా, అతడు స్నానాల గదిలో హాయిగా పద్మాసనంలో కూర్చుని ఉన్నాడు. సమాధిస్థితిని భంగం చేసి అతడిని బయటికి తీసుకువచ్చాను. ఇప్పుడు, అతడు ధ్యానం చేసుకునే గదిలో ఇతరులకు కూడా ధ్యానావస్థ కలుగుతుంది.

సిద్ధ విద్యార్థుల శరీరాలనుంచి చిత్‌శక్తి ప్రవాహం ఈ విధంగా బయటికి వస్తూ ఉంటుందన్న సంగతిని చెప్పడానికి ఈ ఉదంతం చెప్పాను. మా గురుదేవుడు చేసే ప్రతిపనిలోను చిత్‌శక్తి కిరణాలు ప్రవహించేవి. అవి తగిలినవారు దివ్యమైన అనుభూతులకు లోనయేవారు. ఈ విధంగా సిద్ధపురుషుల ప్రతి ఒక్క క్రియలోను చిత్‌శక్తి స్వయంగా క్రియాశీలమౌతుంది. వారి చేతివ్రేళ్లు ఎవరికైనా తగిలినట్టయితే, వాటి నుంచి శక్తి ప్రసరించి, అవి తగిలిన వారిలోకి ప్రవేశించేది. గురుదేవుడి శరీరాన్ని ఎక్కడైనా తాకితే చాలు అక్కడ శక్తిపాతం జరిగేది. ఆయనది పాతవస్త్రం ఏదైనా ధరించినా చాలు, శక్తి ప్రవేశించేది. అందువల్ల ఓ సిద్ధ విద్యార్థులారా, మీరు ధ్యానం చేసుకునే ప్రదేశం, దేవుడి గృహం అవుతుంది. మీరు నివసించే ప్రదేశం మహాపుణ్య తీర్థమౌతుంది. పుణ్యతీర్థాలు మీవల్ల పవిత్రమౌతాయి. మంత్రం మీవల్లనే చైతన్య మౌతుంది. యోగాభ్యాసం చేసేవారు అభ్యసించే వివిధ రకాలైన యోగాసనాలు –

ముద్రలు – ప్రాణాయామం వంటి క్రియలు, యోగాంగాలు, నీ స్పర్శవల్ల ఇతరుల్లో వాటంతట అవే జరుగుతాయి. నీ శ్వాస – ప్రశ్వాసలు ఎంతో విలువైనవి. నీ శరీరంలోని ప్రతి రోమం నుంచి చిత్‌శక్తి కిరణాలు వెలువడుతున్నాయన్న సంగతిని విస్మరించవద్దు. అందుచేత అత్యంత మంగళప్రదమైన, పరమారాధ్య దైవమైన చిత్‌శక్తి క్రియాశీలమై చైతన్యరూపంలో నివసిస్తున్న పరమ పవిత్రమైన క్షేత్రం, నువ్వేనన్న జ్ఞానం కలిగి ఉండడం అవసరం. శ్రీ గురువే, పారమేశ్వరి అనుగ్రాహిక శక్తి రూపంలో మీ అందరి లోపల కూర్చుని ఉన్నాడు. అల్పులమనీ అజ్ఞానులమనీ మీరు అనుకోవద్దు. వయసులో చిన్నవారమనీ పరాధీనులమని కూడా అనుకోవద్దు. ఈ జగత్తుకు మూలమైన శక్తి, స్వయంగా జగత్తురూపంలో ఉన్నశక్తి, అటువంటి జగత్తును సృష్టించే చిత్‌శక్తి పారమేశ్వరి, నీలో ప్రత్యక్షంగా నివసిస్తూ ఉంది. అందుచేత, నువ్వు తీర్థాలకే తీర్థానివి, మంత్రాలకే మంత్రానివి. దేవతలకు దేవతవు. మరియు పూజలోని పవిత్రభావం స్వయంగా నువ్వే. నీ ఈ యోగ్యతను అర్థం చేసుకుని సావధానంగా నిర్మలంగా ఉంటూ, వీలైనంత వరకు మౌనంగా ఉంటూ సదాచార పరాయణుడివిగా జీవించు. పాశ్చాత్య ఆడంబరాలు, భ్రష్టమైన వ్యవహారాల వ్యామోహంలో చిక్కుకోవద్దు.

నేను ఒకసారి బొంబాయి వెళ్లాను. అక్కడ ఒక పెద్ద ఆఫీసరు నన్ను చూడడానికి వచ్చాడు. ఆయన పేరు ఇప్పుడు అప్రస్తుతం. నేను ఆయన్ను ప్రశ్నించాను: ''ఒక్కరే వచ్చారే అమ్మ (ఆయన భార్య) ఏదీ'' అని. ''ఆమె స్కూలుకు వెళ్లింది బాబాజీ'' అని సమాధానం చెప్పాడు ఆ ఆఫీసరు. నేను ఆశ్చర్యంతో ''ఈ వయసులో స్కూలుకా?'' అన్నాను. ''బాబాజీ ఆమె డ్యాన్స్ స్కూలుకు వెళ్లింది'' అన్నాడు ఆ ఆఫీసరు. ఆయన వెళ్లి పోయిన తర్వాత నేను అక్కడున్న వారిని అడిగాను ''ఈ డ్యాన్స్ స్కూలు ఏమిట''ని. పాశ్చాత్య పద్ధతిలో డ్యాన్సు నేర్పే స్కూలు అని వారు సమాధానం చెప్పారు. ఈ పద్ధతిలో కాళ్లూ చేతులూ ఆడించవలసి ఉంటుందని కూడా చెప్పారు. నేను మనసులో అనుకున్నాను ''ఇది నగ్నంగా నృత్యం చేయడమే''నని. పరపురుషుడి స్పర్శతో నేర్చుకునే నగ్న నృత్యం కన్నా, కుండలిని జాగరణం వల్ల సిద్ధ విద్యార్థులు – విద్యార్థినులు చేసే శాస్త్రీయమైన, భావముద్రా యుక్తమైన, కళాత్మకమైన, నృత్యం ఎంత మంచిది! అటువంటి పాశ్చాత్య డ్యాన్సు, మీ వంటి పవిత్రమైన సిద్ధ విద్యార్థులకు తగినది కాదు. పాశ్చాత్యులలో మరొక అలవాటుంది. చిన్న చిన్న బాల బాలికలు, ఒకరినొకరు రాసుకుంటూ, అనవసరంగా మాట్లాడుతూ నవ్వుతూ

ఎగురుతూ ఉంటారు. ఇటువంటి ప్రవర్తనవల్ల వారు అప్రయోజకులవుతున్నారు. మీరు, వారిని అనుకరించవద్దు. మీలోని శక్తి ఆగ్రహిస్తుంది. మీరు ఇంకొక సంగతిని కూడా గుర్తుంచుకొనడం మంచిది. వీర్యత్యాగం కన్నా మలత్యాగం శ్రేష్ఠం. ఈ సంగతి కేవలం బ్రహ్మచారులు సన్యాసులు సాధువులకు మాత్రమే సంబంధించినది కాదు. వారికి స్త్రీలతోగాని ఈ ప్రపంచంతోగాని ఎటువంటి సంబంధమూ లేదు. ఈ సంగతి సంసారులకే. ఈ ప్రపంచంలోనే ఉండండి, సంతోషంగా ఉండండి, భార్యాభర్తలు పరస్పర దైవభావనతో ప్రేమతో ఉండండి. మీమీ తేజస్సును పెంచుకొనండి. ఒక్కొక్కపైసాను జాగ్రత్తగా కూడబెట్టి పొదుపు చేసే విధంగానే వీర్యాన్ని కూడా పొదుపు చేసుకొనండి. ఒక్క బిందువు వీర్యం, ఒక తేజస్వీ మానవుడి జన్మకు మూలమన్న సంగతిని ఎప్పుడూ గుర్తుంచుకొనండి. ఆ బిందువు యొక్క తేజస్సు ఎంత విలువైనదీ ఆలోచించండి. ఈ తేజస్సు నష్టమై పోయినతర్వాత, ఎంతరంగు పూసుకున్నా ఎన్ని పౌడర్లు అద్దుకున్నా ఆ శరీరం కాంతి హీనంగానే ఉంటుంది. ఈ తేజస్సు చిత్‌శక్తి వాహనం. దీనితో చిత్‌శక్తిని కొనుక్కోవచ్చును. కుండలినిని క్రియాశీలం చేసే యంత్రమిది. సమాధిని స్థిరం చేయగల గొప్ప సాధనం. వీర్యహీనుడైన మానవుడికి ఎటువంటి దశ ప్రాప్తిస్తుందో జాగ్రత్తగా పరిశీలించినట్టయితే తెలుస్తుంది.

నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా, మీరు చిత్‌శక్తియొక్క సజీవ స్వరూపాలు. అందుచేత మీ స్వరూపాలను యదార్థమైనవిగా తెలుసుకుని పవిత్రంగా ఉండండి. మీ లోపల ప్రకాశిస్తున్న తేజస్సుయొక్క ఒక్క బిందువు నుంచి సూర్యుడు– చంద్రుడు, తారలు, ఉదయిస్తున్నారు. మీరు చేసే కొద్దిపాటి సాధనవల్ల మీకు ఎటువంటి యోగ్యత ప్రాప్తిస్తున్నదో గ్రహించండి. మీ సాంగత్యం వల్ల మీ స్పర్శవల్ల చిత్‌శక్తి ఇతరులలోకి కూడా ప్రవహిస్తుంది. ఈ అనుభవం కూడా చిన్నదేమీ కాదు. గురుకృపకు పాత్రులై కొంతకాలమే సాధనచేసి పొందిన తేజస్సు ద్వారా మీ దగ్గర ఉన్న వారిలో కూడా చిత్‌శక్తి స్పందనాన్ని కలుగచేస్తున్నారు. అటువంటప్పుడు దీర్ఘకాలం భక్తిశ్రద్ధలతో సాధన చేస్తూ ఉన్నట్టయితే మీ యోగ్యత ఎంత ఎక్కువవుతుందో ఆలోచించండి. మీ గొప్పతనం ఎంత పెరుగుతుంది! ఈ ప్రపంచంలో మాతాపితల రూపంలో పూజలందుకునే అర్హతను సంపాదించవద్దా!

ఇప్పుడు సిద్ధవిద్యార్థులకు నేనొక హెచ్చరిక చేస్తున్నాను. కొంతకాలమే సాధన చేసి ధ్యానం ద్వారా కొంత శక్తిని సంపాదించుకున్నారు. మంచిదే. కాని, ఈ శక్తిని మీరు

పూర్తిగా సంపాదించుకునే లోపున అది మీ నుంచి పోవచ్చును కూడా. దీన్ని జాగ్రత్తగా సంరక్షించుకొనండి. ఏపని చేస్తున్నా, మెలకువగా సావధానంగా ఉండండి. చిత్‌శక్తిని పుష్కలంగా సంపాదించుకొనండి. తక్కువ చేసుకొనవద్దు. చెడునడత – చెడు దృష్టి – చెడు ప్రవృత్తి కలిగి, చెడుకర్మలు చేయువారి మాటలను విని సాధన యొక్క మహత్యాన్ని తక్కువ చేసుకొనవద్దు. ఒక వేళ అటువంటి మూర్ఖుడు ఎవరైనా తటస్థపడి పిచ్చిమాటలేవైనా మాట్లాడినట్టయితే ఆవ్యక్తి ముఖం మీద ఉమ్మెయ్యండి. కనులు మూసుకుని, '' ఓ గురుదేవా మీరే నా తండ్రి, నా తల్లి, నన్ను రక్షించండి'' అని ప్రార్థించుకొనండి. ఈవిధంగా మెలకువగా ఉండడం వల్ల మీ సాధన, వేగంగా పురోగమిస్తుంది. సాధకులకు ధ్యానంలో నీలేశ్వరి లేదా నీల బిందువు కనిపించిన వెంటనే వారి యోగ్యత ఎక్కువవుతుంది. అందుచేతనే సిద్ధవిద్యార్థుల మహత్తు గురించి ఇంతగా చెబుతున్నాను. ఈ సందర్భంగా జ్ఞానేశ్వర మహారాజ్ రచించిన ఒక అభంగం యొక్క తాత్పర్యం రాస్తున్నాను. దాన్ని జ్ఞాపకం పెట్టుకొనండి. జ్ఞానేశ్వరుడు అంటున్నాడు: ''రెండుకనుల మధ్య నివసిస్తున్న పురుషుడి దర్శనం చేసుకున్నవారి చరణాలను నా నివాసస్థానం చేసుకుంటాను. కనులమధ్య ఉన్న దివ్యమైన నీల జ్యోతిని ఏకాంతంలో దర్శనం చేసుకున్నవారి రూపాన్ని నేను నిరంతరం ధ్యానం చేసుకుంటాను. ఓ జనులారా! కనుల మధ్య శూన్యంలో ఉన్న నీలజ్యోతిని చూచిన వారు ధన్యులు, అదృష్టవంతులు.''

జ్ఞానేశ్వరుడి మరొక అభంగం గురించి కూడా చెప్పాలని ఉత్సాహంగా ఉంది. ఈ అభంగం, నా ఆరాధ్యదైవము. నాకే కాదు, మోక్షమార్గంలో పురోగమిస్తున్న అందరికీ ఇది మహామంత్రం. అంతేకాదు, నేను చెప్పబోతున్నది అంతరాత్మకు సాక్షి, సాక్షాత్కారానికి ప్రమాణం, గురు – రహస్యానికి తాళపు చెవి. అందుచేతనే ఈ అభంగం, నాకు మంత్ర తుల్యం. నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా వినండి. రహస్యం కన్నా అతి రహస్యమైన దాన్ని శ్రద్ధగా చదవండి:

**డోళాంచీ పాహే డోళాc శూన్యాచా షేవట్**
**నీల బిందూ నీట లఖలఖీత 1**
**విసావేc అలేc పాతలేc చైతన్య తేథేc**
**పాహే పా నిరుతేc అనుభవేc 2**

**పార్వతీలాగీc ఆదీనాథేc దావిలేc**
**జ్ఞానదేవా ఫావలేc నివృత్తి కృపా 3**

అనగా ''సిద్ధ విద్యను అభ్యసిస్తున్న సాధకులారా! మీ కన్నులకు కూడా కన్ను, శూన్యం అంతమయే స్థానం, అదే నీల బిందువు: పరిశుద్ధమైనది, మెరుస్తున్నది, ప్రకాశిస్తున్నది. ఇది కనిపించిన వెంటనే సాధకుడికి విశ్రాంతి స్థానం ప్రాప్త మౌతుంది. చైతన్య ఆత్మయొక్క స్థానం ఇదే. ఇదే అనుభవంలోని రహస్యం. పార్వతికి పరమేశ్వరుడు ఇదే చెప్పాడు. జ్ఞానదేవుడంటున్నాడు: నా సద్గురువు నివృత్తినాథుడి కృపవల్ల దీన్ని చూడకలిగాను''. ఇంతవరకు నేను నీలేశ్వరి అని వర్ణిస్తున్న నీలబిందువు మహానత అటువంటిది. అటువంటి బిందువు దర్శనం చాలును జీవన్ముక్తికి. కాని ఇది, సాక్షాత్కారాన్ని గాని, సిద్ధపదాన్ని గాని, సిద్ధ మార్గాన్ని గాని, పరిపూర్ణంగా పొందినట్టుకాదు. నీలబిందువును పదే పదే దర్శనం చేసుకొనడాన్ని 'తురీయావస్థ' అంటారు. నీలబిందువు దర్శనం తర్వాత ఒకవేళ సాధకుడు మరణించినట్టయితే, బ్రహ్మలోకానికి చేరుకుంటాడు, అక్కడ మిగిలి ఉన్న సాధనను పూర్తి చేసుకుని పరిపూర్ణత్వాన్ని పొందుతాడు. మంచిది.

నేను ఒక గొప్ప దివ్యమైన తేజస్సుతో వెలుగుతున్న గోళాకారాన్ని పదే పదే చూస్తున్నాను. దాని తేజస్సు మిగతా అన్ని జ్యోతులకన్న అధికమైనది. అటువంటి దివ్యమైన తేజస్సును చూస్తూ చూస్తూ నా ధ్యానావస్థ బాగా ఎక్కువకావడం ప్రారంభమైంది. ఇప్పుడు కూడా ధ్యానంలో పూర్వం మాదిరిగానే మొట్టమొదట నాలుగురంగుల జ్యోతులు దర్శనమిస్తున్నాయి. నీలేశ్వరి కనిపించిన వెంటనే, నీలేశ్వరిని చూస్తూ, ధ్యానం చాలా సేపు స్థిరంగా ఉంటున్నది. అప్పుడు మనస్సుకు ఎంతో ఆనందంగా ఉంటుంది, ప్రశాంతంగా ఉంటుంది. ప్రాణము అపానము బలహీనమై స్థిరపడతాయి. ప్రాణవాయువు, ముక్కుకు వెలుపల రెండు అంగుళాలమేర మాత్రమే ఉండిపోతుంది. లోపలికి వెళ్ళే సమయంలోకూడా కంఠం వరకే వెళుతుంది. హృదయం వరకు వెళ్ళడం లేదు. ధ్యానానికి ఎక్కడ భంగం కలుగుతుందోనన్న భయంతో దీన్ని ఎక్కువగా పట్టించుకొనలేదు. ధ్యానం స్థిరంగా ఉండేట్టు ఎంతో మెలకువగా జాగ్రత్తగా ఉండేవాడిని. ఆ విధంగా ఉంటూ ఉండగా అనేక ప్రకారాల సువాసనలు వచ్చేవి. ఇవి ఉన్నతశ్రేణికి చెందినవి. వీటిముందు

నా ప్రియమైన భక్తులు తెచ్చి ఇచ్చే సుగంధ ద్రవ్యాలు దిగదుడుపుగా ఉండేవి. ధ్యానంలో వచ్చే సువాసనకు సమానమైనవి ప్రపంచంలో లేనేలేవు. అటువంటి సువాసనతో ఉన్మత్తుడినయేవాడిని. మనస్సు ఆనందంతో ఓలలాడేది. ఎంత దివ్యమైన సువాసన! ఈ అనుభూతి చాలాకాలం కొనసాగింది. ఈ సుంగంధం వెలువడినపుడు శ్వాస- ప్రశ్వాసలు చాలా చిన్నవిగా మారేవి. అనగా అవి చాలా మెల్లగా జరిగేవి. ఆ సమయంలో ఒక ప్రత్యేక విధమైన ప్రాణాయామం దానంతట అదే జరిగేది. ప్రాణవాయువు ఈ విధంగా సంచరిస్తున్నపుడు మధురమైన సుందరమైన ప్రేమ భావం ఉదయించేది. ఇదే సాక్షాత్తు పరమాత్మ యొక్క సత్యమైన ప్రత్యక్ష రూపమా అన్నట్టుతోచేది. ప్రేమే పరమాత్మ. నారదమహాముని అన్నాడుగదా, "**అనిర్వచనీయం ప్రేమ స్వరూపం**" (భక్తి సూత్రం-51) అనగా ఈ ప్రేమను మాటల్లో వర్ణించ శక్యం కాదు.

ఇటువంటి సూక్ష్మమైన అనుభూతులను పొందుతూ ధ్యానంలో నా రుచి ఇంకా ఎక్కువైంది. మనస్సుయొక్క పరిస్థితి విచిత్రంగా మారింది. ధ్యానం చేసుకున్నపుడు మనస్సు ఎంతో ఉన్నతమైన స్థితిలో పరవశం చెంది ఉండేది. కాని మరుసటిరోజు అంతకన్నా పెద్ద అనుభూతి కలిగేది. దానితో, ముందురోజు కలిగిన ఆనందం చాలా తక్కువగా కనిపించేది. ఈ ఆనందానికి అంతులేదని తెలిసింది. ప్రేమ, రోజురోజుకు ఎక్కువకావడం ప్రారంభమైంది. ప్రేమ, ముగియడం అంటూ లేదు. ఈ అనుభవం వల్ల ఒకటి తెలిసింది. ముందు ముందు ఇంకా జరుగవలసినది ఏదో ఉందని. ధ్యానంలో ఉండగా ఒక్కొక్కసారి ధ్యానం జరుగుతున్న పద్ధతి, క్షణంలో మారిపోతుంది. కన్నులు మెల్లమెల్లగా పైకి తిరుగుతాయి. సహస్రారంలోని ఊర్ధ్వాకాశంలో నిలిచిపోతాయి. రెండుకన్నులు ఒకే చోట కేంద్రీకృతమౌతాయి. రెండుకనులకు విడివిడిగా రెండు దృశ్యాలు కనిపించవు. ఒకే దృశ్యాన్ని చూస్తాయి. దీన్నే '**బిందు భేదం**' అంటారు. ఆహా! సిద్ధయోగం ఏమి వరప్రదాయిని! కుండలిని ప్రభావం ఎటువంటిది! గ్రంథపఠనం ద్వారా తెలుసుకునే విషయాలను సిద్ధయోగం ద్వారా ప్రత్యక్షంగా అనుభవించ వచ్చు.

పదహారు

# సిద్ధలోక పర్యటన

నీలం రంగు నక్షత్రం మళ్లీ నా ఎదుట స్థిరమైంది. కొంచెం కూడా కదలడం లేదు. నాలోపల సహస్రారంలోని ఊర్ధ్వాకాశంలోకి చూస్తూ చూస్తూ అనేక లోకాల్లోకి వెళ్లి పోయేవాడిని. ఈ ప్రయాణం, ఆ పెద్ద నీలం రంగు నక్షత్రం సహాయంతో జరిగేది. ఇది నీల జ్యోతికాదు, నీల బిందువుకాదు, నీల నక్షత్రం. అది చిన్నదైనప్పటికీ నేను దానిలోపల ఇమడగలను. ఆ నీలనక్షత్రం నన్ను చాలా దూరం తీసుకువెళ్లింది. ఒకచోటికి తీసుకువెళ్లి నన్ను దింపింది. ఎంత అందమైన లోకం! ఆహా! ఆహా! ఇంతవరకు చూచిన లోకాలన్నింటిలో ఇది అత్యంత ఆకర్షణీయమైనది. దాని సౌందర్యాన్ని నేను వర్ణించలేను. దాన్ని శబ్దాల్లో వర్ణించడం దాన్ని అవమానించడమే అవుతుంది. నీల నక్షత్రం నన్ను ఒక దివ్యమైన లోకంలో వదిలిపెట్టింది. అక్కడ నేను ఒక రమణీయమైన మార్గాన్ని చూచాను. అనేక రకాల తోటలు, చిన్నవి - పెద్దవి గుహలు, నిర్మలమైన నీటి ప్రవాహాలు, తెలుపు-నీలం-పచ్చరంగుల జింకలు, తెల్లటి నెమళ్లు ఉన్నాయి. అక్కడి వాతావరణం ఎంతో ప్రశాంతంగా ఉంది. ప్రాతఃకాలపు సూర్యుడిని నీలం రంగు గాజుపలకతో చూచినపుడు ఎంత బాగుంటుందో, అటువంటి చల్లటివెలుగు అక్కడంతా పరుచుకుని ఉంది. ఆ లోకంలో సూర్యుడుగాని చంద్రుడుగాని లేరు. అంతటా వెలుగు వ్యాపించి ఉంది. అక్కడ దిగిన వెంటనే ఒక రకమైన ఉద్వేగం, ప్రాచీనకాలపు ఋషుల దర్శనం కాబోతున్నట్టు లోపలి నుంచి ఒక స్ఫురణ, కలిగింది. మనోవేగంతో అక్కడ తిరగడం ప్రారంభించాను. ఇంతలో నేను ఏమి చూస్తున్నాను! ఇది సిద్ధలోకం! చాలా మంది సిద్ధపురుషులను చూచాను. అందరూ తమ ధ్యానంలో తన్మయులై ఉన్నారు. తమతమ ఆసనాలమీద కొత్తకొత్త ముద్రల్లో కూర్చుని ఉన్నారు. నావైపు చూడనేలేదు. కొందరు జడధారులు; కొందరు గుండు చేయించుకుని ఉన్నారు; కొందరు చెట్ల కింద; కొందరు బండలమీద; కొందరు గుహల్లో; కూర్చుని ఉన్నారు. పురాణాల్లో చదివిన మహర్షులు కూడా ఉన్నారు. షిరిడి సాయిబాబా కూడా ఉన్నారు. నిత్యానంద బాబా గణేశపురిలోనే ఉన్నారు కాని

ఆయన్ను కూడా ఇక్కడ చూచాను. వారందరికీ విడివిడిగా కుటీరం లేదా గుహ ఉన్నాయి. చిన్న చిన్న కొత్త రకం ఇండ్లుకూడా ఉన్నాయి. కొంతమంది మహాత్ములు ప్రశాంతంగా కూర్చుని ఉన్నారు.

అక్కడ గాలి, నీరు చాలా బాగున్నాయి. అక్కడ వ్యాపించి ఉన్న వెలుగు ఎంతో రమణీయంగా ఉంది. అక్కడ ప్రవేశించిన వెంటనే నాకు అన్ని విషయాలు తెలియ వచ్చాయి. ప్రాచీన కాలానికి చెందిన ఋషులు, మునుల గురించి తెలియవచ్చింది. కొంచెం ముందుకు వెళ్లాను. అక్కడ చాలా మంది యోగినులు కనిపించారు. వారు దివ్యమైన ముద్రలను ధరించి ప్రశాంతంగా కూర్చుని ఉన్నారు. యోగినులను, సిద్ధమహాత్ములను చూస్తూ సిద్ధలోకంలో చాలాసేపు గడిపాను. ఈ లోకం నాకు బాగా నచ్చింది. మిగతా ఏ లోకమూ ఇంత నచ్చలేదు. ఇక్కడనే ఉండిపోతే బాగుండుననిపించింది. అక్కడి నుంచి బయటికి రావడానికి మనసు ఒప్పడం లేదు. ఆ సమయంలో తామరపువ్వులతో నిండిన ఒక పెద్ద సరోవరం కనిపించింది. దానిలో బంగారు తామరలున్నాయి. అక్కడి నుంచి వస్తూ వస్తూ సప్త ఋషులను చూశాను. వారి దర్శనం అవుతుండగానే సుఖము–శాంతి–ప్రేమ అనుభవంలోకి వచ్చాయి. ఆ స్థితిలోనే నడుస్తున్నాను. ఎవరు నన్ను ఈ విధంగా నడిపిస్తున్నారో తెలియలేదు. ఈ విధంగా నడుస్తూ ఒక తోటలోకి ప్రవేశించాను. అందమైన తోట. అక్కడి చెట్లు ఏజాతికి చెందినవో నాకు తెలియలేదు. అక్కడ సిద్ధపురుషులను చూస్తూ చూస్తూ, అక్కడనే పద్మాసనం వేసుకుని కూర్చుందామనిపించింది. కూర్చుంటూ ఉండగానే నీలనక్షత్రం ప్రత్యక్షమైంది. ఎందుకో తెలియదు మరి, దానిలోపల కూర్చోవలసివచ్చింది. ఏ విధంగా కూర్చున్నాను? ఎవరి ప్రేరణ ఇది? ఇవేమీ నాకు తెలియదు. నేను కూర్చుంటూ ఉండగానే ఆ నక్షత్రం నన్ను మళ్లీ అతివేగంగా ధ్యాన స్థానానికి తీసుకుపోయింది.

ధ్యానస్థానానికి చేరుకున్నవెంటనే, నీలనక్షత్రం, నాలోపలికి ప్రవేశించి, పగిలి నట్టయింది, అపుడు దాని వెలుగు సహస్రారంలోని విశాల ప్రదేశమంతటా వ్యాపించింది. ఇప్పుడు ఎదుట ఏ నక్షత్రమూ లేదు. కేవలం ఒక తెల్లటి మధురమైన వెలుగు. ఆ తర్వాత తంద్రాలోకంలోకి వెళ్లి పోయాను. అక్కడినుంచి తంద్రా లోకం చాలాదగ్గర. తంద్రాలోకం చేరుకుంటూనే సిద్ధలోకానికి చెందిన సిద్ధపురుషులొకరు

ప్రత్యక్షమయారు. ఆయన నాకు, తెలిసిన వారు కారు. ఆయన అన్నారు: '' ఇప్పుడు నువ్వు చూచినది సిద్ధలోకం. జీవన్ముక్తులైన మహాపురుషులు అక్కడ ఉంటారు. అక్కడ ఆకలి లేదు, నిద్రలేదు, జాగృతి లేదు. ఆనందమే ఆహారం, ఆనందమే పానీయం. ఆనందమే జీవనం, ఆనందమే అనుభవం. అన్ని విషయాలు అక్కడ ఆనందమే. చేప నీటిలోనే నిద్రపోతుంది. నీటిలోనే నివసిస్తుంది. నీటిలోనే తింటుంది. నీటిలోనే దాని విహారం కూడా. అదే విధంగా సిద్ధలోక వాసులు ఆనందంలోనే సంచరిస్తుంటారు. సిద్ధకృపలేనిదే అక్కడికి ఎవ్వరూ పోజాలరు. దానికి సాధనం సిద్ధమార్గం. అది సిద్ధపరంపరకు చెందినమార్గం. పరిపూర్ణంగా సిద్ధులైనవారే అక్కడికి పోగలరు. నిన్ను అక్కడికి తీసుకువెళ్లిన నీలనక్షత్రమే అక్కడికి రాకపోకలను సాగించే వాహనం. అంతే కాదు. లోకలోకాంతరాలకు కూడా రాకపోకలకు ఈ నీల నక్షత్రమే వాహనం. ఈ నక్షత్రం పగిలేవరకు జనన మరణాలు నశించవు. కర్మ బంధం తీరదు. పాపపుణ్యాల పరదా తొలగిపోదు. ఈ నక్షత్రం విచ్చుకున్నపుడే భేదదృష్టి అంతరిస్తుంది.'' అని చెప్పి, నన్ను ఆశీర్వదించి, ఆ మహాపురుషుడు నిష్క్రమించాడు.

పదిహేడు

# స్వర్ణ కమలం శిరస్సుపైన పడడం

నేను తంద్రాలోకంలో ఎంతో ఆనందపారవశ్యంతో ఎంతో ఉత్సాహంగా ఉన్నాను. ఈ లోపున పైనుంచి నా తలమీద పుష్పవృష్టి కురిసింది. పుష్పాలు పడుతూండగా నా ధ్యానం పైవైపుకు వెళ్లింది. ఆ సిద్ధమహాపురుషుడు, సిద్ధలోకంలోని సరోవరంనుంచి ఒకటి రెండు అడుగుల వ్యాసం ఉన్న పెద్ద స్వర్ణ కమలాన్ని తీసి నా తలమీదికి గట్టిగా విసిరివేశాడు. ఆ కమలం కిందికి రావడం నేను చూస్తున్నాను. ఆ కమలం, ఓంకార నాదం చేస్తూ దిగుతూ ఉంది. అది పెద్ద శబ్దం చేస్తూ నా శిరస్సుమీద పడింది. శబ్దం వింటూనే నా కనులు తెఱుచుకున్నాయి. కాని ఇంకా తంద్రాలోకంలోనే ఉన్నాను. తలమీద ఎవరో గట్టిగా దెబ్బకొట్టినట్టు అనిపించింది. తంద్రాలోకంలోనే ఉంటూ కనులు తెఱిచి చూచాను. ఆ స్వర్ణకమలం నా శిరస్సు నుంచి భూమి మీద పడి ఉంది. ఎంతో అందంగా ఉంది! దాని రూపం అద్భుతంగా ఉంది. దాని నుంచి వెలువడుతున్న సువాసన అంతకన్న దివ్యంగా ఉంది. నేను ఆశ్చర్యంతో కుతూహలంతో దాన్ని చూస్తున్నాను. ఇంతవరకు నాముందే ఉంది. దాన్ని చూస్తూ నా అదృష్టానికి పొంగి పోయాను. కుండలిని మహిమను పొగుడుతూ ఉండిపోయాను. గురుదేవుడి కృప జ్ఞప్తికి వచ్చింది. వెంటనే కనులు మూసుకుని మనస్సులో గురుదేవుడికి నమస్కారం చేశాను. కనులు తెఱిచి చూచినపుడు అక్కడ ఏమీ లేదు ''అరె! ఎంత ఆశ్చర్యం! ఎంతగొప్ప అనుభవం!'' అనుకుంటూ కూర్చున్నాను. తలమీదపడిన దెబ్బతాలూకు అనుభవం ఇంకా ఉంది. ఆసనం మీద నుంచి లేచాను. ధ్యానం అవధి పూర్తయింది. బయటికి వెళ్లాను. అటు ఇటు తిరిగాను. ఆకాశాన్ని చూశాను. గణేశపురిలో నా గురుదేవుడు ఉన్న దిక్కువైపు తిరిగి నమస్కారం చేశాను. శాంతపడి, తోటలోకి వెళ్లి కూర్చున్నాను. మళ్లీ కనులు మూసుకుని, ధ్యానంలో కనిపించిన దృశ్యాలను జ్ఞప్తికి తెచ్చుకున్నాను. కొన్ని అనుభవాలు జ్ఞాపకం వచ్చాయి. అవే దృశ్యాలు మళ్లీ కనిపించాయి.

దీని తర్వాత ఎప్పుడు ధ్యానానికి కూర్చున్నా, మొదట కొన్ని క్రియలు జరిగేవి. తర్వాత ఆ రక్తేశ్వరి జ్యోతి మళ్లీ ప్రత్యక్షమయేది. రక్తేశ్వరి జ్యోతిగురించి నేను ప్రస్తావించకపోయినా, పాఠకులు దీన్ని మరువరాదు. సూర్యోదయమైన తర్వాత కొత్తరోజు ప్రారంభమైనట్టు రక్తేశ్వరి దర్శనమైనవెంటనే ధ్యానం ప్రారంభమయేది. రక్తేశ్వరి తేజస్సు ఎక్కువైంది. అది ఇప్పుడు, ఇంతకుముందుకన్నా దివ్యంగా వెలుగుతూ ఉంది. సహస్రారంలో నీల నక్షత్రం విచ్చుకుని, నలువైపులా వ్యాపిం చిన వెలుగు ఈ జ్యోతిలో కలిసిపోయి ఉంటుందని నాకు అనిపించింది. లేదా బహుశః సిద్ధలోకం యొక్క పుణ్యదర్శనం, దీనికి కారణమై ఉంటుంది. ఎందుకు కాకూడదు? నేను ఒక వేళ కాశీకి వెళ్లినట్టయితే కొంత పుణ్యం లభించి ఉండేది; ద్వారక దర్శించినట్టయితే కొంత పుణ్యం దొరికి ఉండేది; రామేశ్వర యాత్ర చేసినట్టయితే తప్పకుండా కొంత పుణ్యం ఉండేది. గణేశపురి వెళ్లినట్టయితే ఆనందంగా ఉండేది. అటువంటప్పుడు సిద్ధలోక యాత్ర వెళ్లినందుకు ఫలితం ఏమీ ఉండదా? నాకు మరొక ఆలోచనకూడా వచ్చింది: ''నేను ఇప్పుడే సిద్ధలోక యాత్ర నుంచి వచ్చాను. అక్కడి నుంచి వచ్చిన తర్వాత నా శిరస్సుమీద బంగారు పువ్వుపడింది. బహుశః ఆ స్పర్శ ఫలితమేమో ఇది'' అని.

రక్తేశ్వరి యొక్క దివ్యమైన జ్యోతిలో, విచ్చుకున్న నక్షత్రపు అనంతమైన రవ్వలు వెలుగుతున్నాయి. దీని వెలుగులోనే శరీరంలోని అన్ని నాడులు, మలకోశం, పిత్తకోశం మొదలైనవన్నీ కనిపించాయి. దానితోపాటు రక్తేశ్వరి లోపల మెరుస్తున్న, వేగంగా ప్రవహిస్తున్న, ఒక సుందరమైన తేజస్సు కనిపించింది. అదే, నా సద్గురువు కృపాశక్తియొక్క తేజోరాశి. దాన్ని చూస్తూండగా రక్తేశ్వరి వెళ్లి పోతుంది. శ్వేతేశ్వరి వస్తుంది. ఈ అంగుష్ఠ మంత శ్వేతజ్యోతిని కూడా కొత్త తేజస్సులోనే చూచాను. దాని తేజస్సు కూడా ఎక్కువైంది. శ్వేతజ్యోతికి తర్వాత కృష్ణజ్యోతి ప్రత్యక్ష మయేది. ఆ కృష్ణజ్యోతి వెలుగుకూడ ఎక్కువగా ఉన్నది. దానితర్వాత మరల నీలేశ్వరి దర్శనమిచ్చేది. దానిలో కొత్తగా అనేక దివ్యమైన కిరణాలు కనిపించ సాగాయి. వీటి రంగు నీలంగానే ఉంది కాని, వీటి తేజస్సుకూడా ఇంతకు ముందుకన్నా ఎక్కువగా ఉంది. రోజురోజుకు దీని తేజస్సు ఎక్కువవుతూ ఉంది. నీలేశ్వరి అత్యంత తేజస్వి అయింది. ధ్యానం దానిలో స్థిరపడింది. స్థిరపడుతూనే హృదయంలో ఉచ్చస్థాయికి చెందిన ప్రేమ ప్రవహించసాగింది. అన్ని నాడుల్లో నీలకిరణం ప్రసరిస్తున్న విధంగానే, ఈ ప్రేమ ప్రవాహం కూడా వ్యాపించింది. ఈ విధంగా ప్రేమ ప్రవాహం అన్ని నాడుల్లోకి

ప్రవేశించి, తరంగాల రూపంలో తుళ్లుతూ ప్రవహించడం కనిపించింది. ఇంద్రియాల్లోకూడా దాని స్ఫురణే ఉంది. చిత్‌శక్తి కిరణాలు సర్వాంగాల్లో వ్యాపించడంతో పాటు ఆనంద కిరణాలు కూడా వ్యాపించాయి. అటువంటి ప్రేమ పారవశ్యంలో ధ్యానం చేస్తూ చేస్తూ తంద్రాలోకంలోకి వెళ్లి పోయేవాడిని.

ఒకసారి తంద్రాలోకంలోకి వెడుతూనే, నేను దర్శించిన సిద్ధలోక రహస్యం తెలిసిపోయింది. నేను వెళ్లిన సిద్ధలోకం నిజంగా ఉన్నదే. సిద్ధావస్థ ప్రాప్తమయేవారికి, వారు ఎటువంటి మార్గాన్ని అనుసరించే వారైనా వారందరికీ ఒకటే లోకముంది. నా శిరస్సు మీద పడిన సువర్ణకమలం, ఆ సిద్ధలోక ప్రసాదమే. అది సిద్ధలోకం నుంచి లభించిన కృపాపూర్ణమైన ఆశీర్వచనం. నేను కూర్చుని వెళ్లివచ్చిన నీలనక్షత్రం హెచ్చుతగ్గులుగా అందరిలోనూ సహస్రారంలో ఉంటుంది. దాని తేజస్సులోనే కొంత భేదముంటుంది కాని ప్రమాణం మాత్రం ఒకటే. జీవాత్మ, దేహ త్యాగం తర్వాత రాకపోకలు చేసేది దీని ద్వారానే. మానవ శరీరాన్ని ఎన్ని సార్లు దహనం చేసినా, ఎన్నిసార్లు భూస్థాపితం చేసినా ఈ నీలనక్షత్రం మాత్రం చెక్కు చెదరకుండా ఉంటుంది. అది, ప్రాణంతోపాటే శరీరం నుంచి బయటికి వెళుతుంది. బయట పడిన తర్వాత, మరణించిన తర్వాత పదకొండవరోజు వరకు మృత్యువు సంభవించిన స్థానంలోనే ఉంటుంది. ఆ తర్వాత జరిగే కర్మకాండ ననుసరించి, పాపపుణ్యాలను తనవెంట తీసుకుని లోకలోకాంతరాలకు వెడుతుంది. ఆ నీలనక్షత్రమే, ఈ జీవాత్మ యొక్క డ్రైవరులేని మోటారుబండి. జీవాత్మ మళ్లీ జన్మ ఎత్తినపుడు, కూడా వస్తుంది. నా ఈ నక్షత్రం ఎప్పుడు పగిలిందో అప్పుడే నా రాకపోకలు ఆగిపోయినాయి. మోటారు బండి పగిలిపోయింది. ఇంక రాకపోకలు ఏవిధంగా జరుగుతాయి? దీన్ని 'హృదయ గ్రంధి భేదం' అని కూడా అనవచ్చు. నా జన్మ జన్మాంతరాల కర్మ బంధం నశించినట్టు తంద్రావస్థలో నాకు అర్థమైంది. ఆ విధంగా జరిగిన వెంటనే లోకం మారిపోయింది. ఈ అనుభూతులన్నీ నావి కావు. ఆంతరికశక్తి అధీనంలో జరిగినవి. శక్తి పూర్తిగా స్వతంత్రమైనదికదా.

పద్ధెనిమిది

# పితృలోకం

ప్రారంభదశలోని ఒక అనుభవాన్ని వ్రాయడం మర్చిపోయాను. దాని గురించి చెప్పడం చాలా అవసరం. అది నా పితృలోకసందర్శనం. ఈ పితృలోకం, స్వర్గలోకానికీ సిద్ధలోకానికీ మధ్య ఉంది. పితృలోకంలో అనేకరకాల పితృదేవతలు న్నారు. వారిని నేను ప్రత్యక్షంగా చూచాను. స్వర్గలోకం–నాగలోకం–చంద్ర లోకంలో ఉన్నవారందరికీ ఒకే రకమైన భోగభాగ్యాలు ఉన్నాయి. కాని పితృ లోకంలో ఆవిధంగా లేదు. భూలోకంలో, ధనవంతులు – బీదవారు, పుణ్యాత్ములు – చెడ్డవారు, వంటి తారతమ్యాలున్న విధంగానే పితృలోకంలో కూడా తారతమ్యాలున్నాయి. అయినప్పటికీ అక్కడ ఇక్కడికన్నా సుఖంగా ఉంది. నా చిన్నతనంలో పరిచయమున్న కొంత మంది వృద్ధులను అక్కడ చూచాను. ఈ లోకం విలక్షణమైనది. మనం తర్పణం, పిండదానం వంటివి చేసినపుడు అవి సూక్ష్మరూపంలో అక్కడికి చేరుకుంటున్నాయన్న విషయం సత్యం. మన పితృదేవతలు, మనం అర్పించే వాటినే తింటున్నారు. మన దాన – పుణ్యాన్ని వారు స్వీకరిస్తున్నారు. తమ వంశజులను ఆశీర్వదిస్తున్నారు. ఇది కూడా సత్యమే. అందుచేత పితృలోకవాసులకు తర్పణాదులను అర్పించి వారిని సంతోషపెట్టడం అవసరం. సిద్ధవిద్యార్థులారా, మీకు ఈ విషయమై ఎటువంటి సందేహమూ అవసరంలేదు. తర్పణం, సూక్ష్మరూపంలో మంత్రం ద్వారా పితృలోకానికి తప్పకుండా చేరుతుంది. మంత్రవాహకమైన చిత్‌శక్తి, మంత్రం ద్వారా దాన్ని ఇక్కడినుంచి అక్కడికి తీసుకువెడుతుంది. మీకు ఈ నాటిజీవితం నుంచి ఒక ఉదాహరణ చెబుతాను: మీ మిత్రుడొకడు అమెరికాలో ఉన్నాడను కొనండి. ఇక్కడి నుంచి అమెరికా చాలా దూరం. అయినప్పటికీ ఆ మిత్రుడు టెలిఫోన్‌లో మీతో అంటాడు: ''నేను నీకు బ్యాంకు ద్వారా ఇన్ని డాలర్లు పంపించాను, నువ్వువాటిని అక్కడ తీసుకో'' అని. మీకు ఆ డాలర్లు అందుతాయి కూడా. దీనిలో సందేహమే లేదు. ఇది ఒక జడ వ్యవహారం. జడమైన టెలిఫోన్ ద్వారా శబ్దం సహాయంతో జరిగే పని. దీని గురించి మీకు తెలుసు.

అటువంటప్పుడు మంత్రపిండం, మంత్రం ద్వారా, సూక్ష్మరూపంలో పితృలోకం చేరుకోవడం గురించి సందేహమెందుకు?

నేను పితృలోకంలో చాలామందిని చూచాను. సిద్ధలోకం తీసుకువెళ్లిన నీలనక్షత్రమే, నన్ను పితృలోకం తీసుకువెళ్లింది. మీకు మరొకసారి జ్ఞాపకం చేస్తున్నాను- అది నీల బిందువుగాని నీలజ్యోతిగాని కాదు. అది నీల నక్షత్రం. ఓ సిద్ధవిద్యార్థులారా, మీరూ నేనూ నివసించే స్థానం మృత్యులోకం. మృత్యు లోకం నిజమైనట్టే, పితృలోకం కూడా నిజమే. నేను దాన్ని ప్రత్యక్షంగా చూచాను. ఈ సందర్భంలో నాకు ఏక్‌నాథ్ మహారాజ్‌కు సంబంధించిన కథ ఒకటి జ్ఞాపకం వస్తున్నది. ఈ కథగురించి నాకు ఒకప్పుడు సందేహం ఉండేది. నిజానికి మహాపురుషుల చరిత్ర విషయంలోనూ వారి గుణగణాలను కీర్తించడంలోనూ వారి పనుల విషయంలోనూ సందేహం రావడం మంచిది కాదు. ఈ సందేహం, సాంగత్యదోషం వల్ల వచ్చినది. సిద్ధపురుషుల ఆచార వ్యవహారాల గురించి సందేహపడరాదని నేను మీకు ఎన్నోసార్లు చెప్పి ఉన్నాను. వారి వ్యవహారాలను పాపపుణ్యాల దృష్టితో చూడరాదు. వారి ప్రతి ఒక్కపని, భగవంతుడి ప్రేరితం కావడం చేత, అది యజ్ఞరూపమైనది. శ్రీ ఏక్‌నాథ్ మహారాజ్ ద్రష్ట. ఆయన, పరమేశ్వరుడిని సాక్షాత్కరింప చేసుకున్నవాడు. ఆయనకు గ్రాహ్య-త్యాజ్యాల్లో, వనాల్లో-జన సమూహాల్లో, ఉచ్ఛ-నీచాలలో, గ్రహించతగినవి - త్యజించ వలసిన వాటిలో, పాపులు-పుణ్యాత్ముల్లో, ఒక్క పరమాత్ముడే కనిపించేవాడు. సిద్ధపురుషుల దృష్టి, నామరూపాలను చూడదు. అది కేవలం సద్వస్తువునే చూస్తుంది. ఈ సందర్భంగా ఒక కథ చెబుతాను. ఒక పశువుల వ్యాపారి ఉండేవాడు. పేరు రామ్‌జా, చాలా ధనవంతుడు. అతడు తన ఇష్ట దైవమైన ఖండోబా విగ్రహాన్ని ఆయన వాహనాన్ని బంగారుతో చేయించుకుని, పూజ చేసుకునేవాడు. ఖండోబా వాహనం గుఱ్ఱం. అది ఖండోబా విగ్రహం కన్నా పెద్దదిగా ఉండేది. లక్ష్మి చంచలమైనదన్న పెద్దల మాట నిజం. ఏదీ స్థిరం కాదు. రోజులు మారిపోతుంటాయి. రామ్‌జా పరిస్థితి కూడా మారింది. శ్రీమంతుడు, దరిద్రుడయాడు. సంపద-దరిద్రం, ఇవి రెండూ ఒకే తల్లి సంతానమని భావించండి. ఇద్దరూ సొంత అక్క చెల్లెళ్లు. ఇదే విధంగా సుఖం-దుఃఖం, కీర్తి-కళంకం, సహోదరులు కావడం చేత ఒకటిగానే ఉంటారు. ఒకరిని విడిచి మరొకరుండరు. ఒకరిపట్ల మరొకరికి ఎంతో ప్రేమ. ఒకరినొకరు మరిచి పోరుకూడా. మనలను ఒకసారి అన్నగారు ఆదరిస్తే మరొకసారి తమ్ముడుగారు ఆదరిస్తారు.

అన్నగారి ఆదరణ లభించినపుడు సంపద – ఐశ్వర్యం – అధికారం – పదవి లభిస్తాయి. తమ్ముడుగారు అన్నగారితో ''అన్నానువ్వు కొంత సేపు విశ్రమించు, నేను చూచుకుంటాను'' అన్నాడా, దరిద్రం – దుర్దశ – ఆపదలు – అగౌరవాలు వరిస్తాయి.

రామ్‌జాకు కూడా అదే జరిగింది. అక్కగారు విశ్రాంతి తీసుకునేందుకు వెళ్లింది. చెల్లెలు రంగప్రవేశం చేసింది, రామ్‌జా దరిద్రుడయాడు. తిండికి కూడా కష్టమైంది. అందరూ ప్రశ్నించడం మొదలు పెట్టారు: ''అరె రామ్‌జా అన్నా! ఎందుకు ఈ విధంగా దరిద్రం అనుభవిస్తున్నావు? భగవంతుడిని క్షమాభిక్ష వేడుకుని, నీ దేవతార్చన గదిలో ఉన్న బంగారు విగ్రహాలను విక్రయించు. వచ్చే డబ్బుతో గొఱ్ఱెలను కొనుక్కో, వ్యాపారం చేయి. మళ్లీ సంపాదించు. డబ్బు చేరినపుడు విగ్రహాలను మళ్లీ చేయించుకోవచ్చు. వాటికి ప్రాణప్రతిష్ఠ చేయించి యధావిధిగా మళ్లీ పూజచేసుకో. బ్రాహ్మణులకు, సాధు సన్యాసులకు, దరిద్రులకు, అంధులకు – అందరికీ సంతర్పణ చేయించు. నీ వ్యాపారం మళ్లీ ప్రారంభం కావడం వల్ల సత్కర్మ జరుగుతుంది.''

దారిద్ర్యాన్ని అనుభవించే సమయంలో బుద్ధికూడా సరిగా పనిచేయదు. మానవుడి దారిద్ర్యం, బంగారం – డబ్బు, లేకపోవడంలోనే కాదు. మానవుడి ఆలోచనలోకూడా దారిద్ర్యం ఏర్పడుతుంది. రామ్‌జా, స్నేహితుల మాట విన్నాడు. గుఱ్ఱపు బొమ్మతో సహా ఖండోబా విగ్రహాన్నికూడా సంచిలో వేసుకుని షావుకారులున్న వీధికి వెళ్లాడు. ఒక షావుకారు దుకాణానికి వెళ్లి కూర్చున్నాడు. షావుకారు అడిగాడు: ''ఏం రామ్‌జా అన్నా, ఏం సంగతి?'' అని, రామ్‌జా సంచిలోనుంచి బంగారు విగ్రహాలను బయటికి తీసి, షావుకారుకు చూపించి, ''షావుకారూ వీటిని విక్రయించడానికి వచ్చాను. నాకు కొంత పైకం అవసర మైంది. అందువల్ల వీటిని అమ్మవలసివచ్చింది. వీటి విలువ ఎంతో చెప్పు'' అన్నాడు. షావుకారు తూకం వేశాడు, విగ్రహాలను, భగవాన్ ఖండోబా విగ్రహం బరువు ఒక శేరు, గుఱ్ఱపు బొమ్మ బరువు మూడు శేర్లు ఉంది. ఆ రోజుల్లో శేరు బంగారం ధర వేయి రూపాయలు. షావుకారు అన్నాడు: ''రామ్ జా అన్నా, నీ భగవంతుడికి వేయి రూపాయలు, గుఱ్ఱానికి మూడువేల రూపాయలు లభిస్తాయి'' అని.

రామ్‌జా ఈ మాటలు వింటూనే షావుకారు మీద విరుచుకుపడ్డాడు. ''అదేం మాట షావుకారు? నీకేమైనా బుద్ధి ఉందా లేదా? నా భగవంతుడి వెల వేయి

రూపాయలా, గుఱ్ఱపుబొమ్మవెల మూడువేల రూపాయలా? నీకు అసలు ఏమీ తెలిసినట్టు లేదు'' అంటూ. రామ్‌జాకు కోపం వచ్చింది. ముఖం ఎఱ్ఱబడింది. నిజానికి బుద్ధిలేనిది రామ్‌జాకే. షావుకారు అన్నాడు: ''అరె రామ్‌జా, నీకే బుద్ధిలేదు. భగవాన్ - గుఱ్ఱం అన్నభావం నీది. నాకు అవి రెండూ బంగారమే. ఎంత బరువుంటే అంతవెల. భగవంతుడి విగ్రహం బరువు ఒకశేరు. అందుచేత ఆ విగ్రహం వెల వేయి రూపాయలు. గుఱ్ఱం బొమ్మ బరువు మూడుశేర్లుంది. అందుచేత దాని మూల్యం మూడువేల రూపాయలు. క్రయించదలిస్తే విక్రయించు లేదా బయలు దేరు.''

పరమసిద్ధపురుషుడు ఏక్‌నాథ్ మహారాజ్‌కూడా ఇదే విధమైన సమదర్శి. ఆయన బంగారాన్ని మాత్రమే చూచేవాడు. ఆయనకు సంబంధించినంతవరకు సర్వత్ర వ్యాపించి ఉన్నది పరమాత్మ ఒక్కడే. హెచ్చుతగ్గులు, జాతి-వ్యక్తి భేదభావము, పెద్ద-చిన్న తారతమ్యము, ఆయనకు తెలియవు. ''హరిరేవ జగత్'' అన్నది ఆయన దృష్టి. పరిపూర్ణమైన సమానత్వదృష్టి ఆయనది. ఒక రోజు ఒక హరిజన బాలిక, ఆయన దగ్గరకు వచ్చింది. ఎంతో భక్తితో ప్రేమతో ఆయనతో ఈ విధంగా అన్నది: ''బాబా, భగవంతుడు నీకు మంచినీళ్లను కూడా తెచ్చిపెడతాడు. నేను ఆ భగవంతుడిని చూడలేను. ఆయన్ను పిలవలేను. ఓ ఏక్‌నాథ్ బాబా నువ్వే నా దేవుడివి. నాకున్న ఎండిపోయిన రొట్టెను ఊరగాయను ఆరగించడానికి నా కుటీరానికి రావా. నేను నీ కథలు విన్నాను. కథల్లో నువ్వు చెబుతావుగదా, మహాపురుషులు, దేవతలకు సమానమని. అందుకని బాబా, ఇవేళ మా ఇంట్లో భోజనం చేయి. నిన్ను పిలిచేందుకు వచ్చాను'' అని దీనంగా ప్రార్థించింది. ఏక్‌నాథ్ మహారాజ్ ఆ బాలిక మాట మన్నించాడు. ఆ హరిజన బాలిక ఇంటికి వెళ్లాడు. ఆ బాలిక పెట్టిన రొట్టెను భుజించాడు. అక్కడి వారందరు ఈ సంఘటనను చూచారు. ఇంకేముంది! ఒకటే చర్చ దానిగురించి.

జనం అనుకోసాగారు: ''చూచారా, ఏక్‌నాథ్ మహారాజ్ హరిభక్త బ్రాహ్మణుడై ఉండి కూడా ఆ హరిజన బాలిక ఇంట్లో భోజనం చేశాడు. ఛీ ఛీ భ్రష్టుడై పోయినాడు. ఈ కర్మభ్రష్టుడి ఇంటికి బ్రాహ్మణులెవరూ వెళ్లరాదు'' ఈ విధంగా బ్రాహ్మణులందరూ ఏక్‌నాథుడిని బహిష్కరించారు.

దీనివల్ల ఏక్‌నాథ్ మహారాజ్‌కు ఎటువంటి దుఃఖమూ కలుగలేదు. ఎప్పుడూ ఉండే విధంగానే భక్తి పారవశ్యంలో మునిగి ఉన్నాడు. ఆయన పద్ధతి: ''సంపదా ఆపదా మానేజో సమ సదా''. అనగా సంపదను ఆపదను ఆయన ఎల్లప్పుడు సమానంగా చూచేవాడు, అని అర్థం. ఆయన ఎప్పుడూ ప్రశాంతంగా సమభావం కలిగి ఉండేవాడు. గ్రామంలో వాతావరణం ఆయనకు వ్యతిరేకంగా మారడం ప్రారంభమైంది. ఏదో ఒక మాట అని, ఆయన్ను అవమానించేవారు, గ్రామవాసులు. ఆయన మాటలను తిరస్కరించేవారు. ఏక్‌నాథ్ మహారాజ్ దీనికి కూడా బాధపడలేదు. గృహస్థాశ్రమంలో ఉంటూ కూడా ఆ సిద్ధమహాపురుషుడి దృష్టి సమానంగా ఉండేది.

**మమతా నహీఁ సుతదార్ మేఁ, నహీఁ దేహ మేఁ అభిమాన్ హై**
**నిందా ప్రశంసా ఏక్ సీ, సమ మాన అరు అపమాన హై.**
**జో భోగ ఆతే భోగతా, హోతా న విషయాసక్త హై**
**నిర్వాసనా నిర్ద్వంద్వ సో, ఇచ్ఛా బినా హీ ముక్త హై .**
**సబ విశ్వ అపనా జానతా, యా కుఛ్ న అపనా మానతా**
**క్యా మిత్ర హో క్యా శత్రు, సబ్ కో ఏక్ సమ సన్మానతా.**
**సబ్ విశ్వకాహై భక్త జో, సబ్ విశ్వ జిస్‌కా భక్త హై**
**నిర్హేతు సబ్‌కా సుహృద్ సో, ఇచ్ఛా బినాహీ ముక్త హై.**
**మాయా నహీ, కాయా నహీ, వంధ్యా రచా యహ విశ్వహై.**
**నహీఁ నామ హి నహీ రూప హీ, కేవల్ ఇక్ ఈశ హీ పరిపూర్ణ హై.**
**జో ఈశ్వర హై వహీఁ జీవ హై, వహీ సబ్ జగ్ కా పరమాత్మ తత్వ హై**
**ఐసా జిసే నిశ్చయ హువా, వహ ఇచ్ఛా బినా హీ ముక్త హై.**

అనగా : భార్యాపుత్రులపట్ల లేదుమమత, దేహం పట్ల లేదు అభిమానం
నిందాప్రశంసలు మానావమానాలు సమానం
సుఖసంతోషాలు కలిగినపుడు అనుభవించినా
వాటి వెంట పడడం లేదు
నిర్వాసనము నిర్ద్వంద్వము, ఇచ్ఛ అన్నది లేదు, ముక్తుడు.
విశ్వమంతా తనదేనన్న భావన, ఏదీ తనది కాదన్న భావం;
శత్రువులు మిత్రులు అందరూ సమానమే.

విశ్వమంతటికీ భక్తుడు, విశ్వమే భక్తితో కొలిచేది.
అందరిపట్ల నిర్హేతుకమైన సుహృద్భావము, ఇచ్ఛ అన్నది లేదు, ముక్తుడు.
మాయలేదు కాయంలేదు, ఈ విశ్వం అసత్యం గొడ్రాలి బిడ్డవలె
నామం లేదు రూపం లేదు, దేవుడొక్కడే పరిపూర్ణుడు.
ఈశ్వరుడే జీవుడు, అతడే పరమాత్మ తత్త్వము
అటువంటి నిర్ణయం కలిగినపుడు ఇచ్ఛఅన్నది లేదు, ముక్తుడు.

ఈ విధంగా ఏక్‌నాథ్ మహారాజ్ ఎల్లప్పుడూ భక్తిపారవశ్యంలో మునిగి ఉండేవాడు. ఆయన గృహంలో ప్రతిదినము, భగవంతుడి గురించి సద్గోష్ఠి, హరిభజన, ధ్యానయోగం జరిగేవి. కూర్చున్నా లేచినా నిద్రపోయినా, అన్నీ ఆనందమే ఆయనకు. ఈ ప్రపంచమంతా ఆనందమయంగా ఉండేది. పరమాత్మ ఆనందరూపుడు. ఆయన సృష్టించిన ప్రపంచంకూడా ఆయన వలెనే సుఖమయము. ప్రపంచాన్ని ఆనందస్వరూపముగా చూడగల కన్నులు, గురుప్రసాదమే. ఇటువంటి ఆనందంతో ఏక్‌నాథ్ మహారాజ్ తమ జీవితాన్ని గడిపేవారు.

కొన్ని రోజుల తర్వాత పితృపక్షం వచ్చింది. మీకు ముందే చెప్పి ఉన్నాను: మనం అర్పించే తర్పణాదులు పితృలోకానికి చేరుతున్నాయని, పితృదేవతలకు అవి అందుతున్నాయని, ఈ విధంగా చేయడం అవసరమని. మనం, పిల్లలం, మన పితృదేవతలకు ఎంతో ఋణపడి ఉన్నాము. తలిదండ్రులు మనకు, తమ రసాన్నీ రక్తాన్నీ తాము తినే ఆహారంలో సగభాగాన్నీ మనకిచ్చి పోషిస్తున్నారు. ఈ సంగతిని మనం ఎన్నటికీ మరువరాదు. తాము తినరు, పిల్లలకు పెడతారు. తాము నిద్రపోరు, పిల్లలను నిద్రపుచ్చుతారు. మంచి ఆహారపదార్థం ఏది లభించినా మొదట పిల్లలకిస్తారు. మిగిలితేనే తాము తింటారు. తలిదండ్రులు పిల్లలకు ఏమి చేయరు? అందువల్లనే మనం మన పితృదేవతలకు ఎంతో ఋణపడి ఉన్నామని చెప్పడం. పితృపక్షంలో తర్పణం చేయడం నీతినియమాలుగల పుత్రుడికి అత్యంత అవసరం. పితృపక్షంలో బ్రాహ్మణులను సన్యాసులను అతిథులను ఆహ్వానించి వారిని ఆదరించి వారికి భోజనం పెట్టడం, పితృదేవతలకు తర్పణం విడవడం మన మత సంప్రదాయం. ఏక్‌నాథ్ మహారాజ్ కూడా పితృపక్షంలో బ్రాహ్మణులను భోజనానికి పిలిచాడు. కాని, ఒక్కరుకూడా రాలేదు. ఆయన, హరిజన బాలిక ఇంట్లో భోజనం చేశాడు గదా,

అందువల్ల. అప్పుడు ఏక్‌నాథ్ మహారాజ్, పితృదేవతలను ఆహ్వానించాడు. ఆశ్చర్యం! పైఠణ్ గ్రామంలోని బ్రాహ్మణ కుటుంబాలలో మరణించిన పూర్వీకులందరూ, భోజనానికి వచ్చారు. నేను, పితృలోకంలో పితృ దేవతలను చూచిన తర్వాత, ఈ కథ కల్పితం కాదని తెలసింది. పితృలోకం నిజంగా ఉంది.

ఈ విధంగా నేను అనేక లోకాలను చూచాను. ధ్యానంలో ప్రతి రోజు కొత్త అనుభవాలు కలుగుతున్నాయి. ధ్యానం మళ్లీ నీలేశ్వరిలో స్థిరం కాగానే ద్రష్టాభావం వస్తుంది. ఇటువంటి ధ్యానాన్ని 'సమాధి అవస్థ' అనవచ్చు. దీనిలో స్పృహ పూర్తిగా ఉంటుంది. ప్రాణాపాన క్రమం సూక్ష్మమౌతుంది. కాని పూర్ణకుంభకం ఉండదు. సిద్ధ మార్గంలో సమాధి అవస్థ ఇదే. దీనిలో ద్రష్టాభావం స్ఫురిస్తూ ఉంటుంది. ఇది, ఎటువంటి ఎఱుకలేని, అవిద్యతో కూడిన, జడసమాధి కాదు. చైతన్యలోకం జ్ఞానయుక్తమైనది. అందుచేత సమాధిలో ద్రష్టాభావం ఉండడం అవసరం.

ధ్యానం జరుగుతున్నపుడు దివ్యమైన ఆనందానుభూతిలో మునిగిపోయేవాడిని. ఈ విధంగా ధ్యానం చేసుకునే అవధి పూర్తయేది. బాహ్య ప్రపంచం గురించి స్పృహ కలిగేది. పద్మాసనాన్ని సడలించి, పాదాలను చేతులతో ఒత్తుకునేవాడిని. లేచి అటూ ఇటూ తిరిగేవాడిని. ధ్యానానికి కూర్చునేముందు నాలుగు దిక్కులను గురురూపంగా భావించి పరాశక్తి రూపంగా భావించి నమస్కరించేవాడిని. నేను కూర్చునే ఆసనాన్ని గురుపీఠంగాను శక్తిపీఠంగాను భావించేవాడిని. దాన్ని చాపగాగాని మఖమల్ వస్త్రంగా గాని భావించేవాడిని కాదు. నాపైన, కింద సర్వత్ర చిత్‌శక్తి వ్యాపించి ఉండడాన్ని చూచేవాడిని. అందరికీ మనస్సులో నమస్కారం చేసుకుని కూర్చునేవాడిని. ధ్యానం నుంచి లేచే సమయంలో కూడా ఆసనాన్ని స్పృశించి దానికి నమస్కారం చేస్తాను.

ఆ రోజు ధ్యానం తర్వాత, బాహ్యస్మృతి కలిగిన తర్వాతకూడా ధ్యానంలో 72 కోట్ల నాడుల్లో ప్రేమకిరణాలు ప్రసరించిన అనుభూతి కొనసాగింది. ఉన్మత్త స్థితి అది. ఆ ప్రేమ కిరణాలు ఎంతో ఉత్సాహపూరితమై, నా రక్తకణాల్లో చిందులు – గంతులు వేస్తూ ఆనంద రూపంలో ప్రవహిస్తున్నాయి. ఈ విధంగా 'ప్రేమ – పిచ్చి' పట్టిన స్థితి అనుభవంలోకి వచ్చింది. ఇదివరలో పిచ్చి అనేక రకాలుగా పట్టేది. ఇప్పుడు ఇది ప్రేమ పిచ్చి. ప్రేమ తరంగాలు సర్వాంగాల్లో ప్రసరిస్తూ పరాశక్తి ప్రాప్తించిన సంగతిని తెలియచేస్తున్నాయి.

ధ్యానం రోజూ ఇదే విధంగా జరుగుతూ ఉంది. ఉదయం ధ్యానం – మధ్యాహ్నం ధ్యానం – సాయంత్రం ధ్యానం. తుకారామ్ అభంగం ఒకటి జ్ఞప్తికి వస్తున్నది: **''తుకా వ్హణే దినరజనీ. హాచి ధందా''.** షావుకార్లు, ఉద్యోగస్థులు, నౌకర్ల వంటివారి దైనందిన కార్యక్రమం ఈ విధంగా ఉంటుంది – తెల్లవారిలేచి స్నానం చేయడం, అల్పాహారం తినడం, మధ్యాహ్నానికి భోజనాన్ని వెంట తీసుకుని ఆఫీసుకు వెళ్లడం, అక్కడ పనిలో నిమగ్నంకావడం, పనిపూర్తయిన తర్వాత ఆఫీసు మూసివేసి ఇంటికి రావడం. ఎవరైనా వారిని ''మీరేం చేస్తున్నారు'' అని ప్రశ్నించినట్టయితే వారంటారు: ''అదే రోజూ చేసేపనే, వెళ్లడం, రావడం, తినడం, తాగడం, రాత్రికి నిద్రపోవడం''. ముక్తానంద దినచర్య కూడా అదే విధంగా ఉంది. పగటి పూట – ఉదయం, సాయంత్రం – ధ్యానం, ధ్యానం ముగిసిన వెంటనే తోటలో పనిచేయడం, మొక్కలకు నీరు పెట్టడం, రాత్రి – మళ్లీ ధ్యానం, నిద్ర.

పందొమ్మిది

# నాదలోకం

ఇప్పుడు ధ్యానంలో ఒక కొత్త స్థానం ప్రాప్తించింది. దానిపేరు ''**నాదలోకం**''. నాదం అనేక రకాలు. సముద్రంలోని నీటి శబ్దం, మేఘగర్జన, సెలయేటి నీటి ప్రవాహపు శబ్దం, దూరంగా రైలుబండి వేగంగా పరుగెడుతున్న శబ్దం, దూరంగా ఆకాశంలో విమానం ఎగురుతున్న శబ్దం, స్మశానంలో మృత శరీరం కాలుతున్నప్పటి శబ్దం - ఈవిధంగా అనేక రకాలైన శబ్దాలు వినిపించసాగాయి. ఒక్కొక్క సారి, చాలామంది కూర్చుని భజన చేస్తున్నట్టు ఘోష, మృదంగం వాయిస్తున్నట్టు నాదం, దుందుభిమ్రోత, శంఖాన్ని పూరించినట్టు గంభీరమైన దివ్యనాదం, ఓంకారాన్ని స్ఫురింపచేసే పెద్ద పెద్ద గంటల ప్రచండనాదం, వీణ వంటి వాద్యాల మధురమైన ధ్వని, వినిపించేది. మధ్య మధ్యలో తుమ్మెదలు, తేనెటీగల ధ్వని, సూర్యోదయ సమయంలో తోటలో నెమళ్లు, కోయిలలు ఇతర పక్షులు చేసే కలకలనాదం వినిపించేది. ఒక్కొక్కసారి ఇంద్రలోకంలోనూ ఇతరలోకాల్లోనూ విన్న సంగీత ధ్వనులు వినిపించేవి. ఇతర రకాల ధ్వనులు కూడా హృదయాకాశంలో వినిపించసాగాయి. చిన్ చిన్ -చించిణ - ఘంట - శంఖం- వీణ - కరతాళాలు- వేణువు - మృదంగం- భేరీ- మేఘం, ఈ విధమైన పది రకాల నాదాలు వరుసగా వినిపించేవి. ఇప్పుడు నాద శ్రవణం, ఒక కొత్తరకమైన పారవశ్యాన్ని కలిగించేది. దీనివల్ల అప్పుడప్పుడు నాకు పది- పదిహేను రోజులపాటు నిద్రపట్టేది కాదు. నిద్రకూ నాదానికీ పడేట్టులేదు. అందువల్లనేమో నిద్రకు కోపం వచ్చి వెళ్లిపోయేది. కాని నిద్ర రాకపోవడం వల్ల నేను భయపడలేదు. మనస్సు కూడా పాడుకాలేదు. ఇంకేదైనా కారణం చేత నిద్రపట్టకపోయినట్టయితే మనసు పాడవుతుంది. శరీరం కూడా దెబ్బతింటుంది. కాని నాకు అటువంటి దేమీ జరుగలేదు. నిద్రపట్టక పోయినప్పటికీ, చురుకుదనం, ఉత్సాహం, ఎప్పటి మోస్తరుగానే ఉన్నాయి. ఆనందంగా ఉంది. నిద్ర అవసరమని కూడా తోచలేదు. ఆహారం కూడా తగ్గిపోయింది. శరీరంకూడా కొంత కృశించినట్లు తోచింది.

ఈ నాదానుసంధాన సమయంలో యోగిలో ఒక నృత్యకళ ఉదయిస్తుంది. నృత్యం చేయడం ప్రారంభిస్తాడు. నేనుకూడా రాత్రిపూట అప్పుడప్పుడు పైన పర్వతం మీదికి వెళ్లి గంటల తరబడి నృత్యం చేసేవాడిని. ఆ సమయంలో ఎటువంటి దివ్యమైన భావం ఉండేది! నా నృత్యాన్ని నేను మాత్రమే చూచేవాడిని. నాకు చాలా సిగ్గుగా ఉండేది. అందుచేత ఈ సంగతిని ఎవరికీ తెలియనివ్వలేదు. రహస్యంగా నృత్యం చేసేవాడిని. ఇటువంటి కళాత్మకమైన నృత్యం చేయడంవల్ల ఆకలి కొంత ఎక్కువ అయేది. శరీరం తేలికైన భావం కలిగేది. మంచి కుటుంబాలకు చెందిన బాల బాలికలు, స్త్రీ, పురుషులు ఎటువంటి సంకోచమూ లేకుండా సభల్లో ఏ విధంగా నృత్యం చేస్తారో నాకు అర్థం కాలేదు. నాకు ఇప్పటికీ సిగ్గుపోలేదు. అందువలన నాలో ఏదైనా లోపం ఉందేమోనని అనుకునేవాడిని. నాదానుసంధానంతోపాటు, నేను దాన్ని సూక్ష్మంగా పరిశీలించడం ప్రారంభించాను. నాదం ఎడమచెవిలోనో లేదా కుడి చెవిలోనో ఉదయిస్తుందని సాధకుడు భావిస్తాడు. నిజానికి అది చెవిలో వినిపించదు. సహస్రారంలోని ఊర్ధ్వాకాశంలో ఉదయిస్తుంది. అక్కడ పరవశింపచేసే సంగీతం ఉదయిస్తుంది. అక్కడి నుంచి అది ఏ చెవిలోనైనా వినిపిస్తుంది. శిరస్సులో ఉన్న ఆకాశంలో ఒక అత్యంత దివ్యమైన స్ఫూర్తి కలిగింది. జ్ఞాపకశక్తి విపరీతంగా పెరిగింది. దర్శనానికి ఎంతమంది వచ్చారు, ఎవరు ఏమి తెచ్చారు – ఇవన్నీ బాగా జ్ఞాపకం ఉండేవి. ధారణశక్తి కూడా ఎక్కువైంది. విద్యార్థులకు ఇటువంటి జ్ఞాపక శక్తి ఉన్నట్టయితే వారు నోట్సు తీసుకోవడంగాని, వ్రాసుకోవడంగాని ఎక్కువ అవసరం ఉండదుగదా అని తోచేది. కుండలిని విషయంలో సంపూర్ణ జ్ఞానం కలిగిన జ్ఞానేశ్వరుడి రచన ఒకటి జ్ఞాపకం వస్తున్నది: ''**హేచి ఆత్మప్రభా నిత్య నవీ**''. ముక్తానందకూడా అదే అంటున్నాడు. ధ్యానప్రభ, ధ్యానం యొక్క లీల, రోజు రోజుకు కొత్తగా ఉండేది. ఎన్నోకొత్త అనుభూతులు! రోజూ ధ్యానం చేస్తూనే ఉన్నప్పటికీ మనస్సు దాని నుంచి విముఖం కాలేదు. సాధనలో జరుగుతున్న క్రియలు తగ్గలేదు. పై పెచ్చు ప్రయత్నమూ పురుషార్థమూ కూడా విపరీతంగా ఎక్కువయాయి. మానవుడు, తన గమ్యస్థానం సమీపించే కొలదీ పరుగెత్తడం ప్రారంభించినట్టు, నా ధ్యానవేగం కూడా ఉధృతమైంది. ప్రతిదినము అనేకరకాల నాదాలు వినిపిస్తున్నాయి. చాలాసార్లు నేను మధురమైన మురళీనాదాన్ని విన్నాను. ఎంత దివ్యమైన సంగీతం! ఎంత ఆకర్షణ! మురళీనాదం యొక్క ఆకర్షణ గురించి నేను కొన్ని కావ్యాల్లో చదివాను. ఒక గోపిక అంటున్నది :

''ఓ భగవంతుడా నీ వేణునాదాన్ని ఆపు. నీ మురళీనాదం వినిపించినపుడు నేను ఏమీ చేయలేక పోతున్నాను. నా పిల్లల స్పృహ కూడా ఉండడం లేదు. ఇంటికి వెళ్లలేకుండా ఉన్నాను. హే ప్రభూ, నేను ఇంటికి వెళ్లడం అవసరం. అరె! నీ మురళిని కాస్త ఆపు. నీ మురళీనాదం ఎంతో మధురమైనది. అందుచేత నా కాళ్లు ఇంటివైపు వెళ్లడం లేదు. నా ముఖం ఇంటివైపు తిరగడం లేదు. ఓ మనమోహనా, దయచేసి మురళిని కొంతసేపు ఆపు. నా పిల్లలకూ భర్తకూ వంటచేసి, భోజనం పెట్టవద్దా? అత్త–మామలు నేనింకా రాలేదని ఎదురు చూస్తుంటారు. దయ ఉంచి, మురళిని వాయించడం ఆపు.'' ఈ విధంగా గోపిక, భగవంతుడిని అతిదీనంగా ప్రార్థిస్తుంది.

నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా, నేను సహస్రారంలో మురళీ నాదం విన్నపుడు నాకు తంద్రాలోకం గురించి స్పృహే ఉండదు. నా ఆ ద్రష్ట ఏమౌతుందో. అదికూడా తెలియదు. మధురమైన వేణునాదాన్ని వింటూ నేను ఏలోకాలకు వెళ్తానో నాకేమవుతుందో నాకు తెలియదు. సహస్రారంలో మురళీనాదం విన్న నా పరిస్థితి ఈ విధంగా ఉన్నపుడు, పరమానంద స్వరూపుడైన శ్రీ కృష్ణభగవానుడి వేణునాదాన్ని ప్రత్యక్షంగా విన్న గోపికల స్థితి ఆ విధంగా కావడంలో ఆశ్చర్యమేముంది? ఈ విషయంలో సందేహానికి తావులేదు. మురళీనాదాన్ని ప్రత్యక్షంగా విన్న ఆ గోపికలు, ప్రాతఃస్మరణీయమైన కృష్ణప్రేమ యొక్క కిరణాలు. సహస్రారంలో మురళీనాదాన్ని విన్న యోగికే ఇటువంటి తన్మయస్థితి కలిగినపుడు, ఇక ఆ గోపికలకు ఎటువంటి స్థితి కలిగినదో!

నేను అప్పుడప్పుడు నృత్యం చేస్తాను. ఊగుతాను. ఒక్కొక్కసారి ప్రేమోన్మత్తుడనై, ఆ దివ్యనాదంలో నన్ను నేను మరిచిపోతాను. ఈ నాదమే పరబ్రహ్మము. ఇది శ్రీ గురు నిత్యానంద యొక్క శబ్దమయమైన శరీరం. ఇది పరాశక్తి, మహామాయ, శ్రీ కుండలిని తల్లి యొక్క స్ఫురణ చేత కలిగిన స్ఫూర్తి యుక్తమైన స్పందనము. దీనిపేరే **''ఆదౌ భగవాన్ శబ్దరాశిః''**. భగవంతుడిని ఈశబ్దాల్లోనే చూచాను. ఇదే నా క్రియాశీలమైన కుండలిని యొక్క ఉత్తర రూపం. ఈ విధంగా నాదానుసంధానం చేస్తూ, మనస్సు, నాదం ఉదయించే స్థానంలో స్థిరపడేది. ఈ నాద స్పందనం వల్ల దివ్యమైన జ్యోతి యొక్క స్ఫులింగాలు వెలువడేస్థానాన్ని నేను ద్రష్టగా చూచేవాడిని. అప్పుడు అన్ని ఇంద్రియాల గమనం కూడా ఆటే. జిహ్వ అక్కడికే పరుగులెత్తేది. ఆవిధంగా నాదానుసంధానం జరుగుతూ, నాకు వినిపించే నాదాలకు తగినట్టు, శరీరంలో మందంగా నొప్పి పుట్టేది. శరీరమంతా విరిగిపోతున్నట్టు అనిపించేది. చెమటలు

కారిపోయేవి. శిరస్సు అతివేగంగా కంపించేది. శరీరమంతటా సన్నగా మంటలు పుట్టేవి. అప్పుడప్పుడు ఊర్ధ్వాకాశం నుంచి అమృతం చిన్న చిన్న బిందువులుగా పడేవి. అప్పుడప్పుడు అక్కడినుంచి రకరకాల రుచులు– చేదు–పులుపు– తీపి–కారం వంటి రుచులు వచ్చేవి. ఒక్కొక్కసారి నాదలోకం నుంచి పాలవంటి ద్రవ పదార్థం, అంగిట్లో పడేది. ఇది జఠరాగ్నిలో ప్రవేశించి, 72 కోట్ల నాడుల్లోకి వ్యాపించేది. దీని ఫలితంగా శరీరంలోని సూక్ష్మవ్యాధులు తొలగిపోయేవి. శరీరం ఎంత శ్రమపడినా అలసట ఉండేది కాదు. అటువంటి దివ్యనాదాన్ని వింటూ నాదం శబ్దబ్రహ్మ అని తెలుసుకుని, నాదరూపంలో శబ్ద బ్రహ్మను సాక్షాత్కారం చేసుకునేవాడిని. నాలో క్రియారూపంలో ఉన్న కుండలినితల్లి కూడా నాదరూపంలో ఉన్న తన పతిని కలుసుకుని మిక్కిలి ఆనందించేది. ఆ ఆనందపు తరంగాలు నా శరీరమంతటా వ్యాపించేవి. ముక్తానంద నృత్యం చేయడం ప్రారంభించేవాడు. ఆ నాద తరంగాలు శరీరంలో ప్రసరించడం వల్ల నా మనస్సుకు స్ఫూర్తి, చురుకుదనం కలిగేవి.

పరమాత్మ యొక్క వేణునాదాన్ని వింటూ ఉండడం చేత, గూఢమైన విషయాల గురించి తెలియడం ప్రారంభమైంది. నాదశ్రవణపు అవధి ఎక్కువవుతూ ఉంది. ఏదైనా పనిలో నిమగ్నమై ఉన్నా, నాదం వినిపించేది. వస్తున్నపుడు నాదం, వెడుతున్నపుడు నాదం, నిద్రపోతున్నపుడు నాదం, భోజనం చేస్తున్నపుడు నాదం, కోపం వచ్చినపుడు, నాదం బాగా ఎక్కువయేది. వేణునాద శ్రవణం ఎక్కువవుతున్న కొద్దీ, వాక్కు యొక్క గుణం ఎక్కువకావడం, అనుభవంలోకి వచ్చింది. ఈ విధంగా రకరకాల నాదాలను వింటూ, వాటికి తగిన లక్షణాలను అనుభవించే వాడిని. భేరీనాదం వినిపించినపుడు, దానివల్ల లభించే దివ్య చక్షువులతో ఎక్కడో దూరంగా జరిగే వాటిని చూడకలిగేవాడిని. ఒక్కొక్కసారి, నాగదిలో కూర్చుని, పక్కగదిలో జరిగేవాటిని చూచేవాడిని. ఇంకొకగదిలో ఎవరైనా పని రహస్యంగా చేసినట్టయితే, నేను తక్షణమే అక్కడికి చేరుకునేవాడిని, నన్ను ఎవరో అక్కడికి పిలిచినట్టు. కాని, ఆ వ్యక్తితో నన్ను ఫలానావ్యక్తి పిలిచాడని చెప్పేవాడిని. ఆ విధంగా భేరీనాదం వింటూ దాని లక్షణాలను పొందుతూ నా ధ్యానం శుక్లపక్ష చంద్రుడి విధంగా రోజురోజుకు ఎక్కువయేది.

దాని తర్వాత అంతిమ నాదాన్ని విన్నాను. దీనిపేరు **మేఘనాదం.** ఇది, గొప్ప దివ్యమైన నాదం. ఇది నాదాలకు రాజు, యోగులకు వారికి అవసరమైన వాటినన్నిటినీ

సమకూర్చే కామధేనువు. దీనిని వినడంవల్ల దీని శ్రవణం వల్ల ఊర్ధ్వాకాశంలో పెద్దశబ్దం వినిపించేది. ఈ దివ్య నాదపు శబ్దానికి సాధకుడికి కొన్నిరోజుల పాటు స్పృహ ఉండదు. యోగి లక్ష్యమైన సమాధి కలిగేది ఈ నాదం వల్లనే. **ఈ మేఘనాదం నుంచే యోగికి ఓంకారనాదం వినిపిస్తుంది. 'ఓంకారం స్వయంభువు' అని అప్పుడు తెలుస్తుంది.** సంప్రదాయాన్ననుసరించి ఇతర మంత్రాల విధంగా ఇది ఋషులు రూపొందించినది కాదు. ఎవరైనా మహంతు రచన కాదు ఇది. ఇది స్వయంగా ఉదయించిన నాదం. ఇది సహస్రారంలోని ఊర్ధ్వాకాశంలో స్వతహాగా ఉదయిస్తుంది, తానుగా స్ఫురిస్తుంది. మరొకరి ప్రేరణవల్ల స్ఫురించేది కాదు. ఈ నాదం ఉదయించిన వెంటనే యోగి ఎంతో పరవశం చెందుతాడు. అప్పుడప్పుడు నా నియమాన్ని మరిచిపోయి ఈ విషయం గురించి ఇతరులతో చెప్పేవాడిని. వారు ఎంతో శ్రద్ధగా వినేవారు. విని, ఇతరులతో చెప్పేవారు గర్వంగా, ''ముక్తానందస్వామి ఈ శబ్దం విన్నాడు, ఆ శబ్దం విన్నాడు'' అని. నిత్యానంద బాబాకు కూడా చెప్పేవారు. అంతే మర్నాడు నేను దర్శనానికి వెళ్లినపుడు బాబా చాలా కోపంతో అనేవారు: ''మూర్ఖుడా... ఆవిధంగా చెప్పుకుంటారా. ఆఁ....? రహస్యంగా ఉంచవలసిన ఇటువంటి విషయాలను బహిరంగంగా చెప్పుకొనడం వల్ల సిద్ధి భ్రష్టమైపోతుంది. యోగి కష్టాల పాలవుతాడు.'' ఆయన ఆ విధంగా అనడంతో కొన్నిరోజులు సాధన కుంటుపడేది. సిద్ధ విద్యలో **''గురు కృపాహి కేవలం గురోరాజ్ఞాహి కేవలం''** అని మీకు పదేపదే చెప్పి ఉన్నాను. గురువుకు క్షోభ కలిగించినట్టయితే సాధన కుంటుపడుతుంది. పూర్ణత్వాన్ని సాధించడంలో ఆలస్యమౌతుంది. మంచిది.

ఈవిధంగా, నా ధ్యానం రోజురోజుకు ఎక్కువవుతూ ఉంది. ఇప్పుడు ధ్యానానికి లక్ష్యం: నీల వర్ణంలో నీల బిందువులో. నా ధ్యానం విభిన్న శరీరాలలో నుంచి పోతూ – రక్తేశ్వరి నుంచి శ్వేతేశ్వరి, శ్వేతేశ్వరి నుంచి కృష్ణేశ్వరి, కృష్ణేశ్వరి నుంచి ఇప్పుడు – నీలేశ్వరిలో స్థిరపడింది. ఆ నీలేశ్వరికి నలువైపులా కుంకుమపువ్వు రంగు – బంగారు రంగు కలిసిన వలయం కనిపించేది. నీలేశ్వరి వెలుగు రోజురోజుకు ఎక్కువవుతూ ఉంది. ధ్యానం చేసుకునే అవధి పెరుగుతున్న కొద్దీ నీలబిందు ప్రకాశం కూడా ఎక్కువవుతూ ఉంది. మొదటి రోజుకన్నా రెండవరోజు తేజస్సు ఎక్కువగా ఉండేది. దీని తేజస్సు రోజు రోజుకు ఎక్కువవుతూ ఉంది. నా ఉత్సాహం కూడా రోజురోజుకు ఎక్కువవుతూ ఉంది. అయినప్పటికీ నాకు అనిపించేది: పూర్ణత్వాన్ని ఇంకా

సాధించలేదని. పూర్ణత్వం ఇంకా లభించలేదని నా అంతరంగం చెబుతూ ఉంది. ఇంకా చాలా బాకీ ఉందని చెబుతూ ఉంది. తృప్తిగా హాయిగా ఉన్నప్పటికీ సాధించవలసినది ఇంకా ఉన్నదని చెబుతున్నది.

ఇక్కడ ఒక నిజం ఛెప్పవలసి ఉంది. దీనివల్ల ఉపాసకుడు దృఢమైన నిష్ఠ కలవాడుగా రూపొందుతాడు. సాధకుడి శరీరంలో చిత్‌శక్తి ప్రభావమూ, శ్రీ గురుదేవుడి ప్రత్యక్ష అస్తిత్వం యొక్క పరిపూర్ణమైన ఎఱుకా ఉంటాయి. నా ముక్కు, చెవులు, కనులు, నాలుక, ముఖమూ, ఏవిధంగా సత్యమో అదేవిధంగా నా అంతరంగంలో వ్యాపించి ఉన్న శ్రీ గురువు కూడా సత్యమని సాధకుడు భావించడం అవసరం. నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా, ఈ సంగతిని జాగ్రత్తగా పరిశీలించి మననం చేయండి. శ్రీ గురువులోనూ పారమేశ్వరి అనుగ్రాహిక శక్తిలోనూ అచంచలమైన శ్రద్ధను కలిగి ఉండండి. కొంత ఆలోచించండి. డాక్టరు ఏదో ఒక చోట ఇంజెక్షన్ ఇచ్చినపుడు, అది శరీరమంతటా వ్యాపిస్తుంది. కొన్ని రకాల ఇంజెక్షన్ల వల్ల రక్తం వేడెక్కుతుంది. ఆయుర్వేద వైద్యులెవరైనా ఇచ్చిన చిన్న మాత్ర వేసుకున్నట్టయితే రోగం పోతుంది. చిన్నమాత్రఅయినా దాని శక్తి ఎంతో ఎక్కువ. అది నీ శరీరమంతటా నరనరాల్లో ప్రతి అణువులో వ్యాపించి వ్యాధిని నిర్మూలించగలదు. ఇది నీ ప్రత్యక్ష అనుభవం. అదే విధంగా సద్గురువు బ్రహ్మానంద రూపంలో విలసిల్లుతున్న పరాశక్తితో పాటు, అన్నిరకాల అనర్థాలకు కారణ భూతమైన అవిద్యను నాశనం ఛేసే శక్తితోపాటు, నీ అంతరంగంలోని దీక్షను నిమిత్తంగా తీసుకుని ప్రత్యక్షంగా గాని లేదా పరోక్షంగా గాని దృష్టి - శబ్దం - సంకల్పం - సహఫాసం - స్పర్శ - వీటిలో ఏదైనా ఒక మార్గం ద్వారా స్వయంగా ప్రవేశిస్తాడు. ఈ విధంగా నీలోకి ప్రవేశించి సప్తధాతువులూ సర్వేంద్రియాలూ పంచకోశాలూ నఖశిఖపర్యంతం మూర్తీభవించి ఉంటాడు. అప్పుడు నీకు నీ అంతరంగంలో నుంచి మార్గదర్శనం లభించడం, సాక్షాత్కారం కావడం కష్టం కాదు. అటువంటి గురువుయొక్క జ్ఞానానికీ ప్రేమకూ నిష్ఠకూ ఆజ్ఞాపాలనకూ దూరమైనపుడు గురువుకూడా దూరమౌతాడు. నిజానికి ఆయన నీ అంతరంగంలో క్రియాశక్తి రూపంలో నివసిస్తాడు. నీలోపల ఈ విధంగా నివసిస్తూ నీలోపలి నుంచి నీకు ఏదైనా చెప్పడం, ఏదైనా నేర్పించడం ఆశ్చర్యం కాదు. **ముక్తానంద చెబుతున్న ఈ సంగతి సత్యం: శ్రీ గురువు పూర్తిగా నీవాడు. కాని నువ్వు ఇంకా పూర్తిగా ఆయన వాడివి కాలేదు. ఆయన నీనుంచి కించిత్తు కూడా దూరంగా లేడు. నువ్వే ఆయనకు**

**దూరంగా ఉన్నావు. అందుచేతనే నిత్యనూతనంగా కనిపించే సాక్షాత్కారానికి నువ్వు దూరమవుతున్నావు.**

నా గురునిష్ఠ అకుంఠితమైనది. నేనెక్కడికి వెళ్లినా నా గురువు ఫొటో నాదగ్గర ఉండవలసినదే. తిరగడానికి వెళ్లినా కూడా ఉండేది. భోజనానికి కూర్చున్నపుడు దగ్గరే పెట్టుకునేవాడిని. నిద్రపోయే సమయంలో కూడా దగ్గరే పెట్టుకునేవాడిని. అంతేకాదు, స్నానాలగదిలో కూడా నా గురువు ఫొటో ఉంటుంది. ఎవరేమనుకున్నా సరే. మంచిది.

శ్రీ గురుదేవ రూపమైన అంతర్ జ్యోతినుంచి లేదా నేనింతకు ముందు వర్ణించిన సర్వజ్ఞలోకం నుంచి నాకు ఒక సందేశం లభించింది. ''అరె ముక్తానంద! నీలేశ్వరి దర్శనం వల్ల జీవన్ముక్తి ప్రాప్తించినప్పటికీ తుర్యానందం యొక్క అనుభూతి కలిగినప్పటికీ పూర్ణత్వ ప్రాప్తికి ఇంకా బాకీ ఉంది. దివ్యసాక్షాత్కారం ఇది కాదు. దానికిగాను నువ్వు నీలవర్ణంలోకి ఇంకా ఎక్కువగా ప్రవేశించవలసి ఉంది.'' అంతరంగంలో నుంచి చిత్‌శక్తి పరమేశ్వరి యొక్క ఈ సందేశం లభించింది. ఈ ఆదేశాన్ని సత్యమైనదిగా భావించి ధ్యానాన్ని ఎక్కువచేశాను. ధ్యానం ఎక్కువైన కొద్దీ, నీలేశ్వరి కూడా ఎక్కువసేపు స్థిరంగా కనిపించేది. ఆ విధంగా నీలేశ్వరి స్థిరంగా ఉండేకొద్దీ దాని తేజస్సు ఎక్కువ కాజొచ్చింది. స్థిరంగా ఉన్నంత సేపు దాని నడవడిక, దాని అద్భుత కార్యాలు కొత్త కొత్తగా ఉండేవి. నిజంగా అడిగితే ఇది నీలబిందువా లేక నీలకంఠుడా? ఇది నీలవర్ణమా లేక నీలవర్ణపు నిత్యానందుడా? ఇది కేవలం నీలం రంగు మాత్రమేనా లేక నీలివర్ణపు నీలేశ్వరి భవాని ఉమాశక్తి కుండలిని మాతా? ఈ విధమైన అనేక రకాల ఆలోచనలు తల ఎత్తేవి. నీలేశ్వరి ఇప్పుడు సమీపానికి వస్తున్నది. నీల బిందువు ప్రత్యక్షమయే వ్యవధి ఎక్కువవుతున్నకొద్దీ, దాని ప్రకాశం ఎక్కువయే కొద్దీ, ముక్తానందుడు కూడా పెరుగుతున్నాడు, మారుతున్నాడు, వికసిస్తున్నాడు, అన్నిచోట్ల ప్రసరిస్తున్నాడు, ముక్తానంద ఎవరు అన్న సంగతిని అర్థం చేసుకుంటున్నాడు. నీలబిందువు ప్రవర్తనకు తగినట్టు ఉండేది ముక్తానంద ప్రవర్తన. ఇప్పుడు నీల బిందువులో నాశ్రద్ధ మరింత ఎక్కువైంది. శరీరంలోని అవయవాలను 'మనవి'గా 'మనమే' అన్నట్టు ఏవిధంగా భావిస్తామో అదేవిధంగా నీలబిందువు విషయంలో కూడా అటువంటి భావనే ఏర్పడింది.

ఇరవై

# నీలపురుషుడి దర్శనం

నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా, ఇప్పుడు ఒక కొత్త సంఘటన జరిగింది. శ్రద్ధగా వినండి. విని విడిచిపెట్టవద్దు. ఒకరోజు నేను ధ్యానంలో పరవశుడినై కూర్చుని ఉన్నాను. కూర్చుంటూనే భగవతి కుండలిని శక్తి రూపమైన సద్గురువు శ్రీ నిత్యానందకు మహాపూజ ప్రారంభించాను: 'ఓగురుదేవా నీవు నా ప్రాక్ పశ్చిమలు, నీవు నా ఉత్తర దక్షిణాలు, ఓ సద్గురూ నాపైనా నాకిందా నీవే. నా ప్రియమైన గురుదేవా, నా కనుల్లో చెవుల్లో ముక్కులో నోటిలో నీవే ఉన్నావు. ఓ కృపాదాతా సద్గురు నాథా, కంఠంలో బాహువుల్లో రొమ్ములో, వీపులో, పొట్టలో నీవే ఉన్నావు. నా తల్లివి తండ్రివి నీవే. నా తొడల్లో నా కళ్లలో నా పాదాల్లో నీవే ఉన్నావు. ఓ బాబా నేను నీలో, నీవు నాలో ఉన్నాము. ఈనాడు రూపం – ఆకారాల్లో మనిద్దరిలో భేదం ఉంది ఆ భేదంలోకూడా నీవు ఉన్నావు. ''ఈ విధంగా గురువును తలచుకుని ధ్యానం ప్రారంభించాను. వెంటనే రక్తేశ్వరి, మెరిసిపోతూ ప్రత్యక్షమైంది. ఒకదాని తర్వాత ఒకటిగా రక్తేశ్వరి, శ్వేతేశ్వరి, కృష్ణేశ్వరి, నీలేశ్వరి వచ్చి నిలుచున్నాయి. హృదయంలో ఆనంద తరంగాలు లేచాయి. సహస్రారంలో, యోగులకు మిత్రుడైన మేఘాధిపతి ఇంద్రుడి గర్జన వినిపించసాగింది. ఆ తర్వాత ఒక అద్భుతం జరిగింది. ఈ అద్భుతం గురించి నేను చెప్పరాదు. కాని శ్రీగురువు ప్రేరేపిస్తున్నారు. చెప్పవలసిందని. ఈ సమయంలో దానిగురించి వ్రాసే సామర్థ్యం లేదు నాకు. నా చేయి కదలడంలేదు. వేళ్లు పనిచేయడం లేదు. కనులు తెఱుచుకొనడం లేదు. నాలుక మాత్రం పనిచేస్తూ ఉంది. బహుశః నిత్యానంద దేవుడు నాలుకమీద వచ్చి కూర్చుని ఉండవచ్చు. మాటలాడే అధికారం నాకు లేక పోవడం చేత నిత్యానంద దేవుడే మాటలాడు తున్నాడు. ఇప్పుడు వ్రాసేపని, నాకు ప్రియమైన యందేభావు చేస్తున్నాడు. ఆయన, మహారాష్ట్ర ఆర్థిక మంత్రికి కార్యదర్శి. ఆయన నిత్యానంద బాబాకు అంకితమైన వాడు. అందుచేత ఆయన వ్రాస్తున్నాడు. మంచిది.

మహాతేజస్వి అయిన నీలబిందువు అంతరంగంలోని అనంతప్రకారాలైన,

ప్రకాశిస్తున్న, కిరణాలతోపాటు, నా సమీపానికి వస్తూనే పెద్దది కావడం ప్రారంభమైంది. అది నా ఎదుట అండాకృతిని దాల్చి మానవ ఆకారంలో పెద్దదవుతూ ఉంది. అది పెద్దది కావడం నేను ప్రత్యక్షంగా చూస్తున్నాను. ఆశ్చర్యంలో మునిగిపోయాను. ఆ అండాకారం పెద్దదవుతూ మానవ ఆకారం దాల్చింది. దానినుంచి దివ్యమైన తేజస్సు, వేగంగా బయటికి వచ్చింది. ఒక్క క్షణం సేపు నాకు స్పృహ తప్పింది. తంద్రాలోకం ఎక్కడ నిద్రపోయిందో! సర్వజ్ఞలోకం ఎక్కడ విశ్రాంతి తీసుకుంటున్నదో! అన్ని విషయాలను అవగతం చేసే ప్రజ్ఞాలోకం ఏమైంది? ముక్తానందుడు ఒక్కక్షణం సేపు తనను తాను మరచిపోయినాడు. నువ్వు లేనపుడు ఇంకేమీ ఉండదు. చూచేవాడు లేనపుడు దృశ్యం కూడా ఉండదు. వినేవాడు లేనపుడు శబ్దం ఉండదు. వాసన చూచేవాడు లేనపుడు వాసనే ఉండదు. ఒక క్షణం సేపు ఏమీ తెలియలేదు. కాని, నా ధ్యానం అదే విధంగా ఉంది. నేను ఉత్తరాభిముఖంగా పద్మాసనంలో కూర్చుని ఉన్నాను. క్షణం తర్వాత ఆ అండాకృతి మళ్లీ మానవ ఆకారంలో ప్రకాశించడం ప్రారంభమైంది. అది ప్రకాశించడంతో ముక్తానంద మళ్లీ వచ్చాడు. ముక్తానంద యొక్క తంద్రాలోకం కూడా వచ్చింది. స్పృహ వచ్చింది. ముక్తానందను అనుక్షణం కనిపెట్టి ఉండే, అంతరంగంలో రిపోర్టర్ రూపంలో ఉండే దివ్యస్మృతి మళ్లీ వచ్చింది.

నా ఎదుట మానవరూపం ధరించి ఉన్న అండాకృతిలో నీలబిందువు నిల్చుని ఉంది. ఇప్పుడు దాని తేజస్సు తక్కువకావడం ప్రారంభమైంది. దానిలో ఒక నీలవర్ణపు మానవుడు కనిపించాడు. ఏమి రూపం! ఆ నీలవర్ణం ఏమి మెరిసిపోతున్నది! ఆ శరీరం, సప్తధాతువుల రస వీర్యాలతో చేసినది కాదు. తుకారామ్ మహారాజ్ ''చిన్మయ అంజనం'' అని వర్ణించిన నీల తేజోకిరణాలరాశి– దివ్య దృష్టిని ప్రసాదించే అంజనం – ఆ అనంత చిన్మయ కిరణాల రాశితో కూడిన శరీరమిది. ఇది చైతన్యగోళం. ముక్తానందుడిలోపల ఉన్న ప్రాణానికి ప్రాణం. నిత్యానందుడి రూపం. ఇది నా చిదంబ, చిద్విలాసిని, కుండలినియొక్క రూపం. ఎదుట ఆ దివ్యమైన మహాపురుషుడు నిల్చుని ఉన్నాడు. మిలమిల మెరిసిపోతున్నాడు. ఎంత సుందరమైన రూపం! ఆహా! ఎంత అందమైన కన్నులు! ఎంత తీరైన ముక్కు! కర్ణాలు, కర్ణకుండలాలు ఎంత అందంగా ఉన్నాయి! తీర్చిదిద్దిన తల. చూడముచ్చట గొలిపే శిరోజాలు. ఎంత అందమైన తల! గడ్డం పెరిగిలేదు. తలకు నవరత్న ఖచిత కిరీటం ఉంది. ఆ రత్నాలు ఈ పృథ్వికి చెందినవి కావు. అవి చిన్మయాలు. ఇక్కడివాటివలె జడం కావు. ఎంత చక్కటి విగ్రహం!

పొడవైన చేతులు. అందమైన వ్రేళ్లు. చక్కటిగోళ్లు. అన్నీ నీలవర్ణమే. ఆ ఆకారం అందమైన మెత్తటి వస్త్రాలను ధరించి ఉంది. పొడవైన కాళ్లు, కాలివేళ్లు, ఎంతో అందంగా ఉన్నాయి. అన్ని అవయవాలు ఎంతో చక్కటివి. ఆ రూపాన్నినేను పైనుంచి కిందికి, కింది నుంచి పైకి ఏకాగ్రతతో చూస్తూ ఉండిపోయాను, ఆశ్చర్యంతో.

ఆ ఆకారం నాముందుకు వచ్చి హుంకారం చేస్తూ ఏవో సంజ్ఞలు చేసింది. ''ఏదైనా చెప్పు'' అన్నది. నేనేం చెప్తాను. తన్మయత్వంతో చూస్తూ ఉండి పోయాను. ఆ ఆకారం నాకు ప్రదక్షిణం చేసింది. ఒక ప్రదక్షిణం చేసి మళ్లీ నిల్చుంది. నా వైపు చూచి కనులతో ఏవో సంజ్ఞలు చేసింది. ఈ విధంగా అన్నది: ''నాకు అన్నివైపుల నుంచి కనిపిస్తుంది. కనులు చూడగలవు. ముక్కు కూడా చూడకలదు. నాకు శరీరమంతటా కనులున్నాయి. నాకు శరీరమంతటా నాలుకలున్నాయి. నాలుకతోనే కాదు, చేతులతో కాళ్లతో కూడా మాట లాడగలను. శరీర మంతటా చెవులున్నాయి. అన్ని అవయవాలతో వినగలను.'' ఈ విధంగా ఆ ఆకారం నాకు చెబుతూ ఉంది. నేను వింటూ ఉన్నాను. ''నేను కాళ్లతోనే కాదు, తలతోకూడా నడవగలను. ఏ విధంగానైనా నడవగలను. ఒక్క క్షణంలో ఎంతదూరమైనా పోగలను. కాళ్లతో అవసరంలేకుండా నడుస్తాను. చేతులతో అవసరంలేకుండా పట్టుకోగలను. నాలుకతో అవసరంలేకుండా మాట్లాడుతాను. కనులతో అవసరంలేకుండా చూస్తాను. ఎంతో దూరంగా వున్నప్పటికీ, ఎంతో దగ్గరలో వుంటాను. అన్ని శరీరాల్లో శరీరంగా ఉంటూ కూడా శరీరానికి భిన్నంగా వుంటాను.'' ఈవిధంగా ఇంకా ఏమోకూడా చెప్పింది ఆ మానవాకారం. ఈ మాటలన్నీ నిత్యానంద విన్నాడు. ఇది ఇక్కడ వ్రాయవలసిన విషయంకాదు. **'యహీ సాధన్, సిద్ధమార్గ, సత్యపథ్‌హై.'** అని కూడా అన్నది ఆ మానవాకారం. ఒక చేయి పైకెత్తి ఆశీర్వదిస్తున్నట్టు ఆడించింది. నేను ఎంతో ఆశ్చర్యంలో మునిగి ఉన్నాను. నేను చూస్తూ వుండగానే ఆ నీలవర్ణపు అండాకృతి, ఆరడుగుల ఎత్తు ఉన్న ఆకారం, ఇప్పుడు ముడుచుకుపోవడం ప్రారంభించింది. చిన్నదిగా మారిపోతూ ఉంది. చిన్నదై నీలేశ్వరిగా మారిపోయింది. అది నా నీలజ్యోతిగా నీలబిందువుగా మారి పోయింది.

నా ఆశ్చర్యానికి అంతు లేదు. లోపల ఎంతో ఆనందం. శ్రీ గురుదేవుడు నిత్యానంద దేవుడి కృప, పారమేశ్వరి శ్రీ చిత్‌శక్తి కుండలినీ దేవి కృప, జ్ఞప్తికి వచ్చి నేను తంద్రాలోకంలోకి పోయాను. తంద్రా లోకంలోకి ప్రవేశిస్తూనే నాకు బోధపడింది: సగుణ

సాక్షాత్కారాన్ని ప్రదానంచేసే దాతగా పేర్కొనే నీలపురుషుడే నాకు దర్శనమిచ్చాడని. ఈయనను అవ్యక్త మహాపురుషుడు అని కూడా అంటారు. ఈయన అనుగ్రహంతోనే ఇంకా కొంత పురోగమించినపుడు సత్యం సాక్షాత్కరిస్తుంది. ఆ మహాపురుషుడు నన్ను ఆశీర్వదించి, వచ్చిన నీల బిందువులోనే తిరిగి వెళ్ళాడు. వెంటనే ధ్యానం ముగిసింది.

ధ్యాన లోకంలో ఎన్నిరకాల దర్శనాలు! మానవుడికి ఎంత యోగ్యత ఉంది! ఆ నీల బిందువు ఎంత గొప్పది! ధ్యానేశ్వరుడు ఎంత గొప్ప దాత! మానవుడు ఎంత గొప్పవాడు! ఈ మానవుడు గొప్పవాడు! అరె! ముక్తానంద నువ్వు గొప్పవాడివి. నువ్వు అనంతుడివి. నువ్వు అద్భుతమైన వాడివి. ఈ విధంగా మానవత్వానికి ధన్యవాదాలను అందచేస్తూ చూచిన దృశ్యాలను పునశ్చరణ చేసుకుంటూ ఎంతో ఆనందంగా గడిపాను. ఇప్పుడు 'అహం ఆత్మ ఇతి' అన్న భావం పూర్తిగా స్థిరపడింది. 'సోహం' 'హంసః' వీటిలో పూర్తి విశ్వాసం ఏర్పడింది. 'నీలో దేవుడు, దేవుడిలో నువ్వు', అన్నది అనుభవంలోకి వచ్చింది.

నాకు దర్శనమిచ్చినది, భగవద్గీతలోని పదమూడవ అధ్యాయంలో వర్ణించిన దివ్య పురుషుడేనని నాకు ఇప్పుడు రూఢి అయింది:

**సర్వతః పాణిపాదం, తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్**
**సర్వతః శ్రుతి మల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి 13**

అనగా ఎవరికి అంతటా చేతులూ కాళ్ళూ ఉన్నాయో, ఎవరికి అంతటా కనులున్నాయో ఎవరికి అంతటా శిరస్సూ ముఖమూ ఉన్నాయో, ఎవరికి అంతటా చెవులున్నాయో, ఎవరు సర్వజ్ఞుడో, అతడు అన్నిటినీ ఆవరించి వుంటాడు.

**సర్వేంద్రియ గుణాభాసం సర్వేంద్రియ వివర్జితం**
**అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణ భోక్తృ చ ॥ 14 ॥**

అనగా, సహస్రారంలో ఉంటూ, సర్వ ఇంద్రియాల లక్షణాల్లో సూక్ష్మ రూపంలో భాసమానమౌతున్నప్పటికీ, అన్ని ఇంద్రియాలకు దూరంగా ఇంద్రియ రహితంగా ఉంటున్నట్టే. మరియు శరీరంలో ఉండి ''నేను ముక్తానందను'' ''నేను ఉన్నాను'' ''నేను ఉన్నాను'' అని అంటున్నప్పటికీ ఆసక్తిలేనట్టి ఆ దివ్యపురుషుడే అందరినీ పోషించేదీ, 72 కోట్ల నాడుల్లోని ప్రతి అణువును సంరక్షించేదీ, రసాన్ని రసమయమూ,

రక్తాన్ని రక్తమయమూ చేసి పోషించేది కూడా. గుణాతీతము, కేవలం నిర్గుణం అయి ఉండికూడా ఈ శరీరంలో సహస్రారంలో ఉంటూ అన్ని గుణాలను భోగిస్తూ ఉంటాడు. ఎవరైనా అన్నం పెట్టినట్టయితే తింటూ, ఎవరైనా పువ్వులను ఇచ్చినట్టయితే ధరిస్తూ, ఎవ్వరైనా వస్త్రాలిచ్చినట్టయితే కట్టుకుంటూ, ఎవ్వరైనా నమస్కరించినట్టయితే స్వీకరిస్తూ, ఇచ్చేవారు 'బాబాకిస్తున్నాం' అని భావించి ఇచ్చినపుడు తీసుకుంటూ ఉన్నది ఆ దివ్య పురుషుడే.

**బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ.**
**సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్ ॥ 15 ॥**

అనగా, మానవులు దానవులు అందరూ, క్రిమికీటకాదులూ, పశుపక్ష్యాదులూ, స్థావరజంగమ స్వరూపాలతో కూడిన ఈ జగత్తు అంతటా, అంతరంగంలో బాహ్యంలో వ్యాపించి ఉండినప్పటికీ సూక్ష్మరూపంలో ఉండడంచేత అర్థంకాడు. ఎంతదూరంగా ఉన్నట్టు మనం భావించినప్పటికీ అతి సమీపంగా, సహస్రారం మధ్యన ఉంటున్నాడు. అటువంటి పరమాత్మ, వ్యక్తి- జాతి- క్రియ- నామం- రూపం- దేశం- కాలం వంటి విభిన్నమైన రూపాలలో కనిపించినప్పటికీ అభేదుడు. మానవుల్లో మానవుడుగా, పక్షుల్లో పక్షిగా, ఆవుల్లో ఆవుగా, గుళ్మాల్లో గుళ్మంగా, పురుషుల్లో పురుషుడుగా, స్త్రీలలో స్త్రీగా ఉంటాడు. ఎక్కువ ఏంచెప్పను. స్వయంగా అన్నీ తనే అయినప్పటికీ అన్నిటికన్న అందరికన్నా విలక్షణంగా ఉంటాడు. సర్వభూతాలకు తల్లి సమానంగా తన శక్తిని ప్రదానం చేస్తూ వాటిని భరిస్తూ, పోషిస్తూ అన్నిటినీ తనలోనే ఇముడ్చుకుంటాడు. ఆయన, జ్యోతులలో పరమోత్కృష్టమైన జ్యోతి. ఆ జ్యోతివల్లనే అన్ని జ్యోతులు ప్రకాశిస్తాయి. అక్కడ చీకటి లేనేలేదు. ఆ దివ్యపురుషుడికి అన్నిటి గురించీ, అందరి గురించీ తెలుసు, లేనట్టయితే ముక్తానందుడు ఆ నీల పురుషుడి గురించి ఏవిధంగా తెలుసుకోగలడు? తెలుసుకొనవలసిన వాటిలో పరమమైనది, ధ్యానం యొక్క ఉచ్చస్థితిలో ప్రాప్తమయే కుండలిని యొక్క ప్రసాద రూపమైనది, సర్వజ్ఞలోకం యొక్క జ్ఞానంవల్ల అర్థమయేది, ఎల్లప్పుడు హృదయంలోను సహస్రారంలోను నివసించేది అయిన నీలబిందువు, ఆ నీలేశ్వర మహాదేవుడు, ఆ నీల నిత్యానందుడి దర్శనం అయింది నాకు.

ఓ సాధకులారా! మీ నీలబిందువులో ఆ నీలపురుషుడున్నాడు. కాని నీల బిందువు దర్శనమాత్రం చేత మీరు పరిపూర్ణులైనట్టు భావించరాదు. ఆ అవ్యక్త మహాపురుషుడు సాధకుడికి సంబంధించినంత వరకు అత్యంత రహస్యమయుడు. సిద్ధిని ప్రాప్తించుకునే మార్గానికి లక్ష్యం ఆ మహాపురుషుడు. కాలాంతరంలో కూడా ఇది చెప్పవలసిన విషయం కాదు. వ్రాసే విషయం కూడా కాదు. ఈ మహాపురుషుడి అనుగ్రహం వల్లనే ముందు ముందు దివ్య సాక్షాత్కారమౌతుంది. వ్రాయకూడని ఈ విషయం ఏ విధంగా అక్షర బద్ధమైనది, సిద్ధవిద్యార్థులకే తెలుస్తుంది. నేను గత్యంతరం లేక చెప్పాను, యందేభావు వ్రాసిపెట్టాడు.

ఇంత జరిగిన తర్వాత కూడా, తృప్తి కలుగలేదు. కొఱతగానే ఉంది. ఇప్పుడు ధ్యానం దివ్యంగా జరుగుతూ ఉంది. నేను కొంత సేపు చూచిన నీలపురుషుడిని అవ్యక్త తేజోగోళం అని వ్యవహరిస్తాను. భూమండలాన్ని తనలో ఇముడ్చుకున్న ఈ మహాపురుషుడిని, యోగులు ధ్యానంలో నీలబిందువులో చూస్తారు. ఇప్పుడు ఆ నీల మహాపురుషుడి మీదనే ధ్యానం. ఇదే ధ్యాస. ఇప్పుడు నా మనసులో ఆ నీలపురుషుడి మూర్తి స్థిరపడింది. ప్రతిరోజు ధ్యానం చేసుకుంటున్నాను. ధ్యానంలో అదే మధురమైన తేజస్సుతో నిండిన నీలబిందువు అనేక రకాలుగా కనిపించేది. దీనిలో రుచి బాగా ఎక్కువైంది. రోజు రోజుకు దీని తేజస్సు ఎక్కువై కొత్త కొత్త రూపాలు ధరించడమే దీనికి కారణం. ఇప్పుడు ధ్యానం సహస్రారంలో జరుగుతూ ఉంది. దీనితో పాటు దివ్యమైన మేఘ గర్జన కూడా వినిపించేది. మేఘనాదం వింటూ, ధ్యానం ఆనందమయమయేది. మనస్సుకు చెందిన పూర్వపు వాసనలన్నీ ఈ గర్జనతో ఛిన్నాభిన్నమై, అదృశ్యమయాయి. ఈ నాదాన్ని వింటూ ఉండినపుడు, ఒక్క క్షణం సేపు నిరామయమైన పరబ్రహ్మలో లీనమైన అనుభూతి కలిగేది.

అంతర్జ్ఞాన భండార రూపంలో మూలాధారంలో ఉన్న మహాశక్తి కుండలిని, గురుప్రసాదం వల్ల జాగృతమైనపుడు, సాధకుడి యోగక్షేమాల బాధ్యతను తనే స్వయంగా వహిస్తుంది. సాధకుడు, కుండలిని పట్లా గురువు పట్లా ఎంత భక్తి శ్రద్ధలు కలిగి ఉంటాడో వారిలో ఎంతగా శరణుపొందుతాడో, వారు సాధకుడి రక్షణకు అంత సన్నద్ధంగా ఉంటారు. శ్రీ గురువులోనూ శక్తిలోనూ అనన్య భావంతో శరణు పొందడం

గురించి ఎన్నడూ విస్మరించరాదు. ఈ మహాశక్తిని **పారమేశ్వరీ అనుగ్రాహికా శక్తి** అని అన్నపుడు, ఆమే కుండలిని, గురువు, పరమశివుడు అని సిద్ధ విద్యార్థులు అర్థం చేసుకొనడం అవసరం. సూది, వస్త్రం అడుగునుంచి పైకి ఛేదించుకుని వచ్చే విధంగా ఈ మహాశక్తి మూలాధారం నుంచి, సుషుమ్నలోని చక్రాలను ఛేదిస్తూ బ్రహ్మరంధ్రాన్ని చేరుకుంటుంది. అప్పుడు సాధకుడి శరీరంలో దాని స్పర్శ యొక్క అనుభూతి తప్పకుండా కలుగుతుంది. కుండలిని మహాశక్తి జాగృతమైనపుడు అది 72 కోట్ల నాడుల్లో వ్యాపించి, సాధకుడికి, మృదువైన, కోమలమైన, సుఖదమైన, దివ్యమైన స్పర్శ యొక్క అనుభవం కలుగుతుంది. ఈ స్పర్శ సాధకుల స్వభావానికి తగినట్టు మృదువుగాను కఠోరంగాను కూడా ఉంటుంది. కఠోరంగా ఉన్నపుడు అన్ని అవయవాల్లో మంటలు పుడతాయి. ఆ విధంగా ఉన్నప్పటికీ మృదువైన స్పర్శ, కఠోరమైన స్పర్శ రెండూ ఆ పరబ్రహ్మ స్పర్శలే.

ఊర్ధ్వధ్యానం స్థిరమైన తర్వాత సహస్రారంలో మేఘగర్జన ప్రారంభమైనపుడు, నాలుక అంగిట్లో అతుక్కుపోయినపుడు సాధకుడు దివ్యమైన రసాన్ని త్రాగుతాడు. ఒక్కొక్కసారి నాలుక అంగిట్లో అతుక్కుపోయినపుడు చల్లటి చంద్రామృతం త్రాగడం కూడా తటస్థిస్తుంది. ఈ అమృతాన్ని తాగినపుడు సిద్ధవిద్యార్థులు ఆశ్చర్య చకితులవుతారు. ధ్యానంలో రుచి వృద్ధిచెంది అభ్యాసాన్ని ఎక్కువ చేసుకుంటూ ఈ అమృతాన్ని ఇంకా ఎక్కువ త్రాగేందుకు ప్రయత్నిస్తారు. ఈ రసపానం కూడా అనేక రకాలైనది. ఈ ప్రత్యేకమైన రసపానంలో సాధకులకు వెన్న, పాలు, నెయ్యి, మజ్జిగ, తేనెవంటి మధురమైన పానీయాల రుచుల అనుభవం కలుగుతుంది. సాధకుడి మనస్సు ఆజ్ఞా చక్రంలో లీనమై, భ్రుకుటిలో, నిలకడగా ఉన్న జ్యోతిరూపంలో ఆత్మదర్శన మైనపుడు ఈ రసపానం జరుగుతుంది. ఈ రసపానం వల్ల అనేక రకాల ఆంతరిక రోగాలు నశిస్తాయి. ధ్యానం చేస్తూ చేస్తూ ఉండగా, సాధకుడి ప్రాణవాయువు, భ్రూమధ్యంలో స్థిరపడుతుంది. అప్పుడు అక్కడ దివ్యమైన సుగంధం వస్తుంది. ఆ సుగంధాన్ని వాసన చూచినపుడు ఎంతో ఉన్నతమైన స్థితి ప్రాప్తిస్తుంది. ఇటువంటి అనేక రకాల అనుభూతులతో నా ధ్యానం పురోగమిస్తూ ఉంది.

నీలపురుషుడి దర్శనం తర్వాత ధ్యానం, ఊర్ధ్వాకాశంలోనే స్థిరపడసాగింది. ఊర్ధ్వాకాశంలో మేఘాలను పోలిన దివ్యమైన తేజస్సును చూచేవాడిని. ఆ తేజస్సు

మధ్యలో నీలబిందువు కనిపించేది. ఈ తేజస్సు రోజు రోజుకు ఎక్కువకావడం ప్రారంభమైంది. నీలబిందువు చుట్టూరా ఈ తేజస్సు ఉంది. సహస్రార ఆకాశంలోని తేజస్సు, ఈ బిందువు మహిమ మీద అధారపడి ఉన్నట్టు భావిస్తారు. ఆ నీల బిందువు నుంచే తేజస్సు ఉదయిస్తుంది. రోజూ ఇదే ధ్యానం. ప్రతిరోజు ధ్యానంలో "**ఆత్మాహమ్**" అన్న భావం ఉదయిస్తూ ఉంది. ఆ నీలబిందువు కొంతసేపు లోపల, కొంతసేపు బయట ఉంటున్నట్టు అనిపించేది. ఎవరైనా మహాపురుషుడి రాకపోకల గురించిన దృష్టాంతం మీకు కలిగినట్టయితే అది నీలబిందువు ద్వారా జరుగుతున్నట్టు తెలుసుకొనండి.

ఇరవై ఒకటి

# మరణ భయం

నేను ధ్యానంలో మరొక ఆశ్చర్యాన్ని చూచాను. ధ్యానం చేస్తూ చేస్తూ ఉండగా, నా కనులు పైకి వెళ్లిపోయేవి. కను రెప్పలు రెండూ పైకి వెళ్లేవి. రెండు కనులచూపు సహస్రారం మధ్యలో నీలబిందువులో స్థిరపడేది. ఇప్పుడు ధ్యానంలో మెడ కొద్దిగా పైకి సాగేది. కనులు పైకి లాగినట్టుండేవి. సహస్రారంలో నేనింతకుముందు వర్ణించిన అవ్యక్త తేజోగోళం ఉన్నది. ఒకరోజు ఆ తేజోగోళం తెఱచుకుంది. దానితో కొన్నివేల, కాదు కోటి సూర్యుల ప్రకాశానికి సమానమైన వెలుగు అక్కడ పఱచుకుంది. తీక్షణమైన వెలుగు అది. దాన్ని నేను చూడలేక పోయాను. నా ధైర్యం సడలింది. ధ్యానానికి భంగం కలిగించడం నా చేతుల్లో లేదు. ఆసనం నుంచి నేనుగా లేవలేక పోయాను. కనులు మూసుకొనడం తెరవడంకూడా నా అధీనంలోలేదు. ఆ తేజస్సు, నన్ను తనవైపు లాక్కుంది. తేజస్సును చూస్తూ చూస్తూ మూర్ఛపోయాను. కొంత సేపటికి స్పృహవచ్చిన తర్వాత నాకు మృత్యుభయం పట్టుకుంది. ''ఓ భగవతీ ఓ సద్గురునాథా రక్షించండి'' అంటూ ఆర్తనాదం చేశాను. ప్రాణవాయువు గమనం, మనస్సు పనిచేయడం ఆగిపోయింది. నా ప్రాణం పోతున్నట్టు నాకు తోచింది. ''ఓ భగవాన్'' ''ఓ సద్గురు'' అంటూ ఆర్తనాదం చేస్తూ ''ఓం ఓం'' ఉచ్చరిస్తూండగా శరీరం పట్టుతప్పింది. మానవుడు మరణ సమయంలో నోరు తెరిచి, చేతులు చాచి, వింత ధ్వని చేసే విధంగా, నేను కూడా అటు వంటి ధ్వని చేస్తూ పడిపోయాను. పడుతూనే ఒక క్షణంలో మూత్రవిసర్జన జరిగింది. దీనితో నాకు స్పృహ పూర్తిగా పోయినట్టు అనిపించింది.

ఈ స్పృహలేని మూర్ఛిత స్థితిలో కొంతసేపు గడిచింది. గంట, ఒకటిన్నర గంట తర్వాత, నిద్రలోనుంచి లేచినట్టు లేచాను. నవ్వు వచ్చింది. ''ఇప్పుడేకదా మరణించాను. మళ్లీ ప్రాణం వచ్చింది'' అనుకున్నాను. ప్రశాంతంగా ప్రేమతో సంతోషంగా లేచాను. ఇప్పుడర్థమైంది నాకు: కోటి సూర్యుల ప్రకాశానికి సమానమైన ఆ దివ్యమైన అవ్యక్త తేజోగోళపు దర్శనంతో నాకు మరణించిన అనుభూతి కలిగినట్టు. నేను చాలా

భయపడిపోయాను. ఈ అనుభవంతో నాకు మృత్యువు గురించి తెలిసింది. మృత్యువంటే ఇదే కదా అని ఆలోచించాను. ఆ దివ్యమైన అవ్యక్త తేజోగోళం నా భయాన్ని పోగొట్టి నన్ను నిర్భయుడిని చేసింది. జీవదశ నుంచి ముక్తి పొందిన దశ ఇది. అప్పటి నుంచి నాకు ధైర్యం ఎక్కువ కాజొచ్చింది. భయం అన్నది లేకుండా పోయింది. ఎవరివల్లనూ భయంలేదు. ఏమౌతుందన్న భయం లేదు. ఎవ్వరైనా ఏదైనా చేస్తారన్న భయంలేదు. భయానికి స్థానమే లేకుండా పోయింది. నేను పూర్తిగా నిర్భయుడినయాను.

ఇరవై రెండు

# సచ్చిన్మయి నీలిమ

ఇప్పుడు అంతరంగంలోనుంచి ఆత్మానుభూతి దానంతట అదే కలుగుతూ ఉంది. ఇంతకుముందు ''దేహో హం ఇతి'' అన్న స్ఫురణ ఉండేది. ఇప్పుడు అది మారి, ''శివోహం'' అన్న స్ఫురణ లోపలినుంచి దానంతట అదే కలుగుతూ ఉంది. ఆనందపారవశ్యం ఎక్కువైంది. ఆ స్మృతులన్నీ, సగుణ నీలమహా పురుషుడు, ఆయన ఆశీర్వచనమూ ఆయన నాలోపల ఉండడమూ ''అదే నేను'' అన్న భావమూ - ఇవన్నీ ఎక్కువగా జ్ఞాపకానికి వస్తున్నాయి. నాద ధ్వనివల్ల కలిగే పారవశ్యమూ సర్వాంగాలలో వ్యాపించి ఉన్న ప్రబలమైన ప్రేమా, దివ్యమైన అవ్యక్త తేజోగోళ దర్శనమై భయం పోవడమూ ఇవన్నీ జ్ఞాపకం వచ్చి ఆనందంతో పారవశ్యం చెందసాగాను. ధ్యానం ఇంకా ఎక్కువైంది. ఆత్మానుభవం ఎక్కువైంది. అప్పటికీ అంతరాత్మ చెబుతూ ఉంది. ఇంకా కొంత బాకీ ఉంది అని. నాకు కూడా కొఱతగానే ఉంది. కాని, మార్గాంతరం లేదు. అంతరంగంలో శక్తిరూపంలో ఉన్న శ్రీ గురుదేవుడిని శరణు వేడుకొనడం తప్ప వేరే మార్గం లేదు. ఆయన అనుగ్రహంతోనే ఈ కొఱత తీరగలదు. అయినప్పటికీ ధ్యానం చేస్తూనే ఉన్నాను. ప్రతిరోజూ, దివ్యతేజోగోళాన్నీ దానిమధ్య నీలబిందువునూ చూస్తూ మేఘనాదాన్ని వింటున్నాను. ఇదే నా ధ్యానావస్థ.

అప్పుడప్పుడు ఆ సర్వజ్ఞ మహాపురుషుడు, నీలేశ్వరుడి విద్యుత్ వేగ తుల్యమైన దర్శనం లభించేది. ధ్యానం కూడా ఎక్కువయేది. ఇప్పుడు నాలో ఈ భావం దృఢపడసాగింది. ''ఇది నా అంతరాత్మే. దీని ప్రకాశమే విశ్వమంతటా వ్యాపించి ఉంది.'' ఇది కనిపించకపోయినప్పటికీ, నీల పురుషుడి దర్శనమైనపుడు నా అంతరాత్మను చూడకలుగుతున్నాను. అందరిలోపల ఉంటూ, విశ్వమంతటా వ్యాపించి, అందరినీ క్రియాశీలం చేస్తూ పూర్తిగా ''ఏకమేవాద్వితీయం'' అయి ఉండికూడా అనంతరూపాలలో స్ఫురిస్తూ, ఒకటి నుంచి అనేకం, అనేకం నుంచి ఒకటిగా మారుతూ, క్రీడిస్తూ ఉన్న ఈ నీల బిందువే నా ఆత్మ అన్న జ్ఞానం, శ్రీ నిత్యానంద భగవానుడి కృపా ప్రసాదం వల్ల కలుగుతూ ఉండేది. భాగవతంలోని **సత్**

**చిన్మయ నీలిమారూప** శ్రీకృష్ణుడు సాక్షాత్తు ఆ నీలబిందువే. ఇదే శ్రీమద్ భాగవతం యొక్క లక్ష్యం. ఈ చిన్మయ నీలిమ గోపీ జనులకు ప్రాణప్రదం. ఈ నీలిమ యోగుల ఆత్మ. అంతరంగంలోని ఈ సత్‌చిత్ నీలిమ జ్ఞానుల "**సోహంబ్రహ్మ**". భక్తుల ప్రేమరసాన్ని ఎక్కువ చేసే ఆరాధన ఇష్టదైవం ఈ నీలిమే. ఇదే సత్‌చిన్మయ నీలిమ, ముక్తానంద స్వామి యొక్క ఆరాధ్యదైవతం శ్రీ గురు నిత్యానంద. ఇదే సత్ చిన్మయ నీలిమ, సిద్ధ విద్యార్థుల అనుగ్రాహిక పారమేశ్వరి శక్తి. దీని గురించిన జ్ఞానం లేకపోవడం చేత, ఈ జగత్తు "పరబ్రహ్మ పరమేశ్వరుడిలోనే భాసిస్తుంది" అన్న సంగతి అర్థం కాదు. కాని పరాశక్తి కుండలిని వికసించడం వల్ల జ్ఞానం కలిగి, ఈ జగత్తు పరబ్రహ్మరూపంలో విలసిల్లుతున్నట్టు కనిపిస్తుంది.

ఎవరి అనుగ్రహం చేత మాయ, మహేశ్వరరూపం ధరిస్తుందో, అదే నా అంతరంగంలో నీలేశ్వరి రూపంలో ఉన్న ఆత్మ అన్న జ్ఞానం కలుగసాగింది. విశ్వమంతటా వ్యాపించి ఉన్న నీలజ్యోతి, అందరియొక్క పరమ పవిత్రమైన సాక్షి, మార్పులేనిది, అచంచలమైనది, సత్యమైనది, నాకు జ్ఞానోదయం కలిగించినది అయిన నీలిమ, నా ఆత్మ అన్న జ్ఞానం కలిగింది. సూర్యుడిని మేఘం కప్పి ఉంచ లేదు. ప్రత్యక్షంగా ఉన్నప్పటికీ అంధుడు చూడలేడు. అదే విధంగా అందరి ద్రష్ట అయిన నీలిమ ప్రత్యక్షంగా ఉన్నప్పటికీ గురుకృపలేనిదే కనిపించదు. క్షణంలో ప్రత్యక్షమౌతుంది, క్షణంలో మాయమౌతుంది. మాయమైనప్పటికీ ప్రత్యక్షంగా ఉంటుంది. అదే నా ఆత్మ అన్న జ్ఞానం నా అంతరంగంలో దృఢపడసాగింది. నా యోగక్షేమాల బాధ్యతను వహించినదీ నా పూర్వీకుల జ్ఞానమూ, భవిష్యత్తులో జరుగబోయే వాటి గురించి తెలియచేసేదీ తన కృపాజ్ఞానం చేత మొత్తం ప్రపంచాన్ని లయం చేసేదీ – అదే నా సచ్చిదానందమన్న విశ్వాసం ఏర్పడసాగింది. ప్రకాశాన్నే ప్రకాశింపచేసేది, జడంలోకూడ ప్రకాశించేదీ, దాని జ్ఞానం లేకపోవడం చేత జ్ఞానమే అసంపూర్ణంగా ఉండేదీ, దాన్ని తెలుసుకొనడం చేత అన్ని సహజంగానే అర్థమయేదీ – అదే శ్రీ గురువు నిత్యానంద కృపారూపమైన నీలిమ అన్న భావం, అంతరంగంలో అనుదినమూ స్ఫురిస్తూ దృఢపడసాగింది. ఈ భావం దృఢమయేకొద్దీ ఇంకా ఏదో కొఱత ఉన్నదన్న భావం కూడా సూక్ష్మంగా విదితమయేది. మహాకుండలిని, ధ్యానంతో పాటు బ్రహ్మ జ్ఞానాన్ని కూడా ఎక్కువ చేస్తూ ఉంది.

ఇరవై మూడు

# జ్ఞానోదయము

ధ్యానానంతరం విచారణ చేసినపుడు, వేదాంతులయొక్క లక్ష్యం అర్థం కావడం ప్రారంభమైంది. వేదాంతులకు ద్రష్టాభావం వల్ల నిర్వికార రూపంలో ఏది బుద్ధి గోచరమౌతుందో, సూక్ష్మ బుద్ధి దేనిని నిరంతరం అధ్యయనం చేసి తనను తానే మరిచిపోతుందో; ఆ సత్యంలో మనో బుద్ధి వ్యాపారాలు లయమై పోవడమే వేదాంతం యొక్క లక్ష్యమని నాకు ధ్యానంలో సహజంగానే అర్థం కావడం ప్రారంభమైంది. మానవుడు మేల్కొని ఉన్నపుడు కూడా జాగ్రదవస్థకు దూరంగా ఉంటూ జాగృతి యొక్క సర్వప్రపంచాన్ని ''ఇదమ్''గా పరిగణించేదీ, నిద్రపోతున్నపుడు కూడా మేల్కొని ఉండేదీ, మరియు మేల్కొని ఉండికూడా మనస్సు ఇంద్రియాలు పనిచేయకుండా స్వప్నంలో వలె కనిపించేవాటన్నిటినీ ''ఇదమ్'' గా తెలుసుకునేదీ, గాఢమైన సుషుప్తిలో గాఢాంధకారంలో ఏమీ కనిపించకుండా ఉన్నప్పటికీ ప్రకాశమానమై అన్నిటినీ చూడకలిగేదీ - ఇదే ధ్యానానికి పరమలక్ష్యమైన నిర్వికార ఆత్మ - అన్న జ్ఞానం ఉదయించడం ప్రారంభమైంది. కనులలో ఉంటూ రూపాలను చూచేదీ, చెవుల్లో ఉంటూ అన్నిరకాల శబ్దాల అర్థాలను వాటికి సంబంధించిన ఇంద్రియాలకు తెలియ చేసేదీ, ప్రాణాపానాలను గతిశీలమూ క్రమ బద్ధమూ చేసి, వాటిమధ్య నిర్వికార దశలో స్థిరంగా ఉండేదీ - అదే సాక్షి రూపంలో ఉండే ఆత్మ-వేదాంతానికి లక్ష్యం - అన్న జ్ఞానం అంతరంగంలో సహజంగానే కలిగింది. మానవుడు అజ్ఞానానికి వశుడై ''నేను తిన్నాను - నేను త్రాగాను - నేను తీసుకున్నాను - నేను ఇచ్చాను'' అంటూ ఉంటాడు. కాని అన్నిటికీ భోక్త - కూటస్థుడు (మార్పులేని) - సాక్షి, నిజానికి అంతరాత్మే. అతడే బ్రహ్మ. అటువంటి జ్ఞానం కలిగిన తర్వాత నా దగ్గరకు రోదిస్తూ అరుస్తూ సాంసారిక ప్రజలు ఎవరైనా వచ్చినపుడు నాకు సందేహం కలిగేది: వారు చెబుతున్నది నిజమేనా అని. నా అంతరాత్మ ఉన్న విధంగానే వారిలో గూడ అంతరాత్మ ఉందన్న భావం కలిగేది. ఒక చిత్రకారుడు ఒకే కాగితం మీద ఒకే రంగుతో ఒకే కుంచెతో ఒకే భావంతో అనేక చిత్రాలను చిత్రిస్తాడు.

అయినా అవన్నీ ఒకే చిత్రకారుడు ఒకే సంకల్పంతో ఒకే కాగితం మీద వేసినవి. ఒకే రంగుతో ఒకే కుంచెతో వేసినవి. అదే విధంగా ఈ ప్రపంచంలో అనేక రూపాలు అనేక రంగుల్లో కనిపించినప్పటికీ 'అన్నీ ఒక్కటే'. అనగా భిన్నత్వంలో ఏకత్వం ఉంది అన్నజ్ఞానం కలుగడం ప్రారంభించింది. ఈ విధంగా జ్ఞానం యొక్క అనుభూతి, ప్రతిదినము ఎక్కువవుతూ ఉంది. కాని దానివల్ల ధ్యానం కుంటుపడలేదు. సాధన తగ్గలేదు. ధ్యానంతో ఊర్ధ్వదృష్టి సహస్రారంలో నిలిచిపోయేది. కనులు రెండు సహస్రారంలోకి లాగుతున్నట్టు ఉండేది. ఈ విధంగా ఉండగా ఒక కొత్త సంఘటన జరిగింది. ఈ సంఘటన చెప్పరానిది. కాని దీని గురించి ఎందుకు చెబుతున్నానో నాకు తెలియదు! ఇప్పుడు నా ప్రియమైన ప్రొఫెసర్ జైన్ వ్రాస్తున్నాడు. మంచిది. కానున్నది కాక మానదు. భగవంతుడి ఇచ్ఛ ఏదో అదే జరుగుతుంది. ఇది సత్యమైన మాట: "**సబ్హీఁ నచావత రాము గోసాఁయి**".

ఇరవై నాలుగు

# సాక్షాత్కారం

ధ్యానం యధావిధిగా పూర్తిగా జరిగేది. సాధన సమాప్తమయే సమయం, పరమార్థ యాత్ర ముగిసే సమయం, అంతరాత్మకు పరిపూర్ణమైన తృప్తి కలిగే సమయం, ఆసన్నమైంది. గురుదేవుడి ఆజ్ఞాపాలన కార్యం పూర్తయే సమయం వచ్చింది. దీన్ని దివ్య సాక్షాత్కారం అంటారు. లేదా మానవుడి భాగ్యోదయం అంటారు. పరమార్థయాత్రీకుల సాధనారూపమైన మోటారు బండి, అక్కడికి చేరుకుని నిలిచిపోతుంది. అక్కడికి చేరుకున్నపుడు ఏమీ చూడకపోయినప్పటికీ అన్ని చూచినట్టు అన్ని వినిపించినట్టు సర్వస్వమూ లభ్యమైనట్టు అంతరంగంలోనుంచి దృఢమైన అభిప్రాయం దానంతట అదే కలుగుతుంది. ఇది ప్రాప్తించిన తర్వాత సాధకుడు ఆనందంగా కూర్చుంటాడు, ఆనందంగా నిద్ర పోతాడు, ఆనందంగా సంచరిస్తాడు, ఆనందంగా బయటికి వస్తూ పోతూ ఉంటాడు. మఠంలో ఆనందంగా నివసిస్తాడు. ఆచార వ్యవహారాలన్నింటినీ ఆనందంగా పాటిస్తాడు. ఆనందంగా భోజనం చేస్తాడు. ''నేనిప్పుడు భవసాగరాన్ని దాటాను'' అన్న అనుభూతి సాధకుడికి కలుగుతుంది. దీని దర్శనమాత్రం చేత అన్ని రకాల వ్యవహారాలను చేస్తూ ఉన్నప్పటికీ వాటివల్ల కలిగే క్షోభ ఉండదు. హృదయం, సముద్రాన్ని పోలి గంభీరమౌతుంది. మనఃక్లేశాలన్నీ తొలగిపోయి చిత్తం చిన్మాత్రే అవుతుంది. ''అందరికీ ప్రియమైనది, అందరి ఆత్మ, నేనే నేనే నేనే'' అన్న భావం అంతరంగంలో ఉదయిస్తుంది. దేని దర్శనం వల్ల సాధకుడు నిర్ద్వంద్వమైన సుఖాన్ని నిర్ద్వంద్వమైన జ్ఞానాన్ని నిర్ద్వంద్వమైన విజ్ఞానాన్ని నిర్ద్వంద్వమైన సమతాజ్ఞానాన్ని పొందుతాడో ఆ సచ్చిదానందమయమైన నీలేశ్వరుడి దర్శనం మరొక సారి కలిగింది.

నా ప్రియమైన ఆత్మీయ సిద్ధ విద్యార్థులారా, ఇప్పుడు నేను చేస్తున్న ధ్యానం, ఇంతకు ముందు చేస్తున్న ధ్యానం వంటిదే. భగవాన్ శ్రీనిత్యానందుడు, అంతరంగంలో ఒక ఊపు ఊపినట్టయింది. దానితో 72 కోట్ల నాడుల్లో, అసంఖ్యాకమైన రక్త కణాల్లో రక్తేశ్వరి జ్యోతి యొక్క ఎఱ్ఱటి కిరణాలు మెరవడం ప్రారంభమైంది. వెంటనే శ్వేతేశ్వరి

వచ్చి నిలుచుంది. శ్వేతేశ్వరికి ఆధారం కృష్ణేశ్వరి, కృష్ణేశ్వరికి పరమాధారం, నాకు ప్రియమైన నీలేశ్వరి వచ్చింది. నీలేశ్వరి వస్తూనే ధ్యానం ఒక్క సారిగా ఎక్కువైంది. దృష్టిపైకి పోయింది. రెండు కనుల నీలబిందువులు శక్తివంతమై పైన సహస్రారం మధ్యలో బ్రహ్మరంధ్రం లోపల ఉన్న పరమ పవిత్రమైన నీలపురుషుడిని బయటికి లాగి తీసుకువచ్చి నా ఎదుట నిలపెట్టాయి. ఆ చిన్న నీల బిందువును నేను చూస్తూ ఉండగానే అది తన ప్రకాశాన్ని విస్తరింపచేస్తూ సర్వత్ర వ్యాపించింది. ఆకాశం నుంచి భూతలం వరకు దాని నీలప్రభ వ్యాపించింది. ఇప్పుడది బిందువు కాదు. మెరిసిపోతున్న ప్రకాశిస్తున్న అనంతమైన వెలుగుగా మారింది. పండితులు, సత్యాన్ని సాక్షాత్కరింపచేసు కున్నవారు దానిని చిన్మయమనీ, చిత్‌జ్యోతి అనీ పేర్కొని ఉన్నారు. ఈ వెలుగు విశ్వమంతటా వ్యాపించింది. ఆ విధంగా వ్యాపిస్తున్న సమయంలో ఆ చిన్మయమైన వెలుగునుంచి పృథివి ఉదయించడం నేను చూచాను. అగ్నిజ్వాలనుంచి వెలువడే పొగను మానవుడు చూచినట్టు ఆ చిన్మయమైన వెలుగునుంచి ప్రపంచం ఉదయించడం నేను ప్రత్యక్షంగా చూచాను. వస్త్రంలో దారము, దారంలో వస్త్రము ఉన్న విధంగా చిన్మయమైన వెలుగులోపల ప్రపంచమూ, ప్రపంచంలోపల చిన్మయమైన వెలుగూ ఉన్నట్టు ప్రత్యక్షంగా చూచాను. ఒక్క బీజం నుంచి ఒక వృక్షం పెరిగి పెద్దదై కొమ్మలు - పువ్వులు - కాయలు - చిగుళ్లతో నిండిన విధంగా, చిన్మాత తనలోనే పశుపక్ష్యాదులను, క్రిమికీటకాదులను, దేవదానవులను, స్త్రీపురుషులను, తనలోనే సృష్టించుకుంది. దేదీప్యమానమైన, అత్యంత సుందరమైన ఆ చిన్మయమైన వెలుగు, నాలోపల నా వెలుపల నాపైన నాకింద అన్నివైపుల ప్రశాంతమైన పరమానంద స్వరూపంగా స్ఫురిస్తూ కనిపించింది. కనులు తెరిచిన తర్వాతకూడా ధ్యానం కొనసాగింది. నీటిలో మునిగిపోయి ఉన్న మానవుడు, నీటి అడుగుకు పోయి పరిశీలించినపుడు ''నేను నీటిలో ఉన్నాను. నా చుట్టూ నీరు తప్ప ఇంకేమీ లేదు'' అనుకుంటాడు. అదే విధంగా నాకు నాలుగు వైపులా చిన్మయమైన ఆ తేజఃపుంజం తప్ప మరొకటి లేదు. అటువంటి స్థితిలో ప్రపంచం మాయమైంది. నేను తేజస్సును మాత్రమే చూస్తున్నాను. సూర్య భగవానుడి నుంచి అసంఖ్యాకమైన కిరణాలు మిలమిలా మెరుస్తూ నాలుగువైపులా వ్యాపిస్తూ కనిపించే విధంగానే, నా ఎదుట ఉన్న నీల బిందువు నుంచి అసంఖ్యాకమైన తేజఃకిరణాలు అన్నివైపులకు వ్యాపిస్తున్నాయి.

ఇప్పుడు ప్రపంచం కనిపించడం లేదు. ఒక దివ్యమైన భావం నన్ను పూర్తిగా ఆవహించింది. ప్రసరిస్తున్న ఆ కిరణాల మధ్య నీలవర్ణంలో నాకు కనిపించిన దివ్యదృశ్యం: శ్రీ గురుదేవుడు ఒక చేయి పైకెత్తి ఆశీర్వదిస్తూ నిల్చుని ఉన్నాడు.

సందేహం లేదు. ఆయన నా పరమారాధ్యదైవమైన శ్రీ నిత్యానందుడే. మళ్లీ చూచాను. నిత్యానందలేడు. ఆ స్థానంలో త్రిశూలం ధరించిన పరమశివుడు నిల్చొని ఉన్నాడు. ఎంత అందమైన మనోహరమైన రూపం. అంతా నీలమయం. కాళ్లు, చేతులు, గోళ్లు, శిరోజాలు, శిరస్సు - అన్నీ నీలవర్ణమే. చూస్తూ చూస్తూ ఉండగా నిత్యానంద మారిపోయాడు, పరమ శివుడు మారిపోయాడు. నేనింతకు ముందు ఏ ముక్తానందుడి ప్రతీక దర్శనం చేసుకున్నానో ఆ ముక్తానందుడు ఇప్పుడు మళ్లీ కనిపించాడు. అవును ముక్తానందుడిని కూడా ఆ చిన్మయ కిరణ పుంజంలోనే చూచాను. అదే నీలవర్ణ శరీరం. శాలువ రుద్రాక్షమాల కూడా నీలవర్ణమే. ముక్తానందుడి తర్వాత మళ్లీ పరమ శివుడిని చూచాను. శివుడి తర్వాత అదే నీలవర్ణంలో నిత్యానందుడిని చూచాను. ఆ కిరణపుంజం ఇప్పుడుకూడా అదే విధంగా ఉంది. ఏమి మెరుపు! ఏమి రంగు! దాని బాహ్య స్వరూపం ఎంత అందమైనది! చిన్మయకిరణ పుంజపు ప్రకాశంలో నేను నిత్యానందుడిని చూచాను. చూస్తూ ఉండగా ఆయన ఆ నీల వర్ణంలో కలిసిపోయాడు. మంచు కరిగి నీరైనట్లు, కర్పూరం కరిగి ఆకాశంలో కలిసిపోయినట్లు, నిత్యానందుడు కరిగి కరిగి, అక్కడ అంతటా వ్యాపించి ఉన్నకిరణ పుంజంలో కలిసిపోయాడు. ఇప్పుడు ఆయన నామరూపాలు లేవు. మెరిసిపోతున్న జ్యోతి పుంజంమాత్రమే ఉంది. నీలజ్యోతి నుంచి సర్వత్ర వ్యాపించిన కిరణాలు, వెనక్కువచ్చి నీలమణిలో కలిసిపోయాయి. ఇప్పుడు పప్పుగింజంత నీలమణిమాత్రమే కనిపిస్తూ ఉంది. ఆ మణి ఎక్కడినుంచి వచ్చిందో ఆ సహస్రారంలోనే కలిసిపోయింది. సహస్రారంలో కలిసిపోతూనే ముక్తానందకు స్పృహతప్పింది. స్మృతి తప్పింది. లోపల లేదు. బయటలేదు. తనేలేడు. ఆ విధంగా అయింది పరిస్థితి. ఇక్కడ అతి రహస్యమైన ఒక విషయాన్ని వ్రాయులేదు. దాన్ని వ్రాసేందుకు నాకు గురుదేవుడి ఆజ్ఞ లభించలేదు. పరమేశ్వరుడి అనుమతి లభించలేదు. సిద్ధుల ఆదేశంలేదు.

ఇప్పుడు నాకు అంతస్సమాధి కలిగింది. అదే స్థితిలో కొంతకాలం గడిచింది. ?ద్రష్టా భావం కలుగడం ప్రారంభమైంది. ఈ భావం ఏర్పడుతూనే నీలిమ ప్రత్యక్షమైంది. దీన్ని ఆదిశంకరులు **సత్ చిన్మయు నీలిమ** అన్నారు. దానిలో నా ధ్యానం స్థిరపడింది. నేను సహస్రారం మధ్యలో సర్వాధారభూతమైన నీలబిందువు మధ్యలో ప్రవేశిస్తున్నట్లు నాకు అనుభూతి కలిగింది. అక్కడికి ప్రవేశించిన వెంటనే నాకు మళ్లీ ఒకసారి సర్వత్ర వ్యాపించి ఉన్న ప్రపంచం కనిపించింది. నేను అంతటా చూచాను. అక్కడ కనిపించిన స్త్రీ-పురుషులు, చిన్నా-పెద్దా, గొప్ప-బీద,



స్వామి ముక్తానంద: శ్రీగురుదేవ ఆశ్రమంలో - 1956

అందరిలోనూ అటువంటిదే ఒక్కొక్క నీలమణి కనిపించింది. నాలో చూచిన నీలమణినే ఇతరులందరిలోనూ చూచాను. అందరి సహస్రారంలోనూ ఇదే అంతరాత్మ ఉన్నది అన్న జ్ఞానం కలుగగానే ధ్యానం ముగిసింది. స్పృహ వచ్చింది. స్పృహరాగానే పూర్ణదేహభావం వచ్చింది. దేహభావం వచ్చిన తర్వాత కూడా మనస్సులోపల ఆ నీలబిందువు కనిపించేది. అది నా దృష్టిని తనవైపు మళ్లించుకుంటున్నది. అక్కడ చూస్తూ చూస్తూండగా నాకు సమభావము, శాంతి కలిగాయి. ప్రతిదినము ధ్యానం ఈ విధంగా ఎక్కువవుతూ ఉంది.

ఇప్పుడు కూడా నేను ధ్యానం చేస్తాను. ఇప్పుడు నాకు విశ్వాస మేర్పడింది, ఇంక చూడవలసినవి ఏవీ లేవని. నాకు పూర్ణత్వం ప్రాప్తించిందన్న భావం ధ్యానంలో దానంతట అదే దృఢపడింది. దీనికి కారణం నేను నీలబిందువులోపల మూడు రకాల దృశ్యాలను, తదనంతరం, దాని నుంచి వెలువడిన వెలుగునుంచి అతి సూక్ష్మమైన ప్రశాంతమైన నీలపుంజం సర్వత్ర వ్యాపించడం చూచానుగదా. ఆ చిన్మయ ప్రకాశం బాహ్య జగత్తులో అదే విధంగా ఉండిపోయింది. తొలగిపోలేదు. కనులు మూసుకున్నా అది, ముందుకన్న మృదువుగా కోమలతరంగా సూక్ష్మతరంగా ప్రకాశిస్తూ ఉంది. కనులు తెరిచిన తర్వాత కూడా ఆ నీల తేజః పుంజం సర్వత్ర కనిపిస్తూ ఉంది. ఇప్పుడు ఎవరిని చూచినా మొదట నీల ప్రకాశమే ప్రత్యక్షమౌతుంది. తర్వాత ఆ వ్యక్తి కనిపిస్తాడు. ఏదైనా వస్తువును చూచినపుడు మొదట ఆ మధురమైన - సూక్ష్మమైన - చిన్మయకిరణ పుంజం ప్రకాశిస్తుంది. తర్వాత ఆ వస్తువు కనిపిస్తుంది. మనస్సు దేని మీదికి పోయినా, అక్కడ మెరుస్తున్న తేజః పుంజం మధ్య ప్రపంచం కనిపిస్తుంది. క్షుద్రవస్తువు కాని గొప్పవస్తువుకాని ఏది చూచినా ఇంతకు ముందు చెప్పిన తుకారామ్ మహారాజ్ కవిత★ యొక్క నిజమైన అర్థం మనస్సుకు తడుతుంది. అనగా నా కనులకు ఆ నీల తేజస్సు యొక్క అంజనం లభించింది. దానితో నాకు దివ్యదృష్టి ప్రాప్తించింది.

★ మూలం 132వ పుట తుకారామ్ అభంగం.

ఇరవై ఐదు

# చిద్విలాసము

ఇప్పుడు కూడా నేను ధ్యానంలో తన్మయత్వం చెందినపుడు నీలరశ్మి నీలపుంజం, ఆ చిన్మయం మధ్యలో నీలబిందువు కనిపిస్తాయి. ఆ మృదువైన చిన్మయ తేజఃపుంజం అతి సూక్ష్మరూపంలో కదులుతూ మెరుస్తూ అన్ని అవస్థల్లోను కనిపిస్తుంటుంది. భోజనం చేస్తున్నపుడు, మంచినీరు త్రాగుతున్నపుడు, స్నానం చేస్తున్నపుడు నా కనులకెదురుగా నిల్చుని ఉంటుంది. నిద్ర పోతున్నపుడు నిద్రాస్థానంలో కూడా ఉంటుంది. ఇప్పుడు నాదృష్టి, ద్వైత - అద్వైత రహితమైంది. ద్వైత - అద్వైతాలు రెండింటిలోను అదే వ్యాపించి ఉన్నది కనుక ఇప్పుడు దేశ - కాల - వస్తు భేదాలు లేవు. నీలబిందువు యొక్క, సర్వత్ర సూక్ష్మంగా వ్యాపించి ఉన్న తేజస్సు, నా ఆత్మలోకూడా విశ్వాకారమై వ్యాపించి ఉంది. కనిపించని వాటిని కూడా నేను చూడకలుగుతున్నాను. రహస్యంగా దాచి ఉంచిన సంపద, మంత్రాంజనం వేసుకొనడం వల్ల కనిపించేవిధంగా శ్రీ గురుదేవుడి కృపవల్ల పారమేశ్వరి కుండలిని ప్రసాదం వల్ల, దివ్య సాక్షాత్కారాన్ని కలిగింప చేసే అంజనం నా కనులకు పెట్టుకొనడంతో కనిపించనివి అనగా అతి సూక్ష్మమైనవి కూడా కనిపిస్తున్నాయి. నాలుగువైపులా నా ఆత్మయొక్క విశ్వాకారమే వ్యాప్తమై ఉంది, అన్న విషయం నాకిప్పుడు పూర్తిగా అర్థమైంది. ప్రపంచమే లేదు, ఎప్పుడూ ఉండలేదు. మనం ప్రపంచం అని అంటున్నది చిత్‌శక్తి యొక్క చిన్మయమైన విలాసం మాత్రమే, అన్నది నా నిర్ణయం. ''సోహం''లో దేన్ని మనం ''సః'' అని ''అహమ్'' అని అంటామో దాన్ని నేను సునాయాసంగా అర్థం చేసుకున్నాను. వేదాంతం దేన్ని ''తత్వమసి'' విద్య అంటున్నదో, బ్రహ్మానందాన్ని ఏ విద్యకు పరిణామమని అంటారో, అదే నాలోపల సూక్ష్మరూపంలో స్ఫురిస్తున్న నా స్వరూపం. దీన్ని ధృవీకరించేందుకు ''ప్రత్యభిజ్ఞాహృదయం'' నుంచి ఒక ప్రమాణమిస్తాను. పరమశివుడి దృష్టి ఈ విధమైనదని దానిలో పేర్కొన్నారు :

**..... శ్రీ మత్పరమశివస్య పునః విశ్వోత్తీర్ణ – విశ్వాత్మక – పరమానందమయ – ప్రకాశైకఘనస్య ఏవం విధమేవ శివాది – ధరణ్యం తం అఖిలం అభేదేనైవ స్ఫురతి, న తు వస్తుతః అన్యత్ కించిత్ గ్రాహ్యం గ్రాహకం వా; అపి తు శ్రీ పరమశివ భట్టారక ఏవ ఇత్యం నానా వైచిత్ర్య సహస్రైః స్ఫురతి.**

అనగా, మనం పరమేశ్వరుడు పరాశక్తి అని పిలిచే పరమశివుడికి ప్రపంచం అన్న వస్తువు ఏదీలేదు ఆయన సత్యము – నిత్యము – నిర్గుణము – నిరాకారము – సర్వవ్యాపకము – పరిపూర్ణము. ఆయనకు, శివుడినుంచి పృధివి వరకు అనగా స్థావర జంగమాత్మక ప్రపంచము, కనిపించేది కనిపించనిది యావత్తు, అభేద రూపంలో పరమానందమయ ప్రకాశరూపంగా అన్నీ తనవలెనే కనిపిస్తాయి. నిజానికి ఆయన తప్ప ఇంకేదీ లేదు. ద్రష్టాదృశ్య భావం కూడా లేదు. గ్రాహ్యము – గ్రాహకుడు అన్న తారతమ్యం లేదు. జీవుడు – శివుడు అన్న భేదం లేదు. జడం – చేతనం అన్న భేదం కూడా లేదు. అనగా పరమేశ్వరుడైన పరమశివుడు, తానొక్కడే ఈ ప్రపంచంలోని చిత్ర విచిత్రమైన రూపాలలో స్ఫురిస్తాడు. ఈ విశ్వం భగవంతుడి శరీరం. భగవంతుడైన పరమశివుడే విశ్వరూపంలో తన నిజస్థితిలో ఉన్నట్టు నేను చూస్తున్నాను.

ఈ గ్రంథరచనకు ప్రేరణ నిచ్చిన జ్ఞానదేవుడి అభంగపు[1] ఆఖరి రెండు చరణాలు ఈ విధంగా ఉన్నాయి :

**తయాచా మకరంద స్వరూప తేఁశుద్ధ, బహ్మాదికా బోధ్ హాచీ రఘాలా. 4**
**జ్ఞానదేవమ్హణే నివృత్తి ప్రసాదేఁ, నిజరూప గోవిందేఁ జనీఁ పాహతాఁ. 5**

''నేను వర్ణించిన నీలేశ్వరుడిలోపల, అతనికి మూలాధారంగా ఉన్న రసము, ఆయన పరిశుద్ధమైన పరమానందమయమైన జ్ఞానం; అదే పరమాత్మయొక్క పవిత్రమైన స్వరూపం. బ్రహ్మ మొదలు ఋషులు, మునులు అందరికీ ఇదే జ్ఞానం కలిగింది''. సాక్షాత్కారానుభవం గురించి తెలియచేస్తూ జ్ఞానేశ్వర మహారాజ్ అంటున్నారు: ''శ్రీ సద్గురు నివృత్తి నాధుడి కృపా ప్రసాదం వల్ల ప్రాప్తించిన నా అంతరంగంలోని నిజరూపం – నీలంగా ఉన్నది – అదే పరమాత్మ అయిన శ్రీ గోవిందుడు. ఆయన్ను నేను అందరిలోనూ చూస్తున్నాను.''

సర్వ వ్యాపక పరమేశ్వరుడు పరమాత్మ తప్ప అన్యమేదీ లేదు అన్న వేదాంత వాక్యం

---

[1] - 99 వ పేజీలో 'ఆకాశాచా శేఁడా'

సత్యం. నిజానికి పరమాత్మ గురించిన ఈ జ్ఞానమే జీవనసారం. ఈ జ్ఞానం కలిగినపుడు మన జీవితం అమృతమయమౌతుంది. పరమాత్మ గురించిన ఈ జ్ఞానం మానవుడికి చాలా అవసరం. ఈ జ్ఞానం, శక్తి పాతం వల్లనే కలుగుతుంది. మహాత్ములందరు సిద్ధకృపవల్లనే తమ తమ అంతరంగాల్లో పరమేశ్వరుడి దర్శనం చేసుకున్నారు. పైన పేర్కొన్న జ్ఞానేశ్వరుడి అనుభవాలే అందరి అనుభవాలు. జనకుడు, సనకుడు, నారదుడు వంటి మహామునులు, అనుసంధానం చేసుకున్న నిజస్వరూపమే, పరంపరాగతమైన పరమానందమయమైన జ్ఞానం యొక్క తత్వం. అందరిలో కనిపించే పరమానందమయమైన గోవిందుడు కూడా ఆ తత్వమే. జ్ఞానులనుంచి అజ్ఞానులవరకు మానవులందరిలో ఆ తత్వమే కనిపిస్తుంది. వారు మూఢులైనా పిచ్చివారైనా, పిచ్చిగాని మూఢత్వం గాని మనస్సుకు సంబంధించినది. ఆత్మ పరమ పవిత్రమైనది. **సహస్రదళం యొక్క బ్రహ్మరంధ్రం మధ్య నివసిస్తున్న షోడశ కళాతీత పురుషుడు ఎల్లప్పుడూ అక్కడే నివసిస్తాడు. ఈ పురుషుడిని సప్తదశి అని కూడా అంటారు. షోడశ కళలకు పైన ఉన్న పదిహేడవది ఆత్మ.** దృష్టి సంపూర్ణంగా పరిశుద్ధమైన వారికి, ఆత్మరూపమైన నీలబిందువు, సహస్రదళంలో దర్శనమిస్తుంది. ఈ అతిరహస్యమైన విషయాన్ని నేను సద్గురువు కృపవల్ల చెబుతున్నాను, అని జ్ఞానేశ్వర్ అంటున్నాడు. ఈ ప్రపంచం చిద్విలాసం అన్నది అసలు సత్యం. చిత్‌శక్తి యొక్క వికాసము. అందుచేత చిన్మాత గురించిన జ్ఞానం లేకపోవడం వల్ల ప్రపంచం ఉన్నట్టు అనిపిస్తుంది. చిత్‌శక్తి యొక్క జ్ఞానం కలిగినపుడు ప్రపంచం కనిపించదు. అంతటా ఆ చిన్మాతే కనిపిస్తుంది. వసుగుప్తాచార్యుడి ఈ క్రింది కథనం సత్యం:

**ఇతి వా యస్య సంవిత్తిః క్రీడాత్వేనాఖిలం జగత్**
**స పశ్యన్ సతతం యుక్తో జీవన్ముక్తో న సంశయః॥**

– స్పందశాస్త్రం

మనం నివసిస్తున్న ఈ ప్రపంచం స్వయం ప్రకాశరూపిణి, జ్ఞానదేవత అయిన చిత్‌శక్తి విలాసమే. ఇటువంటి దృష్టి కలవారికి, ప్రపంచం, పారమేశ్వరి శక్తియొక్క విలాసం మాత్రమే. అటువంటి వారికి బంధం లేదు, మోక్షం లేదు, సాధన లేదు. సాధ్యం లేదు. గురుప్రసాదరూపంలో జ్ఞానచక్షువు తెఱుచుకొనడంతో అనుమానాలు తొలగుతాయి. ద్వంద్వంగా కనిపించే వాటి రహస్యం బట్టబయలు కావడంతో,

ద్వంద్వం ఉండదు. గురుకృప లేనట్టయితే పారమేశ్వరి, చిద్విలాసిని, చిత్‌శక్తి, కనుల్లో నివసించదు. ప్రపంచంయొక్క నిజస్వరూపాన్ని తెలియనివ్వదు. శ్రీ గురుదేవుడి అనుగ్రహంతో పాటు సిద్ధ విద్యార్థుల అంతరంగంలో చిన్మాత ప్రవేశించినపుడు అన్ని అంగాలలో విస్తరించి వాటిని పూర్తిగా పరిశుభ్రపరుస్తుంది. సిద్ధ విద్యార్థులను తన స్వరూపాలుగా మార్చివేసి, వారి కనులు, హృదయం, మనస్సుల్లో నివాసం చేస్తుంది. ఆ తర్వాత సిద్ధ విద్యార్థులకు ఈ ప్రపంచం, చిత్‌శక్తి యొక్క విలాసరూపంగా కనిపిస్తుంది. ఇదే సత్యదర్శనం. ప్రపంచం అన్యవస్తువు కాదని సంవిద్ రూపమైన చిత్‌శక్తి యొక్క క్రీడామాత్రమేనని వసుగుప్తాచార్యుడి నిర్ణీతమైన అభిప్రాయం. ఈ చిత్‌శక్తి యొక్క స్వరూపం అత్యంత స్వతంత్రమైనది. స్వప్రకాశమయమైనది. సృష్టి -స్థితి - లయములను నిర్వహించేశక్తిని తనలో ఇముడ్చుకుని ఉన్నది. ఇదే చిత్‌శక్తి అందరికీ మూలకారణమై అందరి సుఖానికి మార్గమై ఉన్నది. ఈ చిత్‌శక్తి, దేశ - కాల - ఆకారాలకు అతీతమైనప్పటికీ, దేశ - కాల - ఆకార రూపాలలో భాసిస్తుంది. అన్నిదేశాలు, అన్నికాలాలు, అన్ని ఆకారాలు ఈ చిత్‌శక్తి వల్లనే ప్రకట మౌతున్నాయి. చిత్‌శక్తి ప్రపంచరూపంలో ప్రకటమౌతున్నప్పటికీ సర్వవ్యాపకమూ సదాపరిపూర్ణమూ నిత్యప్రకాశరూపమూ కావడం చేత తన అఖండత్వంలోనూ ఏకత్వంలోనూ పరిపూర్ణమైనది.

**దేశకాలాకారభేదః సంవిదో న హి యుజ్యతే**
**తస్మాదేకైవ పూర్ణాహం విమర్శాత్మా చిదుచ్యతే.**

పరమశివుడు సృష్టి రచనకు పూనుకున్నపుడు చిత్‌శక్తి, తన స్వతంత్ర స్వభావంచేత తన శక్తిని వ్యాపింపచేసి, తనలోనే భేదాలను కల్పించుకుని అనంతమైన రూపాలలో అభివ్యక్తమౌతుంది.

ఈ చిత్‌శక్తి, ప్రవృత్తి రూపంలో బాహ్యాజగత్తులో సంపూర్ణ విశ్వాకారమై స్వయంగా ప్రకాశిస్తుంది. దీనినే చిత్‌శక్తి యొక్క విశ్వాత్మక రూపమంటారు. విశ్వాకారంగా ఉన్నప్పటికీ ఈ చిత్‌శక్తి విశ్వాతీతంగా ఉంటూ స్వయం ప్రకాశమూ పరమ నిర్మలమూ పరమ పరిశుద్ధమూ అయి ఉంటుంది. ఇదే విధంగా మానవ శరీరం లోపలకూడా ఈ చిదాత్మ లేదా చిత్‌శక్తి, బాహ్య ప్రవృత్తి రూపంలో స్థూల - సూక్ష్మ - కారణ - మహాకారణ శరీరాలను ధరిస్తుంది. పంచకోశాలు, నాలుగు అవస్థలు, అంతఃకరణ

చతుష్టయం మొదలు పంచతత్వాలకు చెందిన ముప్ఫయి తత్వాలతో కూడిన శరీరంలో, 72 కోట్ల నాడుల సముదాయంతో కలిసి, సప్తధాతు రూపమై, పంచజ్ఞానేంద్రియాలూ పంచకర్మేంద్రియాలూ వాటి వాటికి సంబంధించిన శబ్దస్పర్శాది విషయాలూ పంచప్రాణాలూ అవిచేసే పనులూ శిరస్సునుంచి కాలివేలివరకు ఎన్ని రూపాలను ధరిస్తుందో చెప్పలేము. సుఖ దుఃఖాలు, భయం, వ్యాధులు, అనేకరకాల వికారాలు, శైశవం, యౌవనం, స్వర్గం, నరకం – ఈ విధంగా అనేక రకాల భావాలనూ రూపాలనూ సృష్టించి వాటిలో స్వయంగా తనే ప్రవేశించి, బాహ్య విశ్వాకారంగా రూపొందుతుంది. అయినప్పటికీ పరిశుద్ధంగా నిర్మలంగా ఉంటుంది. యథాతథంగా ఉంటూ చిత్‌శక్తి, బహిరంగ ప్రపంచంలో క్రీడిస్తూ ఉంటుంది. విశ్వోత్తీర్ణ అనగా విశ్వాతీతదశలో, చిత్‌శక్తి జాగృత అవస్థకు భిన్నంగా, జాగృత అవస్థలో ఉన్న శరీరానికి సంబంధించిన శుభాశుభాలన్నిటికీ భిన్నంగా ఉంటుంది; స్వప్నాలకు భిన్నంగా స్వప్నావస్థలోని సర్వవ్యవహారాలకు భిన్నంగా ఉంటుంది; సుషుప్తికీ సుషుప్తి అవస్థలోని శూన్యానికీ భిన్నంగా ఉంటుంది; మహాకారణ రూప తురీయంలో తురీయా తీతమై, కేవలం స్మృతిమాత్రంగా ఈ సంపూర్ణ విశ్వానికి సాక్షి అయి ఈ సమస్త విశ్వంలో, విశ్వానికి భిన్నంగా ఉంటుంది.

నీలబిందువు లోపల ఉన్నది పరమానందమయమైన మధురమయమైన చిత్‌శక్తియే. ఇంకేదీ కాదు. దానివంటిది మరొకటి లేదు. ఈ విధంగా ఏకాకారమై, కేవలం సాక్షిరూపంలో, పరమసంవిత్తు – పరమశివుడు అని మనం అంటున్న ఆ చిత్‌శక్తి, తనలో తాను ఒంటరిగా ఉంటుంది. దీనికి ముందుగాని మధ్యగాని వెనుకగాని ఎవరూలేరు. దీనినే విశ్వాతీత పరమశివుడు అంటారు. వేదాంతులు ''నిర్గుణ నిరాకార పరబ్రహ్మ'' అనేది దీన్నే. దీనికి రెండు రూపాలున్నాయి. ఒకటి, విశ్వాతీతమై పరమ పరిశుద్ధమైనది; రెండవది, విశ్వాత్మకము. చిత్‌శక్తి, తన విశ్వాత్మక రూపంలో తన ఇచ్ఛానుసారం తనలోనే తాను జగద్రూపాన్ని ధరిస్తుంది.

సిద్ధ విద్యార్థులారా, మీరు ఇక్కడ కొంత ఆలోచించవచ్చు. మీరు గురుప్రసాదాన్ని పొంది గురుప్రసాద ఫలితంగా ఊర్ధ్వసహస్రారంలో మీలో మీరు క్షణంసేపు ఆనందంగా ఉన్నపుడు, ఆ సమయంలో, మీకు భిన్నమైనది ఇంకేదైనా ఉన్నట్టు మీకు తెలియలేదు. భిన్నమైనదేదీ మీకు కనిపించలేదు. అసలు లేదుకూడా. కేవలం మీరు మాత్రమే ఉన్నారు. మీ యొక్క ఆనందాన్ని, మీ యొక్క గురుప్రసాద రూపమైన పారవశ్యాన్ని,

మీలో మీరే మీదిగా అనుభవిస్తారు. దీనిపేరే ''**పూర్ణాహంతాయామ్ 'ఆవేశో'...**'' ఇది సిద్ధవిద్యార్థుల విశ్రాంతి స్థానం. ఇక్కడ మీలో మీకు మీరే కనిపిస్తారు. దీన్ని 'అహం' అంటారు. ఈ అహం ఏమిటని ఎవరైనా ప్రశ్నించినట్టయితే చెప్పండి : ఈ అహమే బ్రహ్మ అని, ఈ అహమే శివుడని. ఇదే రాముడు. ఇదే శక్తి. ఇదే కుండలిని మరియు ఇదే అహం సిద్ధవిద్యార్థికూడా. ఈ ''అహం'' తురీయాతీత దశనుంచి ''ఇదమ్'' ఆకారాన్ని ధరించి, తన విశ్వాత్మక రూపంలో ప్రకటితమైనపుడు, తురీయం నుంచి సుషుప్తి, సుషుప్తి నుంచి స్వప్నం, స్వప్నం నుంచి జాగృతిలోకి వచ్చి, నఖశిఖ పర్యంతం పూర్తిగా విశ్వాకారమై పోతుంది. ఈ విశ్వాత్మక దశలో అది అన్ని గుణాల్లోనూ క్రీడిస్తుంది. తనంతట తానే తన ఇచ్ఛానుసారం, తురీయాతీతం నుంచి జాగృతివరకు ప్రకటమౌతుంది. విశ్వరూపాన్ని ధరించినప్పటికీ తన స్వస్వరూపాన్ని విస్మరించదు. మరొకటిగా మారిపోదు. తన స్వరూపాన్ని ఏదీ చెడగొట్ట జాలదు. ఈ విధంగా తన ఇచ్ఛానుసారం తనలోనే విశ్వాన్ని సృష్టిస్తుంది.

ఈ చిత్‌శక్తికి రెండు రూపాలున్నాయి. ఒకటి గ్రాహ్యాభావము, మరొకటి గ్రాహక భావము. ''ఇదం''గా మనకు అర్థమయ్యే మొత్తం ప్రపంచం - గ్రాహ్యాభావం. ''ఇదం ఘటః'' ''ఇదం పటః'' అని విడివిడిగా ''ఇదం''ను అంతరంగంలో తెలుసుకునే శక్తి - గ్రాహక భావం. ఈ మొత్తం ప్రపంచం గ్రాహ్యం. విశ్వాత్మ దీని గ్రాహకుడు. ఈ గ్రాహకుడికి తగినట్టు, ఆయనకుగాను ఈ గ్రాహ్య ప్రపంచం ఉంది. ఇటువంటి అద్భుతమైన శక్తిగల సామర్థ్యం గల చిత్‌శక్తే గ్రాహ్య- గ్రాహక భావంలో విశ్వంగాను విశ్వాత్మగాను మారి ఉంటుంది. ఈ చిత్‌శక్తే జగద్ విలాసము, ఈ జగత్తే చిత్‌శక్తి విలాసము. కశ్మీర శైవ మతం ప్రకారం :

**శరీరమేవ ఘటాద్యపి వా యే షట్త్రింశ త్తత్త్వమయం**
**శివరూపతయా పశ్యంతి తేఽపి సిధ్యంతి.**

అనగా ఈ శరీరాన్ని ముప్ఫయి ఆరు తత్వాలతో కూడిన చిత్‌శక్తి రూపంగా, అనగా దీన్ని పరమశివుడి రూపంగా అర్థం చేసుకునే సిద్ధ విద్యార్థులకు సిద్ధ విద్యయొక్క నియమాలననుసరించి అన్ని సిద్ధులు ప్రాప్తిస్తాయి. నిజానికి ఆ చిత్‌శక్తి భేదాభేదరూపంలో తన క్రీడను జరుపుతూ ఉంది. మానవుడి నాలుగు అవస్థలు ఆ చిత్‌శక్తివే, దానికి భిన్నమైనవి కావు. అదే విధంగా ఈ విశ్వరూపం చిత్‌శక్తి యొక్క నిజస్వరూపమే. దానికి భిన్నమైనది కాదు.

బ్రహ్మ సచ్చిదానందమయము, ఆనందరూపము అని అన్ని శాస్త్రాలు చెబుతాయి. బ్రహ్మనుంచి పుట్టిన ఈ ప్రపంచం బ్రహ్మకు భిన్నం కాదు. నేను నీవు మనకు కనిపిస్తున్నవన్నీ బ్రహ్మయొక్క విలాసమే. భేదంలో అభేదంగా, అభేదంలో భేదంగా ఉంటున్నది ఆ పరమేశ్వరుడే. ఇది సత్యం. సముద్రంలో అనంతమైన జలబిందువులు, నురుగు, బుడగలు, తరంగాలు అనంతంగా ఉన్నప్పటికీ, అవి అన్నీ సముద్రానికి భిన్నమైనవి కావు. అదే విధంగా విశ్వానికున్న నామాలు రూపాలు గుణాలు, చిత్‌శక్తికి ఏమాత్రం భిన్నం కావు. నీటి చల్లదనం యొక్క స్పర్శ, నీటి నుంచి ఏ విధంగా భిన్నం కాదో, అదేవిధంగా చిత్‌శక్తి యొక్క విలాసరూపమైన ఈ చిన్మయ జగత్తు నీకన్న వేరుకాదు. వస్త్రాన్ని, మనం వస్త్రంగా పరిగణించినా నిజానికి అది నూలు మాత్రమే. నూలు లేకుండా వస్త్రం లేదు. అదే విధంగా ప్రపంచం, **ప్రపంచంగా కనిపిస్తున్నప్పటికీ పరమార్థ దృష్టితో చూచినపుడు అది పరబ్రహ్మమే. బ్రహ్మలేకుండా జగత్తు లేదు. జగత్తు బ్రహ్మ విలాసం, దీని పేరే సంవిత్క్రీడ.** ఆ విధంగా చూడడమే పరాశక్తి పూజ. ఇదే సత్యమైన శ్రీగురు బోధ.

ఈ చిత్‌శక్తి విలాసాన్ని అర్థం చేసుకొనకుండా జగత్తును చిత్‌శక్తికి భిన్నమైనదిగా చూచేవారు, జగద్భ్రమకు లోనై నానారకాల ఇబ్బందులకు గురవుతారు. చిత్‌శక్తి మయమైన ఈ ప్రపంచాన్ని చిత్‌శక్తి విలాసంగా అర్థం చేసుకున్నవారు స్వయంగా చిత్‌శక్తి స్వరూపాలవుతారు. వేదాంతం కూడా ఇదే చెబుతున్నది.

**హై బ్రహ్మ సచ్చా, జగత్ మిథ్యా, యహ మాత్ర సిద్ధాంత హై,**
**బ్రహ్మాత్మా కో జానే బినా, హోతా నహీం దుఃఖ్ కా అంత హై.**

**జో జానతా సబ్ మే ఏక్ కో, వహీ నర పాతా శాంతి హై,**
**జో బ్రహ్మహై సో ఆత్మ హై, యహీ కహతా వేదాంత హై.**

అందుచేత సిద్ధవిద్యార్థులు ముందు వ్రాసిన మహామంత్రాన్ని మననం చేసుకొనడం ద్వారా తమ ఆత్మను స్మృతి రూపం చేసుకొనడం అవసరం. మనదేశంలో నిజమైన ప్రజా నాయకుడెవరైనా ఉన్నట్టయితే, ఆ వ్యక్తికి అహర్నిశము, ఏ పని చేస్తున్నా ''నేను భారతదేశపు ఆత్మను, భారతదేశం నా ఆత్మ'' అన్న అభేద భావం రాత్రింబగళ్లు స్వతహాగా స్ఫురిస్తుంది. అదే విధంగా ఒక పేరు పొందిన కుటుంబపు పెద్ద

తనకుటుంబంలోని సభ్యుల గురించి ఆలోచిస్తాడు. కుటుంబంలోని చిన్నా పెద్దా, రకరకాలవారు, ఎవరి సంసారంతో వారు ఉన్నప్పటికీ వారందరూ తనవారేనన్న భావం ఉంటుంది. అదే విధంగా నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా; ''శివుడు నావాడు. నేను శివుడికి చెందిన వాడను. ఆయన సృష్టించిన విశ్వం స్వయంగా శివుడే, ప్రపంచంలో జరిగే క్రియలన్నీ శివుడే, ఆ శివుడు, నేను వేరుకాదు'' అని ప్రతిదినము మీ అంతరంగంలో స్వతహాగా స్ఫురించేట్టు చేసుకొనండి.

**యహ విశ్వ శివ కీ వాటికా, హై సైర్ కర్‌నే కేలియే**
**నా రాగ ఈర్ష్య, ద్వేష, చిన్తా, వైర కర్‌నే కే లియే.**
**యహ విశ్వ శివ కీ మూర్తి, శివభక్తి కర్‌నే కే లియే**
**విశ్వ శబ్ద కా బోధ్ కర్, శివధ్యాన కర్‌నే కేలియే.**
**యహ విశ్వ శివ అవతార్‌హై, న జాన ధోఖా ఖాయహై**
**శివ సే విలక్షణ జాన కర్, వ్యర్థ అతిభయ పాయ హై.**
**యహ విశ్వ శివదర్పణ భవన్, శివ బస జో భీతర్ దేఖతా**
**సర్వత్ర హీ శివ్ ఏక్ ఉస్‌కో, బింబ ప్రతిబింబ భాసతా.**

అనగా: ఈ విశ్వం శివుడితోట, విహరించేందుకు.
రాగద్వేష ఈర్ష్యా చింతలతో పోట్లాడుకునేందుకు కాదు.
ఈ విశ్వం శివుడి మూర్తి, పూజ చేసేందుకు.
''విశ్వ'' శబ్దాన్ని విడిచిపెట్టి శివుడిని ధ్యానం చేసేందుకు.
ఈ విశ్వం శివుడి అవతారం, తెలియనట్టయితే మోసపోతావు.
శివుడికి భిన్నమని భావించినపుడు అనవసరంగా భయానికి లోనవుతావు.
ఈ విశ్వం శివుడి దర్పణాలతో కూడిన భవనం, శివుడిపై లోపల చూడు.
సర్వత్ర శివుడే బింబప్రతిబింబాలుగా కనిపిస్తాడు.
సిద్ధవిద్యార్థులకు మననం చేసుకునేందుకు ఒక మంత్రం వ్రాస్తున్నాను :

**సర్వో మమాయం విభవ ఇత్యేవం పరిజానతః**
**విశ్వాత్మనో వికల్పానాం ప్రసరేపి మహేశతా..**

ప్రియమైన సిద్ధ విద్యార్థులారా! మీ భావాల్లో క్రియల్లో పొందే ఫలితాల్లో మంత్రాన్ని పూర్తిగా ఆత్మీయం చేసుకొనండి. ''ముప్ఫయి ఆరు తత్వాలతో కూడి ప్రత్యక్షంగా కనిపిస్తూ మన జీవితాలకు ఆశ్రయరూపమైన ఈ విశ్వం నా ఐశ్వర్యం'' అన్న విశ్వాత్మ భావనతో అర్థం చేసుకునేవారికి అంతరంగంలో అభేదంలో భేదాన్ని సృష్టించే వృత్తి

ఉన్నప్పటికీ అతడి మహేశత్వం అనగా సిద్ధత్వం చెక్కు చెదరకుండా ఉంటుంది. సముద్రంలో అనేక తరంగాలున్నప్పటికీ సముద్రత్వానికి భంగం ఉండదు. అదే విధంగా ''ఈ విశ్వమంతా నా ఐశ్వర్యం'' అని తెలుసుకున్న తర్వాత విశ్వాకార ప్రవృత్తి ఉదయించినప్పటికీ మీ ఈశత్వానికి ఎటువంటి భంగము ఉండదు.

ఓ సిద్ధవిద్యార్థులారా! ఈ ప్రపంచం మీది. విశ్వాత్మమీరు. ఈ ప్రపంచంలోని వికృతులు మీ వల్లనే కలుగుతున్నాయి. అవి మీరే. అందుచేతనే మీరు విశ్వాత్మరూపంలో పూర్ణులు. ఈ విశ్వం, మీ వైభవమేనని సదాస్మరణ చేస్తూ ఉండండి. ఇది మీకు, మీ గురువు ఆదేశం, పరమశివుడి అనుశాసనం. సిద్ధుల ఆచార – వ్యవహారం. మోక్షధర్మం యొక్క సులభసాధనం. పరాశక్తిని ప్రసన్నం చేసుకునే యజ్ఞం. చిత్‌శక్తి సమావేశానికి మహా మంత్రం. ఇది ఆత్మబోధ. ఇది శ్రీ గురు ధ్యానం. ఇది ముక్తానంద యొక్క స్వధర్మ రూప యజ్ఞం.

ఒకటి

# సిద్ధుల ఆదేశం

ప్రియమైన సిద్ధవిద్యార్థులకు ముఖ్యమైన ఒక విషయం చెప్పవలసి ఉంది. మన మార్గం సిద్ధ మార్గం. మన పద్ధతి సిద్ధుల పద్ధతి. మన లోకం సిద్ధలోకం. మనకు ప్రియమైన గురుజనులు కూడా సిద్ధలోకవాసులు. మన మంత్రం సిద్ధమంత్రం. మన నియమ నిబంధనలు సిద్ధులవి. మన జీవితం సిద్ధాశ్రయం. సాధన, సిద్ధులు చేసే సాధన. సాధించవలసినది ఆత్మ సిద్ధి. ఉండవలసినది సిద్ధావస్థలో, చేరవలసినది సిద్ధలోకానికి. మన పనులు పరిపూర్ణంగా సిద్ధిస్తాయి. సిద్ధకృప ఎన్నడూ విఫలం కాదు. సిద్ధ కృప అమోఘమైనది.

చేపపిల్లలు చిన్నవైనప్పటికీ చేపల గుణగణాలనే కలిగి ఉంటాయి. నీటిలో సహజంగానే జీవిస్తాయి. సింహపు పిల్లలు, శైశవంలోకూడా పూర్తిగా సింహాలే. ఏనుగు పిల్లలు దంతాలు రానివికూడా ఏనుగులే. ఏనుగు పిల్లలు చిన్నవే అయినప్పటికీ వాటి గుణగణాలన్నీ పెద్ద ఏనుగువంటివే. అదే విధంగా మీరుకూడా మీ పరిపూర్ణుడైన తండ్రియొక్క పరిపూర్ణులైన పిల్లలు. అందుచేత మీరు ఆలోచించవలసిన పనిలేదు. దిగులు పడవలసిన పని అంతకన్నా లేదు. పిల్లవాడు స్వతహాగా పెరిగి పెద్దవాడవుతాడు. వయస్సుకు తగినట్టు తనంతట తానే పెరుగుతాడు. ''నా చెవి ఎందుకు చిన్నదిగా ఉంది? పండ్లు రాలేదే? నన్ను గొప్పవాడినిగా ఎందుకు అందరూ గుర్తించరు? పెద్దవారికుండే సామర్థ్యం నాకెందుకు లేదు?'' ఈ విధంగా ఆలోచించడం వ్యర్థం. మీరు దినదినం పెరిగి పెద్దవారు కావడంతో పాటు మీ తండ్రి యొక్క బీజం పూర్ణత్వాన్ని పొందు తుంది. బాల్యం నుంచి యవ్వనం వరకు ఒక మానవుడి పెరుగుదల సహజంగా జరుగుతుంది. ఈ విషయమై దిగులుపడడం పిచ్చితనం, మూఢత్వం. ఆ మూర్ఖత్వమే బంధమౌతుంది. అందుచేత అనవసరంగా దిగులు పడుతూ ఆత్మ స్థైర్యాన్ని తగ్గించుకోరాదు. **ఒక సిద్ధ పురుషుడి శిష్యుడు ఎన్నడూ బద్ధుడు కాడు. ఈ సంగతిని గుర్తుంచుకోనడం అవసరం.**

వయసులో చిన్నవారైన సిద్ధవిద్యార్థులు తమ తల్లిదండ్రుల అదుపాజ్ఞలలో వారి శిక్షణలో ఉండడం అవసరం. నియమబద్ధంగా ఉండడం అవసరం. ఆ విధంగా లేనపుడు పూర్తి ఫలితం ఉండదు. సాధన కూడా దుర్బల మౌతుంది. సిద్ధత్వంలో లోటు ఉంటుంది. పురోభివృద్ధి కుంటుపడుతుంది. చిత్‌శక్తిలో లీనం కావడం ఆలస్యమౌతుంది.

సింహపు పిల్లలు ఎన్నటికీ గాడిదను పోలి ఉండవు. నఖశిఖ పర్యంతం పూర్తిగా సింహాన్నే పోలి ఉంటాయి. ఒక వేళ సింహపుపిల్ల, రాత్రింబవళ్లు గాడిదలతో గడిపినట్టయితే వాటి గుణాలే అబ్బుతాయి. గాడిదలుకూడా, ఇది తమ జాతిదే అనుకుంటాయి. రోజురోజుకు దాని తేజస్సు, స్వభావం, పద్ధతి, అన్నీ మారుతూ మెల్లమెల్లగా గాడిద గుణగణాలు అబ్బుతాయి. గాడిద అరిచినట్టే అరుస్తుంది. గాడిద తినే మురికి పదార్థాలను తినడం ప్రారంభిస్తుంది. సందుగొందుల్లోని మురికి నీటిలో స్నానం చేస్తుంది. ఆ విధంగా జరుగుతూ రూపం మాత్రం సింహంగా ఉంటుంది. కాని స్వభావం అంతా గాడిదదే. మెల్ల మెల్లగా సింహానికుండే శౌర్యమూ అడవుల్లో ఏకాంతంగా ఉండాలన్న దాని కోరిక, దాని స్వాభావికమైన గుణగణాలు అన్నీ అంతరిస్తాయి. గ్రామాల్లోని సందుగొందుల్లో, నగరాల్లోని శబ్దాల మధ్య నివసించడం అలవాటవుతుంది. ఈలోపున చాకలి, తనకు పనికివచ్చే గాడిదకోసం వెతుక్కుంటూ ఈ సింహాన్ని పట్టుకుంటాడు, మురికి గుడ్డల మూటను దాని వీపుమీద పడవేసి చాకలి రేవుకు తీసుకుపోవడానికి. ఈవిధంగా, గాడిదలతో ఉండిన ఫలితంగా, సింహం గాడిదగా తయారవుతుంది, మురికి గుడ్డలను వీపుమీద వేసుకుని చాకలి రేవుకు యాత్రలను చేయడానికి. దానికి తెలియదు, తాను ఒక సింహపు బిడ్డనని, గాడిదగా మారానని. గాడిదలు చాలా ఉన్నాయి గదా, వాటిలో నాది మెరుగైన కొత్త జాతి అయివుంటుంది, అని అనుకుంటుంది.

గాడిద మెరుగుపడి సింహంగా మారాలేగాని, సింహం గాడిదగా మారరాదు. మీరు బద్ధులైన ముముక్షువుల విధంగా ఇటు – అటు ఇంటింటికి తిరగరాదు. మీలోకం సిద్ధలోకం. అన్నిటికన్నా శ్రేష్ఠమైనది. గొప్ప శక్తి సామర్థ్యాలను కలిగినది. మీలోకం ముందు, ఇంద్రలోకం చంద్రలోకం సూర్యలోకం వంటిలోకాలన్నీ దిగదుడుపే. మీ వంశం గొప్పది. మీ వంశానికి చెందిన చాలామంది సిద్ధయోగులు యోగినులు మీ రక్షణకు గాను మీ వెనుకనే ఉన్నారు. అందుచేత బద్ధావస్థలో ఉన్న సాధువుల మధ్య,




స్వామి ముక్తానంద : శ్రీ గురుదేవ ఆశ్రమం

భక్తజనుల మధ్య మీ సమయాన్ని నష్టం చేసుకోరాదు. గుర్తుంచుకొనండి, మీరు సిద్ధలోకం వెళ్లవలసి ఉంది.

మీ పూర్వీకులు చాలామంది సిద్ధలోకంలో ఉన్నారు. పరమ సిద్ధుడైన శ్రీ ఆదినాథుడి మొదలు, సప్త ఋషులు, పూర్వకాలం నుంచి ఈ నాటివరకు జన్మించిన అసంఖ్యాకులైన సిద్ధులు, మునులు, పరిపూర్ణత్వాన్ని పొంది సిద్ధలోకంలో నివాసం చేస్తున్నారు. వీరు మీకు శక్తిని ప్రదానం చేస్తున్నారు. మీ యోగసాధనను క్రియాశీలం చేస్తున్నారు. మీ సంరక్షణకు, మీ యోగక్షేమాల బాధ్యతను వహించడానికి, సిద్ధంగా ఉన్నారు. మీరు, కేవలం, మీ గురువు యొక్క శిష్యులు మాత్రమేనని భావించరాదు. మీరు, సిద్ధలోకవాసుల వంశపరంపరకు చెందినవారు. మీ వంశ పరంపర గురించి మీకు తెలియదు. మీకు సిద్ధలోక దర్శనమైనపుడు మీ వంశ పరంపర గురించి పూర్తిగా తెలుస్తుంది. మీ వంశంలో ఆది శివుడు, ప్రజ్ఞానానందుడు, ఆనందఘనుడు అయిన మహేశ్వరుడి నుంచి దేవర్షి నారదుడు, వ్యాసమహర్షి, శేషుడు, శుకదేవుడు, యాజ్ఞవల్క్యుడు, కాకభుశుండి, సూతుడు, శౌనకుడు, శాండిల్యుడు, భీష్ముడు, జనకమహారాజు మొదలైన వారున్నారు. సిద్ధావస్థను పొందిన వ్రజనారీమ ణులందరు; పృథుడు, అంబరీషుడు, భరతుడు వంటి రాజులు, ప్రహ్లాదుడు, ధ్రువుడు, ఆంజనేయుడు, అక్రూరుడు, ఉద్ధవుడు, విదురుడు, సంజయుడు, సుదాముడు, కశ్యపుడు, సుతప, పృశ్ని, మనువు, దశరథుడు, కౌసల్య, విభీషణుడు, సనకాది అసంఖ్యాకులైన సిద్ధ మహాత్ములు, మీ వంశానికి చెందినవారే. ఈ నాటి షిరిడీ సాయిబాబా, నసీరాబాదుకు చెందిన నా ప్రియమైన జిప్రుఅణ్ణా నుంచి మీ పరమగురువు భగవాన్ నిత్యానందుడి వరకు కోటానుకోట్ల సిద్ధయోగులు, సిద్ధయోగినులు, సిద్ధలోకంలో మీ సంరక్షణకు గాను సిద్ధంగా ఉన్నారు. అందుచేత మీకు ఎటువంటి అనుమానమూ ఉండరాదు. పతివ్రత యొక్క పతిభక్తి, చెక్కు చెదరకుండా ఉండే విధంగా మీరు సిద్ధమార్గంలో చెక్కు చెదరకుండా ఉండడం అవసరం.

మీకు మీ సిద్ధత్వం గురించి తెలియకపోవడం చేత అక్కడ ఇక్కడ వెతుక్కో వలసి వస్తున్నది. మీకు మీ సిద్ధమార్గంలో మీ పద్ధతిలో మీ ధ్యానయోగంలో సిద్ధమంత్రాల్లో దృఢమైన విశ్వాసం ఉండడం అవసరం. మీ వెనుక పర్వతం వంటి సిద్ధకృప అండగా నిల్చుని ఉంది. అటువంటప్పుడు మీరు అక్కడా ఇక్కడా వెతుక్కొనడం ఎందుకు,



స్వామి ముక్తానంద: తన ఆఖరి సంవత్సరంలో

వ్రతభంగం చేసుకొనడమెందుకు? పతివ్రత, తన భర్తను తప్ప అన్యమేదీ ఎరుగదు. పతిపట్లనే ఆమెకు ప్రేమ. పతిభక్తే ఆమె నియమం. పతిక్షేమమే తనక్షేమం. పతితోనే ఆమెకు సుఖం. ఆమెసంతోషం పతితోనే. పతియే ఆమె జపయోగం. పతికే తన మతిని అర్పించుకుంటుంది. ఆమెకు జ్ఞాన - ధ్యాన - తీర్థ స్నానాలు అన్నీ ఆమె భర్తే. పతి స్నేహమే ఆమె జీవన వ్రతం. పతి తప్ప మరొక వ్యసనం లేదు. ఆమెకు పతి తప్ప మరొక గతి లేదు. అదే విధంగా మీకు, సిద్ధవిద్యార్థులు - విద్యార్థినులకు, సిద్ధమార్గంలో సంపూర్ణ మైన అనురక్తి, ప్రేమ ఉండడం అవసరం.

మీకు ఏమీ ప్రాప్తం కాలేదని సంకోచించవద్దు. సిద్ధులు కన్నులు తెరవడానికి ఒక్క క్షణమే పడుతుంది. మీలో భక్తి - శ్రద్ధలు, దృఢమైన ఆస్తిక్య భావము, సమర్పణ భావము, పరిపూర్ణంగా కలిగినపుడు, సిద్ధకృప లభించడం ఆలస్యం కాదు. వెంటనే లభిస్తుంది. మహాత్ములైన సిద్ధుల కృప లభించినపుడు మీకు సాధన సంపత్తులే కాదు, మోక్షమే కాదు, స్వయంగా పూర్ణ సిద్ధులే అవుతారు. సిద్ధకృపవల్ల సాధకుడు సిద్ధుడవుతాడు. ఎన్నడూ బద్ధుడుగా ఉండడు. మీరు ఎల్ల వేళలా సిద్ధలోకాన్ని జ్ఞాపకం పెట్టుకొనడం అవసరం. అసమర్థులను సమర్థులను చేసే అలౌకికమైన సామర్థ్యం సిద్ధులకుందని మీరు మరిచిపోరాదు. మీ అంతరంగంలో వెలుగుతున్న జ్యోతిని ఎన్నడూ మరువరాదు. సిద్ధులకు సిద్ధపదాన్ని ప్రదానం చేయగల చైతన్యమంత్రాన్ని సదా గుర్తుంచుకొనడం అవసరం. మీ అంతరంగంలో స్వతంత్రంగా అనేకరకాల పనులను చేస్తున్న మహాశక్తి క్రియాశీలమై ఉందన్న సంగతిని ఎన్నడూ విస్మరించరాదు. దివ్యమైన తేజోమయమైన మహాశక్తి మీ అంతరంగంలో మూర్తీభవించి నివాసం చేస్తున్న సంగతిని ఎల్లప్పుడూ గుర్తుంచు కొనడం అవసరం. అందుచేత మీ శక్తి సామర్థ్యాలకు తగినట్టు మీ దినచర్యను రూపొందించుకొనండి. **నా సాధనకు ఎటువంటి ఫలితం ఉంటుంది? అసలు నా సాధన ఎప్పటికైనా ఫలిస్తుందా? ఎంతవరకు ఫలిస్తుంది? అన్న అనుమానం పెట్టుకొనవద్దు.** సింహపు పిల్ల సింహమే అవుతుందని నేను మొదటే చెప్పాను. మీరు ప్రత్యేకంగా ఆచరించవలసిన విషయమిది. ఇది గురు వాక్యం. ఇది గురువాజ్ఞను పాలించడమే.

అర్జునుడు గీత విన్న తర్వాత ఇంతే అన్నాడు : **కరిష్యే వచనం తవ.** గురువాజ్ఞను పూర్తిగా పాలించు. గురూపదేశాన్ని హృదయంలో ధరించు. గురువు చూపిన మార్గంలో ముందుకు సాగు. ఇది, భవసాగరాన్ని దాటేందుకు నీకు లభించిన నౌక. గురుశాసనాన్ని, గురువాజ్ఞను, గురువుబోధను, గురువు పేర్కొన్న మార్గాన్ని ఎంత

ఎక్కువ భక్తిశ్రద్ధలతో అనుసరిస్తావో అంత త్వరగా నీకు సంపూర్ణమైన ఫలితం లభిస్తుంది. గురువు అవహేళన పనికిరాదు. ఆ విధంగా చేయడం వల్ల నువ్వు సాధనా భ్రష్టుడవై పిచ్చివాడివైపోతావు. తోటి సాధకులలో ఈర్ష్యాసూయలు, వ్యర్థమైన సంభాషణ, గురుకుల పద్ధతులకు వ్యతిరేకంగా వ్యవహరించడం, ధ్యానం చేసుకొనవలసిన సమయంలో అధ్యయనం చేసుకొనవలసిన సమయంలో పరస్పరం ఘర్షణ పడి మనసు పాడుచేసుకొనడం- ఇటువంటి వాటివల్ల అంతశ్శక్తి క్రమంగా క్షీణిస్తుంది. రోదించడం కేకలు పెట్టడం స్వాభిమానంతో ఇతరులను నొప్పించడం – ఇవి గురుసేవ చేసే సాధకుడి లక్షణాలు కావు. నా గురుదేవుడు, నన్ను ఒక్కసారి పిలిస్తేనే చాలు, నేను ఎంత దూరంలో ఉన్నా, 'హాఃగురుదేవా' అని మూడుసార్లు అంటూ ఉరుకులు పరుగులుగా వెళ్లేవాడిని. ఒకసారి అడిగితే చాలు, వెంటనే జవాబు చెప్పేవాడిని. ఎన్నిసార్లు అడుగుతారు ఆయన? నా గురుదేవుడిని ఎందుకు కష్టపెట్టడం? అంతటి భక్తి శ్రద్ధలతో మెలిగేవాడిని.

నీలోపల వికసించి ఉన్న క్రియాశక్తి, గురువే అని గుర్తుంచుకో. అందుచేత నీ సాధన నిర్దోషమైనదిగా నిర్మలమైనదిగా ఉండేందుకు గాను ఎవరితోనైనా స్నేహం చేసేముందు బాగా ఆలోచించు. చెడుసహవాసం చాలహానికరమైనది. ఎంతైనా ముప్పు తెచ్చిపెట్టకలిగినది. చెడ్డవారి సాంగత్యానికి దూరంగా ఉండాలని గట్టి సంకల్పం చేసుకో. చెడ్డవారి సహవాసం వల్ల ఆసురీసంపదయొక్క అన్ని చెడ్డ గుణాలూ చెడు అలవాట్లూ ఏర్పడి ఎక్కువవుతాయి. చెడు సాంగత్యం వల్ల సద్గుణాలన్నీ నాశనమౌతాయి. పరమసుశీల స్నేహమయి ప్రేమమయి అయిన కైకేయి, దాసి మంథర యొక్క దుస్సాంగత్యం చేతనే, ఆమె చెప్పిన చెడుమాటలు వినడం చేతనే, దశరథమహారాజు, భరతుడు, అయోధ్య నివాసులందరూ శోకసముద్రంలో మునిగిపోవడానికి కారణమైంది. కైకేయి, తనకు అత్యంత ప్రియమైన భరతుడికి కూడా దూరమైంది, దీని వల్ల. పాలసముద్రమైతేనేమి, ఒక్కబొట్టు పులుపురసం చాలును, దాన్ని చెడగొట్టడానికి. అదేవిధంగా చెడుసహవాసం వల్ల చెడుగుణాలన్నీ సునాయాసంగా అబ్బుతాయి. ఇతరుల గురించి చర్చ, ఇతరులను నిందించడం, అవివేకం, గర్వం, ద్వేషం, అపవిత్రత, అసత్య భాషణం, సినిమా నాటకాలపట్ల ఆసక్తి, హోటల్లో అశుచికరమైన పదార్థాల భోజనం- ఇవన్నీ చెడుసహవాసం వల్ల అబ్బేవే. దీనివల్ల అంతశ్శక్తి వేగం తగ్గుతుంది. సిద్ధవిద్యార్థులు దీని నుంచి తమను తాము రక్షించుకొనడం అవసరం.

చిత్‌శక్తి పారమేశ్వరి కనురెప్పలు తెఱుచుకున్నపుడు ప్రపంచం ఏర్పడుతుంది, మూసుకున్నపుడు ప్రపంచం నాశనవౌతుంది. అటువంటి పారమేశ్వరి నీ అంతరంగంలో ఎంతో స్నేహంగా ఉంటున్నపుడు, ఆమె సాహచర్యం కొంత చాలు, ప్రపంచంలో నీకు ప్రేమ కనిపిస్తుంది. అటువంటి ప్రియమైనశక్తి నీ అంత రంగంలో క్రియాశీలమై ఉన్నపుడు, అటువంటి శక్తితో స్నేహంగా ఉండకుండా, ఆమెలో లీనమైపోకుండా, నీచసాంగత్యాన్ని కలిగి ఉండడం ఎంతహానికరం? నువ్వే ఆలోచించు. అందుచేత చిత్‌శక్తి స్ఫురణతో వ్రాసిన ఈ ఆదేశం, చిత్‌శక్తికి ప్రియమైనది కావడం చేత, చిత్‌శక్తినుంచి వచ్చినది కావడం చేత, చిత్‌శక్తి ప్రాప్తికి హేతువైనందుచేత చిత్‌శక్తికి సంతోషకరమైన విషయం కావడం చేత, చిత్‌శక్తికి భిన్నమైనది కాకపోవడం చేత, ఇది చిన్మయము. దీన్ని పాలించడం వల్ల చిత్‌శక్తి ప్రాప్తమౌతుంది.

## రెండు

# సిద్ధ విద్యార్థుల జగత్క్రీడ

ప్రియమైన సిద్ధవిద్యార్థులారా! చిత్‌శక్తి యొక్క విలాసము తప్ప ప్రపంచంలో మరొకటి లేదని నేను మీకు పదే పదే చెబుతూవచ్చాను. చిత్‌శక్తి, తనంతట తానుగా సంవిత్తు – విలాసరూపంలో క్రీడిస్తున్న చిత్‌శక్తి, జగద్రూపం. అందుచేత అనంతమైన జగద్రూపాలలో ఆమే స్ఫురిస్తుంది. **చిదేవ భగవతి స్వచ్ఛ స్వతంత్రరూపా తత్తదనంత జగదాత్మనా స్ఫురతి.** ధ్యానయోగ ప్రభావం చేత సిద్ధవిద్యార్థులకు చిత్‌శక్తి గురించి ఇటువంటి ఎఱుక కలిగినపుడు, లోపల– బయట, సర్వత్ర, మొత్తం ప్రపంచాన్ని చిత్‌శక్తి విలాసముగా ఎఱిగి, ప్రతి ఒక్క పనిలోను ఆనందం పొందుతారు. ప్రతి ఒక్కపనిలోను చిత్‌శక్తి స్ఫురణ కనిపిస్తుంది. సిద్ధ విద్యార్థి జ్ఞానం ద్వారా చిత్‌శక్తి యొక్క వికాసాన్ని అదేపనిగా పరిశీలిస్తూ ఉంటాడు. ప్రపంచంలో జరిగే పనులన్నీ చిత్‌శక్తి యొక్క వికాసమే కావడం చేత అవి స్వయంగా చిత్‌శక్తే; ఈ విధంగా అన్వయించుకుంటూ ఉంటాడు. అన్నీ పారమేశ్వరి చిత్‌శక్తే అన్న ఎఱుక కలిగినపుడు, లౌకిక వ్యవహారాలలో కూడా – భోజనం – రసాస్వాదన – ఉల్లాసవిలాసాలు మొదలైన క్రియల్లో కలిగే ఆంతరిక తృప్తిని చిత్‌శక్తి భగవతి యొక్క స్ఫురణ రూపమైన పరమానందంగా భావించి, స్వయంగా పరమానంద భరితుడౌతాడు. అంతే కాదు, తమ తమ ఆశ్రమాలకు ఉచితమైన విషయోపభోగాలను అనుభవిస్తున్నపుడు కలిగే ఆనందం చిత్‌శక్తి స్ఫురణ రూపమైన పరమానందంకన్నా భిన్నమైనది కాదని చిత్‌శక్తి ధ్యానం వల్ల నిర్మలమైన మనస్సుతో తెలుసుకుంటారు. విషయోప భోగం వల్ల ఆనందాన్నీ తృప్తినీ పొందిన విధంగానే నిర్విషయమైనపుడు కూడా చిత్‌శక్తి యొక్క ఆనందాన్నీ అనుభవిస్తాడు. **ఈ విధంగా సంసారయోగి, ప్రపంచంలో జరిగే క్రియలన్నిటినీ చిత్‌శక్తి క్రియలుగా చూస్తూ ఆపనుల్లో స్ఫురించే వికాసాన్ని పరమానందమయ చిత్‌శక్తి యొక్క స్ఫురణగా తెలుసుకుని మనస్సులో పూర్తిగా తృప్తి చెందుతాడు.** తృప్తితో కూడిన ఆస్థితిని భావనాబలంతో ఎక్కువ చేసుకొనడం వల్ల, వికల్పవృత్తి రోజు రోజుకు క్షీణించి, లోపలినుంచి పరమానంద

స్వరూపమైన ప్రకాశం నాలుగువైపులా వ్యాపిస్తుంది. విజ్ఞాన భైరవంలో ఈ విధంగా ఉంది:

**జగ్ధిపాన కృతోల్లాస రసానంద విజృంభణాత్**
**భావయేద్భరితావస్థాం మహానందమయో భవేత్.**
**గీతాది విషయా స్వాదా సమసౌఖ్యైకతాత్మనః**
**యోగిన స్తన్మయత్వేన మనోరూఢేస్తదాత్మతా.**
**యత్ర యత్ర మనస్తుష్టిర్ మనస్తత్రైవ ధారయేత్**
**తత్ర తత్ర పరానంద స్వరూపం సంప్రకాశతే.**

నిజానికి ప్రపంచమంతటా వ్యాపించి ఉన్న పరమేశ్వరుడిని తెలుసు కొన లేకపోవడమే దుఃఖం. తెలుసుకొనడమే సుఖం. ప్రియమైన సిద్ధవిద్యార్థీ! నువ్వు చిన్మాత్రుడవు. సర్వవ్యాపకుడవు. పరిపూర్ణుడవు. ప్రపంచం ఎన్నడూ నీకన్న భిన్నమైనది కాదు. దేన్ని త్యాగం చేయగలవు? దేన్ని సంపాదించడానికి పరుగులు పెడుతున్నావు? ప్రపంచంలో నీకన్న భిన్నమైనది ఏదీలేదు. విశ్వమంతటా నువ్వే వ్యాపించి ఉన్నావు. నువ్వే సిద్ధఅక్షయ తత్వానివి. నీకూ ప్రపంచానికీ భేదం లేదు. నువ్వే అద్వైత రూపంలో విశ్వమంతా నిండి ఉన్నావు. ప్రశాంతమైన అవ్యయమైన నిర్మలమైన చిత్ప్రకాశ కుండలిని నువ్వే. అజ్ఞాన మన్నది నీలో ఎన్నడూ లేదు. ఇక ఎప్పుడూ ఉండదు కూడా. నువ్వే సంవిత్తు క్రీడ. నువ్వు రాజసం కాదు తామసం కాదు. నీ మీద ఏ గుణం యొక్క ప్రభావమూ లేదు. నువ్వు నిర్గుణుడవు– సగుణుడవు – నిరామయుడవు – రసస్వరూపుడవు– పరిశుద్ధమైన చిద్విలాసివి. బంగారుతో చేసిన హారాలు కంకణాలు మొదలైన ఆభరణాలు, నిజానికి బంగారమే అయినట్టు పరాశివశక్తి యొక్క వికాసం వల్ల ఉదయించి వృద్ధి చెందిన ఈ ప్రపంచం, కార్యకారణ రూపంలో చిత్శక్తికి భిన్నమైనది కాదు.

ప్రియమైన సిద్ధవిద్యార్థీ, నువ్వు ఎక్కడ ఏది చూచినా అది నీ ప్రకాశమే. నీకు భిన్నమైనది ఏదీ లేదు. నువ్వే అన్నిటిలో వ్యాపించి ఉన్నావు. ''నేను ఇక్కడ ఉన్నాను. నేను అక్కడలేను'' అన్న భిన్నత్వాన్ని మనసులోకి రానివ్వకు. ''నేను సర్వత్ర ఉన్నాను. నేను అందరి ఆత్మను'' అన్న విషయాన్ని నిరంతరం ధ్యానం చేయి. నువ్వు తప్ప ఈ ప్రపంచంలో అన్యమేదీ లేదు. ''**స్వశక్తి ప్రచయోస్య విశ్వం**'' అని శివసూత్రంలో పేర్కొన్నారు. ఈ ప్రపంచం అన్న భ్రాంతి నీలో కేవలం మలదోషం వల్లనే ఏర్పడింది.

చిత్‌శక్తి భగవతిని ఆరాధించు. మలం అమలం కావడంతో ప్రపంచం చిత్‌శక్తి విశ్రాంతి స్థలంగా మారుతుంది. నువ్వు చిన్మాత్రుడివి. నువ్వు శుద్ధ తత్త్వానివి. కనిపిస్తున్న ఈ ప్రపంచమంతా నీ యొక్క స్ఫురణే. అనవసరంగా ఎందుకు రోదిస్తావు? చిత్‌శక్తి అందరిలో పరిపూర్ణంగా ఉంది. మొట్టమొదట ఉన్న ఒకే సత్యానివి నువ్వే. ఇప్పుడున్నది కూడా నువ్వే. ఇక ముందు ఉండపోయేది కూడా నువ్వే. నీకు రాకపోకలు ఎక్కడివి? బంధమే లేనపుడు మోక్షమెక్కడిది? అరే! అన్నిటికీ కర్త చిత్‌శక్తి అయినపుడు నీకు భోక్తృత్వం ఎక్కడిది? అంతటా ఉన్న పరిపూర్ణుడివి నువ్వే. నిత్యానంద తత్త్వానివి నువ్వే. నీ మనోవృత్తిని, సంకల్పవికల్పాల క్షోభకు గురిచేయవద్దు. సంకల్ప వికల్పాలను చిత్‌శక్తి యొక్క స్ఫురణగా అర్థం చేసుకుని చిత్‌శక్తిలో లీనం చేయి. అల్పత్వం భాసించినా అల్పత్వంలో పరిపూర్ణత్వం ఉన్నట్టు అర్థం చేసుకో. వాసనలను చిత్‌శక్తి మయం చేసుకో. వాసనారహితుడవై రోజులను గడుపు. హృదయం యొక్క ధ్యేయాన్ని సర్వత్ర వ్యాపింపచేయి. సర్వత్ర విస్తరింపచేయి. ఆత్మ ఎల్లప్పుడూ పరిపూర్ణమే అని అర్థం చేసుకుని ధ్యేయాన్ని ధ్యాతగా మార్చుకో. మరొకటి లేనపుడు ధ్యానం చేసేది ఎవరిని? అంతటా నీవైభవమే అని భావించి మనస్సును ప్రశాంతం చేసుకో. జీవిత పర్యంతం శాస్త్రాలన్నిటినీ మననం చేస్తూ ఉన్నా రాత్రింబగళ్లు షట్‌శాస్త్రాలను బోధిస్తూ ఉపదేశాలను కూడా చేస్తూ ఉన్నా, చిత్‌శక్తిలో కలిసిపోనంతవరకు నీ భయం నశించదు. ''నేను-నాది'' అన్న భేదాన్ని ధ్యానాగ్నిలో దగ్ధం చేసినపుడు అక్షయమైన పరమానందం ప్రాప్తిస్తుంది.

ఎన్నికర్మలను ఆచరించినా ఎన్ని భోగాలను అనుభవించినా లక్షలాదిసార్లు సమాధి స్థితిలో కూర్చున్నా, చిత్‌శక్తికి భిన్నంగా ఉన్నంత కాలం, నీ బంధనం తొలగిపోదు. చిత్‌శక్తిలో కలిసిపోయి, చిత్‌శక్తిగా మారిపోయినపుడు అక్షయమైన నిత్యానందం లభిస్తుంది. ''ఈ పని చేయవలసి ఉంది'' ''ఈపని చేయరాదు'' ''ఇంతపని చేయడమైంది'' లేదా ''ఇంకా ఇంత బాకీ ఉంది'' – ఈ ద్వంద్వాల నుంచి బయట పడడం అవసరం. మతమౌఢ్యాన్ని వదులుకో. కామాన్ని త్యజించు. మోక్షాన్ని పొందాలన్న ఆకాంక్షనుకూడా విడిచిపెట్టు. నిరపేక్షుడివై చిత్‌శక్తి శరణుపొందు. అప్పుడు నిజమైన విశ్రాంతి లభిస్తుంది. అక్షయమైన సుఖం ప్రాప్తిస్తుంది. త్యాగి విషయాలను త్యజిస్తాడు కాని, విషయాలపట్ల ద్వేషాన్ని త్యజించడు. రాగి, విషయాలలో రాగముకలిగి, వాటిని ప్రేమిస్తాడు. ప్రియమైన సిద్ధవిద్యార్థులారా,

విషయాలపట్ల రాగమూ వద్దు, ద్వేషమూ వద్దు. అప్పుడు నువ్వు ముక్తానందుడివి అయిపోతావు. ద్వంద్వం వదిలిపోతుంది. అక్షయమైన శాంతిలభిస్తుంది.

త్యజించడం – గ్రహించడం ఉన్నంతవరకే నువ్వు ఈ ప్రపంచానికి బద్ధుడివై ఉంటావు. త్యజించడం – గ్రహించడం గురించిన స్పృహలేనపుడు ఈ ప్రపంచానికి అతీతుడివైపోతావు. త్యజించడం – గ్రహించడం, వీటిని త్యజించనూ వద్దు గ్రహించనూవద్దు. స్వస్వరూపంలో రమించు. ప్రపంచాన్ని చిత్‌శక్తి విలాసంగా అర్థం చేసుకుని, అక్షయమైన శాంతి పొందు. వింటూ, చూస్తూ, తాకుతూ, వాసనచూస్తూ, తింటూ తాగుతూ, మేలుకుని లేదా నిద్రపోతూ, ఎల్లవేళలా చిన్మాత్ర స్పృహను కలిగి ఉన్నట్టయితే మనస్సు ఎన్నడూ దుఃఖించదు. ఆ విధంగా సిద్ధవిద్యార్థులు ఎప్పుడూ జీవన్ముక్తులే. ప్రాజ్ఞుడైన మానవుడు ఆకాశాన్ని పోలి, సదా నిర్లిప్తంగా ఉంటాడు. ఎన్నడూ మనస్సును వ్యాకులం చెందనీయడు. అటువంటి వ్యక్తి సంపూర్ణంగా ధ్యానం చేసి ఉంటాడు. అతడు చిన్మాత్ర భగవతికి అన్యుడు కాడు. అటువంటి సిద్ధవిద్యార్థి చాలా అదృష్టవంతుడు. ప్రపంచం దృష్టిలో నిద్రపోతూ ఆత్మ ధ్యానంలో మేల్కొని ఉండేవాడు, ఎల్లప్పుడూ పరమానందాన్ని అనుభవిస్తాడు. నిత్యమూ ఆనందమయుడై ఉన్న సిద్ధవిద్యార్థి యొక్క సాధన పరిపూర్ణము. అతడు మహానుభావుడు. తనను తనలో తెలుసు కుని, తనలోనే లీనమై, తనలోనే తృప్తి పొంది, తనలో తానే సంలగ్నమౌతాడు. అటువంటి సాధకుడికి పట్టణంలో అరుచిలేదు. అరణ్యంలో రుచి ఎక్కువలేదు. అటువంటి సిద్ధ విద్యార్థి గొప్ప పుణ్యతీర్థం వంటివాడు.

**ఈ ప్రపంచం యావత్తు భ్రమ మాత్రమే. పరమార్థ దృష్టి రీత్యా మాత్రమే ఇది చిద్విలాసం.** శాశ్వతమైన శివతత్త్వమే విశ్వమంతటా స్ఫురిస్తూ ఉంది. ఈ ప్రపంచమంతా రక్త – శ్వేత – కృష్ణ – నీల జ్యోతులతో నిండిన చిన్మయ చిత్ప్రకాశమే నన్న జ్ఞానం కలిగిన సిద్ధవిద్యార్థి, చిత్‌శక్తి యొక్క పరిపూర్ణమైన రూపం. ఆ సిద్ధవిద్యార్థి అన్ని అభ్యాసాలను పూర్తి చేసినవాడు. భేద త్యాగ రూపంలో ( భేదభావమును త్యజించడం ద్వారా) వైరాగ్యాన్ని సాధించినవాడు. శ్రవణం – మననం – నిది ధ్యాసలను పూర్తి చేసినవాడు. చిదంబను తన హృదయంలో ప్రతిష్ఠింప చేసుకున్నవాడు. బ్రహ్మాత్మ ప్రత్యక్షంగా ఉన్నది, అభిన్నమైనది అన్న జ్ఞానం కలిగిన వ్యక్తి, సిద్ధవిద్యార్థి. అతడు ధన్యుడు. అందరూ సన్మానింప తగినవాడు. అతడు అనేక రూపాలలో భాసిస్తున్న

తన ఆత్మను గుర్తించినవాడు. అతడు, శరీరం వంటివాటిని గమనించడు. అన్నిటినీ చిత్‌శక్తి విలాసంగా పరిగణించి వ్యవహరిస్తాడు. అతడు, జ్ఞాన యుక్తము, నిత్యముక్తము, అయిన బ్రహ్మానందాన్ని పొందుతాడు. అటువంటి సిద్ధవిద్యార్థి జీవన్ముక్తుడు.

అతడి తలిదండ్రులు ధన్యులు. అతడికి భార్యాపిల్లలమీద మమత ఉండదు. అయినప్పటికీ కుటుంబంతోనే జీవిస్తాడు. నిందా – ప్రశంసలు రెండింటినీ ఒకేవిధంగా పరిగణిస్తాడు. సుఖ–సౌభాగ్యాలు లభించినపుడు అనుభవిస్తాడు, కాని విషయాసక్తుడు మాత్రం కాడు. మనస్సు వాసనా రహితము, దృష్టి చిన్మయము అయిన వ్యక్తి జీవన్ముక్తుడు.

అతడు ప్రపంచాన్ని ప్రపంచంగా చూడడు. ప్రపంచాన్ని కేవలం చిత్‌శక్తి విలాసంగా మాత్రమే పరిగణిస్తాడు. శత్రువుల్లోను మిత్రుల్లోను చిత్‌శక్తి ప్రకాశాన్నే చూస్తాడు. **విశ్వాన్నంతటినీ భక్తితో చూచేవాడు, మొత్తం విశ్వాన్ని పరమేశ్వరుడుగా భావించేవాడు, ప్రపంచంలో ఉంటూ కూడా పరిశుద్ధమైన జీవన్ముక్తుడు.**

అందరితో ఉంటూ నిస్సంగుడుగా ఉండే వ్యక్తి, చిత్‌శక్తి యొక్క ప్రభావంలో మునిగిపోయి మరే ఇతరమైన ప్రభావానికి లొంగని వ్యక్తి, తనలో తాను పరవశమై ఉన్న వ్యక్తి, తనలో తాను అనురక్తుడై ఉన్న వ్యక్తి, తనలో తాను సంతుష్టుడై ఉన్న వ్యక్తి, శాశ్వతంగా జీవన్ముక్తుడు.

ప్రాపంచిక వ్యవహారాలను యథావిధిగా నిర్వహిస్తూ, పైకి పిచ్చివాడిగా కనిపిస్తున్నా లోపల పరమశాంతుడై, అనురాగంపట్ల అనురాగం, ద్వేషం పట్ల ద్వేషం లేకుండా, అన్ని గుణాల బారినుంచి విముక్తి పొంది, అందరినీ ప్రేమించే వాడు, స్వతహాగా జీవన్ముక్తుడు.

అతడు దుఃఖం కలిగినపుడు కలతచెందడు. సుఖం కావాలని ఎన్నడూ కోరుకోడు. సన్మార్గాన్ని ఎన్నడూ వదిలిపెట్టడు. చెడుమార్గాన్ని ఎన్నడూ అనుసరించడు. అతడి అంతఃకరణం ఎల్లప్పుడూ చిత్‌శక్తి స్ఫురణతో నిండి ఉంటుంది. అతడు గంభీరుడు, ధీరుడు, పరిశుద్ధుడు, విరక్తుడు, దయ, ప్రేమ, అనుగ్రహంతో కూడినటువంటి సిద్ధవిద్యార్థి ఈ ప్రపంచంలో ఉంటూ కూడా ముక్తుడు.

అతడు మృత్యువుకు భయపడడు. జీవితంలో కూడా ఎక్కువ రుచి ఉండదు. జీవన మరణాలు రెండూ అతడికి చిద్విలాసమే. అతడికి చిత్‌శక్తి గురించిన పూర్ణజ్ఞానం ఉంది. శ్రీ గురుదేవుడి అనుగ్రహాన్ని పూర్తిగా పొందినవాడు. అటువంటి జ్ఞానిని, ప్రపంచంలో జీవన్ముక్తుడు అంటారు.

అతడికి మాయలేదు, మోహం లేదు. ఈ విశ్వమంతా అతడికి చిత్‌శక్తి యొక్క ఉద్యానవనము. ఈశ్వరుడే జీవుడు. ఈశ్వరుడే ఈ జగత్తు అన్న జ్ఞానం ఉంది అతడికి. అటువంటి జ్ఞానం కలిగి ఉన్న సిద్ధ విద్యార్థి, చిత్‌శక్తి భగవతిలో పరిపూర్ణమైన విశ్రాంతిని పొందుతాడు. జన్మ ఎత్తి సాధించవలసిన దాన్ని సాధించాడు. చేయవలసినది ఇక ఏమీ లేదు. పొందవలసినదాన్ని పొందడమైనది. ఇంక పొందవలసినది ఏదీ లేదు. అర్థం చేసు కొనవలసినదానిని అనగా, తనను, అర్థం చేసుకున్నాడు. ఆ విధంగా అర్థం చేసుకుని, తనలోనే శివుడిని పొందాడు. అతడే వైకుంఠం, అతడే కైలాసం, అతడే బదరి, కాశి అన్ని పుణ్య తీర్థాలు. అతడితోనే ఉన్నాయి.

మూడు

# బక ధ్యానం

ధ్యానం చేసుకునే నా ప్రియమైన సిద్ధ విద్యార్థులారా! మీ ధ్యానం నిజమైనదిగా ఉండడం అవసరం. ప్రశంసలను గౌరవ ప్రతిష్ఠలను పొందేందుకు గాను కపటులు మోసకారులు దాంభికులు కారాదు. ఆ విధంగా ఉంటున్నవారు తమను తామే మోసగించుకుంటున్నారు, తమ ధనాన్ని తామే అపహరించినట్టు. దానివల్ల ప్రయో జనముండదు. దాంభికునికి పరీక్ష పెట్టినపుడు దానిలో పూర్తిగా ఉత్తీర్ణుడు కావడం కష్టమౌతుంది.

నీలో అనేక రకాల క్రియలు జరుగుతుంటాయి. మంచిదే. ధ్యానంలో పూర్తిగా లీనమైపోవడం అవసరం. చెడు ఆలోచనలు రాకూడదు. ధ్యానయోగులారా, బాహ్యంలో కన్నా, వీలైనంత ఎక్కువ, లోపల, మీ అంతశ్శక్తిని సంపన్నం చేసుకొనండి. అంతశ్శక్తి సర్వజ్ఞ, జ్ఞానశాలిని. నీ అంతరంగంలో నుంచి శక్తి, భావావేశాలను క్రియలరూపంలో వ్యక్తపరుస్తుంది. నువ్వు భావావేశానికి లోనవు తావు. అంతశ్శక్తికి ఇవన్నీ తెలుసు. అంతశ్శక్తికి, భూత భవిష్యత్తులు, వర్తమానంలో జరుగుతున్న సంఘటనలు – అన్నీ పూర్తిగా తెలుసు. అంతశ్శక్తి, సర్వజ్ఞుడైన శివుడికి భిన్నంకాదు. స్పందకారిక (3-48)లో ఈ విధంగా ఉంది:

**సేయం క్రియాత్మికా శక్తిః శివస్య పశువర్తినీ.**

అనగా: పరమశివుడి శక్తే నీ అంతరంగంలో క్రియాత్మకమై ఉంది. అదే శక్తి, పరమగురువు శ్రీ నిత్యానందుడిలో కూడా ఉంది. సిద్ధవిద్యార్థులారా మీ సాధన మార్గం మంచిదిగా సత్యమైనదిగా ఉండడం అవసరం. క్రియాత్మకమైన శక్తి అంతరాత్మ రూపంలో అన్నిటినీ చూస్తూ ఉంటుందన్న సంగతిని మీరు గుర్తుంచు కొనడం అవసరం.

శక్తిపాతాన్ని ప్రదానం చేసే మంచి యోగి ఒకరు ఉన్నారు. ఆయన తన అనుచరులను వరుసగా పంక్తిలో నిలుచుండబెట్టి, ''ఇచ్చాను'' అని చెప్పేవారు. దానితో వారందరిలో ఒక ఉద్వేగం వచ్చేస్తుంది. వారందరూ అనేక రకాల క్రియలు చేయసాగుతారు. కొందరు ఏడుస్తారు. కొందరు నవ్వుతారు. కొందరు అరుస్తారు. కొందరు నృత్యం చేస్తారు. ఈ విధంగా ఒకగంట అయిన తర్వాత, గురువు, ''తీసుకున్నాను'' అని అనేవారు. అప్పుడు వారందరూ పూర్తిగా స్వస్థులై ధ్యానం నుంచి బయటికి వచ్చేవారు. ఆవిధంగా ''తీసుకున్నాను'' అన్న పదాన్ని ఉపయోగించినపుడు ఎవరైనా ధ్యానం నుంచి బయట పడకపోయినట్టయితే, వారికి చెప్పవలసి వస్తుంది: ''మాధవా లే'' ''ఉద్ధవా లే'' అని. అటువంటి వారిని ధ్యానానికి పనికిరానివారుగా అనుకునేవారు. ఆ గురువు ఈ విధంగా చెప్పేవారు: ''నా శక్తిని నా అధికారంతో 'ఇచ్చాను' అని చెప్పి ఇచ్చినపుడు వారికి (శిష్యులకు) ధ్యానంలో క్రియలు జరగుతాయి. నేను 'తీసుకున్నాను' అని చెప్పి శక్తిని తిరిగి తీసుకున్న తర్వాత కూడా ఎవరైనా ధ్యానం నుంచి బయటికి రాకపోయినట్టయితే అది శక్తి ప్రభావం చేత కాదు. ఆ శిష్యుడు కపటి, పాషండుడు కావడమే దీనికి కారణం''.

ఎంతో మంది సాధకులు ఒకరితో మరొకరు చెప్పుకుంటూ ఉంటారు: ''ధ్యానంలో ఎంతమంచి తంద్రావస్థ! ఆహా! ఎంతమంచి భావం! ఆహా!'' ఈ విధంగా చెప్పుకుని అందరి ప్రశంసలను అందుకోవాలన్నదే వారి ఉద్దేశ్యం. వారి ధ్యానం, ప్రశంసలను పొందడానికే; అటువంటి ధ్యానం, ఆత్మయొక్క ధ్యానం కాదు. దీన్ని కవులు ''కొంగజపం'' అంటారు.

కొంగ, నీటిలో నిల్చుని కనులు మూసుకుని ఎంతసేపైనా ధ్యానం చేస్తూ ఉంటుంది. అప్పుడప్పుడు ప్రవహించే నీటిలో కూడా నిల్చుని ధ్యానం చేస్తూ ఉంటుంది. జీవిత పర్యంతం అదే విధంగా చేస్తూ ఉంటుంది–నిల్చుని ధ్యానం–ప్రతిదినం ధ్యానం–చాలాకాలం ధ్యానం. అయినప్పటికీ కొంగకు శక్తిపాతం లేదు. జ్యోతి దర్శనం లేదు, పరమేశ్వరుడి సాక్షాత్కారం లేదు. దీనికి కారణం, ఈ ధ్యానం భగవంతుడి గురించిన ధ్యానం కాదు. చేపలగురించిన ధ్యానం. ఆత్మ శాంతిని పొందేందుకు చేసిన ధ్యానం కాదు, చేపలను పట్టుకునేందుకు చేసిన ధ్యానం. కడుపు నింపుకునే ధ్యానం. మంచి మంచి చేపలను పట్టుకునితిని, శరీరాన్ని పోషించుకునే ధ్యానం. స్వార్థానికి చేసే ధ్యానం. ఎవరైనా నన్ను ఈ విధంగా ప్రశ్నించారనుకోండి. ''బాబాజీ ఎదురుగా ఉన్న నదిలో

చాలా కొంగలు చాలా కాలంగా ధ్యానం చేసుకుంటున్నాయి. అంతే కాదు. అవి నది ఒడ్డునే ఉంటాయి. ఎక్కడికీ పోవు. వాటిధ్యానానికి ఫలితంగా జ్యోతి దర్శనము ఆనందము సమాధి ఎందుకు ప్రాప్తించవు?'' అని. నేను ఈ విధంగా జవాబు చెప్తాను: ''ఆహా ఎంత గొప్ప ప్రశ్న అడిగారు? ఎంత తెలివైన వారు మీరు! ఎంత పండితులు! ఎంత బుద్ధిమంతులు! ఏం తెలుసును, ఎంతస్థాయికి ఎదిగి ఉన్నారో! అయినప్పటికీ ప్రశ్నలు మాత్రం అంధులు అడిగినట్టు, మూర్ఖులు అడిగినట్టు అడుగుతారు. అయ్యా చూడండి. ప్రతినిత్యము చేపలను పట్టుకుని వాటిని తింటూ సంతోషంగా గడుపుతూ ఒళ్ళు పెంచుకొనడమే కొంగజపం''.

ఈ విధంగా కొంగజపం చేసే యోగులు కూడా ఉన్నారు. వీరు, సద్గురువు నిత్యానందుడిని ధ్యానం చేయరు. పారమేశ్వరి అనుగ్రాహిక శక్తిని ధ్యానం చేయరు. కొంగజపం చేసే ఈ విద్యార్థులు తమ ఆత్మ స్వరూపాన్ని ధ్యానం చేయరు. వారి ధ్యానం చేపలగురించే. అందుచేత అవే దొరుకుతాయి. ప్రతిదినమూ చేపలగురించి ధ్యానం చేసే వ్యక్తి, ప్రతిదినము చేపలను పట్టుకుని వాటిని భుజిస్తాడు. హాయిగా తృప్తిగా ఉంటాడు. ఇప్పుడు చెప్పండి. చేపలగురించి ధ్యానం చేయడం వల్ల పరమేశ్వరుడి ప్రాప్తి ఏవిధంగా కలుగుతుంది? చేపల గురించి ధ్యానం చేయడం వల్ల జ్యోతి దర్శనం ఏవిధంగా కలుగుతుంది? ధ్యానం భేల్‌పూరీ గురించి, సినిమా గురించి, కోరిక మాత్రం సమాధి స్థితిని పొందాలని! ధ్యాన యోగులారా! కొంగ జపం వల్ల వైకుంఠం చేరుకోలేరు. దేని గురించి ధ్యానం చేస్తారో అదే లభ్యమౌతుంది.

ధ్యానం చేసుకునే సిద్ధవిద్యార్థులు ఇటువంటి కొంగజపం ప్రలోభానికి దూరంగా ఉండడం చాలా అవసరం. తమకు ధ్యానంగురించి తెలియచెబుతున్న, తమచేత ధ్యానం చేయిస్తున్న గురువు యొక్క శక్తి తమలో పంచరూపాలలో ఏవిధంగా పనిచేస్తున్నదీ తెలుసుకొనడం అవసరం. ఈ విషయం గురించి తంత్రసారంలో ఈ విధంగా ఉంది: ''**ప్రకాశరూపతా చిత్‌శక్తిః. స్వాతంత్ర్యమ్ ఆనందశక్తిః. తత్‌చమత్కార ఇచ్ఛాశక్తిః. ఆమర్శాత్మకతా జ్ఞానశక్తిః.** సర్వాకార యోగిత్వం **క్రియా శక్తిః**'' అనగా ఈ చిత్‌శక్తి, గురుదేవుడి నుంచి, పరమ ప్రకాశవంతమై పరమ స్వతంత్రమైన ఆనందంతో, అనేక అద్భుతాలతో కూడిన స్వతంత్రమైన ఇచ్ఛా శక్తితో, నీ అంతరంగంలోకి ప్రవేశించి, నీ హృదయంలోని చిన్న-పెద్ద విషయాలన్నిటి గురించి తెలుసుకుని, నీలో జరుగవలసిన నీకు అవసరమైన సిద్ధయోగక్రియలను

తెలుసుకుని, వాటిని నీలో జరిపిస్తుంది. ఈ విధంగా పరమశివుడి పరమశక్తి, చిత్–ఆనంద–ఇచ్ఛా–జ్ఞాన–క్రియ లు అన్న అయిదురూపాలలో నీ అంతరంగంలో ఉంటుంది. దీనినే చిత్‌శక్తి కుండలిని అనీ, గురుకృపా శక్తి అనీ, గురుదేవుల ఆత్మశక్తి అనీ అంటారు. ఈ చిత్‌శక్తి, విశ్వాత్మకుడైన శివుడిలోనూ, విశ్వాతీతుడైన పరమశివుడిలోనూ సమానంగా ఉంటుంది. అది నీ గురుదేవుడిలో కూడా అదే విధంగా ఉంటుంది. గురుదేవుడిలో ఏది ఉందో అది, నీలోనూ ఉంది. నువ్వు సంపూర్ణంగా గురువుకు అంకితమై ఉన్నట్టయితే ఈ శక్తి నీలోకూడా అదే ప్రమాణంలో ఉంటుంది. కొంగజపంలో ఈ శక్తిలేదు. ఈ శక్తి ఇతరమైన ఆశ్రయమేదీ అవసరం లేకుండా స్వయంప్రకాశమైనది, ఇతరుల సహాయం లేకుండా స్వతంత్రంగానే తనలో తాను ఆనందాన్ని అనుభవించకలిగినది. తనకు తోచినది చేయగల సామర్థ్యం కలిగిన దృఢసంకల్పయుక్తమైన విశిష్టమైన అత్యద్భుతమైన సాటిలేని ఇచ్ఛాశక్తి. ద్రష్ట – దృశ్య విభేదాలను తనలోనే ఇముడ్చుకుని వ్యవహరించే జ్ఞానశక్తి. అనేక రూపాలతో జగత్తులోని పదార్థాలను, పదార్థాల స్పందనను రూపొందించే క్రియాశక్తి. అటువంటి పంచవిధమైన శక్తి పరమాత్మలో ఉంటుంది. అదే శక్తి గురువుకు అనురూపంగా, గురుజనుల్లో ఉంటుంది. అదే, శిష్యుడి యోగ్యతకు తగినట్టు శిష్యుడిలో ప్రవేశిస్తుంది. ఈ ఒకే పంచాత్మక శక్తి శిష్యుడిలో గురువులో పరమాత్మలో ఒకే ఆకారంలో ఉంటుంది. అసలు పరిస్థితి ఇది అయి ఉండగా ధ్యానం యొక్క అర్థం గురుదేవుడికి ఏ విధంగా తెలుస్తుంది. నీ హృదయంలోని భావాలు గురుదేవుడికి ఏ విధంగా తెలుస్తాయి అన్నవి నీకు అర్థం కావు. అందుచేతనే కొంగ జపానికి దూరంగా ఉండవలసిందని చెబుతున్నాను.

కొంగలు సరోవరంలో కనులు మూసుకుని, తెల్లవారు జామునుంచి సాయంత్రం వరకు నిల్చుని ఉండినాకూడా వాటికి చిత్‌శక్తి యొక్క స్వయం ప్రకాశం లభించదు. ఆ ఆనందశక్తియొక్క స్వచ్ఛంద ఆనందం లభించదు. అద్భుతమైన ఇచ్ఛాశక్తి అనుభవంలోకి రాదు. సర్వజ్ఞ అయిన జ్ఞానశక్తి యొక్క అనుభవం ఉండదు. క్రియాశక్తి యొక్క ప్రత్యక్ష అనుభవం కూడా ఉండదు. ఎందుచేత ఇవన్నీ లభించవు? కొంగజపం, బాహ్యానికి యోగుల ధ్యానం వలె కనిపించినప్పటికీ నిజానికి అది చేపలగురించిన ధ్యానం. అనగా నువ్వు ధ్యానం తర్వాత దేన్ని ఎదురుచూస్తావు? ధ్యానంలో ఎవరి గురించి ధ్యానిస్తావు? గంటసేపు ధ్యానం చేసి మనస్సులో ఎవరిని

ప్రతిష్ఠించుకున్నావు? రోదిస్తున్న వారిని చూచి నువ్వు రోదిస్తావు. వారు ఎందుకు రోదిస్తున్నారో నీకు తెలియదు. నవ్వుతున్న వారిని చూచి నువ్వు నవ్వుతావు. వారు ఎందుకు నవ్వుతున్నారో నీకు తెలియదు. ఎవరైనా ఒక చేతివేలు ఆడించినట్టయితే చాలు, నువ్వు పదివేళ్లూ ఆడిస్తావు. ఆ వ్యక్తి ఎందుకు ఆడించాడో తెలియదు. నువ్వు ఎందుకు ఆడిస్తున్నావో కూడా తెలియదు. ఎవరైనా ఒక ప్రదక్షిణం చేసినట్టయితే, నువ్వు ఇరవైఅయిదు ప్రదక్షిణలు చేశావు. నీకు తెలియదు, ఆవ్యక్తి ఎందుకు ప్రదక్షిణం చేశాడో, నువ్వు ఇన్ని ప్రదక్షిణలు ఎందుకు చేశావో. అతడిని చూచి నువ్వు చేశావు. అతడి చేత ఆంతరికశక్తి చేయించింది. నీ చేత నీ మానసిక దశ చేయించింది. దీన్ని అంటారు ''కొంగజప''మని.

ముక్తానంద రెండింటినీ మెచ్చుకుంటాడు. ''ఆహా! చాలా బాగున్నాయి నీక్రియలు. ఆహా! నీ సాధన చాలా బాగా జరుగుతున్నది. బాగా పైస్థాయికి చేరుకున్నావు'' అంటూ ఆశీర్వదిస్తాను. కొంగ, దినమంతా ధ్యానం చేసి కడుపునిండా చేపలను తింటుంది. నువ్వు, కొంచెం నవ్వి, కొంచెం ఏడ్చి, కొన్ని క్రియలు చేసి, పదిసార్లు ప్రశంసలను పొందావు ఇంకేం. కొంగ జపం చేపలకోసం, నీ ధ్యానం పొగడ్తల కోసం. అంతశ్శక్తిని పొందేందుకు కాదు. దానికి చేపలు దొరికాయి, నీకు పొగడ్తలు. ఎవరైనా నిన్నుగాని కొంగనుగాని ''వైకుంఠం ఎందుకు పోలేదు'' అని అడిగారనుకో, నువ్వు వైకుంఠం గురించి ధ్యానం చేస్తే కదా. దేని గురించి ధ్యానం చేస్తే అదే లభ్యమౌతుంది.

మీ కోరికలకు తగినట్టు ఫలితాలనిచ్చే ఆశ్రమాలు చాలా ఉన్నాయి. ఇరవై సంవత్సరాలనాటి మాట. నేను నివసిస్తున్న ప్రదేశానికి దగ్గరలోనే ఒక ఆశ్రమం ఉండేది. అక్కడ ఒక సిద్ధ పురుషుడి సమాధి ఉంది. అది సిద్ధ స్థానం కావడం చేత చాలా మంది యాత్రీకులు అక్కడికి వెడుతుండే వారు. నేను కూడా వెడుతుండేవాడిని. నేను వెళ్లి, సమాధికి, భక్తిశ్రద్ధలతో ఆత్మనిష్ఠకోసం ప్రదక్షిణం చేసి దూరంగా వెళ్లి కూర్చుని ప్రశాంతంగా ధ్యానం చేసుకునే వాడిని. నేను ఆత్మలో లీనమైపోయేవాడిని. ఈ విధంగా నా కర్మకు తగిన ఫలితం నాకు దొరికేది. అక్కడికి ఒక భార్య భర్తల జంటకూడా వచ్చేది. వారికి పిల్లలు లేరు. వారుకూడా ఒకమూలకూర్చుని పిల్లలకోసం ధ్యానం చేసుకునేవారు. వారికి కొన్ని ఆదేశాలు కూడా లభించేవి. వారికి సంతానం కలిగింది కూడా. ఈ విధంగా కొందరు కోర్టులో కేసు గెలిచేందుకు, కొందరు

కాలేజీపరీక్షల్లో ఉత్తీర్ణులయేందుకు, కొందరు రోగవిముక్తులయేందుకు ప్రార్థన చేసేవారు. సంపద కావాలని కొందరు, భోగభాగ్యాలు కావాలని కొందరు, ధ్యానం చేసేవారు. అక్కడికి కొంతమంది విహార యాత్రకు కూడా వచ్చేవారు. బొంబాయిలో ఏకాంతంగా కలుసుకోలేని వారు, సమాధిపేరుతో ఇక్కడికి వచ్చి కలుసుకునేవారు. ''నువ్వు అక్కడి నుంచిరా నేను ఇక్కడినుంచి వస్తాను'' అని ముందుగా అనుకుని అక్కడ కలుసుకునేవారు. కాలేజీల్లో చదువుకునే బాలబాలికలు రహస్యంగా కలుసుకునేందుకు అక్కడికి వచ్చేవారు. సమాధి దర్శనానికి వెళ్లేందుకు ఎవరికీ అడ్డులేదుకదా. ఈ విధంగా స్వామి ముక్తానంద మొదలు, అన్ని రకాల వారు సమాధియాత్రకు వెళ్లేవారు. భక్తులు అనేవారు ''ముక్తానంద స్వామికి బుద్ధులు సిద్ధులు శక్తి అన్నీ ప్రాప్తించాయి. మిగతావారికి ఎందుకు లభించలేదు'' అని. నన్నుకూడా అడిగేవారు ''స్వామీజీ మీకు ఇంత లభించింది. కాని వారికి ఏమీ లభించలేదు. ఎందుచేత?'' అని.

నేను సమాధానం చెప్పేవాడిని. ''వారికి కూడా పూర్తిగా లభించింది. నేను కోరుకున్నది నాకు లభించింది. జ్ఞానం–ధ్యానం–భక్తి – ఇవీ నేను కోరుకున్నది. నాకు ఇవి పూర్తిగా లభించాయి. పరమాత్మ సాంగత్యం కావాలన్నది నా కోరిక. అది లభించింది. వారు సంతానం కోసం ప్రార్థించారు, సంతానం లభించింది. కొందరికి విద్య, కొందరికి కేసులో విజయం, కొందరికి రోగం నుంచి విముక్తి, లభించాయి. కాలేజీల్లో చదువుకునే బాలబాలికలకు ప్రేమగురించి ధ్యానం, వారికి అది లభించింది.

నీ భావన, నీ అంతఃకరణ వృత్తి, గురువుపట్ల నీకున్న భక్తిశ్రద్ధలు, గురువు గురించి నీకున్న జ్ఞానం నీ అంతశ్శక్తి పట్ల నిష్ఠ, దాని గురించి నీకున్న జ్ఞానం–వీటిని అనుసరించి, నీధ్యానం జరుగుతుంది. దానికి తగిన ఫలితం నీకు లభిస్తుంది. నీ ధ్యానం, కొంగజపమైనట్టయితే కైలాసం నుంచి విమానం రాదు. అయితే రెండు చేపలు తప్పకుండా దొరుకుతాయి, తినడానికి. అందుచేత ధ్యానం చేసేవారు మెలకువగా మంచికోరికలతో ధ్యానం చేయడం అవసరం.

నీ ధ్యానం ఎక్కడ స్థిరమౌతున్నదో గమనించు. ఇతర విషయాల్లో నువ్వు ఏ విధంగా చిక్కుకుని ఉన్నదీ గమనించు, ముక్తానందుడు ధ్యానం చేసే సమయంలో ఒకటే కోరిక, ఒకటేలక్ష్యం–భగవాన్ శ్రీనిత్యానంద. ఆయనే ముక్తానందుడి గురుభ్రాత

గురుభగిని. ఆయన తప్ప ఇతర గురుభ్రాతల పట్లగాని గురుభగినులపట్లగాని ఆయన, ప్రేమను పెంచుకోలేదు. తన సోదరుడిని విడిచి పెట్టి ఇతరులను తోబుట్టువులుగా చేసుకొనడంలో అర్థం ఏముంది? ఈ బంధుత్వంలో కపటమూ దోషమూ లేదా? ప్రపంచంలోని వారందరూ మన తోబుట్టువులే అయినపుడు కొందరిపట్ల ప్రేమ, మరికొందరిపట్ల ద్వేషము కలిగి ఉండడం ఏవిధంగా సబబు? ముక్తానందుడికి మాత్రం నిత్యానందుడే ప్రియమైన బంధువు, ప్రియమైన మిత్రుడు. ఆయన తప్ప ఇంకెవ్వరూ మిత్రులు లేరు. నిత్యానందుడి పేరున ఇతరులెవరితోనూ స్నేహం చేయలేదు. ఎల్లవేళలా నిత్యానందుడి గురించే ధ్యానం, నిత్యానందుడి గురించే ఆలోచన, నిత్యానందుడి జ్ఞాపకాల్లోనే విహరిస్తాడు. నిత్యానందుడి లోనే పరిపూర్ణమైన సంతోషాన్ని తృప్తిని ప్రశాంతిని ఆనందాన్ని స్వస్వరూప జ్ఞానాన్ని పొందాడు.

ఒకరోజు నేను ధ్యానమందిరంలోకి అడుగుపెట్టినపుడు చిన్నవయసులో ఉన్న ఒక ధ్యానయోగిని ధ్యానం చేసుకుంటూ ఉంది. మంచి యోగిని ఆమె. ఆమె కనులు మూసుకుని ధ్యానం చేసుకుంటూ ఉంది. ముఖం ప్రసన్నంగా ఉంది. కిలకిల నవ్వుతూ ఉంది. ఆమె నవ్వడం చూచి దగ్గరకు వెళ్లి అడిగాను: ''బాగా సంతోషంగా కనిపిస్తున్నావు. నవ్వుతున్నావు. ఏం కథ'' అని. ఆమె సమాధానం చెప్పింది: ''లేదు బాబా! మీరు అమాయకులనుకుని కొంతమంది ధ్యానంలో ఆవేశం తెచ్చుకుని మిమ్మల్ని మోసం చేసేందుకు ప్రయత్నిస్తున్నట్టు తోచింది. మీరేమీ మోసపోవడం లేదు. మీరు ఏమీ ఎఱుగనట్టు నటించి వారిని మెచ్చు కుంటున్నారు. అందుకే నాకు నవ్వు వచ్చింది.'' నేనన్నాను: ''అవునమ్మా నువ్వు చెప్పిన మాట నిజమే. వారికి ఏం కావాలో అదే ఇస్తాను.''

ధ్యానం చేసుకుంటున్నవారా! మీకు ఎటువంటి ధ్యానం కలిగినా ఎటువంటి క్రియలు కలిగినా, ఎటువంటి భావాలు గొప్ప భావాలు ఉన్నతమైన భావాలు మహోన్నతమైన భావాలు వచ్చినా, వాటన్నిటినీ నమోదు చేసుకునేందుకు నా అంతరంగంలో సర్వజ్ఞ అయిన జ్ఞానశక్తి, కాగితం కలంతో సిద్ధంగా ఉంటుంది. నా అంతరంగంలో ఉన్న జ్ఞాపకశక్తి, నీ అంతరాత్మను సంపూర్ణంగా చూడకలదు. అందుచేతనే ఆబాలిక నవ్విన కారణము, చెప్పిన మాటలు పూర్తిగా సత్యం. ఈ సంఘటనే నన్ను ఈ అధ్యాయం వ్రాసేందుకు పురికొల్పింది. ఆ విద్యార్థినికి కూడా ఆ సర్వజ్ఞ జ్ఞానశక్తే ఈ సంగతిని తెలయచేసింది. నా దగ్గర ఒక ''ధ్యానమీటరు''

ఉంది. అది రహస్యంగా ఉంది. అది ఎవరికీ కనిపించదు. దాని ద్వారా నాకు అన్నీ తెలుస్తాయి. నీ ధ్యానం ఏ విధంగా జరుగుతున్నది. నీ యోగ్యత ఎటువంటిది మొదలైన వన్ని. అందుచేత నీలోపల బయట జరుగుతున్న క్రియలు ఎటువంటివి? బాహ్యంలో నువ్వు నిర్వహిస్తున్న వ్యవహారాల లక్ష్యం ఎక్కడుంది? నీ అంతర్నిష్ఠ ఎంత బలమైనది. అంతరంగంలో నీ మనోవ్యాపారాలు ఎక్కడ కేంద్రీకృత మౌతున్నాయి? ఇవన్నీ తెలుస్తాయి నాకు. దానితో నాకు అర్థమౌతుంది. నీ యాత్ర సమాధివైపే అయినప్పటికీ, దానికి అసలు కారణం ఏమైనదీ తెలుస్తుంది. పిల్లలకోసమా, రోగ నివృత్తికా, ఉద్యోగం కొఱకా, లేక కాలేజి డిగ్రీకోసమా అని. ఏ కోరికతో యాత్ర చేసేవారికి ఆ కోరిక ఫలిస్తుంది. అనగా నీ ధ్యానానికి కారణమేదో దాన్ని క్షుణ్ణంగా పరిశీలించు. ఉత్తర దిక్కుగురించి ధ్యానం చేస్తావు. రామేశ్వరం కనిపించలేదని అంటావు. రామేశ్వరం దక్షిణంలో కదా ఉన్నది. నీ ముఖాన్ని దక్షిణ దిక్కుకు తిప్పు. దక్షిణ దిక్కుగురించి ధ్యానం చేయి, రామేశ్వరం కనిపిస్తుంది. ఆధ్యాత్మిక మార్గంలో నడుస్తున్న ఈనాటి వారికి, ఒక కథ చెప్పాలని చాలా కుతూహలంగా ఉంది. లైలా మజ్నూల కథ ఇది. రామతీర్థుల వ్యాఖ్యాన మాల నుంచి వ్రాస్తున్నాను దీన్ని.

లైలా ఒక రాజుకుమార్తె. మజ్నూ ఒక శ్రామికుడి కుమారుడు. ఒకరి నొకరు ప్రేమించుకున్నారు. కాని ఇద్దరూ ఒకే అంతస్థుకు చెందిన వారు కాకపోవడం చేత వారి వివాహానికి విఘ్నమేర్పడింది. అయినప్పటికీ ఒకరిపట్ల మరొకరికి అమితమైన ప్రేమ. రోజు రోజుకు ప్రేమ ఎక్కువవుతూ ఉంది. ఒకరి ప్రేమలో మరొకరు పిచ్చివారైనారు. లైలా రాజ ప్రాసాదంలోని పై అంతస్తుకు వెళ్లి ''మజ్నూ మజ్నూ'' అంటూ విలపించేది. మజ్నూ నగరంలోని సందు గొందుల్లో ''లైలా లైలా'' అంటూ తిరిగేవాడు. ఒకే నిష్ఠ – ఒకేపని – ఒకే ఆశ – ఒకే కోరిక. మరొక స్త్రీ గురించిన ఆలోచనే లేదు. లైలా తప్ప మరొక విషయంగురించిన ఆలోచనే లేదు. రాజకుమారి ప్రేమలో పడి, కుమారుడు పిచ్చివాడై పోవడం చూచి, రాజు దండన విధించగలడని మజ్నూ తండ్రి భయపడ్డాడు. కాని మజ్నూకు భయంలేదు. నిజమైన ప్రేమ ఉన్నచోట భయం ఉండదు.

మరొకవైపున రాజుకూడా కుమార్తె దుర్దశ చూచి చింతిస్తున్నాడు. కుమార్తె ఆరోగ్యాన్ని బాగుచేసేందుకు వైద్యులను మాంత్రికులను తాంత్రికులను పిలిపించాడు. జ్యోతిష్కులను పిలిపించాడు. ఎన్నో ప్రయత్నాలను చేశాడు. ఫలితం లేకపోయింది.

కుమార్తె మనసును మరొకవైపుకు మళ్లించేందుకుగాను, నాటక ప్రదర్శనకు వెళ్లవలసిందని కుమార్తెను కోరతాడు, రాజు. నాటకంలో మజ్నూ ఉంటాడా అని అడుగుతుంది లైలా. ''ఎక్కడికైనా దూరంగా చక్కటి చల్లని ప్రదేశానికి వెడదాం'' అంటాడు రాజు. ''అక్కడ మజ్నూ లేడు, నేను రాను'' అంటుంది రాకుమార్తె. లైలా మజ్నూలకు ఒకరిపట్ల మరొకరికి అంత నిష్ఠ. ముక్తానంద అంటున్నాడు: నిష్ఠ ఉంటే ఆవిధంగా ఉండాలని. లేని పక్షంలో నిరర్థకం. ఫలాపేక్షతో కూడిన నిష్ఠ, ఇహపరాలకు రెండింటికీ పనికి మాలినది.

లైలా – మజ్నూలు ఒకరి స్మృతిలో మరొకరు, ఒకరి ధ్యానంలో మరొకరు, తమను తాము మరిచిపోయారు. లైలా మజ్నూ స్మరణలో స్వయంగా మజ్నూ అయింది. మజ్నూ, లైలాగా మారిపోయాడు. ధ్యానం చేసే వారు తమను తాము మరిచిపోవడంలో కొంత మిగుల్చుకున్నట్టయితే అది దొంగతనమే అవుతుంది. ఎంత మిగుల్చుకున్నారో, అంత దొంగతనం చేసినట్టు. మజ్నూ పరిస్థితి ఏవిధంగా ఉన్నది, ఒక కావ్యంలోని ఈ క్రింద పంక్తులు సూచిస్తాయి:

**ఖటకా నహీఁహై ఖానేకా, చింతానహీఁహై పానేకీ,**
**మమతా నహీఁహై దేహకీ, పరవాహ్ నహీఁహై ప్రాణోఁ కీ.**

భోజనం గురించి దిగులు లేదు, దేనినైనా పొందాలన్న విచారం లేదు. శరీరం మీద మమతలేదు. ప్రాణం గురించిన చింతలేదు.

లైలాను పొందాలన్న కోరికతో మజ్నూ, అన్నీ మరిచిపోయి, గమ్యం లేకుండా తిరుగుతున్నాడు. అందరూ అతడిని పిచ్చివాడుగానే భావిస్తున్నారు. రాజుకు అతడిమీద దయకలిగింది. రాజుకు, మజ్నూ ప్రేమలో నిజాయితీ కనిపించింది. మజ్నూ, లైలాకు తనను పూర్తిగా అర్పించుకుని, తన అస్తిత్వాన్ని పోగొట్టుకున్నాడు. ఆభరణాలు బంగారమైపోయినట్టు, మజ్నూకు అన్నిచోట్ల, లైలాయే కనిపిస్తూ ఉంది. తనది – పరాయిది అన్న భేదం లేకుండా పోయింది. అప్పుడు రాజు, దండోరా వేయించాడు. ''మజ్నూ పరిస్థితి బాగలేదు. లైలా ప్రేమలో పరవశుడై ఉన్నాడు. అతడికి అన్నపానాదులు, వస్త్రాదులు సమకూర్చవలసినది, సమకూర్చి రాజుగారి దగ్గర సొమ్ము వసూలు చేసుకోవలసింది'' అని. లైలా ప్రేమలో పడిన మజ్నూకు సర్వము ఉచితంగా లభ్యమౌతాయన్న సంగతి అందరికీ తెలిసింది. సోమరులు –

దరిద్రులు – ఇతరుల మీద ఆధారపడి బతికేవారు ఈ సంగతి తెలుసుకున్నారు. వెంటనే మజ్నూగా మారిపోవడం మంచిదనుకున్నారు. రోజుకొక కొత్త మజ్నూ తయారయేవాడు. మజ్నూల సంఖ్య పెరిగి పెద్దదైంది.

మజ్నూగా మారుతున్న అందరికీ ఒకరు పాదరక్షలు, మరొకరువస్త్రాలు, మరికొందరు ఆహారము. వీరందరు రాజుగారి దగ్గరకు వెళ్లేవారు సొమ్ముకు. మజ్నూ ఖర్చు వేలరూపాయలను మించుతున్నట్టు రాజు గమనించాడు. రాజు విచారించగా వేయి మందికి పైగా మజ్నూలు తయారైనట్టు తెలిసింది. రాజు ఆలోచించసాగాడు. ''దయాదాక్షిణ్యాలకు పోయినందుకు ఈ ప్రవాదం వచ్చింది. ఇప్పుడేం చేయడం?'' అని. రాజుగారి మంత్రి మంచి బుద్ధిశాలి. ఆయనన్నారు: ''మహారాజా, నాకు పూర్తి అధికారమిచ్చినట్టయితే నేను ఈ సమస్యను పరిష్కరించగలను'' అని. రాజు అంగీకరించాడు. మంత్రి నగరంలో దండోరా వేయించాడు. ''ఇవేల్టి నుంచి ఏడవరోజున మధ్యాహ్నం పన్నెండు గంటలకు మజ్నూకు ఉరిశిక్ష అమలు జరుగుతుంది. మజ్నూ, రాకుమారిని ప్రేమించడం తగదు'' అని. అప్పుడు మజ్నూల పరిస్థితిని వర్ణించలేము. ఒకరు లుంగీ తీసి పారవేశారు. మరొకరు చెప్పులు తీసి వేశారు. ఇంకొకరు టోపీ తీసివేశారు. అటూ ఇటూ దూరంగా చెల్లా చెదరై పోయారు. ఒకరు ఉద్యోగంలో చేరారు. మరొకరు ఇంకొకరి నౌకరుగా కుదిరారు. సైన్యంలో సిపాయిగా చేరారు మరొకరు. మజ్నూలందరు తమ వేషాలను తొలగించుకుని దాక్కోవడం ప్రారంభించారు. లేని పక్షంలో ఉరికంబం ఎక్కవలసి వస్తుందికదా! అందరూ అదృశ్యమయారు. నిజమైన మజ్నూ ఒక్కడే మిగిలాడు. అవును. ఆ మజ్నూ ఉరికంబం ఎక్కడానికి గాని అగ్నిలో దూకడానికి గాని వెనకాడడు. ప్రాణాల నర్పించడానికి సిద్ధంగా ఉన్నాడు. ప్రాణం మీద బతకాలన్న ఆశ అతడికి లేదు కనుక. ఒకటే కోరిక. లైలాను పొందాలన్న కోరిక. లైలాలో తనను తాను పోగొట్టుకున్నాడు. అతడి కోరిక నిజమైనది. అతడు నిజమైన మజ్నూ. నిజమైన మజ్నూ లైలాను పొందాడు.

ధ్యానం గురించి నేర్చుకుంటున్న ప్రియమైన విద్యార్థులారా, మీరు చేస్తున్న ధ్యానానికి పరీక్ష జరిగినపుడు మీ ధ్యానం యొక్క యోగ్యత గురించి తెలుస్తుంది. అన్ని రంగాలలో పరీక్షలు జరిగేవిధంగానే, ధ్యానంలో కూడా ఉంది. నిజమైన

మజ్నూకు అనగా నిజంగా ధ్యానం చేసేవారికి, లైలా అనగా ఈశ్వరుడు లభ్యమౌతాడు. లేనట్టయితే, లుంగీ, చెప్పులు, విసిరివేసి, అదృశ్యమౌతాడు. నిజమైన ధ్యానం చేసేవారి స్థితి మజ్నూవలె ఉంటుంది. అందుచేత కొంగజపం చేయకుండా నిజమైన ధ్యానాన్ని చేయండి. నిజమైన సుఖాన్ని పొందండి.

మీ అంతరంగంలో ఉన్న పూజనీయమైన పంచరూప శక్తికి స్వాగతం పలుకుతూ, శ్రీ గురువును ధ్యానిస్తూ, మైమరచిపోండి. ధ్యానం ద్వారా, తన అస్తిత్వాన్నే కోల్పోయి, తన ఇష్టదైవతంలో లీనమై, ఆ ఇష్టదైవతంగా మారే వ్యక్తి, ఆభరణాలు బంగారంగా మారేవిధంగా పరబ్రహ్మ పదాన్ని పొందుతాడు, ధన్యుడవుతాడు. అతడి తలిదండ్రులు కూడా ధన్యులు. అతడొక్కడే నిజంగా జీవిస్తున్న వ్యక్తి. మానవుడైన అతడు అమరుడవుతాడు. భక్తులకు ఈ భక్తిరసం రుచి తెలిసిన తర్వాత ప్రపంచమే నిస్సారంగా కనిపిస్తుంది. అటు వంటి దృష్టి ఏర్పడినపుడు బ్రహ్మ నుంచి కీటకం వరకు అందరిలోనూ తన ఆత్మనే దర్శిస్తాడు. అంత రంగంలో బాహిరంలో ప్రతిరోమంలో, భక్తి రసంతో నిండిపోతాడు. అటువంటి భక్తి ఏర్పడి ఉన్నచోట, గురుజ్ఞానం ఉంటుంది. చిత్‌శక్తి క్రీడిస్తుంది. అటువంటి సిద్ధ విద్యార్థులు యోగ్యులు. ధ్యానమహిమను తెలుసుకున్నవారు. తమలో ప్రకటితమై ఉన్న గురుశక్తిని గుర్తించి సర్వదా పూజిస్తూ, గానం చేస్తూ ఉంటారు. వారికిక దుఃఖం లేదు. ఆవిధంగా నిత్యానందుడు తనలో పరిపూర్ణంగా ఉన్నట్టు ముక్తానందుడు చెబుతున్నాడు.

సత్యానికి ఫలితం సత్యం, అసత్యానికి ఫలితం అసత్యం. నీకేమి కావాలో నిర్ణయించుకో, సత్యాన్ని కోరుతున్నట్టయితే సత్యాన్నే ధ్యానం చేయి. పరిపూర్ణమైన ప్రశాంతి నీకు దూరంగా లేదు. ఆత్మశాంతి, నీలో పరిపూర్ణంగా ఉంది. నీవు పరిపూర్ణంగా పరిశుద్ధుడవు కావడమే కావలసినది.

నాలుగు

# "నేను-నాది" త్యజించు, ఇంటిని కాదు

త్యాగం వల్ల పరిపూర్ణమైన శాంతి లభిస్తుందన్నది ఎప్పుడూ సత్యమే. భగవంతుడే పలికాడు: "**త్యాగాచ్ఛాంతిరనంతరమ్.**" కాని త్యాగం విషయంలో చాలా అభిప్రాయాలున్నాయి. త్యాగం చేయవలసిన వరుసక్రమం విషయంలో కూడా అభిప్రాయ భేదాలున్నాయి. కొందరు గృహత్యాగం చేస్తారు. కొందరు ధర్మాన్ని త్యాగం చేస్తారు. అయినప్పటికీ శాంతి లభించక రోదిస్తూ ఉంటారు. కొందరు వస్త్రాలను త్యజిస్తారు, విభూతి పూసుకుంటారు. త్యాగులమన్న పేరు సంపాదించుకుంటారు. అయినప్పటికీ శాంతి లభించదు. కొందరు అన్నం త్యజించి, పాలు త్రాగుతారు. అన్నత్యాగి అన్నపేరు తెచ్చుకుంటారు. ఒకరు స్త్రీని త్యజిస్తారు, ఇంకొకరు ఇంటిని, మరొకరు మాటలాడడాన్ని త్యజిస్తారు. అందరూ శాంతి కోసం తపించేవారే. కాని శాంతి లభించదు. ఈ విధంగా అనేక రకాల త్యాగాలు. ప్రతిరోజు కొత్తకొత్త వాటిని త్యజిస్తున్నారు. కాని లభించేది మాత్రం అశాంతి, నిరుత్సాహము. త్యాగంవల్ల శాంతి లభిస్తుందని భగవంతుడు చెప్పినమాట నిజం. కాని దేనిని త్యాగం చేయడం, ఏవిధంగా చేయడం అన్నది ప్రశ్న. ఈనాడు ప్రపంచంలో త్యాగం పేరిట ఆడంబరాలు ఎక్కువగా ఉంటున్నాయి. దీన్ని చూచి ప్రజలు అలిసిపోతున్నారు, భయపడిపోతున్నారు. ప్రజల్లో భక్తిభావానికి బదులు, చెవులు కుట్టుకొనడం, జుట్టు పెంచుకొనడం వంటి కొత్తరకం వెర్రితలలు కనిపిస్తున్నాయి. బహుశః శాంతిని పొందేమార్గం సంసారులకు సాధ్యంకాదని చాలామంది అభిప్రాయమై ఉంటుంది. శాంతిని పొందేందుకు త్యాగం అవసరం కావడం చేత గుహల్లో గిరికందరాల్లో వనాల్లో నివసించడం, విచిత్రమైన వేషధారణ, వీటితో శాంతి లభిస్తుందనీ, లేకపోతే లేదనీ ఒక తప్పు అభిప్రాయం ప్రబలి ఉంది. నిజానికి ధ్యానయోగం ద్వారా మనస్సును శాంతపరచడం ప్రతి ఒక్కరికి సాధ్యమే.

సాధారణ ప్రజలకు మరొక భ్రాంతి కూడా ఉంది: రసహీనమైన భోగవిలాసాలు - పిల్లలు - ఇల్లు - ఇవే సంసారులకు కావలసినవనీ, ధ్యానము - త్యాగము - యోగము వంటివి గృహత్యాగం చేసిన సన్యాసులకు, విరాగులకు మాత్రమేననీ. కాని ముక్తానందుడు చెబుతున్నాడు: ''ఈ ప్రపంచంలో కుటుంబాలను కలిగి ఉండి ఉద్యోగవ్యాపారాలను నిర్వహిస్తూ ధనసంపదలను కలిగి ఉన్నవారికి కూడా ధ్యానము - యోగము - త్యాగము అవసరమే''నని. కాని త్యాగం చేసేది దేనిని? త్యాగం త్యాగం అంటూ అనేక మంది ఫకీరులై తిరుగుతున్నారు. త్యాగం పేరిట, త్యాగం మంత్రంగా త్యాగం చిహ్నంగా అనేక సంప్రదాయాలు వెలిశాయి. అయినప్పటికీ శాంతి లభించడం లేదు. శాంతిని పొందేందుకు త్యాగం అనివార్యమే కాని ఆ త్యాగం న్యాయోచితమైనదిగా ఉండడం అవసరం. రామనాధుడి టోపీని కృష్ణనాధుడు త్యాగం చేశాడు. పైగా ఆకాశం నుంచి తన కోసం విమానం ఇంకా ఎందుకు రాలేదని చూస్తాడు. అటువంటి త్యాగం కాదు చేయవలసినది.

త్యాగం గురించి రష్యాకు చెందిన ఒక అజ్ఞాత సన్యాసి వ్రాసిన ఒక పుస్తకాన్ని ప్రియమైన భక్తులొకరు నాకు ఇచ్చారు చదవవలసిందని. చాలా బాగుంది పుస్తకం. కాని రష్యాకు చెందిన ఆ యోగి ప్రారంభంలోనే ఈ విధంగా పేర్కొన్నాడు: ''నేనిప్పుడు సంపూర్ణమైన త్యాగిని. నా సంచిలో ఒకటి రెండు రొట్టెలు, ఒక బైబిలు ఉన్నాయి. కప్పుకునేందుకు ఒక దుప్పటి ఉంది. ఇంకేమీలేదు.'' మనదేశంలో కొంత మంది సన్యాసులున్నారు - ఎవ్వరైనా ఏదైనా ఇస్తేనే తింటారు. లేనట్టయితే లేదు. పూర్ణత్యాగులైన వీరు, ఎవ్వరైనా చేతిలో భిక్షపెట్టినపుడే తింటారు, లేనట్టయితే లేదు. కొంతమంది సన్యాసులున్నారు: ఉదయంనుంచి సాయంత్రం వరకు కొంతమంది భక్తులు ఆహారం తీసుకుని వారి వెంట తిరుగు తుంటారు. బుద్ధిపుట్టినపుడు తింటారు, ఇటువంటి సన్యాసులు. ఒక్కొక్కసారి అసలు తినరు కూడా. నాతో ఒకరన్నారు: ''చూడండి స్వామీ అతడెంతటి త్యాగి! ఎప్పుడైనా తినిపిస్తేనే తింటాడు. అందుచేత ఎప్పుడూ అయిదారుగురు భక్తులు ఆహారంతో ఆయన కూడా ఉంటారు'' అని. నేనన్నాను. ''అయ్యా నాకేమో నాత్యాగమే న్యాయోచితమని తోస్తుంది. లాభసాటిగా కూడా కనిపిస్తుంది. నా భోజనం, నేను, సమయానికి, నా చేతులతోనే తింటాను. ఒక్కవ్యక్తికోసం అయి దారుగురు కాచుకుని ఉండడాన్ని నేను త్యాగం చేశాను. మామూలుగా ఆరుగురికి దినకూలి - ఒక్కొక్కరికి రోజుకు కనీసం రెండు రూపాయలని అనుకున్నా -

పన్నెండు రూపాయలవుతుంది. ఇంతమందిని అనవసరంగా తనతోకూడా తిప్పు కుంటూ, పైగా త్యాగినని చెప్పుకొనడం హాస్యాస్పదంగా ఉంది. నేను నా భోజనం స్వయంగా చేస్తాను. ఆరుగురి అవసరం లేదు నాకు. ఇది త్యాగం కాదా?'' దానితో ఆ మహాశయుడు మరొకమాట లేకుండా మౌనంగా కూర్చున్నాడు. మంచిది.

ఈ విధంగా అనేక రకాల త్యాగాలున్నాయి. కాని ప్రజలు త్యాగం రూపంలో ఉపాసన చేస్తున్న దానికి ఎటువంటి ఫలితముంటున్నది అన్న విషయమై ఆలోచించడం అవసరం. త్యాగం వల్ల శాంతి లభిస్తుందని భగవంతుడు చెప్పిన మాట ఏమైంది? ఒక్కొక్క బుద్ధిహీనుడి త్యాగం వెల్లితలలు వేసి, ఎవరైనా తినిపిస్తే తినడం, మంచినీళ్లు త్రాగించినపుడే త్రాగడం వంటి స్థితికి చేరు కుంటుంది. అప్పుడైనా దాని ఫలితం ఏ విధంగా ఉంటుంది? ఆ శాంతి ఎక్కడ? ఆ పరమానంద పారవశ్యం ఎక్కడ? నిదానంగా ఆలోచించండి తెలుస్తుంది. త్యాగం చేయడానికి నీ దగ్గర ఏముంది కనుక? ఈ ప్రపంచంలో నీది అనతగిన వస్తువు, నీవు త్యాగం చేయకలిగిన వస్తువు అసలు ఏదైనా ఉందా? మూఢ జనులు కొంతమంది, పశువులను బలి ఇస్తారు, నైవేద్యంగా నోరులేని గొఱ్ఱెలను దేవి ముందుకు తెచ్చి బలి ఇస్తారు. గొఱ్ఱెతలను దేవికి అర్పించి తాము ఫలం ఆశిస్తారు. జుగుప్సాకరమైన పూజ! పూజారికూడా విశ్వసిస్తాడు, మరొక ప్రాణిని బలి ఇవ్వడం వల్ల తనకు మంచి జరగుతుందని. ఇది చాల విచారకరం. ఇటువంటి పూజకు అర్థమే లేదు. త్యాగం, జ్ఞానయుక్తమూ ఆలోచనా యుక్తమూ సత్యమూ అయి ఉండడం అవసరం. లేకపోయినట్టయితే ఇదేమి త్యాగము? ఇంటిని త్యాగం చేసి మఠంలో లేదా వనంలో బస! నివాసాన్ని కేవలం మార్చుకొనడమే. తెల్ల వస్త్రాన్ని త్యాగం చేసి ఎఱ్ఱటి వస్త్రాన్ని ధరించడం. ధరించే వస్త్రపు రంగు మాత్రమే మారింది.

ఈ సందర్భంగా త్యాగధనుల చక్రవర్తి అనతగిన శిఖిధ్వజుడి త్యాగం స్మరణీయం. శిఖిధ్వజుడి కథ ''యోగవాశిష్టం''లో ఉంది. ఈ కథ, మనస్సుకు విశ్రాంతిని కలుగచేసి, పరమశాంతిని ఇచ్చే సద్బోధ. శిఖిధ్వజుడు రాజు. అయినప్పటికీ ముముక్షువు, ధర్మ జిజ్ఞాసువు, పరమ తత్వాన్ని పొందాలని ఎంతో ఆసక్తితో ఉన్నవాడు. రాజు జిజ్ఞాస రోజు రోజుకు ఎక్కువ కాజొచ్చింది. ఆయన చాలామంది సన్యాసులను, మహాత్ములను, ఋషులను, మునులను సందర్శించేవాడు. భక్తిశ్రద్ధలతో సత్సంగం చేస్తూ సాధన కూడా చేసేవాడు. జిజ్ఞాస తీవ్రతరం కావడంతో మనస్సు వ్యాకులం

చెందడం కూడా ఎక్కువైంది. అనేక రకాల సాధన చేస్తూ, చివరకు త్యాగం లేకుండా ప్రాప్తం ఉండదన్న నిశ్చయానికి వచ్చాడు. త్యాగం లేకుండా సమదృష్టి, శాంతి ప్రాప్తించవని, త్రికాలాల్లోను సత్య ప్రాప్తికి త్యాగమే సాధనమని, దానితో దేనిని త్యాగం చేయడం, ఏ విధంగా త్యాగం చేయడం, ఎప్పుడు త్యాగం చేయడం అన్న విషయమై తీవ్రంగా ఆలోచించసాగాడు. చివరకు, రాజ్యాధికారాన్ని మొదట త్యాగం చేయాలని నిశ్చయించుకున్నాడు.

రాణిని సింహాసనం మీద ప్రతిష్ఠించి, తాను అడవులకు వెళ్లాలని నిశ్చయించు కున్నాడు. అంతఃపురంలో రాణి చూడాల కు తన మనసులోని మాట చెప్పాడు. ''ఆత్మశాంతి లేకుండా నేను జీవించలేను. జ్ఞానంలేని నా హృదయం ఈ ప్రపంచాన్ని చూచి అనుక్షణమూ భయపడుతూ ఉంది. ''నేనొకరాజును'' అన్న అహంకారంతో జీవిస్తున్నాను. నిద్రపోయేసమయంలో అందరివలె నిద్రిస్తున్నాను. భోజనం చేసే సమయంలో అందరివలె భోంచేస్తున్నాను. ఈ పృథ్వీ మండలంలో కాలానికి లోబడని వారెవరు? అయినప్పటికీ జీవితం మీద ఆశపెట్టుకున్నాను. ఇది ఎంత మూఢత్వం! ఈ నశ్వరమైన క్షణభంగురమైన జీవితాన్ని మరణం తర్వాత త్యజించక తప్పదు. ముందే ఎందుకు త్యజించ రాదు? రాణీ చూడాల! నువ్వు నాకు అత్యంత ప్రియమైన పత్నివి. నువ్వు నాకు ఎన్నో విధాల ఉపకారం చేసి ఉన్నావు. ఇంకొక్క ఉపకారం చేసిపెట్టు. నువ్వు సింహాసనాన్ని అధిరోహించి రాజ్యాన్ని పరిపాలించు. దానివల్ల నేను సుఖశాంతు లను పొంది, తపిస్తున్న నా ఆత్మను శాంతింపచేయకలుగుతాను.''

రాణికి, రాజు శిఖిధ్వజుడి అంతర్ మథనం గురించి పూర్తిగా తెలుసును. ఆమె, గురూపదిష్ట మార్గంలో నడుస్తున్న భక్తురాలు. ధ్యానయోగ సంపన్నురాలు. ఆమె, ధ్యాన యోగం ద్వారా భూత – భవిష్యత్ – వర్తమానాలను తెలుసుకొనగల జ్ఞాని. రాణీ చూడాల ఆలోచించింది: ''రాజు త్యాగం చేయాలన్న ఆలోచనలో మునిగిపోయి ఉన్నాడు. ఇప్పుడు తెలియచెప్పినా అర్థం చేసుకొనడు. ఆయన మానసిక స్థితికి అనుకూలంగా ఉన్నపుడే అర్థం చేసుకుంటాడు.'' ఈ విధంగా ఆలోచించి రాణి, రాజుకు వెళ్లేందుకు అనుమతినిచ్చింది.

రాణి, రాజ్యవ్యవహారాలను నిర్వహించగల దక్షత కలిగినది. నిర్భయంగా పరిపాలించసాగింది. ఆత్మ జ్ఞానం ఉదయించిన వారికి, చిత్‌శక్తి కృప ప్రాప్తించిన వారికి,

రాజ్యాన్ని పరిపాలించడం చాలా సామాన్యవిషయం. ''ప్రత్యభిజ్ఞాహృదయం''లో ఈ విధంగా పేర్కొన్నారు: **బలలాభే విశ్వం ఆత్మసాత్ కరోతి.** చిత్‌శక్తిని పొందిన వ్యక్తి, ప్రపంచాన్ని ఆత్మీయం చేసుకుంటాడు. సంపూర్ణవిశ్వానికి మూలమైన చిత్‌శక్తి, ఎవరి హృదయంలో మూర్తీభవించి నివసిస్తుందో అటువంటిరాణికి, రాజ్యాన్ని పరిపాలించడంలో భయమెందుకు? రాణి ఈ ప్రపంచాన్ని చిత్‌శక్తి కిరణపుంజంగా పరిగణించేది. ప్రపంచం రాణికి ఆత్మ తుల్యంగా కనిపించేది. రాణి, రాజ్యవ్యవహారాలను దోషరహితంగా అత్యంత ఉత్తమంగా నిర్వహిస్తూ ఉంది.

రాజు, హిమాలయాల్లోని గిరికందరాల్లో నిర్జనవనంలో ఒక కుటీరం నిర్మించుకుని, ధ్యానం – ధారణ – జపం – తపం చేసుకుంటూ, సాధన దివ్యంగా చేసుకుంటున్నాడు. కఠినమైన నియమాలను పాటించే కొద్దీ అశాంతి కలిగేది, చిత్తం చంచలమయేది, సమభావం నశించేది. ముక్తానంద అంటున్నాడు: ఏ జాతికి చెందిన మానవుడికి, ఆ జాతికి చెందిన పద్ధతుల్లోనే సుఖ – శాంతులు లభిస్తాయి. దానికి వ్యతిరేకంగా ఉన్నపుడు సుఖంలో కూడా దుఃఖమే కలుగుతుంది అని.

నా దగ్గర ఆవుదూడలు మేలురకం జాతికి చెందినవి ఉండేవి. అందంగా ఆకర్షణీయంగా చూడముచ్చటగా ఉండేవి. ఆశ్రమంలో తినుబండారాలుకూడా ఎక్కువగా వచ్చేవి. పాలకోవాలు – హల్వా – లడ్డు వంటి తీపులు – రకరకాల పండ్లు. నేను వాటిని దూడలకు పెట్టేవాడిని. గానుగపిండి – నూక – పచ్చిగడ్డి తినే దూడలు, పాలకోవాలు – లడ్లు – పండ్లు తినడం ప్రారంభించాయి. దానితో వాటికి అనారోగ్యం కలిగింది. వాటికి అలవాటు లేదు కద! ఎవరికి ఏది అలవాటో దానివల్లనే సుఖం.

రాజు పరిస్థితి కూడా అదే. ఆయన అనేకసంవత్సరాలు రాజభోగాలను ఐశ్వర్యాన్ని అనుభవించినవాడు. ఇప్పుడు నారబట్టలను ధరిస్తున్నాడు. పర్ణశాలలో ఉంటున్నాడు. జింకచర్మం మీద పడుకుంటున్నాడు. చన్నీటి స్నానం చేస్తున్నాడు. కందమూలాలు పండ్లు తింటూ తపస్సు చేసుకుంటున్నాడు. రోజు రోజుకు ఆయన మనస్సు మరింత వ్యాకులమౌతూ ఉంది. అశాంతి ఎక్కువవుతూ ఉంది. శాంతికి బదులు అశాంతి, సమదృష్టికి బదులు వైరుధ్యం ఆనందానికి బదులు విషాదమూ ఎక్కువకాజొచ్చాయి. అయినప్పటికీ రాజు, నిజమైన ముముక్షువు కావడం చేత అధైర్యపడలేదు. ప్రతి దినము త్యాగం గురించి ఆలోచించేవాడు, ఇప్పుడు దేనిని త్యాగం చేయడం అని

''**త్యాగా చ్ఛాంతి రనంతరమ్**''. కాని శాంతి లభించలేదు. అనగా త్యాగం పూర్తి కాలేదన్నమాట.

రాణి చూడాల ఒకగొప్పయోగిని. చిత్‌శక్తి ప్రసాదంగా సర్వజ్ఞ అయింది. అంతే కాదు. తన యోగబలం చేత, నీలేశ్వరి ద్వారా ఎక్కడికైనా స్వేచ్ఛగా పోగలదు. ఎటువంటి శరీరాన్నయినా ధరించగలదు. పతికి, అంతరాత్మను గురించి చాలా సార్లు బోధించి ఉంది. కాని రాజు మాత్రం, ఆమెను కేవలం ఒకస్త్రీగా, పత్నిగా మాత్రమే పరిగణించాడు. ఈ విధంగా రాజు ఆమె నుంచి ఏమీ నేర్చుకొనలేదు. రాణి కూడా తెలివైనది కావడం చేత, తగిన సమయం వచ్చినపుడు తెలియ చెప్పవచ్చునని ఎదురుచూస్తూ ఉంది. తగిన సమయం రాకుండా తెలియచెప్పడంవల్ల ఫలితం ఉండదని ఆమెకు తెలుసు. అందుచేత తెలియచెప్పే ప్రయత్నం మానుకుని ప్రశాంతంగా ఉంది. ధ్యానం ద్వారా రాజు పరిస్థితిని తెలుసు కుంటూ ఉంది. రాజు ఏమి చేస్తున్నది అంతర్ దృష్టితో చూడ కలుగుతున్నది.

మరొకవైపున రాజు, తన త్యాగాన్ని ఎక్కువ చేసుకుంటున్నాడు. రెండు రోజుల కొకసారి మూడురోజులకొకసారి, తరువాత అయిదురోజుల కొకసారి ఫలాలను మాత్రం తింటూ, శరీరాన్ని శుష్కింపచేసుకున్నాడు. రాజు పరిస్థితిని చూచి రాణి దుఃఖించింది. ఇక భరించలేక పోయింది. తన శరీరాన్ని, యోగబలంతో కుంభ ఋషి రూపంగా మార్చుకుని రాజు ఎదుట ప్రత్యక్షమైంది. అపరిచితుడైన ఆ ఋషిని చూచి రాజు, ఆశ్చర్యచకితుడైనాడు. ఆయన్ను సత్కరించాడు. ఆసనం మీద కూర్చుండబెట్టాడు. కుంభ ఋషి, రాజు యోగ క్షేమాల నడిగాడు. రాజు తన ఆంతరికస్థితిగురించి చెప్పాడు. చెప్పి ఈ విధంగా అన్నాడు: '' ఓ ఋషీ, ఇంతవరకు నాకు శాంతి లభించలేదు. శాంతిని పొందే ఉపాయమేదైనా చెప్పండి'' అని కోరాడు. కుంభ ఋషి ఈ విధంగా బదులు చెప్పాడు: ''రాజా శాంతిని పొందేందుకు ఉన్న మంత్రమొక్కటే. **త్యాగాత్ శాంతి రనంతరమ్**'' అని పలికి, ఋషి అదృశ్యమయ్యాడు. రాజు శిఖిధ్వజుడు ''**త్యాగాత్ శాంతి రనంతరమ్**'' మంత్రం వింటూనే మరింత ఆశ్చర్యపడ్డాడు. ఆలోచించసాగాడు: ''ఇదేమి మాట? నేను త్యాగం చేయవలసినది ఇంకా ఏముంది? రాజ్యాన్ని త్యజించాను. ధనాన్ని సంపదను అధికారాన్ని వైభవాలను సుఖాన్ని అన్నిటినీ వదులుకున్నాను. స్వజనులు - పరజనులపైన ఆసక్తిని వదులుకుని అడవిలో పర్ణశాలలో ఉంటున్నాను. అయినప్పటికీ

కుంభ ఋషి దర్శనమిచ్చి "**త్యాగాత్ శాంతి రనంతరమ్**" అని అదృశ్య మయాడు. త్యాగం చేయవలసినవి ఇంకా ఏమున్నాయి? త్యాగం గురించి పరి పూర్ణమైన జ్ఞానం లేకపోవడంచేత రాజు త్యజించవలసిన దాన్ని ఇంకా త్యజించలేదు. త్యజించ నవసరం లేనివాటిని త్యజించాడు.

రాజుకు సందేహం కలిగింది. ఆలోచనలో పడ్డాడు. "ఈ పర్ణశాలనుకూడా త్యజించా"లని అనుకున్నాడు. మృగచర్మాన్ని, కమండలువును నారబట్టలను కూడా త్యజించాలని నిర్ణయించుకున్నాడు. అన్నిటినీ త్యజించాడు. ఈలోపున కుంభ ఋషి మళ్లీ ప్రత్యక్షమై "ఓ రాజా సంతోషంగా ఉన్నావా? శాంతి లభించిందా?" అని అడిగాడు. రాజు ప్రత్యుత్తరమిచ్చాడు: "మహానుభావా శాంతికోసం తపిస్తున్నాను. ఆరాటపడుతున్నాను" అని. కుంభ ఋషి అన్నాడు: "త్యాగం ఇంకా పూర్తిగా జరుగలేదు, "**త్యాగాత్ శాంతి రనంతరమ్**" అంటూ ఋషి అదృశ్యమయాడు. రాజు మళ్లీ ఆలోచనలో పడ్డాడు. త్యాగం చేయవలసినది ఇంకా ఏమున్నాయని.

ముక్తానంద అంటున్నాడు: "నిజానికి గ్రహించడం, త్యాగం చేయడం గురించిన, జ్ఞానం చాలా జటిలమైనది. ఇది ఒక కఠినమైన సమస్య. ఈ సందర్భంగా ఒక భక్త కవి వచనం పదే పదే గుర్తుకు వస్తూవుంది: "**సాండీ మాండీ కరూఁ జాసీ। తోఁ తోఁ వికారా పావసీ। నిజరూపీఁ భిన్న పడసీ।**" త్యాగంగురించీ, గ్రహించడం గురించీ విచారణ చేయడం ప్రారంభించినట్టయితే, స్వస్వరూపం నుంచి వేరు పడతావు, స్వస్వరూపంలో ఉండలేవు – అని అర్థం. ఈ సందర్భంగా బ్రహ్మానందుడి కవిత ఒకటి జ్ఞప్తికి వస్తూ ఉంది. సిద్ధవిద్యార్థులకు ఇది చాలా లాభప్రదం. దానిని ఉటంకిస్తున్నాను:

**ఐసా జ్ఞాన్ హమారా సాధో, ఐసా జ్ఞాన్ హమారా రే॥**
**జడ చేతన్ దో వస్తు జగత్ మేఁ చేతనమూల ఆధారా రే।**
**చేతన్ సే సబ్ జగ్ ఉపజత్ హై, నహిఁ చేతన్ సే న్యారా రే॥ 1**
**ఈశ్వర అంశ జీవ అవినాశీ, నహిఁ కఛు భేద వికారా రే।**
**సింధు – బిందు సూరజ్ – దీపక మే ఏక హీ వస్తు నిహారా రే॥ 2**
**పశు – పక్షి నర్ సబ్ జీవన్ మే పూరణ బ్రహ్మ అపారా రే।**
**ఊంచ – నీచ జగ్ భేద్ మిటాయో సబ్ సమాన నిర్ధారా రే॥ 3**
**త్యాగ– గ్రహణ కఛు కర్తవ్య నాహీఁ, సంశయ సకల నివారారే**
**బ్రహ్మానందరూప సబ్ భాసే యహ సంసార్ పసారా రే॥ 4**

దీని అర్థం: ఓ సాధువా! నేను తెలుసుకున్నది ఇది. నేను తెలుసుకున్నది ఇది. ప్రపంచంలోని జడచేతనాలు రెండింటికీ, చైతన్యమే మూలాధారం. ప్రపంచం యావత్తు చేతనంనుంచే ఉదయించింది, చేతనానికి భిన్నమైనది కాదు. జీవాత్మ ఈశ్వర అంశ, అవినాశి. దానికి వికారాలు భేదాలు లేవు. సింధువులో బిందువులో సూర్యుడిలో దీపంలో ఉన్నది ఒకటేవస్తువు. పశు - పక్ష్యాదులలో మానవుడిలో అన్నిటా ఉన్నది సంపూర్ణమైన బ్రహ్మ, హెచ్చుతగ్గులను నిర్మూలించు. అన్నీ సమానమన్న నిర్ధారణకు రా. త్యాగం, గ్రహణం అన్నది లేదు. సంశయాలన్నిటినీ నివారించుకో. ఈ ప్రపంచమంతటా బ్రహ్మానంద రూపమే భాసిస్తున్నది.

అసలు పరిస్థితి ఇది. గ్రహించడం, త్యజించడం ఏమిటని రాజు అర్థం చేసుకొనవలసింది. కాని, అర్థం చేసుకొనలేకపోయాడు. మానవుడి మీద గురుకృప పూర్తిగా కలిగి, అంతశ్శక్తి వికసించి చిత్‌శక్తిప్రసాద రూపంలో జ్ఞానశక్తి ప్రాప్తించేవరకు గ్రహించడం - త్యజించడం ఇచ్చ వచ్చినట్టు జరగుతుంటాయి. తత్వపరిశీలన చేయగల జ్ఞాన దృష్టి ప్రాప్తించనపుడు, త్యాగాన్ని ఏవిధంగా గుర్తించడం, గ్రహణాన్ని ఏవిధంగా అర్థం చేసుకొనడం?

ఇప్పుడు శిఖిధ్వజుడి త్యాగం మరింత ఎక్కువైంది. తన దగ్గర ఇంకా ఉన్న వాటినన్నిటినీ, ప్రాణాన్ని కూడా త్యాగం చేయాలని నిశ్చయించుకున్నాడు. ఈ విధం ఆలోచించసాగాడు: ''పెద్ద చితిని తయారు చేసి అన్ని వస్తువులను దానిలో పడవేసి చివర నేను కూడా దానిలోకి దుముకుతాను. ఈ శరీరం దగ్ధమైపోతుంది. అప్ శాంతి లభిస్తుంది.'' అడవిలో ఎండిపోయిన కట్టెలన్నిటినీ పోగుచేశాడు. పెద్ద తయారుచేశాడు. నిప్పంటించాడు ఒక్కొక్కటిగా వస్తువులన్నిటినీ దానిలో పడ న్నాడు. ఈ విధంగా చెప్ప సాగాడు: ''ఓ కుటీరమా నాకు ఇన్ని రోజులు ఆశ్ర మిచ్చావు. కాని శాంతి లభించలేదు. ఇప్పుడు నిన్ను అగ్నికి సమర్పిస్తున్నాను. కమండలువా! నీ సహాయంతో ఇన్నిరోజులు మంచినీళ్లు త్రాగాను. అయినప్పు శాంతి లభించలేదు. నిన్ను అగ్నికి సమర్పిస్తున్నాను.'' మృగచర్మాన్ని అగ్ని అర్పించాడు. లంగోటి తీసి చితిలో పడవేశాడు. ఉన్నవాటిని అన్నిటినీ మంటల్లో పడవేశాడు. ఇక తన నగ్న శరీం ఒక్కటే మిగిలింది. చితికి మూడుసార్లు ప్రదక్షిణం చేశాడు. శరీరంతో ఈ విధంగా అన్నాడు: ''ఓ నాప్రియమైన శరీరమా నీకు షడ్ర సోపేతమైన భోజనం పెట్టి తృప్తి పరుస్తూ అలిసిపోయాను. అప్పటికీ నీ నుంచి నాకు

సుఖం లేకపోయింది. అనేక రకాల సుగంధిత జలాలతో స్నానం చేయించి అలిసిపోయాను. అయినప్పటికీ నీ వల్ల శాంతి లభించలేదు. ఎంతోమంది రమణుల చేత నిన్ను అలరింపచేశాను. అయినప్పటికీ సుఖం లేదు. ఎంత స్నానం చేయించి ఎంత శృంగారం చేసి ఎంత నైవేద్యం పెట్టినప్పటికీ శాంతి లభించలేదు''. ఈ విధంగా చెప్పి, రాజు, చితిలోకి దూకేందుకు సన్నద్ధమయాడు.

ఈ లోపున కుంభ ఋషి అక్కడ ప్రత్యక్షమయాడు. ఆయన, రాజు చేయి పట్టుకున్నాడు. ''ఓ రాజా, ఆగు, ఆగు. ఎంత అన్యాయానికి ఒడిగట్టావు? ఇంత అనర్థానికి పాల్పడుతున్నావు ఎందుచేత?''

రాజు సమాధానం చెప్పాడు: ''ఓ ఋషీ, అన్నిటినీ త్యాగం చేసిన తర్వాత శరీరాన్ని కూడా త్యాగం చేయాలని తలపెట్టి, ఆ పనికి పూనుకున్నాను. దీనివల్ల నాకు పరిపూర్ణమైన శాంతి లభిస్తుంది.''

కుంభ ఋషి అన్నాడు: ''ఓ రాజా శరీరం చితిలో కాలిపోయినంత మాత్రాన శాంతి లభించేట్టయితే అసంఖ్యాక జీవులు మరణిస్తున్నారే వారందరికీ శాంతి లభిస్తున్నదా? మరణం శాంతికి సాధనమా? జీవించి ఉన్నపుడే ఏ శరీరంతో శాంతిని పొందవలసి ఉన్నదో, ఆ శరీరాన్ని దగ్ధం చేసి శాంతిని ఏ విధంగా పొందగలవు? ఏ శరీరంలో ఉంటూ జీవన్ముక్తిని పొంది సుఖశాంతులను అనుభవించవలసి ఉన్నదో ఆ శరీరాన్ని చితికి అర్పించబోతున్నావు. శరీరం భస్మమైన తర్వాత శాంతి ఎక్కడ, ఎవరు అనుభవించేది? రాజా దేనిని త్యజించవలెనో తెలియలేదు నీకు. చూడు రాజా! నీకు ప్రత్యక్షంగా కనిపిస్తున్న ఈ శరీరంలో డెబ్బయిరెండు కోట్ల నాడుల సముదాయము, నాలుగు అవస్థలు, నాలుగుశరీరాలు, పంచకోశాలు ఉన్నాయి. శరీరంలోపల దీని రూపకల్పన అత్యద్భుతమైనది. తల్లిదండ్రుల సంయోగం వలన, రజస్సు – వీర్యం కలయిక వలన ఉత్పత్తి అయినది ఈ శరీరం. దీనిలో సగభాగం తండ్రియొక్క వీర్యం నుంచి మిగతా సగభాగం తల్లియొక్క రజస్సు నుంచి ఏర్పడినది. ఈ రెంటి కలయిక వల్ల ఏర్పడిన ఈ శరీరంలో త్యాగం చేసేందుకు నీది ఏమి ఉంది? ఏ వస్తువు నీది ఈ శరీరంలో?

''ఓ రాజా, ఈ శరీరానికి మూలకారణమైన రజస్సు – వీర్యము, తల్లిదండ్రులు భుజించిన అన్నపానాదుల రసం. ఈ అన్నరసం పృథ్వికి చెందినది. అటువంటప్పుడు

నీకు చెందినది ఏముంది త్యాగం చేసేందుకు? మానవుడు పృథ్వీ నుంచి ఉత్పత్తయిన అన్నాన్ని తిని, పృథ్వీలోనే రమించి, పృథ్వీలోనే కలిసిపోతాడు. అందుచేత ఈ శరీరం పృథ్వీమయం. పరమశాంత స్వరూపుడైన పరమేశ్వరుడు ఆత్మరూపంలో ఈ శరీరంలోకి ప్రవేశించి, ఈ శరీరంలోనే నివసిస్తాడు. అదికూడా నువ్వుకాదు. ఈ శరీరంలోని ఇంద్రియాలన్నిటిలో - కనులు - చెవులు - ముక్కు - నాలుక - చర్మం - వీటన్నిటిలో ఆయాదేవతలు వచ్చి వాటి పనులను చేయిస్తున్నారు. అది కూడా నువ్వు కాదు. ఓ రాజా, నువ్వు త్యాగం చేయతలపెట్టినది దీనినా! దీనిలో నీ త్యాగమేముంది? తరువాత, పృథ్వీ నుంచి పుట్టి, పృథ్వీమీద నివసించి, పృథ్వీలోనే కలిసిపోవడంతో శరీరం పృథ్వీమయమౌతుంది. అదే విధంగా ఈ పృథ్వీ జలం నుంచి పుట్టింది; అందుచేత జలమయం. జలం, అగ్ని నుంచి పుట్టింది, అందుచేత అగ్నిమయం. అగ్నివాయుమయం. వాయువు ఆకాశమయం. ఆకాశం, పరమాత్మ మయం. దీనిలో నీది ఏదీ లేదు. ''నాది'' అన్న భ్రాంతి మాత్రమే ఉంది. ఆవిధంగా అర్థం చేసుకుని, ఆ భ్రాంతిని త్యాగం చేయడం అవసరం. నీకు మరొకరు ఇచ్చిన దేహాన్ని త్యాగం చేసి, దాన్ని నువ్వు చేస్తున్న త్యాగంగా భావిస్తున్నావు! నిజానికి జ్ఞానదృష్టి ప్రాప్తమైనవారికి, గురుకృపలభించిన వారికి, త్యాగం చేసేందుకు ఈ భ్రాంతి కన్నా అన్యమేముంది?

**ఇతో న కించిత్ పరతో న కించిత్**
**యతో యతో యామి తతో న కించిత్।**
**విచార్య పశ్యామి జగన్న కించిత్**
**స్వాత్మావబోధాత్ అధికం న కించిత్॥**

(ఇక్కడ ఏమీ లేదు, అక్కడ ఏమీ లేదు. ఎక్కడికి వెళ్లినా ఏమీ లేదు. విచారణ చేసినపుడు తెలిసింది, ప్రపంచంలో ఏమీ లేదని. స్వాత్మ జ్ఞానాన్ని మించినది ఏదీ లేదు) కుంభ ఋషి ఈ విధంగా పలికిన తర్వాత, ''నేను ద్వేషిస్తున్న ఈ శరీరం ఎంతో సహాయకారి. శరీరం సాధకం గాని, బాధకం కాదు'' అన్న సత్యాన్ని రాజు తెలుసుకున్నాడు.

ఈ సందర్భంగా ఒక కవి వ్రాసిన పంక్తులు నాకు జ్ఞాపకం వస్తున్నాయి - **''సాధక జగ హే, బాధా నాహీఀ యా పాసుని తుజ లేశ. తుజలా యాచా ద్వేష కారే.''** (ప్రపంచం సహాయకరం. ఏ మాత్రం బాధకం కాదు. ఎందుకు దాన్ని ద్వేషిస్తావు?) ఈ శరీరంలో శుభాశుభాలను చేస్తూ, కర్మఫలాన్ని అనుభవిస్తూ ఉన్నావు.

ఈ శరీరం నీకు ఆవిధంగా ఆశ్రయం. అటువంటి శరీరాన్నా త్యాగం చేయడం? దాన్ని అవహేళన చేయడం – నియమ రహితంగా ఉంటూ దాని ఆరోగ్యాన్ని పాడుచేయడం – ఎంతో కాలం ఉండి ఆనందిచవలసిన ఈ శరీరాన్ని పవిత్ర మైనదిగా భావించకుండా సంయమం లేకుండా వ్యవహరించి నిస్తేజం చేయడం – ఇవన్నీ త్యాగమా? **త్యాగం చేయడంలో విచక్షణ అవసరం. అన్ని దుఃఖాలకు మూలము పరము అనర్థదాయకము అయిన ''అభినివేశాన్ని'' త్యాగం చేయడం అవసరం. శాస్త్రాల్లో అభినివేశానికి నిర్వచనం ఈ విధంగా ఉంది: ''మనది కాని వస్తువును మనది అనడం, మనంకాని వస్తువును మనం అనడం అభినివేశం.''** ఈ మనం అన్న పదం అన్ని పెద్ద అనర్థాలకు మూలం. ఈ మనం అన్నపదమే ఈశ్వరుడిని జీవుడుగా భావింపచేస్తుంది. సుఖాన్ని దుఃఖంగా చూపిస్తుంది. ఏకాన్ని అనేకంగా చూపిస్తుంది. ''అహం'' నశించి, ''అహం'' స్థానంలో ''సోహం'' వచ్చినట్టయితే ఇక త్యాగం చేయవలసినది ఏముంది? జగత్తు అంతా చిత్‌శక్తి మయం. అకారణ మైన త్యాగం. అశాస్త్రీయమైన త్యాగం, శాంతికి బదులు భ్రాంతిని కలిగిస్తుంది. ఈ సందర్భంగా సిద్ధవిద్యార్థులకు గాను ఒక భక్తకవి వ్రాసిన కొన్ని పంక్తులను వ్రాస్తున్నాను :

**నహిఁ మిలే ధన త్యాగే, నహిఁ మిలే రామ్‌జీ జాన తజే**
**నారాయణ తో మిలే ఉసీకో జో దేహ అభిమాన తజే ॥**
**సుతదారా యా కుటుంబ త్యాగే యా అపనా ఘర్ బార్ తజే**
**నహిఁ మిలే ప్రభుకదాపి జగత్ కా సబ్ వ్యవహార తజే**
**కందమూలఫల ఖాయ రహే ఔర్ అన్న కా భీ ఆహార తజే**
**వస్త్ర కో త్యాగ నగ్న హో రహే ఔర్ పరహి నారి తజే**
**తో భీ హరి నహిఁ మిలే యహ త్యాగే చాహే అపనే ప్రాణ తజే॥**
**నారాయణ తో మిలే ఉసీకో...**

**తజే పలంగఫూల్ కా ఔర్ చాహే హీరా మోతీ లాల్ తజే**
**జాత కో అపనీ తజే, కుల కీ సారీ చాల్ తజే**
**వన్ మేఁ నిశిదిన విచరే ఔర్ ఇస్ దునియాకా జంజాల్ తజే**
**దేహ భీ అపనీ జలావే, శరీర కా భీ ఖ్యాల్ తజే**
**బ్రహ్మజ్ఞాన నహిఁ హో తో భీ, చాహే వో అపనీ జాన్ తజే..**
**నారాయణ తో మిలే ఉసీకో...**

రహే మౌన్, బోలే నహిఁ ముఖసే, అపనీ సారీ బాత్ తజే
బాలపన్‌సే యోగ లే తాత తజే యా పాత తజే
శిఖాసూత్ర త్యాగకర్ దే ఔర్ ఉత్తమ అపనీ మాత తజే
కభీ జీవకు నా మారే, ఘాత తజే అపఘాత తజే
ఇతనా తజే తూ క్యా హోవే జో దేహ కా నహిఁ గుమాన్ తజే॥
నారాయణ తో మిలే ఉసీకో...

రహే రాత దిన్ ఖడా, నా సోవే, పృథ్వీ కి భీ శయన తజే
కష్ట ఉఠావే, రహే బేచైన్ ఔర్ సారీ చైన్ తజే
మీఠా హోకర్ సబ్‌సే బోలే కడు వే అపనే బైన్‌తజే
ఇతనా త్యాగే దేహ అభిమాన నహిఁ దినరైన్ తజే
బనరసీ కహే ఉసే మిలా నహిఁ చాహే సకల జాన తజే..
నారాయణ తో మిలే ఉసీకో...

దీని అర్థం: సంపదను ప్రాణాన్ని త్యజించడంవల్ల, రాముడు దొరకడు, దేహాభిమానాన్ని త్యజించినవాడే నారాయణుడిని పొందగలడు. ప్రాపంచిక వ్యవహారాలను త్యజించడం వల్ల, దేవుడు ప్రత్యక్షం కాడు. పత్నిని పిల్లలను కుటుంబాన్ని గృహకృత్యాలను త్యజించడం వల్ల, కందమూలాలను ఫలాలను తింటూ ఇతరమైన ఆహారాన్ని త్యజించడంవల్ల, వస్త్రధారణ త్యజించి నగ్నంగా తిరగడం వల్ల, స్త్రీలను త్యజించడంవల్ల, ప్రాణాన్ని త్యజించడం వల్ల, కూడా హరి లభ్యం కాడు.

దేహాభిమానాన్ని త్యజించినవాడే నారాయణుని పొందగలడు. పూలపాన్పులను వజ్రవైడూర్యాలను ముత్యాలను త్యజించడం వల్ల, జాతిని కుటుంబ సంప్రదాయాలను త్యజించడం వల్ల, ఈ ప్రపంచపు జంజాటాన్ని త్యజించి అడవుల్లో రాత్రింబగళ్లు సంచరిచడం వల్ల, ఈదేహ స్మృతిని త్యజించి దగ్ధం చేసి విభూతి చేసినందువల్ల, బ్రహ్మగురించిన జ్ఞానం ఏమాత్రం లేక ప్రాణత్యాగం చేసినందువల్ల లభ్యంకాడు హరి, దేహాభిమానాన్ని త్యజించినవాడే నారాయణుడిని పొందగలడు. మాటలాడడం మానుకుని మౌనాన్ని పాటించినందువల్ల, తండ్రితాతలను త్యజించి చిన్ననాటినుంచి యోగాభ్యాసం చేసినందువల్ల, తల్లిని, కేశాలను, యజ్ఞోపవీతాన్ని

త్యజించినందువల్ల, చంపడాన్ని హింసను త్యజించి ఎవరికీ హాని చేయకపోవడం వల్ల, దేహాభిమానాన్ని త్యజించకుండా వీటన్నిటిని త్యజించడంవల్ల దేనిని పొందగలరు? దేహాభిమానాన్ని త్యజించినవాడే నారాయణుడిని పొందగలడు. నేలమీద శయనించకుండా నిద్రపోకుండా రాత్రింబగళ్లు నిల్చుని సుఖాలనన్నిటిని త్యజించి, కష్టాలను అనుభవించి కఠోరమైన మాటలను త్యజించి అందరితో ప్రేమగా మాటలాడి ఇవన్నీ చేసి అహాన్ని త్యజించకుండా జీవితాన్ని త్యజించినా కూడా దేవుడు దొరకడని బనారసి అంటున్నాడు.

సంపదను ప్రాణాన్ని త్యజించడం వల్ల రాముడు దొరకడు. దేహాభిమానాన్ని త్యజించినవాడే నారాయణుడిని పొందగలడు.

సిద్ధవిద్యార్థులకు ఇది ఒక ప్రామాణిక కావ్యం. **నిజానికి విచక్షణ లేని త్యాగం కూడా భోగమే అవుతుంది. విచక్షణతో కూడిన భోగం, త్యాగ మవుతుంది.** పరమాత్ముడు తనకు భిన్నంకాని మహిమతో ఈ వ్యావహారిక ప్రపంచాన్ని సృష్టించడానికి కారణం ఏమై ఉంటుంది? ఎందుకు ఈ సృష్టి చేసినట్టు? ఈ ప్రపంచం ఎవరికి గాను ఏ పనికి గాను ఎందుకుగాను ఏర్పడినట్టు? ఈ విచారణ చేయకుండా సిద్ధ విద్యార్థులెవరైనా అశాస్త్రీయమైన త్యాగం చేసి నట్టయితే అటువంటివారు అయోగ్యులు. మానవసమాజం, ఈ ప్రపంచం గురించి సరైన జ్ఞానం లేకపోవడం చేతనే దుఃఖిస్తూ ఉంది. చిత్‌శక్తి యొక్క క్రీడా రూపమైన ప్రపంచంగురించి పరిపూర్ణమైన జ్ఞానం కలిగినపుడు ప్రపంచం పరమార్థమౌతుంది. పరమాత్మ సృష్టి అయిన, ఆత్మకు భిన్నంగాని ఈ జగత్తు, పరమాత్మ రూపమే. కార్యం, కారణానికి భిన్నం కాదు అన్నది తర్క విహితమైన వేదాంత సిద్ధాంతం. కారణం కార్యంలో ఇమిడి ఉంది.

జగత్తు మిథ్య, శుష్కం, రసహీనం మరియు బంధన కారకం అని కొంత మంది పండితుల అభిప్రాయం. ఎవరైనా జిజ్ఞాసతో ఏదో కొంత, పరమార్థ పథంలో నడిచినపుడు వారికి ఇదే పాఠం చెబుతారు. సంసారం రసహీనం- మిథ్య- నశ్వరము అని. దానితో ఆ వ్యక్తి అదే మననం చేసుకుంటూ ఉంటాడు. ఈ ప్రపంచం రసహీనం - మిథ్య- నశ్వరము అని. దృష్టి- సృష్టి సిద్ధాంతాన్ని అనుసరించి ఇది ఎంత అనర్థదాయకమైనది! మానవుడి దృష్టిని అనుసరించి సృష్టి ఉంటుంది. ప్రాచీనకాలపు చెడు అలవాట్లు కొన్ని వ్యవహారంలో ఉన్నాయి. ఉదాహరణకు పిల్లలు ఏడ్చినపుడు,

ఇంట్లో ఒక మూల చూపించి అక్కడ భూతం ఉన్నట్టు భయపెడతారు. ఈ భూతం, పిల్లలను భయపెట్టేందుకు తల్లి చేసిన సృష్టి. ఈ భయం పిల్లల మనసులో చాలాకాలం ఉంటుంది. ఇటువంటి భయాలు విదేశీయుల పిల్లలకుండవు. వారు తమ పిల్లలను ఇటువంటి అబద్ధపు భయాలకు లోను చేయరు. అదే విధంగా ''ఈ జగత్తు మిథ్య - శుష్కము - రసహీనము'' అని పండితులు కొంతమంది చెప్పి ఉండవచ్చు. ఆ విధంగా చెప్పడానికి ఏదైనా కారణం ఉండి ఉండవచ్చు. కాని నిజానికి ఈ జగత్తు అటువంటిది కాదు. ఇది చిత్‌శక్తి విలాసం మాత్రమే. చిదంబ శక్తి సామర్థ్యాల సహాయం లేకుండా అనంతమైన విచిత్రమైన బ్రహ్మాండమైన ఈ ప్రపంచాన్ని ఎవరు సృష్టించగలరు? చిత్‌శక్తి స్వయంగా అనంతరూపాలను ధరించి క్రీడిస్తుంది.

అటువంటి చిత్‌శక్తిమయమైన ప్రపంచంలో ఉంటూ చిదంబను సరిగా అర్థం చేసుకొనక పోవడానికి కారణం అజ్ఞానమే. కాని ఇది సత్యం. మానవుడు సత్యాన్ని తెలుసుకోనంత కాలం, శుష్కము - రసహీనంగా ఉన్నంత కాలం, ఈ ప్రపంచం కూడా అదే విధంగా కనిపిస్తుంది. ఇది న్యాయము సహజము కూడా: **మీరు ఏ విధంగా ఉంటే జగత్తు కూడా అదేవిధంగా కనిపిస్తుంది.** గృహస్థుగాని యతిగాని సాధువుగాని ఫకీరుగాని - వారికి జగత్తు వారివలెనే కనిపిస్తుంది. గురుకృపకు పాత్రుడైన వాడు, అంతశ్శక్తి జాగృతమైనవాడు, చిత్‌శక్తి యొక్క క్రీడను హృదయంలో చూచినవాడు - అటువంటి వ్యక్తికి బాహిరంలో కూడా చిత్‌శక్తి యొక్క ప్రసరణము, చిత్‌శక్తి యొక్క స్ఫూర్తి కనిపిస్తాయి. ఈ కింది మంత్రం మళ్లీ జ్ఞాపకం వస్తూ ఉంది.

**శ్రీగురు చరణాంభోజం సత్యమేవ విజానతామ్**
**జగత్ సత్యమసత్యం వా నేతరేతి మతిర్మమ.**

గురుచరణాలే సత్యం అని తెలుసుకున్న వారికి ఈ జగత్తు సత్యమా అసత్యమా అన్న దానితో పనిలేదు, అటువంటి వ్యక్తికి జగత్తు సత్యమా అసత్యమా అన్న విషయం ముఖ్యం కాదు.

జగత్తు గురించి సత్యం - అసత్యం అన్న వివాదం ఉంది. వాద ప్రతివాదాల వల్ల ప్రాప్తించేది ఏదీ లేదు. మనసు నిర్వివాదమైనపుడు అంతా చిదంబ విలాసంగానే కనిపిస్తుంది. అటువంటి సమయంలో జగత్తు జగదీశుడుగా కనిపిస్తుంది. సాక్షాత్కారం పొందిన వ్యక్తి ఈ జగత్తులో జగదీశుడినే దర్శించాడు. శూన్యాన్నిగాని రసహీనతనుగాని

చూడలేదు. సాధన చేసే కాలంలో ఉండే అభిప్రాయాలు, సాధనానంతరం ప్రామాణికంగా ఉండవు. అనగా శ్రుతిలో రెండు విభాగాలు న్నాయి. పూర్వశ్రుతి - ఉత్తరశ్రుతి అని. పూర్వశ్రుతిని దుర్బల శ్రుతి అంటారు. ఉత్తర శ్రుతిని ప్రబల శ్రుతి అంటారు. పూర్వ శ్రుతిలో అన్నారు:, "**అపుత్రస్య గతిర్నాస్తి**" అని. అనగా పుత్రహీనులకు సద్గతి ఉండదు అని. అటువంటప్పుడు త్యాగి (అన్నీ త్యాగం చేసినవాడు) వివాహం చేసుకుంటాడా? మరి నారదముని, సనత్కుమారుడు వంటివారు జీవన్ముక్తులయారుగదా! అది ఏ విధంగా సంభవమైంది? ఉత్తరశ్రుతి ఈ విధంగా అంటున్నది: "**న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నై కే అమృత త్వమానశుః**" (మహానారాయణోపనిషత్ 8/14) అనగా "కర్మవల్ల పుత్రులవల్ల ధనంవల్ల సద్గతి ప్రాప్తించదు. కేవలం త్యాగం వల్ల మాత్రమే అమరత్వం ప్రాప్తిస్తుంది" అని.

ఈ త్యాగం గృహత్యాగం కాదు, జాతిత్యాగం కాదు, ఆశ్రమ త్యాగం కాదు, భోజన త్యాగం కాదు, దేహత్యాగం కాదు, నిష్కామరూపమైన ప్రవృత్తి, కర్మ త్యాగం కూడా కాదు. ఇది కేవలం భేద జ్ఞానాన్ని త్యాగం చేయడం, మనకున్న అభినివేశాన్ని త్యాగం చేయడం. మన అభినివేశాన్ని త్యాగం చేసిన వెంటనే, మన అంతరంగంలో మనకు తెలియకుండా ఉన్న సత్యం విదితమౌతుంది. బాహ్య జగత్తులో మనకు తెలియకుండా ఉన్న సత్యం కూడా తెలుస్తుంది. ఆ తర్వాత మానవుడికి అన్ని ఇంద్రియాలలో కరణాలలో విషయాలలో చిత్‌శక్తి ప్రవాహమే గోచరిస్తుంది. అప్పుడు రోదించడం శాశ్వతంగా నిలిచిపోతుంది. ప్రపంచ వ్యవహారాలను అతిసునాయాసంగా భక్తిశ్రద్ధలతో పారమేశ్వర బుద్ధితో నిర్వర్తించసాగుతాడు మానవుడు.

రాణి చూడాల గొప్ప బ్రహ్మ జ్ఞాని, పూర్ణ యోగిని, సుశీల, పతివ్రత, చిత్‌శక్తి విలాసాన్ని సంపూర్ణంగా తెలుసుకున్న మహానుభావురాలు. ఆమెకు ఈ జగత్తు, చిదంబయొక్క బహిఃస్ఫురణ, ఆమెకు ఆమె అంతఃపురమే సమ దృష్టితో కూడిన గుహ. అన్ని పనుల్లోనూ ఆమెకు బ్రహ్మదర్శనరూప ధ్యానమే. అన్ని వస్తువుల్లోనూ ఆమెకు చిత్‌శక్తి స్ఫురణ గోచరిస్తుండడం చేత, ఆమె భేదజ్ఞానాన్ని (శాస్త్రీయమైన) త్యాగం చేసినది కావడం చేత ఆమెది పరిపూర్ణమైన త్యాగం. యథార్థమైన శాస్త్రీయమైన త్యాగం. చూడాల, స్వస్వరూపం నుంచి వేరు చేసే భేదాన్ని త్యాగం చేసింది, గృహాన్ని కాదు. అందుచేత ఆమె ధ్యానంలో ఎంత ప్రశాంతంగా ఉండేదో, బాహ్య వ్యవహారాల్లో కూడా అంత నిశ్చింతగా ఉండేది. ఆమెకు

**విషయేషు చ సర్వేషు ఇంద్రియార్థేషు చ స్థితమ్**
**యత్ర యత్ర నిరూప్యేత నా శివం విద్యతే క్వచిత్॥**

అనగా చూడాల పరిస్థితి ఈ విధంగా ఉంది. ఆమెకు అన్ని వస్తువుల్లో, ఇంద్రియార్థాలలో, సర్వత్ర, చిదంబే స్ఫురిస్తున్నది. ఆమెకు ఎప్పుడూ ఏదీ శివుడికి అన్యమైనది లేదు. ఆ విధంగా ఉండడం చేత చూడాల, సంసారంలో కూడా పరమార్థాన్ని దర్శించి పరమాత్మమయమై వ్యవహరించేది.

కుంభ ఋషి ఉపదేశానుసారం, అభినివేశాన్ని సంపూర్ణంగా త్యాగం చేసిన రాజు శిఖిధ్వజుడికి బాహ్యంలో సంచరిస్తూ ఉండిన వృత్తులు ఒక్కసారిగా అంతర్ముఖమై అంతరాంతరాల్లోకి దిగి, ఆత్మాకారమై ఆత్మగా మారాయి. శిఖిధ్వజుడికి సమదృష్టితో కూడిన సమాధిస్థితి కలిగింది, బాహ్యం లేదు, అంతరంగం లేదు, ద్వైతం లేదు, లింగం లేదు, శాంతపడ్డాడు. చాలా కాలం నిద్రలేకుండా ఉన్నవ్యక్తి, చల్లటి చక్కటి నీటి ప్రవాహపు ఒడ్డున మందమారుతం వీస్తుండగా నిద్రపోయినట్లయితే, చాలాసేపు గాఢ నిద్రను అనుభవిస్తాడు. అదే పరిస్థితి శిఖిధ్వజుడిది కూడా. చాలాకాలంగా అశాంతిగా ఉన్న మనస్సు, శాంతిని అన్వేషిస్తున్న మనస్సు, అంతరంగంలో శాంతి లభించిన వెంటనే ఆత్మలో లీనమై ఆత్మగా మారిపోతుంది. ద్వంద్వ భావం నశిస్తుంది. తాను కోరిన దానిని పొందిన రాజు, సుఖానుభూతిలో మునిగిపోయాడు. రాజు అంతరంగంలో నుంచి బాహిరంలోకి వచ్చినపుడు, బాహ్యంలో కూడా అదే కనిపించింది. అంతరంగంలో కలిగిన సుఖం బాహిరంలో కూడా కలిగింది. రాజు హృదయం నుంచి భేదభావం నిశ్శేషంగా తొలగిపోయింది. లోపల ఉన్నదే బయటకూడా కనిపించింది.

''యథా అత్ర తథా అన్యత్ర'' అన్నసిద్ధాంతం రాజుకు పూర్తిగా అనుభవంలోకి వచ్చింది. రాజు దృష్టి మారిపోయింది. త్యాగం గురించి ఆయనకున్న తప్పు అభిప్రాయం తొలగిపోయింది. భిన్నత్వాన్ని త్యాగం చేసిన ఆయనకు ఇప్పుడు ఏకత్వంలో అనురాగం ఏర్పడింది. భ్రాంతితో కూడిన త్యాగాన్ని త్యాగం చేసి ఆయన తన ఆత్మ స్థితిని తెలుసుకున్నాడు. ఏకత్వం యొక్క అభేదమైన దృష్టి అనేకత్వాన్ని నాశనం చేసింది. అందరిలో అన్నిటా ''ఏకాన్ని'' చూచి రాజు, ద్వంద్వం నుంచి బయటపడ్డాడు. రాజు సర్వత్ర విశ్వేశ్వరుడినే దర్శనం చేసుకొనసాగాడు. నగరంగాని శ్మశానంగాని విశ్వేశ్వరుడినే చూచేవాడు. వనాలు, తోటలు, పండ్లు, పువ్వులు అన్నిటా

విశ్వేశ్వరుడి మెరుస్తున్న ప్రకాశమే కనిపించేది. రాజుకు ఏకాంతవము జన సముదాయము, భ్రమ యొక్క విలాసంగా కనిపించ సాగింది. ఇది వనము, ఇది నిర్జన ప్రదేశము, ఇది జనసమూహం ఉండే ప్రదేశము, ఇది నీచకర్మలు చేసేవారి పల్లె- ఇటువంటి భేద భావంతో కూడిన పరదా జ్ఞానాగ్నిలో దగ్ధమై పోయింది. ''వనంలో ఉన్నదీ గుహలో ఉన్నదీ ఏకాంతంలో ఉన్నదీ - అదే నా మహలులోనూ ఉన్నది'' అన్న ఎఱుక కలిగింది. అటువంటి దృఢమైన ఎఱుక కలిగిన తర్వాత రాజుకు, తన రాజ మహలుకు తిరిగి వెళ్లాలన్న కోరిక కలిగింది. రాజమహలుకు బయలుదేరాడు.

ఇంత పెద్ద త్యాగి ఇప్పుడు స్వగృహానికి ఎందుకు వెడుతున్నట్టు అని సిద్ధ విద్యార్థులకు ఆశ్చర్యం కలుగవచ్చు. ప్రియమైన విద్యార్థులారా **స్వీకరించడం - త్యాగం చేయడం, ఉత్తమం - అధమం, అన్నవి జ్ఞానం కలుగనంతవరకు మాత్రమే.** జ్ఞానం కలిగిన తర్వాత మీకు భిన్నమైనది ఏముంది? అన్నీ అంతా మీ సౌందర్యమే. మరొకసంగతి: జ్ఞానికాని అజ్ఞానికాని పూర్వకర్మల ఫలితాన్ని అనుభవించక తప్పదు. ఒకటే భేదం: అజ్ఞాని, భేదదృష్టి కలిగి ఉండడం చేత రోదిస్తూ అరుస్తూ ఇతరులను నిందిస్తూ అనుభవిస్తాడు. జ్ఞాని, జ్ఞానదృష్టిని కలిగి ఉండడం చేత ఈ జగత్తును చిద్విలాసంగా అర్థం చేసుకుని, ఇదంతా తన ఆత్మ ప్రకాశంగా భావించి అనుభవిస్తాడు.

**అనుభవించడం జ్ఞానికి అజ్ఞానికి సమానమే. అజ్ఞానికి ఈ ''అనుభవించడం'' వ్యవహారికము, జ్ఞానికి పారమార్థిక చిద్విలాసము.** జ్ఞాని, అనేక జన్మలుగా పుణ్యకర్మలను చేస్తూ వచ్చిన ఫలితంగా ఆయన వెంట సుఖ-సంపదలు అనంతంగా ఉంటాయి. అయినప్పటికీ జ్ఞానికి పునర్జన్మలేదు. అతడు భోగాలలో చిక్కుకొనడు. భోగాలనే యోగంగా మార్చి ఆనందంగా ఉంటాడు. ''**అటువంటి యోగి ఇంద్రియారాముడు కాదు, ఆత్మారాముడు. వ్యావహారిక దృష్టిలో ఇతరులకు మామూలు వ్యక్తిగా కనిపించినప్పటికీ, యోగదృష్టిలో - బ్రహ్మభూతో మహాయోగి - వంటిది ఆయనస్థితి. ఆయన బ్రహ్మ భూతుడు. వ్యావహారిక భూత సముదాయం ఆయనకు పరబ్రహ్మమే. ఆ ఎఱుకే ఆయన ధ్యానం.**'' అందుచేత దైనందిన వ్యవహారాల వల్ల ఆయన ధ్యానానికి అంతరాయం ఉండదు.

సాధారణ మానవులకు భోగలాలస, ధ్యానం యొక్క లక్ష్యం, భిన్నమైనవిగా ఉంటాయి. భోగలాలసను నిర్మూలించేందుకు సాధారణ ధ్యానయోగి, ధ్యానం

యొక్క లక్ష్యంలోకి ప్రవేశించవలసి ఉంటుంది. కాని బ్రహ్మ భూతుడైన మహాయోగికి, స్నానం-పానం-భోజనం-రాకపోకలు-వస్త్ర-భూషణాల ధారణ-ఇవన్నీ పర బ్రహ్మమయం కావడం చేత ఆయనకు ఇవన్నీ ధ్యానమే అవుతుంది. దీన్ని నేను అఖండ, అహర్నిశ ధ్యానం అంటాను. తుకారామ్ మహరాజ్ కూడా ఈ మాటే అన్నారు: **''విషయతో జ్యాంచా ఝాలా నారాయణ''**- అనగా తనకు సంబంధించిన విషయాలన్నిటినీ నారాయణుడి పరం చేసిన వ్యక్తి, అటువంటి స్థితిలో ఆ యోగి తన అదృష్టానికి తగినట్టు రాజు కావచ్చు, వైభవంగా జీవించవచ్చు, జడభరతుడివలె నిర్లిప్తుడై ఉండవచ్చు. ఋషభదేవుడివలె నగ్న దిగంబరుడుగా కూడా ఉండవచ్చు. అతడి ప్రవర్తన జడునివలె, ఉన్మత్తుని వలె, పిశాచంవలె కూడా ఉండవచ్చు. సిద్ధ యోగులకు, చిత్‌శక్తి ప్రేరణ వల్ల వారి అదృష్టానికి తగినట్టు ఈ స్థితిగతులు కలుగుతాయి. మన అంతరంగంలోకి ప్రవేశించి మనలను శివమయం చేసిన చిత్‌శక్తి, మనకు ఏమి ప్రసాదించినా-గౌరవ ప్రతిష్ఠలు లేదా అవమానం, సంపద లేదా విపత్తులు - అన్నీ ఆమె నుంచి లభించేవి కావడం చేత ప్రసాదతుల్యం. ఇవన్నీ శివశాసనం వల్ల జరిగేవి కావడం చేత వాటివల్ల ప్రేమ మాత్రమే అనుభవంలోకి వస్తుంది. ఇది, కేవలం గురుప్రసాదం ప్రాప్తించిన స్త్రీ-పురుషులకు మాత్రమే వర్తిస్తుంది, గురుప్రసాదం లభించని వారికి కాదు. అటువంటి వారికి సుఖంలో కూడా దుఃఖమే కనిపిస్తుంది. మంచిది!

అజ్ఞానం వల్ల తన రాజసింహాసనాన్ని, ప్రజలను, పత్నిని స్వజనులను, తనసాధనకు విఘ్నంగా తలచి, త్యాగం చేసిన శిఖిధ్వజుడు, గురుప్రసాదం లభించిన తర్వాత, ఈ జగత్తు చిత్‌శక్తి మయం అన్న జ్ఞానం కలిగిన తర్వాత, వీటన్నిటినీ చిత్‌శక్తి యొక్క విలాసంగా అర్థం చేసుకుని, తన సాధనకు సహాయకరంగాను సుఖమయంగాను పరిగణించసాగాడు. గతంలో వ్యాకులం చెంది దుఃఖాన్ని అనుభవించిన పరిస్థితుల్లోనే ఇప్పుడు పరమానందాన్ని అనుభవిస్తున్నాడు. అదృష్టం చేత ప్రేరణ పొందిన రాజు, స్వస్థితిలో ఉంటూ, రాజ్య వ్యవహారాలను నిర్వహిస్తూ రోజులు గడుపుతున్నాడు. ఆయనకిప్పుడు, సూర్యుడి ఎండలో, పర్వత శిఖరాల్లో, నదీప్రవాహాల్లో, సముద్ర తరంగాల్లో, వర్షపాతంలో, మేఘాల్లోని విద్యుచ్ఛక్తిలో, ఆకుపచ్చ, పసుపు , నీలం రంగుల పొలాల్లో, ఆకాశంలో - అంతటా జగదీశుడే కనిపిస్తున్నాడు. ఆకలిదప్పుల్లో,

ఆశా - నిరాశల్లో, దూరం - దగ్గరల్లో, న్యాయ - అన్యాయాల్లో, సంతుష్టిలో - లోభంలో, క్రోధంలో - క్షోభంలో చిత్‌శక్తి స్ఫురణే అనుభవంలోకి వస్తున్నది. రాజుకు బాహ్య వ్యవహారాల్లో భిన్నత్వం కనిపించినప్పటికీ అంతః కరణంలో మాత్రం అభేదమే అనుభవంలోకి వస్తున్నది. ఆయనకు సత్యం పూర్తిగా సాక్షాత్కారమైంది. ఆయన తన వాహనాల్లో భూషణాల్లో అన్న - పానాదులలో సుర - నర - ముని - ఋషి పుంగవుల్లో కొయ్యలో పాషాణంలో అన్నిటా తన అంతరాత్మ వెలుగునే చూస్తున్నాడు. ఈ చరాచర విశ్వంలోని అన్ని నామాలు - రూపాలు - గుణాలు - తత్వాలలో పరమేశ్వరుడినే చూస్తున్నాడు.

నిజానికి భేదభావమే, మానవుడి భయానికి, అశాంతికి మూలకారణం. భేదవాది గురించి బృహదారణ్యకోపనిషత్ (4/4/19)లో ఈ విధంగా ఉంది:

**మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ।**

అనగా భేద భావం కల వ్యక్తికి మృత్యువునుంచి మృత్యువే ప్రాప్తిస్తుంది. అటు వంటి వ్యక్తికి ఇతరమేదీ ప్రాప్తించదు. తైత్తిరీ యోపనిషత్ (2/7)లో ఈ విధంగా ఉంది: "**ఉదరమంతరం కురుతేఽథ తస్య భయం భవతి**" భేదభావం నలుసంత ఉన్నప్పటికీ భయమే సంప్రాప్తమౌతుంది. నిర్భయంగా ఉండేందుకు ఒకే ఒక సాధనం: సత్యం - సమదృష్టి - సర్వాత్మ భావం - గురుబోధ నిష్ఠ.

నీటిలో ఉంటూకూడా చేపకు దాహమే. అదేవిధంగా గురుకృప లభించని జీవుడికి ఈ ఆనందమయ ప్రపంచం, ఎండిపోయినట్టు రసహీనంగా, కనిపిస్తుంది. అటువంటి మూఢులు, త్రాడును సర్పంగా భావించి భయపడి, చెమటపట్టి, కంపించిపోతారు. అదే విధంగా జగద్రూపంలో క్రీడిస్తున్న చిత్‌శక్తి పుంజ రూపమైన చిన్మయజగత్తు లో జడము - శుష్కము - మాయ వంటి ఆరోపణలు చేస్తూ మితిలేని దుఃఖాన్ని అనుభవిస్తారు. దీనికి ముఖ్యకారణం: గురు బోధలేకపోవడం, గురుకృప లభించక పోవడం. అంతశ్శక్తి వికసించకపోవడం చేతనే మానవుడికి ఈ దుస్థితి. దీనినే వసుగుప్తాచార్యుడు "**శక్తి దరిద్రః సంసారీ**" అన్నాడు. ప్రపంచంలోని మానవు లందరు, స్త్రీ - పురుషులు, బాలబాలికలు, ప్రపంచంలో నివసిస్తూనే ధ్యానయోగం

ద్వారా గురుప్రసాదాన్ని పొంది, అంతశ్శక్తిని వికసింపచేసుకున్నట్టయితే హృదయంలో చిత్‌శక్తి పుంజం దర్శనమిస్తుంది. **''స్వశక్తి వికాసే తు శివ ఏవ''** అనగా స్వశక్తి వికాసం చేత జీవుడు పరమశివుడైపోతాడు. జీవుడు, శివుడికి చెందినవాడే. శివుడిలోనే ఉన్నవాడు. శివుడే. ముక్తానంద అంటున్నాడు: 'గురుప్రసాదం లభించిన తర్వాత స్వయంగా శివుడు కావడానికి ఆలస్యమెందుకుంటుంది?'

ప్రపంచంలోని స్త్రీ-పురుషులందరు, పరమాత్మయొక్క అభిన్నమూర్తులు కావడం చేత, అందరూ ధ్యానం చేయవచ్చు. ధ్యానం, యోగుల పరమార్థ యాత్రను పూర్తిచేసే విధంగానే, సంసారుల సాంసారిక యాత్రను కూడా పూర్తి చేస్తుంది. ధ్యానం వల్ల జ్ఞాపకశక్తి ఎక్కువవుతుంది. చాలామంది బాలబాలికలు, చదువులో చురుకులేకుండా ఉన్నవారు ఇప్పుడు ''శ్రీ గురుదేవ ఆశ్రమాని''కి వచ్చిన తర్వాత, ధ్యానం చేయడంతో, ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులవుతున్నారు. ధ్యానంలో మనస్సు స్థిరం కావడంవల్ల, ప్రాణం పరిశుభ్రమౌతుంది. ప్రాణం శుభ్రపడుతూనే శరీరం యొక్క జడత్వం నశిస్తుంది. స్ఫూర్తి - ఉత్సాహం, ఎక్కువవుతాయి. స్ఫూర్తి, ఉత్సాహము, ప్రపంచవ్యవహారాలకు చాలా సహాయ కరం. ధ్యానంలో నాడీ మండలం శుభ్రపడడం చేత చాలా రోగాలు నశిస్తాయి. ఆశ్రమానికి వచ్చే చాలామంది సాధకులు రోగాలనుంచి విముక్తిపొంది ఆరోగ్యంగా ఉంటున్నారు. ధ్యానంలో అంతస్సాక్షాత్కారం కావడం వల్ల భార్యాభర్తల మధ్య సగౌరవమైన దైవబుద్ధి అంకురిస్తుంది. తోబుట్టువుల మధ్య పరస్పరం ఈశ్వరభావం ఏర్పడుతుంది. తండ్రి-పిల్లలు, తల్లి-పిల్లలు, అత్తమామలు-వీరందరిలో పరస్పరం భగవద్భావం ఏర్పడుతుంది. దీనినే స్వర్గమయ సంసారం అంటారు. ఇది ధ్యాన యోగం వల్ల ప్రాప్తిస్తుంది.

లౌకిక వ్యవహారాల్లో మునిగి తేలుతున్న వారా! మీ పరిస్థితి ఎటువంటి దైనప్ప భోజనాది కార్యకలాపాలను నియమబద్ధంగా నిర్వహిస్తున్నారు. అదే విధంగా ఈ సంసారజీవితం నుంచి కొంతసమయాన్ని ధ్యానానికి కేటాయించు కొనండి. సమయం దొరికినపుడు ప్రశాంతంగా కూర్చుని మనస్సును స్థిరం చేసి శ్రీ గురుదేవుడి ప్రార్థనచే ధ్యానం చేస్తూ ఉండండి. అన్ని పనుల్లోనూ గురువు చెప్పిన మంత్రాన్ని జపి ఉండండి. సమయం చిక్కనపుడు నిద్రపోతూ ధ్యానం చేయండి. సుఖ సంతోషా

తప్పకుండా లభిస్తాయి. కొంత వ్యవధి లభించినా దాన్ని ధ్యానంలో సదుపయోగం చేయండి. జనకమహారాజు ఈ ప్రపంచంలో ఉంటూనే, జ్ఞాని అయిన తర్వాత పొందిన బోధనను తన రాణికి వినిపించాడు. దాన్ని సదా గుర్తుంచుకొనండి.

**భేద భావనా తజ్ దే సుమతే, సర్వమేఁ ఆత్మబుద్ధి కర్ లే**
**పుత్ర వాసనా, లోకవాసనా దేహవాసనా తజ్ దే॥**

భేద భావాన్ని త్యజించు సుమతి, అన్నిటిలోనూ ఆత్మనే చూడు, పుత్రులు-లోకం - దేహం పట్ల మమకారాన్ని తెంచుకో.

''జ్ఞానార్ణవ'' గ్రంథం నుంచి ఒక మంత్రం రాస్తున్నాను. దీనిని సిద్ధవిద్యార్థులు ధ్యానం కుదరక పోయినప్పటికీ గుర్తుంచుకొనడం మంచిది :

**అహం న నారకో నామ న తిర్యగ్ నాపి మానుషః।**
**న దేవః కింతు సిద్ధాత్మా సర్వోఽయం కర్మవిక్రమః॥**

మనం, మనలను విమర్శనాత్మక దృష్టితో పరిశీలించినట్టయితే తెలుస్తుంది: మనం నరకలోక వాసులం కాదు, పశువులం కాదు. మానవులం కాదు, దేవతలం కాదు, మనం సిద్ధ స్వరూపులం, సిద్ధాత్మలం-అని. ఈ భావాన్ని పదే పదే జపిస్తూ దాన్ని మనస్సులో దృఢం చేసుకొనండి.

జనక మహారాజు కూడా త్యాగం చేయాలన్న తలంపుతో ప్రపంచం మీద విరక్తి చెందాడు. కొంతకాలంపాటు అన్నపానాదులు, రాజ్యవ్యవహారాలు అన్నీ త్యజించాడు. త్యజించిన అనంతరం సమదృష్టి ఏర్పడవలెగదా! ఏర్పడనట్టయితే అది బూటకపు త్యాగమే అవుతుంది. జనకమహారాజుకు, త్యాగం చేసిన వెంటనే సమదృష్టి ఏర్పడింది. దానితో ఆయన యావత్ ప్రపంచాన్ని ఆత్మ భావంతో చూడడం ప్రారంభించాడు.

సర్వాత్మ భావాన్ని పొంది, రాజు సంతోషపడ్డాడు. తిరిగివచ్చి తన రాజ్యవ్యవహారాలను నిర్వహించడం ప్రారంభించాడు. బాహిరంలో వ్యవహారాలను నిర్వహిస్తూ, అంతరంగంలో బ్రహ్మానుభూతిని పొందేవాడు. రాజు, ప్రశాంతంగా సమదృష్టితో

ప్రేమనిండిన హృదయంతో వ్యవహరించడం గమనించిన రాణికి జిజ్ఞాస కలిగింది. ప్రశాంతంగా ఉండే ఉపాయం చెప్పవలసిందని రాణి, రాజును కోరింది. రాజు ఈ విధంగా సమాధానం చెప్పాడు. ''ఓ రాణీ, ప్రపంచమంతా ఆత్మ స్వరూపమే–అన్న జ్ఞానం కలిగినపుడు చరాచర జగత్తు అంతటా ఆత్మ ప్రకాశమే కనిపిస్తుంది. ఓ దేవి, తదనంతరం, జీవుడు – మాయ – జగత్తు – మనస్సు – ఆలోచన – వంటి ద్వంద్వాలు ఉండవు. అటుపిమ్మట బాహిరంలో – అంతరంగంలో, మనలో – ఇతరుల్లో చిత్‌శక్తి ఒక్కటే కనిపిస్తుంది. ఓ దేవి ఆత్మరూపమైన జగత్తులో ఉన్న భేద భావమే జీవస్థితి. ఇదే దుఃఖానికి మూలం. ఇటువంటి స్థితిలో శాంతి ఎన్నటికీ లభించదు. మానవుడు ఈ జగత్తును విడిచిపెట్టేందుకు జపతపాదులవంటి ఉపాయాలు చేసేకొద్దీ, వాటిలో మరింత చిక్కుకుంటాడు. ఓ రాణీ, నేను ఆత్మను, జీవుడను కాను; ఇదంతా నా శక్తి స్ఫురణయే; బయట – లోపల, పైన – కింద, నేను తప్ప అన్యం లేదు; ఈ చరా చర విశ్వం, జడంగా లేదా చేతనంగా భాసిస్తున్నదంతా నాకు అన్యం కాదు – అన్న జ్ఞానమే శాంతిని ప్రసాదిస్తుంది. అదే అపారమైన సుఖసముద్రం.''

నిజానికి ఆత్మకు భిన్నంగా వేరొకటి ఉన్నపుడే అది చిత్తంలో స్ఫురిస్తుంది. ఆ స్ఫురణే ఈ సంసారం లేదా బంధనం. స్థావర జంగమాత్మక ప్రపంచంలో, మన ఆత్మ స్థితియొక్క స్ఫురణ కలిగినపుడు మనస్సుయొక్క భేదభావం నశించి చిత్‌శక్తిగా మారుతుంది. మనస్సు చిత్‌శక్తిగా మారిన సిద్ధవిద్యార్థి, చిత్‌శక్తి సామ్రాజ్యానికి రాజవుతాడు. అతడికి సర్వత్ర ఆత్మే కనిపిస్తుంది. తర్వాత శరీరం – మాయ – ద్వైతం – భేదం – అన్నీ అద్వైతంగా మార్పుచెందుతాయి. పండితుల లక్ష్యము, సత్తు – చిత్తు- ఆనందం అన్నపేరు కలిగినదీ – అదే, నిరామయ నామ రూపాలతో భాసిస్తుంది. మన చూపును బట్టి ఉంటుంది సృష్టి. ఆత్మ ప్రకాశం కనుల్లో ప్రకాశించినపుడు యావత్తు ప్రపంచం ఆత్మరూపంగా స్ఫురిస్తుంది. సూర్యుడు ఉదయించినపుడు, అంతవరకు ఉన్న అంధకారం వెలుగుగా మారినట్టు, ఆత్మజ్ఞానం కలిగినపుడు జగత్తుకూడా ఆత్మరూపంగా కనిపిస్తుంది. భేదభావం సర్వ అనర్థాలకు మూలం. అందరినీ ద్వంద్వంలోపడవేసి ఒక ఆట ఆడిస్తుంది. అందరికీ దుఃఖాన్ని కలిగించేది ఈ భేదమే. ఈ భేదం సత్యం కాకపోయినప్పటికీ ప్రత్యక్షంగా ఉన్నట్టుతోస్తుంది.

శ్రీగురు కృప కలిగినపుడు భేదరూపమైన ద్వంద్వం యొక్క తెర తొలగి ముము క్షువు తనలో తానే పరమాత్మ పదమును పొందుతాడు. ఇదే జీవన్ముక్త దశ. జీవన్ముక్తే

సహజావస్థ ప్రాప్తి, మానవుడు పొందవలసిన పొందతగిన స్థితి ఇదే. ఇది చిత్‌శక్తి ప్రసాదం వల్ల మాత్రమే సాధ్యం. దీనికి శ్రీగురు బోధ అత్యంత అవసరం. శ్రీగురు బోధ పొందేందుకు గురుభక్తి, గురూపదిష్ట ధ్యానం, గురుమార్గావలంబనం, సిద్ధ పరంపరను స్మరించడం, ఇవన్నీ అత్యంత అవసరం.

ప్రియమైన సిద్ధవిద్యార్థులారా, **పొందవలసినది సమదృష్టి. త్యాగం చేయవలసినది విషమదృష్టిని.** సమదృష్టి కలిగిన వెంటనే మానవుడి హృదయం నుంచి విషమదృష్టి తొలగిపోతుంది. సమదృష్టినే పరబ్రహ్మ అంటారు. అదే అందరి యొక్క సత్యస్వరూపం. సాధుసన్యాసులు, శ్రీ గురుదేవుడు కూడా ఇదే చెప్పారు. శుభం.

ఐదు

# ప్రేమ సాధన

ప్రేమ–సాధన ఉత్తమమైన సాధన. ప్రేమను భక్తి అని కూడా అంటారు. ప్రేమ, స్ఫూర్తితో కూడిన, గతి శీలమైన ఒక గొప్ప అంతఃస్ఫురణ. ప్రేమ పరమాత్మ స్వరూపం. పండితులు దీన్ని పరమానందమని, సచ్చిదానందమని పేర్కొన్నారు. అది మానవుడిలో పరిపూర్ణంగా ఉంటుంది. ఒకవేళ మానవుడికి ప్రేమ అనుభవంలోకి రాకపోయినప్పటికీ అది అతడిలో పరిపూర్ణంగా ఉంటుంది. చూపులేని అంధుడు, ఎప్పుడూ వెలుగు చూడని అంధుడు, వెలుగును చూచిన వ్యక్తి యొక్క అనుభవాన్ని విని, ''వెలుగు లేదు, నేనెప్పుడూ దాన్ని చూడలేదు. వెలుగు ఎటువంటిదో కూడా నాకు తెలియదు'' అంటాడు. అతడికి చూపులేని మాట నిజం. వెలుగుమాత్రం ఉంది. అదే విధంగా ప్రేమ అనుభవంలోకి రాకపోవచ్చు. కాని ప్రేమమాత్రం పరిపూర్ణంగా ఉంది. ప్రేమను పొందేందుకు ఎవరూ ప్రయత్నమే చేయలేదు, సాధన చేయలేదు, ప్రేమ ఏవిధంగా ప్రాప్తిస్తుంది?

**ప్రేమ అమృతరూపం, అమరం.** గోకులంలోని గోపికలు, పరమాత్మను ప్రేమతోనే పొందారు. **ప్రేమ, అంతరంగంలో రహస్యంగా ఉన్న గుహకు ప్రతీక.** అంతరంగంలో ఉన్న ప్రేమే, వివిధ ఇంద్రియాల ద్వారా బాహిరంలోకి ప్రవహిస్తుంది. అంతరంగంలోని ప్రేమ ప్రవాహమే, కనుల్లోకి వచ్చి, రూపాన్ని అందంగా తీర్చిదిద్దుతుంది, చెవుల్లోకి ప్రవహించి శబ్దాలను మృదుమధురం చేస్తుంది. నాలుకలోనికి ప్రవహించి రుచులను ఆస్వాదింపచేస్తుంది. ప్రేమ పరిపూర్ణ ఆనందరూపమైన ఆత్మ. బాహిరంలో స్ఫురించినపుడు ఇంద్రియ విషయాలను రసమయం చేస్తుంది. ఒకవేళ అన్ని ఇంద్రియాల నుంచి ఆత్మయొక్క బహిఃస్ఫురణ ఆగిపోయినట్టయితే, అంకెలేని సున్నాలు విలువలేనివి అర్థ రహితమైనవి అయినట్లు, ఇంద్రియాలు కేవలం శుష్కములు రసహీనములు ఆనంద రహితములు అవుతాయి.

వ్యావహారిక జగత్తులో ప్రేమించడం నేర్చుకో, కాని ఈ ప్రేమ పరిశుద్ధమైనది గాను, వ్యామోహరహితమైనదిగాను, నిష్కామమైనదిగాను ఉండడం అవసరం. ప్రేమకోసమే ప్రేమగా ఉండడం అవసరం. ప్రేమలో ఏదైనా కోరిక ఉన్నట్టయితే, ఇచ్చిపుచ్చుకునే వ్యాపారమౌతుంది. అపుడు అది ప్రేమగురించి ఊహించుకున్న అభిప్రాయం మాత్రమే అవుతుంది. అది సత్యమైన ప్రేమకాదు. ప్రేమలో కోరిక ఉండదు. తన, మన ఉండదు. ప్రేమలో స్వార్థం ఉండదు. ప్రేమ కేవలం ప్రేమ మాత్రమే. శ్రీగురునిత్యానంద అటువంటి ప్రేమమూర్తి. సద్గురువును ప్రేమించు. చాలు. మోక్షం కావాలని కూడా కోరవద్దు. హృదయంలో అనంతమైన ప్రేమ ఉంది. అది ఒక మానవుడికే కాదు, అసంఖ్యాక మానవులకు చాలు. వాసనలు – వ్యర్థమైన ఆలోచనలు – అనవసరమైన చింతలు మొదలైన వాటి కారణంగా అది మన అనుభవంలోకి రావడం లేదు. అదిపూర్తిగా నిష్కామమైనపుడు అమృతమయమైన ప్రేమను పరిపూర్ణంగా పొందగలం.

మొదట నిన్ను నువ్వు సంపూర్ణంగా ప్రేమించు. నిన్ను నువ్వు మలినం – శుష్కం – అసత్యం – అనిత్యం – దుఃఖమయం – ఈ విధంగా దండకం చదువుకుంటూ మనస్సును పాడు చేసుకోవద్దు. కొన్ని కావ్యాలు, కొన్ని సమాజాలు, కొన్ని మతాలు, శరీరాన్ని అనర్థదాయకమని దీనమని హీనమని పేర్కొంటూ దేనికీ పనికిరానిదిగా చేస్తున్నారు. అరె! ఎంత అన్యాయం! తుకారామ్ అంటున్నాడు. **''బ్రహ్మ భూత హోతే కాయా చ కీర్తనీం.''** భగవద్భజన – ధ్యానయోగం – భక్తితోకూడిన పూజ మరియు గురుప్రేమతో బ్రహ్మీభూతం చేయవలసిన కాయాన్ని నువ్వు ఎందుకు అంతహీనంగా చూస్తున్నావు? నేను చాలామంది సాధకులను శరీరాన్ని శుష్కింప చేసుకునే వారిని చూచాను. అటువంటివారికి చివరకు ప్రాప్తించేది రోగం మాత్రమే. ప్రియమైన సిద్ధవిద్యార్థులారా, మీ యొక్క చేతన శరీరం, చిత్‌శక్తి భగవతి యొక్క మందిరం. దాన్ని పరిశుభ్రంగా ఉంచుకొనండి. న్యాయోచితమైన బ్రహ్మచర్యాన్ని పాటించండి. ఉత్తమమైన సాత్వికమైన భోజనం తిని, అందమైన శుభ్రమైన నిరాడంబరమైన వస్త్రాలను ధరించి గౌరవంగా చూచుకొనండి.

ఓ సిద్ధవిద్యార్థులారా, ఈ శరీరం తుచ్ఛమైనదని ఎవరైనా అన్నట్టయితే, అననీయండి. కాని మీరు మాత్రం మరిచిపోవద్దు. మీకు మోక్షం ప్రాప్తించేది దీనివల్లనే. పరమాత్మను పొందాలన్న కోరిక ఉన్నట్టయితే, మీ ప్రియమైన గురుదేవుడిని పొందాలన్న

కోరిక ఉన్నట్టయితే, మీ అంతరంగంలోని ప్రేమను వికసింపచేసుకోవాలన్న కోరిక ఉన్నట్టయితే, మొదట మిమ్ములను మీరు ప్రేమించండి. ప్రేమతోనే మీరు పరమాత్మను చేరుకొనగలరు. ఆత్మశాంతి కావాలని కోరుకుంటున్నారు కాని, శరీరాన్ని, శరీరానికి సంబంధించిన పనులను అసహ్యించుకుంటున్నారు. ఆత్మ పరవశం కావాలని కోరుకుంటున్నారు. మీరు దాన్ని ఈ శరీరంతో మాత్రమే సాధించగలరు. కాని, ఈ శరీరాన్నే మీరు ద్వేషిస్తున్నారు, ఒక శత్రువును ద్వేషించినట్టు. మొదట మీ శరీరం గురించి తెలుసుకొనండి. మీ అంతరంగం గురించి పూర్తిగా తెలుసుకున్నట్టయితే, శరీరం మిథ్యకాదని, విజ్ఞానశాస్త్రమయమైన ఒక గొప్ప సుందర మందిరమని, దీన్ని ప్రేమించడంవల్ల మీ ప్రేమ స్రోతస్సు పొంగి పొరలుతుందని తెలుసుకుంటారు. మీ అంతరంగంలో ధ్యానంలో అనుభవంలోకి వచ్చే నిత్యనూతనమైన పారవశ్యం, స్వతంత్రమైన స్ఫురణరూపంలో మీ హృదయంలో ఉంటున్నదని తెలుసు కుంటారు. తదనంతరం ప్రేమను ఎక్కువ చేసుకొనండి. దాన్ని వికసింపచేసి, శరీరంనుంచి బయటికి ప్రవహించేట్టు చేయండి.

మీ ప్రేమను, భోగలాలసకు లేదా స్వార్థానికి ఉపయోగించరాదు. ఆ విధంగా చేసినట్టయితే అది ఈశ్వరీయ ప్రేమ కాదు. అది మోహం అవుతుంది. మోహం మలినం. అది మానవుడిని భగవంతుడి దగ్గరకు చేర్చజాలదు. ప్రేమ ఇవ్వడం వల్ల పెరుగుతుంది. తీసుకొనడం వల్లకాదు. ప్రేమలో మనది - ఇతరులది అన్నభావం, పెద్ద ప్రతిబంధకం. ప్రేమ సమానంగా విలక్షణమైనదిగా ఉండడం అవసరం. ప్రియమైన సిద్ధ విద్యార్థులారా, ప్రేమను పొందేందుకుగాను, ప్రేమ యొక్క నివాసస్థానమైన ఈ శరీరంగురించి విచక్షణా పూర్వకమైన జ్ఞానం అవసరం. శరీర తత్వం గురించి, అది చేసే పనులగురించి ఎఱుక అవసరం. మీకు, మీ శరీరం పట్ల పవిత్రమైన - స్నేహపూర్వకమైన - గౌరవంతో కూడిన భావం అవసరం. జన్మ జన్మాంతరాలుగా చాలాకాలంగా అనేక విధాల, మీతోపాటు సుఖదుఃఖాలను అనుభవిస్తూ వస్తున్న మీ మిత్రుడు. **''ఈ శరీరం సాధనకు ఆశ్రయం. మోక్ష నగరానికి చేరు కునేందుకు సోపానం. అంతరాత్మకు చక్కటి మందిరం.''** శరీర రూపంలో ఉన్న ఈ మందిరంలో ప్రేమకు నాథుడైన పరమేశ్వరుడు అంతరాంతరాల్లో అంతరాత్మగా నివసిస్తుంటాడు. అందుచేతనే ముక్తానంద అంటున్నాడు: ఈ శరీర మందిరం గురించి, అంతరాత్మగురించి జ్ఞానం కలిగిన

తెలివైన విద్యార్థి, శరీరం గురించి చెడుదృష్టి కలిగి ఉండడు. శరీరంపట్ల చెడువైఖరిని అవలంబించడు. శత్రుత్వంతో వ్యవహరించడు. శరీరాన్ని నీచమైన కర్మలకు ఉపయోగించడు, శరీరాన్ని భ్రష్ట కార్యాలకు కుకర్మలకు అనాచారాలకు ముమ్మాటికీ పాల్పడనీయడు.

కొన్ని విదేశాలలోని ప్రజలు, ఈ శరీరాన్ని విలాసాలను అనుభవించే సాధనంగా ఉపయోగించుకుంటారు, క్లబ్బులు - హోటళ్లు - సినిమాల వంటి వాటిని విలాస వస్తువులుగా ఉపయోగించుకున్నట్టు. దానివల్ల శరీరం అపవిత్రవౌతుంది. శక్తిక్షీణిస్తుంది. ఇటువంటివారు, శరీరాన్ని గౌరవంగా, చూచుకొనవలసిన రీతిలో, చూచుకొనడం లేదు. శరీరాన్ని అవమానిస్తున్నారు అని నా అభిప్రాయం.

ప్రపంచంలో చాలామంది బుద్ధిలేని వారున్నారు. తమ పవిత్రమైన, మిత్రు డితో సమానమైన శరీరాన్ని హింసిస్తున్నవారూ శరీరాన్ని అన్ని విధాల కష్టపెడుతూ నీతి నియమాలు లేకుండా వ్యవహరిస్తూ క్షోభపెడుతున్నవారూ, చాలామంది ఉన్నారు. ప్రేమతో నింపవలసిన తమ హృదయాలను రోదనతో నింపుకుంటున్నారు. శరీరాన్ని రాత్రిం బగళ్లు హింసిస్తున్నారు. భగవంతుడిని ఈ విధంగా ప్రార్థిస్తూ ఉంటారు. ''ఓ భగవంతుడా నాకు ఈ శరీరం నుంచి ముక్తిని ప్రసాదించు'' అని. ఇదే ఆలోచన వారికి రాత్రింబగళ్లు! నిజానికి ఈ శరీరం దోషయుక్తమైనదికాదు.

శరీరం పంచమహాభూతాలతో నిర్మితమైనది. అది నీ ఆత్మకు నివాసస్థానం. సుఖదుఃఖాలను అనుభవించే క్షేత్రం, ఆత్మకు సేవచేసేది. శరీరం ఎప్పుడూ నీ ఆజ్ఞను పాలిస్తుంది. ఎక్కడికి తీసుకువెళ్లినా వచ్చేందుకు సిద్ధంగా ఉంటుంది. దాన్ని నువ్వు నరకం చేసుకున్నట్టయితే నరకంగా మారుతుంది. దాన్ని నువ్వు స్వర్గానికి తీసుకువెళ్లేట్టయితే సంతోషంగా వస్తుంది. గుఱ్ఱాలు - ఏనుగుల మీద కూర్చొనబెట్టు కూర్చుంటుంది. వడ, పాయసం పెట్టు సంతోషంగా తింటుంది. పచ్చడి అన్నం పెట్టు దాన్ని కూడా తృప్తిగా తింటుంది. ఏది ఇచ్చినా తృప్తే. నవరత్నాలు పొదిగిన ఆభరణాలతో అలంకరించు, ఆనందిస్తుంది. పాతవి చినిగిపోయిన వస్త్రాలు ఇచ్చినా సంతోషమే. ఒక లంగోటి ఇచ్చినా సంతోషమే. శరీరం వంటి సేవకుడు, దాసుడు, మిత్రుడు ప్రపంచంలో ఇంకెవరూ లేరు.

ఒక గురువు దగ్గర ఒక సేవకుడున్నాడు. గురుభక్తి కలిగిన ఆ సేవకుడిని ఒక మహాశయుడు ఈ విధంగా ప్రశ్నించాడు: ''ఏం తమ్ముడూ బాగున్నావా? నీ క్షేమ

సమాచారం చెప్పు. మఠంలో సౌకర్యంగా ఉందా? ఎండకు చలికి తట్టుకుంటు న్నావా?'' అని. సేవకుడన్నాడు. ''అయ్యా నాకు వేసవికాలపు వేడి తెలీదు. చలికాలపు చలి తెలీదు. నేను కేవలం ఒక సేవకుడిని. సేవ చేయడమే తెలుసునునాకు. నా చలి, వేడి, సుఖం, దుఃఖం అన్నిటి గురించి నా గురువుకే తెలుసును,'' అని. ఎంత గొప్పమాట! అతడు గురుసేవలో పూర్తిగా నిమగ్నమై తనను తాను మరిచిపోయాడు. తనకుగాను కొంత కూడా మిగుల్చుకొనలేదు. ప్రేమకూడా ఆవిధంగా ఉండడం అవసరం. నీ ప్రేమ సర్వత్ర దోషరహితము, భేదరహితము, క్లేశరహితము, అభిలాషారహితముగా ఉండడం అవసరం. ఆ విధంగా చేసినపుడు, ప్రేమ, నిన్ను పరమాత్మ దగ్గరకు చేరుస్తుంది. నిన్ను పరమాత్ముడినే చేసి వేస్తుంది.

నీ శరీరం పంచమహాభూతాలతో నిర్మితమైనదికదా. ఈ పంచమహాభూతాలు ఎటువంటివి అన్న విషయమై కొంత ఆలోచించు. ఈ భూమి ఎంత అందమైనది! ఎన్నోరకాల ధాన్యాలకు ఆశ్రయం. అనేక రకాల జీవాత్మలకు జనని. ఎంత నిర్మలమైన నీరు! ఆహార ధాన్యాలు - పండ్లు - పువ్వులు - వృక్షాలు - లతలు - ఎన్నిటికి ఇది జీవనాధారం! అందరి మురికిని కడిగి శుభ్రం చేస్తుంది, ఎంతప్రేమ దీనికి! అందరి పట్ల స్నేహమే దీనికి! అగ్నినే చూడు. ఇతర మహాభూతాల వలెనే అదికూడా అందరితోనూ స్నేహంగా ఉంటుంది. మానవుల్లో జఠరాగ్ని రూపంలో అన్నాన్ని జీర్ణం చేస్తుంది. కొయ్యలో, పాషాణంలో వాటికి తగినట్టు ఉంటుంది. నిష్కామప్రేమకు ఇది చక్కటి తార్కాణం. వాయువునే చూడు. వాయువు, మానవుడికి మూలాధారం, ప్రాణం. జడ - చేతన జగత్తులో సమానంగా సంపూర్ణంగా వ్యాపించి ఉంటుంది. మొత్తం ప్రపంచం క్రియాశీలమై ఉండేందుకు ఆధారం ఇదే. శరీరం నుంచి వాయు రూప ప్రాణం వెడలిపోయినపుడు శరీరం ఎందుకూ పనికిరానిదైపోతుంది. ప్రేతమే ఔతుంది. ఆకాశాన్ని తీసుకుందాం. ఆకాశం మనకు నిర్లిప్తమైన ఆత్మగురించి చెబుతున్నట్టు ఉంటుంది. దీని ఆవరణలో అన్ని వ్యవహారాలు సురక్షితంగా జరుగుతుంటాయి. ఇటువంటి పంచభూతాలతో ఏర్పడినది ఈ శరీరం. దీనిలో చైతన్య ఆత్మ పూర్తిగా వ్యాపించి ఉంది. ఇటువంటి అందమైన నిర్వికారమైన శరీరాన్ని మొదట పూర్తిగా పరిశీలించి తెలుసుకో. తదనంతరం దానిని భగవంతుడిగా భావించి ప్రేమించు.

శ్రద్ధగా పరికించు: ఎవరి కనులైనా ఇతరుల ధనాన్ని లేదా రూపాన్ని చూచి ఆశించినట్టయితే, కోపంతో లేదా లోభంతో లేదా ఈర్ష్యతో మండినట్టయితే, ఆ

కనులమీద కోపం కలిగి, వాటిని కొట్టడం గాని, వాటిని పెరికివేయడంగాని పిచ్చితనం కాదా? త్యాగం - వైరాగ్యం పేరిట ఏ పాపము ఎరుగని కనులను దండించడం ఏం న్యాయం? అవి నీకు నిర్వికారమైన మిత్రులు. కనులు ఎవరినీ ప్రేమించవు. ఎవరినీ ద్వేషించవు. రూపాన్ని తిలకించడంలో సహాయపడే మిత్రులుమాత్రమే. నువ్వు నీ ఇంద్రియాలను ఏ విధంగా ఉపయోగించుకున్నా అవి నీకు సహాయమే చేస్తాయి. వాటిచేత ఏపని చేయించినా చేస్తాయి. ఈ శరీరంలో నువ్వు ప్రేమయోగివి అయినా కోపిష్ఠివి అయినా దానికి సమ్మతమే. నువ్వు ఏమి కావాలని కోరుకుంటావో అదే విధంగా రూపొందుతావు. నువ్వు ఏ భావాన్ని కోరుకుంటావో, అదే విధంగా మారుతుంది నీ శరీరం. అందుచేత నువ్వు నీ శరీరాన్ని క్షుణ్ణంగా పరిశీలించు. ఆ తర్వాత కనుల్లో ఉన్న సూర్యచంద్రులను, సర్వేంద్రియాల దేవతలను, చేతులు - కాళ్లు మొదలైన అవయవాలను నిష్కామంగా ప్రేమించు. తర్వాత సర్వేంద్రియాల గుణాలలో నివసించే గుణాతీత పరమేశ్వరుడిని తెలుసుకుని పూజించు. ఈ పూజ జడంగా ఉండరాదు. కేవలం ప్రేమతో, అత్యంతప్రేమతో, కామనారహితమైన ప్రేమతో నిండి ఉండడం అవసరం. సంయమము అత్యంత అవసరం. ఇంద్రియ నిగ్రహం అత్యంత అవసరం. కాని త్యాగం పేరిట సంయమం పేరిట శరీరాన్ని హింసపెట్టరాదు. దాన్ని రోగగ్రస్తం చేయరాదు.

మానవుడి ఇంద్రియాల్లో నరాల్లో తలలో అనేక రకాల శక్తులున్నాయి. వాటిని పరిచయం చేసుకొనడం ప్రారంభించు. ఈ శక్తులు నీకెప్పుడూ వ్యతిరేకంగా పని చేయవు. అవి నీకు శుభాన్ని కలిగించవు, అశుభాన్ని కూడా కలిగించవు. మంచివి కావు, చెడువికూడా కావు. అవి పూర్తిగా తటస్థం. మన మానసిక పరిస్థితి, అంతర్వృత్తి, వాటిచేత ఎంటువంటి పనులను చేయిస్తాయో, వాటిని చేస్తాయి. మానవుడిలోని అంతశ్శక్తి, పరమాత్మయొక్క శక్తే. ఈ అంతశ్శక్తే, సమయానుసారంగా, కామరూపము క్రోధరూపము మోహరూపము లోభరూపము ధరించి, తన పనికిగాను ఏదైనా ఒక ఇంద్రియాన్ని వాహకంగా తీసుకుని క్రియా శీలమౌతుంది. అందుచేతనే ముక్తానందుడు అంటున్నాడు: ''నువ్వు ధ్యానం చేయి. ప్రేమను చైతన్యవంతం చేయి.'' అని. అన్ని ఇంద్రియాల్లో ప్రేమ స్ఫురించినపుడు త్యాగం- యోగం- జ్ఞానం, సహజంగా తమంతట తామే ఉదయిస్తాయి. నీ మనస్సు, నీలో ప్రేమను చూడక, ఇతరుల్లో ఇంద్రియాల్లో అన్యవిషయాల్లో అన్వేషిస్తూ తిరుగుతుంది. ''**మానవుడు**

**తననుభగవంతుడుగా అర్థం చేసుకుని ప్రేమించినట్లయితే, బాహిరంలోకి ఎందుకు వెడతాడు? బాహిరంలో ఏవుంది కనుక? ప్రేమ, ధ్యానం లోపల ఉంది.''** భోగి, భోగాలను భోగించి భోగించి, శరీరాన్ని హింసపెట్టి, నిష్ ప్రయోజనం చేసుకుని, చివరకు శరీరం పట్ల జుగుప్స చెంది దుఃఖిస్తాడు. త్యాగి త్యాగం చేస్తూ శరీరాన్ని నియమబద్ధంకాని జీవితంతో హింసించి, శరీరంపట్ల శత్రుత్వాన్ని పెంచుకుని, నాశనం చేసుకుంటాడు, దాన్ని నిరర్థకం చేసుకుంటాడు. ఆపైన కోరుతాడు మోక్షాన్ని! **నువ్వు మోక్షానికి యాత్ర చేయవలసిన నీ శరీర రూప రథాన్ని అర్థం చేసుకో. మొదట నీ శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచుకొనడం నేర్చుకో, తర్వాత దాన్ని ప్రేమతో గౌరవంగా చూడు.**

నీ శరీరం, పరమాత్ముడి అత్యద్భుతమైన కళాఖండాల్లో ఒకటి. దానిలో రహస్యమయమైన విజ్ఞానం ఉంది. శరీరంలో జ్ఞానఖని ఉంది. భగవంతుడి కొలువు కూటానికి, వైకుంఠయాత్రకు కైలాస దర్శనానికి లేదా నిర్వికల్ప నగరుకు విహారయాత్రకు ఈ శరీరమే తీసుకువెడుతుంది. శరీరాన్ని త్యాగం చేసి నువ్వు సాధించేది ఏముంది? ధ్యానం ద్వారా జ్ఞానం ద్వారా నీ గురించి ఈ శరీరంలోనే తెలుసుకుంటావు. అటువంటి అమూల్యమైన దివ్యమైన శరీరాన్ని పొందిన నువ్వు శరీరాతీతుడవు కావలసినది విస్మరించి, అహర్నిశము శరీరంతో పోరాడడం, నిజం చెప్పు ముక్తానంద! పిచ్చితనం కాదా? దానిని ప్రేమించడానికి బదులు ద్వేషించడం, ఏవిధంగా త్యాగమౌతుంది? పరమాత్మ యొక్క అనుకంపం వల్ల ఈ శరీరాన్ని పొంది, సహస్రారంలో విస్తరించిన అనంత ప్రేమ కిరణాలనుంచి ప్రేమ రసాస్వాదన చేస్తూ పరవశం చెంది, లోపల - వెలుపల ప్రేమస్వరూపం కావడానికి బదులు, విషపూరితమైన, మురికితోనిండిన, కలుషితమైన అపేయములైన ఇంద్రియరసాలను పానం చేస్తూ తన శరీరాన్నే ఆహుతి చేస్తున్న మానవుడు, పిచ్చిమహరాజు కాక ఏమౌతాడు? ప్రియమైన సిద్ధవిద్యార్థులారా, శరీరరసాలను శుష్కింపచేయవద్దు. ప్రేమతో వాటిని వృద్ధి చేసుకొనండి. అదే మిమ్ములను పరమాత్మలో లీనం చేస్తుంది.

నేను ఒక మహాత్ముడి గురించిన పుస్తకంలో జ్ఞాననిష్ఠుడు, ధ్యానరతుడు అయిన ఆ మహాపురుషుడి నిర్యాణ సమయానికి సంబంధించిన కొన్ని సంగతులను చదివాను. అవి నిజమైనవి. అనుభవంతోకూడినవి. చాలామంచి సంగతులు. మహాపురుషుడికి కాలజ్ఞానం చేత తన మరణం గురించి ముందుగా తెలిసింది. మరణం ఆసన్నమైనపుడు

ఆయన అందరిని కలుసుకున్నాడు. అందరి ఆశీర్వచనాలను పొందాడు. అందరినీ క్షమాపణ కోరాడు. అక్కడ ఉన్న అందరికీ ధన్యవాదాలు తెలిపాడు. ఆ తర్వాత అన్ని దిశలకు పంచమహాభూతాలకు విద్యాదాత అయిన గురువుకు నమస్కరించి, పరమయాత్ర పూర్తి చేయించిన తన శరీరానికి, పరమాత్మను తనలో చూపించిన శరీరానికి, పరమాత్మయొక్క నడుస్తూ-తిరుగుతూ-మాట్లాడుతున్న మందిరమైన శరీరానికి, పరమాత్మ నుంచి ప్రాప్తించిన శరీరానికి, ధన్యవాదాలను అర్పించాడు, సన్మానించాడు. సత్పురుషుడైన ఆ మహాముని, చేతులు జోడించి తన ప్రియమైన శరీరాన్ని సంబోధించి ఈ విధంగా అన్నాడు: ''ఓ నా ప్రియమైన శరీరమా! నీ యొక్క సంపూర్ణమైన అనుగ్రహం చేతనే, నీ సహాయం వల్లనే నేను పరమాత్మను చేరుకో కలిగాను. నీకు నా ధన్యవాదాలు. నేను నిన్ను ఎంతో పీడించాను. ఎంతో బాధ పెట్టాను. ఎన్నో కష్టాలకు గురిచేశాను. అయినప్పటికీ నువ్వు ప్రతిక్షణము నాకు సహాయం చేశావు. నేను నీకు ఎంతో ఋణపడి ఉన్నాను. నీవల్ల నేను ధ్యానంలో ఉన్నత స్థాయికి చేరుకున్నాను. నా ప్రియమైన శరీరమా, నీ నుంచే నేను ఉత్తమ శ్రేణికి చెందిన తెలివి తేటలను బుద్ధిని పొందాను. నీలోనే నేను ధ్యానం ద్వారా నిర్వికల్పస్థితిని అనుభవించాను, పరమోత్కృష్టమైన పదవిని పొందాను. అందుచేత ప్రియమిత్రమా, నేను నీకు ఎప్పుడూ ఋణపడే ఉంటాను. తెలిసీ తెలియక నీ పట్ల ఎన్నో అపరాధాలను చేశాను. కాని నువ్వు మాత్రం ఎప్పుడూ ఉపకారమే చేశావు, సహాయంచేశావు. అపకారానికి బదులు సహాయకుడివై, నా సహచరుడివిగా మెలిగావు. నువ్వు లేకుండా నేను పరమాత్మను చేరుకుని ఉండలేను. ఉత్తమమైన సాధనకూడా చేసి ఉండలేను.'' ఈ విధంగా శరీరాన్ని సంబోధించి ఆ మహాపురుషుడు బ్రహ్మలో లీనమయాడు.

ప్రియమైన సిద్ధవిద్యార్థులారా! మీరు కూడా మీ శరీరం పట్ల అటువంటి ఉన్నతమైన దృష్టినే కలిగి ఉండండి. అదే విధమైన పూజ్యభావాన్ని, సన్మాన పూర్వకమైన ప్రేమను పెంచుకొనండి. ఆ మహాపురుషుడి ''ఓ నా ప్రియమైన శరీరమా'' అన్న ప్రేమ పూర్వకమైన సంబోధన చదివినపుడు నాహృదయంలో ఒక అలౌకికమైన ఆనందం కలిగింది. ఆ మాటలు, నాకు వినిపించిన విధంగా మీకు గూడ వినిపించి ఉన్నట్టయితే మీరు కూడా అదే విధంగా పరమానంద భరితులై ఉంటారు. నా ప్రియమైన సిద్ధవిద్యార్థులను నేను ఒకటి ప్రశ్నించ దలచాను. మీరు ఎప్పుడైనా మీ శరీరాన్ని ఆవిధమైన నిష్కామప్రేమతో చూచారా? ఎప్పుడైనా మీ శరీరాన్ని శుభప్రదమైన ఆత్మ చింతనతో ధ్యానంతో స్తోత్రపాఠాలతో ''సోహం''

**మంత్రాన్ని ప్రాణాపానంతో అనుసంధానం చేసి ప్రేమతో పూజించారా? వ్రతాలు నియమాలతో మంచి సాత్వికమైన రుచికరమైన ఆయుర్దాయాన్ని పెంచే ఆహారాన్ని నైవేద్యం పెట్టి ధన్యవాదాలర్పించారా? లేకపోయినట్టయితే ఎంత కృతఘ్నులు! ఎంత అనాచారం. మీకు ప్రియమైన మిత్రుడి పట్ల ఎంత అపచారం!**

ప్రియమైన ముముక్షువులారా! శరీరాన్ని పరికించండి. దానిగురించి పూర్తిగా తెలుసుకొనండి. దానితో నిష్కామమైన మైత్రిని పెంచుకొనండి. సమయాను సారంగా నియమానుసారంగా దాన్ని పోషించుకొనండి. శరీరంగురించి తెలుసు కున్న వారిని, అది వారిని యోగపూర్ణులు గాను ప్రేమపూర్ణులుగాను ధ్యాన పూర్ణులుగాను చేస్తుంది. సంకల్ప వికల్పాత్మకమైన మీ మనస్సు, శరీరాన్ని ఎక్కడికైనా తీసుకు వెళ్ళగలదు. శరీరం, సంకల్పం వెంటపరుగెడుతుంది. సంకల్పం, మనసు వెంట పడుతుంది. మనసు యొక్క ఆదేశాన్ని అనుసరించి శరీరము ఇంద్రియాదులు వ్యవహరిస్తాయి. మీరు, మనసును సంతోషపెట్టేందుకు గాను శరీరాన్ని ఇంద్రియాలను కష్టపెడతారు. అది మంచిది కాదు. కోపం వచ్చింది. రాముడిమీద శిక్ష ఇచ్చేది కృష్ణుడికి అన్నట్టుగా ఉంది. దీనివల్ల ఎటువంటి ప్రయోజనం ఉండగలదు? మనసు చంచలం అన్న సంగతి నేను ఒప్పుకుంటాను. వికారాలను కలిగినది కూడా. ఇబ్బంది పెడుతుంది కూడా. మనస్సును అదుపులో పెట్టేందుకే అన్ని సాధనలు. మనస్సును అదుపులో పెట్టేందుకు యోగులు, అనేక యోగప్రక్రియలను నేర్చుకుంటారు. అయినప్పటికీ, గర్విష్ఠులు అహంకారులు విశ్రాంతిప్రియులుగానే ఉంటారు. ప్రేమను పొందలేరు. హృదయంలో సంతోషముండదు. తృప్తి కూడా ఉండదు. **అందరూ అంటారు మనసు నిలవడంలేదని. నేనూ అదే అంటాను. కాని మనస్సుకు నిలిచేందు కుగాను తగినస్థానాన్ని ఎక్కడ చూపించావు కనుక? మనస్సును యోగ్య మైన స్థానంలో నిలిపినట్టయితే అది అక్కడ ఆనందంగా ఉంటుంది. అటూ ఇటూ తిరగదు.**

ఒకనాటి సంగతి. ఒక చిన్న గ్రామంలో ఒక స్వాములవారు ఉండే వారు. చిన్న కుటీరం. లేమిలోకూడా శ్రీమంతుడివలె ఉండేవారు. ఒకసారి ఒక పెద్ద నగరం నుంచి ఒక సంపన్నుడు, స్వాములవారి దర్శనానికి వచ్చాడు. అప్పుడు స్వాములవారు కుటీరంలో లేరు. స్వాములవారి శిష్యులు, సంపన్నుడిని కూర్చోమన్నారు. ఆయన కూర్చొనలేదు. కుటీరం వెలుపల, చెట్లకింద అటూ ఇటూ తిరుగుతున్నాడు.

శ్రీమంతుడు ఆ విధంగా వ్యవహరించడం శిష్యులను ఆశ్చర్యపరచింది. ఈ లోపున స్వాములవారు తిరిగివచ్చారు. శిష్యులు జరిగిన వృత్తాంతాన్ని ఆయనకు నివేదించారు. స్వాములవారు ఈ విధంగా అన్నారు: ''నిజమే. మనమా సన్యాసులం. శ్రీమంతులు కూర్చునేందుకు తగిన ఆసనం ఇక్కడ లేదు. అందుచేతనే ఆయన కూర్చోకుండా అటు ఇటు తిరుగు తున్నారు.'' అదీసంగతి. మనస్సుకూడా తగిన స్థలం లభించి నపుడు, అటు ఇటు తిరగడం మానుకుంటుంది.

ప్రియమైన సోదరులారా, మీ పరిస్థితి కూడా అదే. మీ మనస్సు ఎప్పుడూ మంచి వస్తువును పొందాలనే కోరుతూ ఉంటుంది. ఓ మనసా! నీ సంతోషం కోసం, నీ గొప్పకోసం, నీ శాంతికోసం ఏమేమో చేస్తుంటావు. అయినప్పటికీ విచారము అశాంతి మిగులుతాయి. జ్ఞానంలో వెతికి వెతికి, విచారగ్రస్తమౌతావు. యోగ విద్యలో కొన్ని అంశాలను అభ్యసించి కొంతకాలం ఉబ్బిపోతావు, తర్వాత పడిపోతావు. విషయ భోగాలలో ఎంతో వెదుక్కుంటావు. అయినప్పటికీ ప్రేమ దొరకదు. భోగాలలో పడి పురుగువైపోతావు. అప్పటికీ తృప్తి లేదు. స్థిమితం లేదు. అశాంతితో కూడిన దుస్స్వప్నాలే కనిపిస్తాయి.

ఇప్పుడు ఒక కొత్త సంగతి నేర్చుకొనండి: అందరినీ ఎటువంటి ప్రతిఫలమూ అపేక్షించకుండా ప్రేమించడం, అందరినీ విలక్షణంగా ప్రేమించడం, అందరినీ అపారంగా ప్రేమించడం. ఎప్పుడూ ఎవరినీ ప్రేమించకుండా ఉన్నట్టయితే శాంతి ఎక్కడినుంచి లభిస్తుంది? నువ్వు పరిశుద్ధంగా నిర్మలంగా, అపేక్షించకుండా ఉండు. భేదభావం మాత్రం లేకుండా ఉండు. భగవంతుడి సృష్టిలో నిన్ను ద్వేషించేది ఏదీ లేదు. పరమేశ్వరుడి సృష్టిలో నిన్ను వ్యతిరేకించేందుకు గాను ప్రత్యేకంగా ఏదీ లేదు. భగవంతుడు సృష్టించిన వాటితో స్నేహం చేసుకొనడం నేర్చుకో. నీ అంతరంగంలోని లోతుల్లోకి ఒకసారి పరికించి చూడు. నీ మనస్సు ఒక్కసారైనా అక్కడికి పోయినట్టయితే, అక్కడే ఉండిపోతుంది. నీ మనసు నీ శత్రువని అనుకోవద్దు. మనస్సు చాలా గొప్పశక్తి కలది. కాని దానిగురించి తెలుసుకున్నప్పుడే కొంతైనా అర్థమౌతుంది. మనస్సు యొక్క అత్యల్ప శక్తితోనే మహాత్ములు అనేకరకాల సిద్ధులను చేసి చూపిస్తారు. నువ్వు మనస్సును పూర్తిగా అర్థం చేసుకున్నట్టయితే, అది ఎంత బాగపని చేస్తుందో తెలుస్తుంది. మనస్సు ఒక గొప్ప సృజనాత్మక శక్తి.

మనస్సు యొక్క చాంచల్యం గురించి ఆలోచించు. మనస్సు యొక్క అస్థిరత్వమే సిద్ధయోగం యొక్క మహాజ్ఞానం వైపు నిన్ను లాగుతుంది. మనస్సు చాంచల్యమే నిన్ను గణేశపురికి తీసుకువచ్చింది. ప్రపంచంలోని గొప్పవిషయాలను ఎన్నిటిని చూపించినా మనస్సు వాటివల్ల పూర్తిగా తృప్తి చెందదు. ఇవేళ రూపం చూచి తృప్తి చెందుతుంది, రేపు రసాస్వాదనతో, తరువాత సుగంధంతో, అదైన తర్వాత శబ్దంతో లేదా మరేదైనా వస్తువుతో. మనస్సును యొక్క చాంచల్యం, చపలత్వం, ఒక ఉన్నతమైన మంచి స్థానం కోసం అన్వేషిస్తూ ఉంటుంది. మనసు చంచలంగా చపలంగా లేనట్టయితే క్రోధి క్రోధంగానే ఉండిపోతాడు. లోభి లోభంగానే ఉండిపోతాడు. మోహి మోహంలోనే ఉండిపోతాడు. కాముకుడు కామంలోనే ఉండిపోతాడు. ధనవంతుడు ధనంలో, కళాకారుడు కళలో, మునిగిపోతారు. కాని ఆ విధంగా జరుగదు. సర్వత్ర ఒకే మంత్రం వినిపిస్తూ ఉంటుంది. అది: శాంతి ధనంలో లేదు, కళలో లేదు, రూపంలోలేదు, భోగాల్లో లేదు, దేనిలోనూ లేదు – అని. అందుచేత నీ మనసు అటూ ఇటూ చాలా చంచలంగా తిరుగుతూ ఉంటుంది, దుఃఖపడుతూ కూడా ఉంటుంది. మనసు యొక్క చాంచల్యం వల్లనే నువ్వు భయభీతుడివై ఉంటావు.

ముక్తానంద అంటున్నాడు: ప్రియమైన విద్యార్థులారా! మనస్సు, నిజమైన ప్రేమను కోరుతుంది. పరిపూర్ణమైన సమదృష్టిని కోరుతుంది. పరమాత్మతో ఐక్యం కావాలని కోరుతుంది. మనోరంజనాన్ని కోరుతుంది. అందుచేతనే మనస్సు ఇంత చంచలంగా ఉంటుంది. అశాంతిగా ఉన్న స్థానాన్ని విడిచిపెట్టి ముందు ముందుకు సాగుతుంది. తుమ్మెద రసపానానికి, లేదా తేనెటీగ తేనె కోసము, ఒక పువ్వు నుంచి మరొక పువ్వుకు పోయినట్టు, మనస్సు కూడా ఏదో ఒక కారణం చేత పరుగులు పెడుతూ ఉంటుంది. **గుర్తుంచుకో. మనస్సు యొక్క చాంచల్యం వెనుక ఒక రహస్యమయమైన అన్వేషణ ఉంది. మనస్సు పూర్తి విశ్రాంతిని కోరుతుంది. మనస్సు ఆత్మధ్యానంలో పూర్తిగా లీనమయే వరకు చంచలంగాను చపలంగాను ఉంటుంది.** కుండలిని ప్రసాదంవల్ల మనస్సు ధ్యానమగ్నమైనపుడు, జ్యోతిలో జ్యోతిర్మయమైనపుడు, చంచలత్వం తొలగి నిశ్చలమౌతుంది. గుర్తుంచుకో, ఆత్మ-విశ్రాంతి లేకుండా మనస్సు నిన్ను ఎప్పుడూ సుఖంగా ఉండనివ్వదు. మనస్సు, ధ్యానంలో తన్మయత్వం చెంది, ఆత్మలో పూర్తిగా స్థిరమైనపుడు, నువ్వు మూర్తీభవించిన పరమానందమౌతావు. నీ దృక్పథమే మారిపోతుంది. నువ్వు పూర్తిగా మార్పుచెందుతావు. నీ అంతరంగంలో నిర్మలమైన శాంతి స్రోతస్సు ప్రవహించసాగుతుంది.

పరమాత్మలో తప్ప మనస్సు మరెక్కడా పరిపూర్ణమైన విశ్రాంతిని పొందజాలదు. పరమాత్మ లభించినపుడు అన్నీ దొరుకుతాయి. మనస్సు అక్కడే పూర్తిగా స్థిమిత పడుతుంది. అప్పుడు నువ్వు కదిలించినా కదలదు. ఈ విధంగా చూచినట్లయితే మనస్సుయొక్క చాంచల్యమే, అక్కడ ఇక్కడ లభించిన కొద్దిపాటి శాంతితో తృప్తి చెందక, సత్యంకోసం, శాంతికోసం అన్వేషణ చేయించింది. పరమాత్మలో తప్ప మనస్సు మరెక్కడా స్థిమితంగా ఉండదు. మనస్సు యొక్క ఈ ప్రవృత్తే శాంతి లభించే చోటును తెలుసుకోకలిగింది. దీన్ని మనస్సు యొక్క గొప్ప ఉపకారంగా అర్థం చేసుకొనడం అవసరం. మనస్సు యొక్క చాంచల్యం చాలా సహాయకరం. మనస్సుయొక్క చాంచల్యం వల్లనే, ధ్యానయోగంలో మీ రుచి ఎక్కువైంది. మనస్సుయొక్క చాంచల్యమే మిమ్ములను సిద్ధకృపకు పాత్రులుగా చేసింది. మనస్సు చేసిన ఈ ఉపకారానికి మీరు హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలుపుకొనండి.

ప్రియమైన సాధకులారా, ఒక మాట చెబుతాను, దాన్ని మంత్రతుల్యంగా భావించి గుర్తుంచుకొనండి. ఇది ముక్తానందుడి వచనం. పూర్తిగా స్వానుభవ యుక్తం. ''నా మార్గం గొప్పది'' అని ఎవరైనా గర్వంగా చెప్పుకొనవచ్చు. కాని మనస్సుకు విశ్రాంతి లభ్యం కాని స్థానం, పరమాత్మ స్థానం కాజాలదు. ఎవరైనా ఒక మంత్రాన్ని ''ఇది చాలా గొప్ప మంత్రం'' అని ప్రశంసించవచ్చు. కాని దానివల్ల మనస్సుకు పరిపూర్ణమైన తృప్తి లభించనపుడు అదికూడా పరమాత్మ స్థానం కాజాలదు. ఎంత గొప్ప సంప్రదాయమైనా, ఎంత గొప్ప గురువైనా ఎన్ని అద్భుతాలు చూపించే గురువైనా ఆచమనం చేసి తీర్థం తీసుకుని విభూతి పెట్టుకుని దేవతార్చన చేసే గురువే అయి ఉండవచ్చు; అయినప్పటికీ ఆయన దగ్గర కూడా మనస్సుకు శాంతి లభించక పోయినట్లయితే, అదికూడా పరమాత్మ స్థానం కాదు. గంట, రెండు గంటలు మనస్సు స్థిమితంగా ఉండవచ్చు. తర్వాత లేచి, క్షోభపడి అటు ఇటు సంచరించడం ప్రారంభించినట్లయితే, అక్కడ శాంతి లభించలేదన్న మాట. మనస్సుకు శాంతి లభించని చోట నువ్వు ఎంత ఆపినా ఆగదు. అక్కడినుంచి మళ్లీ పరుగులు పెడుతుంది. సుఖాన్ని అన్వేషిస్తూ మనస్సు, అటు ఇటు పరుగులు పెడుతుంది. అందుచేత మనస్సును ప్రేమలో ముంచెత్తు. ఆత్మప్రేమతో తన్మయం చేయి. ఎక్కడైనా కొంత శాంతి లభించినపుడు అక్కడ మనసు కొంతసేపు నిలుస్తుంది. మళ్లీ మరింత చంచలమై పరుగులు తీస్తుంది. పరిపూర్ణమైన సుఖ - శాంతులు లభించే చోట మనసు స్థిమితపడుతుంది. పరుగులు తీయడం మానుకుంటుంది.

మనసు చేత దాని కిష్టం లేని పనులను బలవంతంగా చేయించడం మానుకుని ప్రేమతో, ధ్యానం ద్వారా ఆత్మానందం ప్రవహించే ఆ స్థానానికి మనస్సును తీసుకుపో, ఆత్మప్రేమ యొక్క దివ్యమైన నీడ ఉన్నచోటికి, నిజమైన సుఖం యొక్క తేజస్సు వెలుగుతున్న చోటికి నీ మనసును తీసుకుపో. నీ పరమానంద మయమైన ఆత్మవైపు దృష్టిని ప్రసరించు. మనస్సు పరుగులు పెడుతూ అక్కడికి చేరుకుని అక్కడ కూర్చుండి పోతుంది. మనస్సును అదుపు చేసి బలవంతపెట్టి కొంత తపస్సు చేసి, కొంతవరకు శాంతపరుస్తావు. కాని తర్వాత అది మరింత క్షోభపడి నీకు ఎదురు తిరుగుతుంది. నువ్వు మనస్సును కూడా ప్రేమించు. మొదట, మనస్సును మనస్సుగా పరిగణించ వద్దు. చిదంబ భగవతి యొక్క స్ఫురణే మనస్సు రూపంలో ఉన్నట్టు భావించి, మనస్సుపట్ల విరోధభావాన్ని త్యజించి, దానితో స్నేహం చేసుకుని ''నువ్వు అంతరాత్మవైపు వెళ్లు'' అని చెప్పు. ఆ విధంగా అర్థం చేసుకొనడమే ధ్యానం. **మనస్సును చిన్మయంగా భావించి, దాన్ని ప్రేమ మయం చేయడం ద్వారా మనస్సును జయించవచ్చు: మనస్సును సాధారణమైనదిగా భావించడం వల్ల, దాన్ని ద్వేషించడం వల్ల, మనస్సు మనలను జయిస్తుంది.** మనస్సును పూర్తిగా జయించేందుకు దాన్ని ప్రేమించడమే మార్గం. ప్రేమే విజయ సాధనకు మంత్రం. ప్రేమే పరమాత్మను మనవైపు లాగే అయస్కాంతం. మనస్సును పరవశం చేసే యజ్ఞం ప్రేమ. ప్రేమలో గొప్ప శక్తి ఉంది. ప్రేమ అసాధ్యాన్ని సాధ్యం చేస్తుంది. ముక్కలైన దాన్ని మళ్లీ ఒకటి చేసే సామర్థ్యం ప్రేమకుంది. నిన్ను నువ్వు దీనుడిగాను హీనుడిగాను భావించడం మానుకుని, నిన్ను ప్రేమతో నింపుకో. తర్వాత తెలుస్తుంది నువ్వు గొప్పవాడివని.

ప్రియమైన ధ్యానయోగులారా, మీ అంతరంగంలో ఏమున్నది, ఏమి లేనిది, మీరు ధ్యానం ద్వారా మాత్రమే తెలుసుకోగలరు. ధ్యానం లేనపుడు మీరు దరిద్రులు. ధ్యానం వల్లనే మీరు సంపన్నులు. అందుచేత మొదట, మీరు మిమ్మల్ని ప్రేమతో చూచుకొనండి. తర్వాత ధ్యానం చేయండి.

ఒక వనంలో ఒక సిద్ధ మహాత్ముడు నివసించేవాడు. ఒక ముముక్షువు ఆ మహాత్ముడి దగ్గరకు వెళ్లి విన్నవించుకున్నాడు: ''మహాత్మా నేను పరమాత్మ దర్శనం చేసుకోవాలని కోరుకుంటున్నాను. ఎటువంటి సాధన చేయమంటారు నన్ను'' అని.

మహాత్ముడు ముముక్షువును పరిశీలనగా చూచాడు. ''నీకు ఎవరంటే ప్రేమ'' అని ప్రశ్నించాడు.

సాధకుడు, ''ప్రేమ పరమాత్ముడిని చేరుకునే మార్గానికి అవరోధం'' అన్నాడు.

మహాత్ముడన్నాడు: ప్రేమ విఘ్నం కాదు. ప్రేమలో కామం ఉన్నపుడు విఘ్నం, మోహం ఉన్నపుడు విఘ్నం. ప్రేమ పరమాత్మరూపం. నిన్ను నువ్వు ప్రేమిస్తున్నావు. స్వజనులను ప్రేమిస్తున్నావు. అదే ప్రేమను సర్వత్ర విస్తరింపచేయి. ఆ ప్రేమే నిన్ను రాముడి దగ్గరకు చేరుస్తుంది. అందుచేత అందరినీ ప్రేమించు.''

నువ్వు నీ అవయవాలపట్ల క్రోధంతో వ్యవహరించరాదు. క్రోధం పట్ల క్రోధాన్ని వహించు, శరీరం పట్ల కాదు. అజ్ఞానుల మాటలను విని, నీ సహచరుడు మిత్రుడు అయిన శరీరాన్ని హింసించరాదు. దానిపట్ల కఠినంగా కపటంగా వ్యవహరించరాదు. ప్రియమైన ముముక్షువులారా, అన్ని కర్మల ఫలితాలను అనుభవించేది ఈ శరీరంతోనే. అన్నిలోకాల గురించి తపస్సు చేసేది ఈ శరీరంతోనే. ఎవ్వరైనా ఆదర్శపురుషులుగా అవతరించినది ఈ శరీరంతోనే, ఈ శరీరం ఆశ్రయంగానే అవతరించారు. గొప్ప గొప్ప ఋషులు, మునులు, రాజులు, వీరులు, కవులు, నటులు, చిత్రకారులు, మల్లయోధులు, పతివ్రతలు, ఏసుక్రీస్తు, బుద్ధ భగవానుడు మొదలైన మహానుభావులందరు ఈ శరీరం ఆశ్రయంగానే అవతరించారు. అటువంటి శరీరాన్ని నిర్మలంగా ఉంచుకొనండి.

పనిచేయని శరీరం ఎందుకూ పనికిరాదు. నియమబద్ధమైన పరిశ్రమ, ఆసనాలు, ప్రాణాయామం, ధ్యానం – వీటితో శరీరాన్ని క్రమబద్ధం చేసుకొనడం అవసరం. శరీరాన్ని దేవాలయంగా భావించి గౌరవంగా చూచుకొనడం అవసరం. తగిన ఆహార-విహారాదులను కలిగి ఉండడం అవసరం. **శరీరంలో ఒక్కటే ఒక్కకోరిక కలిగి ఉండు: ధ్యానం ద్వారా అంతర్జ్యోతి దర్శనం కావలన్న ఇచ్ఛను మాత్రమే కలిగి ఉండు. శరీరంలోను ఇంద్రియాల్లోను, నీ అంతరంగంలో ప్రేమను ప్రవహింపచేసేందుకుగాను న్యాయెూచితమైన సంయమంతోకూడిన కోరికను, ఆశను మాత్రమే కలిగి ఉండు.** ప్రేమతో అన్నీ సంభవమౌతాయి. ప్రేమికుడు ప్రేమద్వారా భగవంతుడిని దర్శిస్తాడు. అత్యంత దుర్లభమైన భగవంతుడిని ప్రేమతో సునాయాసంగా పొందుతాడు. ఇతర సాధనమార్గాలు ఇంత సులభమైనవి

కావు. నీకు ప్రేమతో పరిచయం ఉందికనుక ప్రేమతో కూడిన సాధన ఒక్కటే సులభమైనది. ప్రేమ ప్రవాహం నీలోపలే ఉంది. దాన్ని సాధన ద్వారా బయటినుంచి తెచ్చుకొనవలసిన అవసరం లేదు. ఈ ప్రేమను విశాలంగా విస్తరింపచేసి, నువ్వు పూర్తిగా ప్రేమమయం కావడం నువ్వు చేయవలసిన పని. ప్రేమను పంచిపెడుతూ ఉండు. అది బాగా వికసిస్తుంది. నువ్వు పంచిపెడుతున్న కొద్దీ అది ఎక్కువవుతూ ఉంటుంది. ప్రేమను పంచిపెట్టేవారికి సర్వత్ర ప్రేమే స్వాగతం పలుకుతుంది.

ప్రేమ పేరుతో ద్వేషించేవారిని చాలామందిని నేను చూచాను. ప్రేమలో జుగుప్సకు తావులేదు. ప్రేమలో ఎక్కువ-తక్కువ అన్న భేదభావం ఉండరాదు. కఠినులుగా కోపిష్టులుగా ఉండే ప్రేమికులను చూచాను, ''మేము వైష్ణవులం. శివాలయానికి వెళ్లం'' అనేవారిని. ప్రేమలో ఇటువంటి క్రోధం ఉన్నపుడు, అది ప్రేమ కాజాలదు. అది కేవలం కఠోరత్వమే. జాతుల మధ్య భేదాలు, వ్యక్తుల మధ్య భేదాలు, మతాల మధ్య భేదాలు - ఇవన్నీ ప్రేమ వల్ల కలుగవు. ఎప్పుడూ భేదభావానికి మూలం అనుమానం, ప్రేమకాదు. ప్రేమవల్ల అభేదరూపమైన తన్మయత కలుగుతుంది.

నీలోపల ప్రేమ, కొత్త కొత్త అనుభవాల రూపంలో విద్యమానమై ఉంటుంది. గాఢ నిద్రవల్ల కలిగే తృప్తి గురించి ఆలోచించు. ఈ అతీంద్రియమైన తృప్తి, నీకు ఎక్కడినుంచి లభిస్తూ ఉంది? మిత్రుడిని చాలా కాలం తర్వాత కలుసుకున్నపుడు కలిగే తృప్తి, ఎక్కడ నుంచి వస్తూ ఉంది? కనులు ఏదైనా చక్కటి దృశ్యాన్ని చూచినపుడు కలిగే తృప్తి, ఎక్కడినుంచి కలుగుతూ ఉంది? ఒక్కొకసారి మనస్సుకు సంతోషం కలిగినపుడు లోపలినుంచి తృప్తి దానంతట అదే కలుగుతుంది. అది ఎక్కడినుంచి వస్తూ ఉంది? వీటిగురించి శ్రద్ధగా ఆలోచించినపుడు నీకు తెలుస్తుంది, నీలోపల ఒక గొప్ప తృప్తి రహస్యంగా ఉన్నట్టు. ఆ తృప్తే పరమానందం. దాని పేరే ప్రేమ. అందుచేతనే ప్రేమకు పూజారికావడం అత్యంత అవసరం. దృశ్యాలను చూపే ద్రష్టకు ప్రేమ దృశ్యాలే చూపించు. నువ్వు నిర్వహించే వ్యవహారాలన్నిటినీ ప్రేమతో చేయి. పశుపక్ష్యాదులపట్ల, చెట్లు చేమలపట్ల, ఫలపుష్పాదుల పట్ల, సర్వాధారభూతమైన ప్రేమను పెంచుకో.

మానవుడిని పరిపూర్ణంగా మార్చివేయగల గొప్ప అణుశక్తి ఉంది ప్రేమకు. హృదయాన్ని శుష్కం చేసుకోవద్దు. ఎవరైనా చెప్పిన బుద్ధిలేని మాటలు విని, నువ్వు ప్రేమ హీనుడివని అనుకోవద్దు. మానవుడు, అజ్ఞానం వల్ల తనకే అన్యాయం

చేసుకుంటాడు. తను, పాపినని, సాధారణ మానవుడినని అనుకుంటాడు. ఇతరులను కూడా అదే విధంగా చేసే ప్రయత్నంలో ఉంటాడు. నేనొకసారి త్రివేణి సంగమానికి తీర్థయాత్ర వెళ్లాను. అక్కడ కూర్చుంటూ ఉండగానే ఒక పురోహితుడు వచ్చి, నన్ను సంకల్పం చెప్పుకోమన్నాడు. అక్కరలేదన్నాను. అయినా సరే వదలలేదు. సంకల్పం చేప్పుకోమని వెంటపడ్డాడు. పువ్వులు తీర్థము తెచ్చాడు. నాతో అన్నాడు. స్వామీజీ ''పాపోహం'' అని చెప్పు అన్నాడు. నేనప్పుడు, ''పాపివి నువ్వు, నేను కాదు. పుణ్యతీర్థంలో కూడా మీరు యాత్రికులను మూఢులను చేస్తున్నారు. నేను పుణ్యోఽహం పుణ్యకర్మాఽహం సంకల్ప రహితోఽహం అనే చెప్తాను'' అన్నాను. ఇది విని పురోహితుడు వెళ్లిపోయాడు. ఈ విధంగా చెడు సాహచర్యం వల్ల మానవుడు, తనను రసహీనుడు, మిథ్యాభూతుడు, దుఃఖితుడు, దరిద్రుడు, నశ్వరుడు ఇత్యాదిగా భావిస్తాడు. ప్రేమను వికసింప చేసుకొనడు.

ప్రియమైన ముముక్షువులారా, ప్రేమలేని పాండిత్యం నిరర్థకం. ప్రేమ లేని యోగం కూడా అర్థహీనం. ప్రేమ లేకుండా ఎటువంటి సాధన మీకు ఆత్మానందప్రాప్తిని కలిగించదు. మీలో ప్రేమను పెంచుకుని, ఇతరులలో దాన్ని విస్తరింపచేయండి. ప్రేమ, కోరికలేనిదిగా ఇచ్ఛా రహితంగా, ఫలాపేక్షా రహితంగా ఉండడం అవసరం. ప్రేమతోనే మోహమనే శత్రువును జయించవచ్చు. శాస్త్ర పాండిత్యం అవసరం కాదు. కారణం: సర్వభావాలు పరమాత్మవే. ఇక్కడ జ్ఞాన ప్రసక్తేలేదు. ప్రేమ ప్రసక్తే ఉంది. త్యజించడం – గ్రహించడం ఈ వివాదంలో పడి కాలం వృధాపుచ్చవద్దు. త్యజించడం–గ్రహించడం, వీటికి పెద్ద విలువలేదు. పరిపూర్ణమైన ఆత్మజ్ఞానానికే విలువ. అహంకారంతో నిండిన యోగం–పాండిత్యం–జ్ఞానం, ఇవన్నీ ప్రేమకు పూర్తిగా విరుద్ధం. అహంకారాన్ని పూర్తిగా త్యజించండి. ఈ త్యాగం కేవలం ప్రేమ వల్లనే సాధ్యం. హృదయంలో వాసనారహిత మైన ప్రేమ ఉదయించినపుడు, జీవితంలో పరమశాంతి, అనుభవంలోకి వస్తుంది. మనస్సును అదుపులో పెట్టేందుకు బదులు, ప్రేమతో నింపుకొనండి, అప్పుడు చూడండి, అంతరంగంలో ఎంత ఆనందం కలుగుతుందో!

మనస్సును బలవంతపెట్టి, ప్రాణాపాన నిరోధం చేసి, హింసించేందుకు బదులు ప్రేమతో బుజ్జగించి, ఆత్మవైపు తీసుకువెళ్ళు. నీ సర్వేంద్రియాలు నిర్వహించే సర్వకర్మలు, నీ సర్వేంద్రియాల ద్వారా గ్రహించే అన్ని విషయాలు, పరమాత్మ

మయం కావడం అవసరం. 'నారాయణుడు తప్ప అన్యవిషయమేదీ లేని మానవుడు, ప్రపంచాన్ని ప్రేమమయంగా చూస్తాడ'ని సంత్‌తుకారామ్ అన్నాడు.

నువ్వు ప్రేమతో నిండిపో. నీ సాధనను ప్రేమమయం చేసుకో, ప్రేమను ప్రాప్తం చేసుకో. ప్రేమే పరమాత్మ, ప్రేమే జగత్తు. సాక్షాత్తు పరమేశ్వరుడే జగద్రూపంలో ఉన్నాడు. జగత్తు అన్యమేదీకాదు. అది పారమేశ్వరి శక్తియొక్క స్ఫురణ మాత్రమే. ఈశ్వర ప్రాప్తికి ప్రేమ, పరిపూర్ణమైన సాధనం. ప్రేమలేకుండా ఈశ్వరుడి ప్రాప్తి ఉండదు. ప్రేమ, అంతరంగంలో ఒకగొప్ప అనుభూతి. అంతరంగంలో అన్వేషించు. అక్కడ విద్యుచ్ఛక్తి వేగానికి సమానమైన వేగంతో ప్రసరించే ఒక దివ్యశక్తి, రక్తంలో ప్రాణంలో సర్వాంగాలలో వ్యాపించి ఉండడం నీకు కనిపిస్తుంది. దాని అనుభవం కలిగిన వెంటనే నీకు ప్రేమ గురించి తెలుస్తుంది.

నీ అంతరంగం ఎప్పుడూ పనిచేస్తూనే ఉంటుంది. ఒక్క క్షణం కూడా ఆగదు. నీ నాడుల్లో, స్నాయువుల్లో, రక్తంలో, ప్రతి స్థానంలో పని కొనసాగుతూనే ఉంటుంది. అదే విధంగా నువ్వు కూడా, నీ ఇంటిలో, మఠంలో లేదా మరెక్కడ ఉన్నా, అక్కడ నీ పనిని ప్రేమతో ఉత్సాహంతో కృతనిశ్చయంతో చేయడం అవసరం.

మానవుడు సర్వత్ర వ్యాపించి సర్వమయమై ఉన్న తన ఆత్మను శ్రద్ధతో ప్రేమించడం అవసరం. ప్రేమ, మానవుడిని సుఖసాగరంగాను, శాంతి ప్రతిమగాను, జ్ఞాన మందిరంగాను చేస్తుంది. ప్రేమ, మానవుడి ఆత్మరూపం. ప్రేమ, మానవుడి సౌందర్యం, ప్రేమ, మానవుడి మానవత్వం యొక్క గొప్పతనం. **అందుచేతనే ముక్తానంద అంటున్నాడు: మొదట నిన్ను నువ్వు ప్రేమించుకో. తర్వాత ఇరుగు పొరుగును ప్రేమించు, తర్వాత యావత్తు ప్రపంచాన్ని ప్రేమించు. ఇదే భక్తి. దీనివల్లనే జ్ఞానానందం ప్రాప్తిస్తుంది. దీని వల్లనే యోగానందం లభిస్తుంది. ప్రేమ వల్ల అన్ని సాధనలు వాటంతట అవే జరుగుతాయి. ప్రేమే నిత్యానంద భగవానుడు. అన్ని సాధనల ఫలితమైన పరమానందమే, శ్రీగురు కృప చేత పూజలందు కుంటున్న సద్గురు నిత్యానందుడు.**

ఆరు

# సర్వసిద్ధికి మూలం : గురుప్రసన్నత

మానవుడు కేవలం పురుషార్థం చేతనే పరమార్థాన్ని పూర్తిగా సాధించజాలడని, సిద్ధవిద్యార్థులు మరచిపోరాదు. లౌకిక వ్యవహారాలలో కూడా మానవుడు, పురుషార్థంతో పాటు, ఇతరుల సలహాలనుకూడా తీసుకుంటాడు. తన చేతకాని పనులను ఇతరులనుంచి నేర్చుకుంటాడు. శక్తిపాతమార్గంలో లేదా క్రియా యోగంలో, సిద్ధవిద్యలో లేదా కుండలిని మహాయోగంలో గురుకృప ఒక్కటే తరుణోపాయం. ఈ మార్గంలో గురువు యొక్క మార్గ దర్శకత్వం లేనిదే పూర్ణత్వాన్ని సాధించడం దాదాపు అసంభవం.

ఆధునిక కాలంలోని స్వతంత్రవాదము స్వేచ్ఛావాదము, సిద్ధవిద్యార్థులకు విఘ్నం కాగలవు. సిద్ధ మార్గాన్ని అనుసరిస్తున్న విద్యార్థులు, ''స్వతంత్ర'' వాదానికి విపరీతమైన నిర్వచనాన్ని చెప్పుకుంటూ గురువాజ్ఞను పరిపాలించడంలో శ్రద్ధ చూపకుండా ఏమరుపాటుతో అలసతతో వ్యవహరించడం, గురువులో దోషాలను కనిపెట్టడం వంటివి చేసినపుడు, అతడి శక్తి క్రమేపీ నష్టమైపోతుంది. ఎవరైనా రాజు వచ్చినపుడు, తన ఐశ్వర్యాన్నంతటినీ తీసుకువస్తాడు. రాజు బసచేసే ఇల్లు ఆయన ఐశ్వర్యంతో కలకలలాడుతుంది. నాలుగువైపులా అందం, ఆనందం, వైభవం ఉట్టిపడతాయి. రాజు తిరిగి వెళ్లే సమయంలో తన సంపదను వైభవాన్ని తనతో తీసుకువెడతాడు. రాజు వెళ్లిపోయిన తర్వాత ఆ ఇల్లు కళావిహీనమై పోతుంది. అదే విధంగా సిద్ధ విద్యార్థుల్లో, గురుకృప చేత క్రియాత్మక రూపంలో ఉంటున్నశక్తి, గురువాజ్ఞననుసరించి గురువాజ్ఞగా మారి పనిచేస్తున్న శక్తి, సిద్ధవిద్యార్థులు తమ సద్గురువు పట్ల సందేహదృష్టిని దోషదృష్టిని కలిగి గురువుగురించి వాదించుకుంటూ ఉన్నపుడు, ఆ సర్వజ్ఞ శక్తి అటువంటి విద్యార్థులలో ప్రసన్నంగా ఉండగలదా?

ఈ సిద్ధ మార్గంలో కుండలిని మహాయోగంలో ''**గురుకృపా హి కేవలం**'' మరియు ''**గురోరాజ్ఞా హి కేవలం**''.

ముక్తానంద చెబుతున్నది సత్యం: అన్ని విద్యల్లో మోక్షానికి దారితీసే పద్ధతుల్లో, స్వస్వరూప విచారణలో, శ్రీగురుకృప మాత్రమే ప్రధానం. జ్ఞానేశ్వర మహారాజు అంటున్నాడు: "**నీ పురుషప్రయత్నం, జపం, తపం, యోగం, సాధన – అన్నీ శ్రీగురుకృప లభించే సమయం వచ్చినపుడే ఫలిస్తాయి,**" అని. సాధకులు, తమ గురువు ఎంతో గొప్పవాడు, శ్రేష్ఠుడు, పూర్ణసిద్ధుడు, సమర్థుడు అని విశ్వసించినపుడు, గురువు అంతసామర్థ్యంతోనూ శిష్యుడికి అండగా ఉంటాడు. నీ సాధనలో హెచ్చు తగ్గులు, శక్తిలో హెచ్చుతగ్గులు, నీ సాధన పరిసమాప్తమయే కాలం– ఇవన్నీ నీ చిత్తశుద్ధిమీద ఆధారపడి ఉంటాయి. నిజానికి ప్రత్యక్షదైవమైన గురువుపట్ల నీ భక్తి శ్రద్ధలు ఎంత ప్రబలంగా ఎంత తీవ్రంగా ఉంటాయో అంత త్వరగా నీకు సర్వం సిద్ధిస్తుంది. దానిలో ఏ విధమైన ఆలస్యము ఉండదు. ఈ సందర్భంగా ఒక చిన్న సంఘటన, నిజంగా జరిగినది, పేర్కొంటాను. సాధకులు తమ భక్తి శ్రద్ధలను పెంపొందించుకుని తమ ఇష్టదైవత్వాన్ని ప్రాప్తించుకొనడంలో ఈ సంఘటన సహాయకరం కావచ్చు.

ఇటీవల, నేను మహాబలేశ్వర్‌లో ఉన్నపుడు, ఒక ఐ. ఐ. టి. విద్యార్థి నా దర్శనానికి వచ్చాడు. నాలుగైదు రోజులలోనే కృపను పొంది, సాధనచేసి ధ్యానసంపన్నుడై తన ఇంటికి బయలుదేరాడు. బొంబాయికి వెడుతూండగా వర్షం వచ్చి, అతడి కారు ప్రయాణం ఆలస్యమైంది. బొంబాయి చేరుకునేసరికి అర్ధరాత్రి అయింది. ఇంట్లో, తల్లి కొడుకుకోసం ఎదురుచూస్తూ ఉంది, ఆందోళనతో కొడుకు ఇంకా ఎందుకు రాలేదని. రాత్రి పదిగంటలైంది. అప్పుడు తల్లి కొడుకుకోసం ఎదురు చూడడం మానుకుని తన గురుదేవుడిని ప్రార్థించడం ప్రారంభించింది, ప్రార్థిస్తూ గురుభావంలో తన్మయమైంది. అప్పుడు ఆమె గురువు ఆమెకు ప్రత్యక్షమై "అమ్మా ఆందోళన పడకు, నీ కుమారుడు పన్నెండుగంటల ఇరవై అయిదు నిమిషాలకు ఇల్లు చేరుకుంటాడు" అన్నాడు. ఇదివిన్న తల్లి మనసు శాంతపడింది. ఆమె శ్రద్ధ కారణంగా గురువు ఆమెకు ప్రత్యక్షం కావడంతో ఆమె కొడుకుకోసం ఎదురుచూడడం మరిచిపోయి, మళ్లీ ధ్యానంలో మునిగిపోయింది. కొంతసేపు అయిన తర్వాత బయటినుంచి కుమారుడి పిలుపు వినవచ్చింది. అమ్మా, అమ్మా అంటూ. తల్లి ధ్యానం నుంచి లేచి, తలుపుతీసింది. కుమారుడు ఎదుట నిల్చుని ఉన్నాడు. గడియారం చూచింది. సరిగ్గా పన్నెండుగంటల ఇరవై అయిదు నిమిషా లైంది. ఆమె ఆశ్చర్యానికి మేరలేదు।

ఆ తల్లి తర్వాత మహాబలేశ్వరం వచ్చింది. ఆమె చెప్పినదే ఈ ఉదంతం. గురువు ప్రసన్నమైనపుడు సర్వము సిద్ధిస్తాయి, అన్న విషయమై ఈ అధ్యాయం వ్రాయాలని ప్రేరణ, అప్పుడేకలిగింది.

పూజ్యులు ప్రాతఃస్మరణీయులు సిద్ధలోకవాసులు అయిన సంత్ తుకారామ్ మహారాజ్, ఈ విషయం గురించి ఒక అభంగం వ్రాశారు. దానిని సిద్ధ విద్యార్థులకు లాభదాయకంగా ఉండగలదని ఇక్కడ వ్రాస్తున్నాను :

**గురుచరణీ ఠేవితా భావ, ఆపే ఆప భేటే దేవ**
**మ్హణునీ గురుసీ భజావే, స్వధ్యానాసీ ఆణావే.**
**దేవ గురుపాసీ ఆహే, బారంబార్ సాంగూ౦ కాయే**
**తుకా మ్హణే గురుభజనీ, దేవభేటే జనీ౦వనీ౦.**

అర్థం ఇది: శ్రీగురు చరణారవిందాలలో శరణుపొందడం వల్ల భగవంతుడు ప్రత్యక్షమౌతాడు. సునాయాసంగా, ఎటువంటి కష్టమూ అనుభవించకుండా స్వయంగా ఆయనే దర్శనమిస్తాడు. అందుచేత గురువును భజించు. అంతేకాదు. ఆయన్ను నీ ధ్యానంలో నిలుపుకో. ఈశ్వరుడు గురువుకు సమీపంలోనే ఉంటాడు. అరె! పదే పదే ఏం చెప్పను? తుకారాం అంటున్నాడు: గురువును భజించడం వల్ల పరమాత్మ దర్శనం, జనంలోగాని, వనంలోగాని, ఎక్కడ ఉన్నా కలుగుతుంది. అందుచేత ప్రియమైన సిద్ధవిద్యార్థులారా, గురుచరణార విందాలలో పరిపూర్ణమైన శ్రద్ధను అనన్యమైన భక్తిని కలిగి ఉండడం అవసరమని గుర్తుంచుకొనండి.

భావం యొక్క మహిమ చాలా గొప్పది. ఒకసారి నాటుకున్న ఒక భావం మారినపుడు కుభావం అవుతుంది. భావం, మానవుడి వికాసానికి తోడ్పడేదిగా ఉండడం అవసరం. దానికి వేరు దృఢమైన ఆస్తిక్యభావం. క్రియాశీలమై ఉన్న చిత్‌శక్తి ప్రభావాన్ని ఒకసారి తెలుసుకున్న సిద్ధవిద్యార్థికి, తన అంతరంగంలో ప్రత్యక్షంగా ఉంటున్న చిత్‌శక్తిలో, శ్రీ గురుదేవుడిలో, తన ఆత్మలో, సంవిత్తు యొక్క క్రీడారూపమైన ఈ ప్రపంచంలో దృఢమైన ఆస్తిక్య భావం కలుగుతుంది. అప్పుడు అతడి మనస్సుకు అతడి బుద్ధికి, అంతరంగంలోని చిత్‌శక్తినీ అంత రంగంలో నెలకొని ఉన్న గురుభావాన్నీ తన అంతరాత్మనూ విడిచి అకారణంగా అటు ఇటు తిరగడం చాలా కష్టమౌ తుంది. అటువంటి విద్యార్థి, ప్రపంచంలోని - క్షణంలో ఉదయించి క్షణంలో అస్త మించే - పరిస్థితుల పట్ల సంతోషించడు, దుఃఖించడు కూడా. నిజానికి శ్రీ గురువులో

దృఢమైన ఆస్తిక్యమైన సంపూర్ణమైన నిజమైన విశ్వాసం ఏర్పడడం అత్యవసరం.

సర్వత్ర వ్యాపించి ఉన్న భగవంతుడి శక్తిలోనూ అంతరంగంలోని చిత్‌శక్తి సామర్థ్యంలోనూ విశ్వాసం ఏవిధంగా ఉండాలన్న విషయంగురించి తెలిపేందుకు మీకు దైత్యర్షి ప్రహ్లాదుడి కథ చెబుతాను. భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుడి కథ తెలియని భారతీయులుండరు. విష్ణుభక్తిని విడనాడవలసిందని, దైత్యుల ఆచార వ్యవహారాలను పాటించవలసిందని, తండ్రి, దైత్యరాజు, పదే పదే చెప్పినప్పటికీ, ప్రహ్లాదుడు విష్ణుభక్తిని విడనాడలేదు, దైత్యుల ఆచార వ్యవహారాలను పాటించలేదు. ఒకసారి హృదయంలో పారమేశ్వరి శక్తిని ప్రత్యక్షంగా దర్శించిన భక్తుడికిక ఎవరి భయం ఉంటుంది? ఎవరిలో చిత్‌శక్తి వికసించి ఉన్నదో వారికేమి తక్కువ? హిరణ్య కశ్యపుడు ప్రహ్లాదుడికి చెప్పి చెప్పి అలసిపోయాడు. క్రోధం పట్టలేక ఈ విధంగా గర్జించాడు: ''నా గంభీరమైన పలుకులకు పృథ్వి బ్రద్దలవుతుంది. వాయువు స్థంభిస్తుంది. కాని ఈ చిన్నవాడు నా మాటలను అవహేళన చేస్తున్నాడు! ఈ బుద్ధిలేని పిల్లవాడు అన్నపానాదులను, తోటి పిల్లలతో ఆటపాటలను, కులధర్మమైన వేటను త్యాగం చేసి, చెప్పుడు మాటలు విని, భగవంతుడిని ధ్యానం చేస్తున్నాడు. ధర్మ భ్రష్టుడైన ఇటువంటి పుత్రుడు కులానికి పెద్ద కళంకం. దీనికన్నా పుత్రుడు అసలు లేకుండా ఉండడమే మంచిది. చెడ్డ కుమారుడు మంచిదికాదు.'' ఈ విధంగా హిరణ్యకశ్యపుడు కుపితుడై సింహం గర్జించినట్టు గర్జించసాగాడు. భయంకరమైన రాక్షసులను వేలాదిమందిని పిలిపించాడు. వారందరు, అస్త్ర శస్త్రాలను తీసుకుని పరుగుపరుగున వచ్చారు. వారితో అన్నాడు దైత్యరాజు: ''ఇది నా ఆజ్ఞ. ప్రహ్లాదుడిని ముక్కలు ముక్కలుగా నరికి వేయండి.'' ఆజ్ఞను వింటూనే దానవులు కత్తులను దూసి ప్రహ్లాదుడివైపు పరుగులు పెట్టారు. అందరూ ప్రహ్లాదుడి తలను నరికేందుకు సిద్ధమయారు. కత్తులతో తనవైపు అతి వేగంగా వస్తున్న రాక్షసులను చూచి భక్త ప్రహ్లాదుడు ఏమాత్రం భయపడలేదు. ధైర్యంగా ఈ విధంగా పలికాడు:

**విష్ణుః శస్త్రేషు యుష్మాసు మయి చాసౌ వ్యవస్థితః.**
**దైతేయాస్తేన సత్యేన మాక్రమన్త్వాయుధాని చ॥**

విష్ణుపురాణం 1.17.33.

''అరె! దైత్యులారా! నా దేవుడు విష్ణువు, ఈ ఆయుధాల్లో కూడా ఉన్నాడు,

మీలో ఉన్నాడు, నాలోనూ ఉన్నాడు. సర్వ వ్యాపకుడైన శ్రీవిష్ణువు, నా తండ్రిలోనూ ఉన్నాడు. ఆయన అన్ని చోట్ల ఉన్నాడు. వాసుదేవః సర్వమితి – ఇది పరమ సత్యం. సత్యమే నిత్యం. అదే పరిపూర్ణము, పరమనిర్భయము. ఈ పరమ సత్యం యొక్క ప్రభావం చేత నేను, సర్వవ్యాపకుడైన ఆ విష్ణువును దృఢమైన ఆస్తిక్య నిష్ఠతో, మీలో, మీ కత్తుల పదునులో చూస్తున్నాను. ఇటువంటి దృఢమైన నిష్ఠకలిగి ఉండడం చేత మీ కత్తుల ప్రభావం నా మీద ఎంతమాత్రం ఉండదు'' అంటూ నిర్భయంగా ప్రశాంతంగా నిల్చున్నాడు.

శస్త్రాల ప్రహారం వల్ల ప్రహ్లాదుడికి ఏమాత్రం నొప్పి కలగలేదు. అవన్నీ ప్రహ్లాదుడి మెడలో పూలహారాలుగా మారాయి. ప్రహ్లాదుడు ఏ మాత్రం చలించలేదు, ధ్యానం తీవ్రత తగ్గలేదు. ఎవరినీ దూషించలేదు, దైత్యుల చర్యవల్ల క్షోభ పొందలేదు. ప్రహ్లాదుడు విష్ణువుకు అంకితమై ఉండడమే దీనికి కారణం. ప్రహ్లాదుడు సుఖం విష్ణువు, దుఃఖం విష్ణువు, ఆలోచన విష్ణువు, శోకం విష్ణువు. **''పరమేశ్వరుడికి సర్వం అర్పణ చేసిన తర్వాత కూడా రోదించేవాడు, భక్తుల్లో మోసకారి, భక్తితో వ్యాపారం చేసేవాడు, సత్యానికి చాలా దూరంగా ఉన్నవాడు. అటువంటి వ్యక్తి యొక్క భక్తి నటన మాత్రమే.''**

శ్రీగురువు పట్ల ప్రహ్లాదుడి వంటి దృఢమైన ఆస్తిక్యబుద్ధి కలవారికి, అంతరంగంలో పరమేశ్వరుడు దర్శనమివ్వడంలో ఆశ్చర్యమే లేదు. అందుచేతనే తుకారామ్ మహారాజ్ అంటున్నాడు: గురుచరణారవిందాల్లో అచంచలమైన విశ్వాసాన్ని కలిగి ఉన్నట్టయితే పరమేశ్వరుడిని సులభంగా పొందవచ్చునని. పరమేశ్వరుడు గురువుకు సమీపంలో ఉండడమే దీనికి కారణం. ముక్తానంద చెబుతున్నాడు: ''శ్రీగురుప్రేమ చేత శ్రీగురుకృప చేత సాధన, నన్ను అన్వేషిస్తూ వచ్చింది. నేను సాధనను వెదుక్కుంటూ వెళ్ళలేదు. యోగిక బంధములు వివిధ రకాల ముద్రలు క్రియలు, నాలో వచ్చి కూర్చున్నాయి. నేను వాటిని ఆహ్వానిం చేందుకు వెళ్లలేదు. ఆశ్రమవాసులు, ఆశ్రమనిర్వహణలో నిపుణులు, నన్ను అన్వేషించారు. కాని, నేను వారి వెంట పడలేదు. నేను కేవలం గురువు వెంట నడిచాను. గురువాజ్ఞ పరిపాలనలో తత్పరుడనై ఉన్నాను. గురువు చెప్పిన మార్గంలో నడిచాను. నాకు సిద్ధి ఎప్పుడు ప్రాప్తిస్తుందని నేను ఆలోచించలేదు. ఈ మార్గం ఎక్కడికి వెడుతుందనికూడా ఆలోచించలేదు. శ్రీగురువు నన్ను ప్రవేశపెట్టిన మార్గంలో, గురూపదిష్టమైన మార్గం అదేనని భావించి ముందుకునడిచాను.

ఆవిధంగా నడిచి, చేరుకోవలసిన స్థానానికి చేరుకున్నాను. ఆ మార్గంలో నడిచినపుడు ఇటు అటు చూడలేదు, చిన్న చిన్న వాటికోసం చేతులు చాచలేదు. సూటిగా వెళ్లాను. పొందవలసినదాన్ని పొందాను. జరగవలసినదే జరిగింది. జరుగవలసినదానిలో లోటు ఏమీ జరుగలేదు.

ప్రియమైనసిద్ధవిద్యార్థులారా, మొదట నేను చేశాను, తర్వాత మీకు చెబుతున్నాను. ఒక ఋషి ఈ విధంగా పేర్కొన్నాడు.

**శ్రీ గురుచరణాంభోజం సత్యమేవ విజానతామ్.**
**జగత్ సత్యమసత్యం వా నేతరేతి మతిర్మమ॥**

ఋషి అంటున్నాడు: ''ఓ ముముక్షు జనులారా! శ్రీగురుచరణార విందాలు సత్యమని తెలుసుకొనండి. ఇదిచాలు. దాని తర్వాత, జగత్తు సత్యమా అసత్యమా అని తెలుసుకొనవలసిన అవసరంలేదు. ఈ వాద వివాదాన్ని పండితులకు విడిచిపెట్టండి.'' ముఖ్యంగా సుఖ సంతోషాలను కోరే సిద్ధ విద్యార్థులకు శ్రీగురుచరణార విందాల గురించి జ్ఞానేశ్వర మహారాజ్ ఈ విధంగా చెబుతున్నాడు: ''ఓ సద్గురు! 'తత్' మరియు 'త్వమ్' రూపాలైన మీ రెండు పాదాలను 'అసి' పదరూపంతో పూజించినపుడు, సాధకుడికి ప్రాప్తించవలసినది ఇక ఏమీ ఉండదు.''

ఓ ప్రియమైన సిద్ధవిద్యార్థులారా! శ్రీగురువును హృదయపూర్వకంగా సన్మానించండి. ఆయన్ను హృదయ పూర్వకంగా పూజించండి. ఆయన్ను హృదయ పూర్వకంగా ప్రేమించండి. అన్ని సిద్ధులు స్వయంగా వచ్చి మీకు సేవ చేసేందుకు సిద్ధంగా ఉంటాయి. అప్పుడు, మాంత్రికుడు చేసినట్లు చిన్న చిన్న గారడీలు చేసి చూపించవలసిన అవసరం ఉండదు. నిగమాలలో ఈ విధంగా ఉంది:

**గురుసంతోషమాత్రేణ సిద్ధిర్భవతి శాశ్వతీ**
**అన్యథా నైవ సిద్ధిః స్యాదభిచారాయ కల్పతే.**

అనగా: శ్రీగురుదేవుడిని సంతోషపెట్టినట్టయితే చాలు, శాశ్వతమైన సిద్ధి లభిస్తుంది. క్షణికమైన అల్పసిద్ధులు కాదు. మీరు ఎంతైనా జపం చేయండి, తపం చేయండి, ధ్యానం చేయండి, యజ్ఞం చేయండి, గంగాసాగరంలో స్నానం చేయండిగాక; గురువు సంతోషపడనిదే సిద్ధి ప్రాప్తించదు.

ఈనాడు సిద్ధ విద్యార్థులలో కనిపిస్తున్నదుర్బలత్వానికీ, సాధన లోపానికీ, స్ఫూర్తి లేకపోవడానికీ కారణం, గురువు ప్రసన్నం కాకపోవడమే. గురుప్రసాదం వల్లనే బుద్ధిలో స్ఫూర్తి, గురుప్రసాదం వల్లనే సర్వదుఃఖనాశనం, గురుప్రసాదం వల్లనే సాధనలో ఆనందం, కలుగుతాయి. గురుప్రసాదం వల్లనే రామనామంలో రుచికలిగి, యౌగిక క్రియలు వాటంతట అవే జరుగుతాయి. గురుప్రసాదం వల్లనే దైనందిన వ్యవహారాలలో సమాధి కలుగుతుంది. బాహ్యప్రపంచంలో రాముడు కనిపిస్తాడు. అందుచేత గురువును సంతోషపెట్టాలన్న సంగతిని గుర్తుంచుకో, గురుకృపాగ్ని యొక్క ఒక చిన్న రవ్వ, శిష్యుడిలో పడిన వెంటనే, శిష్యుడిలో ఒక అలౌకికమైన భావం ఉదయిస్తుంది. చిదంబమయమైన సద్గురువు ముందు, చింతామణి కామధేనువు కల్ప వృక్షము దిగదుడుపే. అటువంటి గురువు యొక్క మహిమను, సుందరదాసు తన గీతంలో ఈ విధంగా గానం చేశాడు :

**గురుదేవ సర్వోపరి, అధిక విరాజమాన**
**గురుదేవ సబహి తేం, అధిక గరిష్ఠ హైం॥**
**గురుదేవ దత్తాత్రేయ, నారద శుకాది ముని।**
**గురుదేవ జ్ఞానఘన, ప్రగట వసిష్ఠ హైం॥**
**గురుదేవ పరమ ఆనందమయ దేఖియత్।**
**గురుదేవ వర వరి-యాన హూ వరిష్ఠ హైం॥**
**సుందర కహత కఛు మహిమా కహీం న జాయే.**
**ఐసే గురుదేవ దాదూ, మేరే సిర ఇష్ట హైం॥**

(గురుదేవుడు అందరికన్నా అధికుడు అధిక విరాజమానుడు,
గురుదేవుడు అందరికన్నా అధిక గరిష్ఠుడు.
గురుదేవుడు దత్తాత్రేయుడు, నారదుడు, శుకుడు, ఇతర మునులు,
గురుదేవుడు జ్ఞానఘనుడు, ప్రత్యక్షవరిష్ఠుడు.
గురుదేవుడు పరమానందమూర్తి,
గురుదేవుడు గొప్పవాడు, మహాగొప్పవాడు, మహనీయుడు.
సుందర పలుకుతున్నాడు, గురువుమహిమను వర్ణించజాలనని,
అటు వంటి గురుదేవుడు దాదూ, నా కత్యంత ప్రియమైన దైవతం)

అనుగ్రహం పొందిన జీవుడు, పరమ స్వతంత్రుడుగాను, ముక్త ఆత్మగాను రూపొందుతాడు. శాశ్వతమైన సిద్ధిని పొందేందుకు గురువును సంతోషపెట్టడం అత్యంత అవసరం. గురువులేకపోవడం చేతనే మానవుడు దుఃఖిస్తాడు, గురువును పొందిన వెంటనే సంతోషిస్తాడు. అందుచేత గురువుకు ఆత్మ సమర్పణ చేసుకుని, గురుభావాన్ని ఆత్మీయం చేసుకో. కొద్దిగా ధ్యానం చేయడం, కొద్దిగా క్రియలు కలుగడం, కొంతసేపు జ్యోతి దర్శనం కావడం– కాదు గురుభావం. దీనికి చాలా దూరం గురుభావం. గురువుపట్ల భక్తిశ్రద్ధలను ఎక్కువ చేసుకునే కొద్దీ నువ్వు పై అంతస్థుకు చేరుకుంటూ ఉంటావు.

**దేవే తీర్థే ద్విజే మంత్రే దైవజ్ఞే భేషజే గురౌ।**
**యాదృశీ భావనా యస్య సిద్ధిర్భవతి తాదృశీ ॥**

అనగా, దేవతల్లో పుణ్యతీర్థాలలో బ్రాహ్మణుల్లో చైతన్యమంత్రాలలో దైవసమానులైన మహాపురుషుల్లో ఓషధుల్లో మరియు శ్రీగురుదేవుడిలో నీకున్న భక్తి శ్రద్ధలకు అనురూపంగా నీకు సిద్ధి ప్రాప్తిస్తుంది.

భవసాగరంలో మునిగి తేలుతున్న శిష్యుడిని బయటికి తీసి తనకు సమానంగా తీర్చిదిద్దుతాడు గురువు; సంశయాలన్నిటిని తొలగించేందుకు శిష్యుడి అంతరంగంలోకి ప్రవేశించి, శిష్యుడిని చిత్‌శక్తి మయం చేస్తాడు గురువు; శిష్యుడిలో బ్రహ్మ ప్రకాశాన్ని ప్రజ్వలింపచేసి దివ్యమైన ఆత్మప్రకాశాన్ని మేల్కొల్పుతాడు; తనలో వలెనే శిష్యుడిలోకూడా ఆత్మానందాన్ని కలుగచేస్తాడు; అటువంటి గురువు పట్ల ఏ విధంగా వ్యవహరించాలన్న విషయమై నీవే ఆలోచించు.

నిజానికి ఈ ప్రపంచాన్ని శిష్యుడికిగాను చిన్మయం చేయగల సామర్థ్యం ఉంది శ్రీగురువుకు. మానవుడు ఈ చిన్మయక్రీడను గుర్తించక ఏమి చేసినప్పటికీ – పరమశాంతి ప్రాప్తించదు. జపతపాదులు, యజ్ఞ యాగాదులు, యోగకర్మలు– ఎన్నిచేసినా శాంతి లభించదు. యమ–నియమాదులను పాటించినా, తీర్థయాత్రలు చేసినా ప్రయోజనం ఉండదు, ఆయుక్షీణం తప్ప. అనేక రకాల పుణ్యకర్మలు చేయవచ్చు, దేవుళ్లను అనేక విధుల ఉపాసన చేయవచ్చు, ఋద్ధి సిద్ధులను పొందవచ్చు, కఠోర తపస్సు చేయవచ్చు. కంద–మూల–ఫలాలను భక్షించి జీవించ వచ్చు– కాని గురుప్రసాద రూపమైన చిత్‌శక్తివిలాస దర్శనం కానిదే సుఖశాంతులు లభించవు. శ్రీ అభినవగుప్తాచార్యుడు చెప్పిన ఈ మాటలు సత్యం:

**స్వతంత్రః స్వచ్ఛాత్మా స్ఫురతి సతతం చేతసి శివః**
**పరాశక్తిశ్చేయం కరణసరణిప్రాంతముదితా ।**
**తదా భోగైకాత్మా స్ఫురతి చ సమస్తం జగదిదం**
**న జానే కుత్రాయం ధ్వనిరనుపతేత్ సంసృతిరితి ॥**

అనగా పరమ నిర్మలమైన చిదాత్మను, లోకులు పరమేశ్వరుడు అని పిలుస్తారు. అతడే కృష్ణుడు, రాముడు, శివుడు, జగదంబ, బ్రహ్మ, చైతన్యము, నిర్గుణము, సగుణము, అల్లా, గాడ్, సత్‌నామ్, మొదలైన పేర్లతో పిలువబడుతున్నాడు. అతడినే ముక్తానంద స్వామి, నిత్యానందస్వామి అని అంటున్నాడు. ''ప్రత్యభిజ్ఞా హృదయం''లో చిత్‌శక్తి అని పేర్కొన్నది అతడినే, అతడినే సిద్ధులు, కుండలిని అని పిలుస్తారు. అట్టి పరమ స్వతంత్రుడైన పరమశివుడు మనసులో సతతము స్ఫురణరూపంలో ఉంటాడు. అతడే పరాశక్తి రూపంలో సర్వేంద్రియాల క్రియలలో, ఇంద్రియాలకు సహజమైన ఆనందంతో స్ఫురిస్తూ ఉంటాడు. ఆ సచ్చిదానంద ఆత్మే జగద్రూపంలో స్ఫురిస్తుంటుంది. ఆ చైతన్యశక్తే, ఆ చిత్‌శక్తే, ప్రతి ఒక్క సిద్ధవిద్యార్థి హృదయంలో ఉంటూ చిన్మయమైన జగత్తును అనుభవిస్తుంది. సత్యం ఇదై ఉండగా, ప్రపంచం – జీవుడు – మాయ అన్న మూడు, ఒకదానితో మరొకటి సంబంధంలేనివి అన్న సిద్ధాంతం ఏవిధంగా ఆవిర్భవించిందో అర్థం కాదు. చిత్‌శక్తికి తప్ప అన్యులెవరికుంది జగద్రూపం దాల్చే సామర్థ్యం? పరమ స్వతంత్రము పరిశుభ్రము ప్రకాశవంతము అయిన చిత్‌శక్తిని ఎవరు మలినపరచగలరు? మండుతున్న అగ్నితో కూడా ఎవరు మనగలరు? యావత్తు ప్రపంచం చిత్‌శక్తి విలాసమే.

ఈ చిత్‌శక్తి విలాసాన్ని అర్థం చేసుకునేందుకు ఒక కవితను ఉటంకిస్తున్నాను. వ్రజభూమిలోని గోపికలు ఇదే చిత్ శక్తి విలాసాన్ని కృష్ణమయంగా, అనగా కృష్ణ విలాసంగా భావించారు. దాని వర్ణన ఉంది ఈ కవితలో :

**జిత దేఖౌఁ తిత శ్యామమయీ హై ।**
**శ్యామ కుంజ బన జమునా శ్యామా, శ్యామ గగన్ ఘన్‌ఘటా ఛాయీ హై।**
**సబ్ రంగన్ మే. శ్యామ భరో హై, లోక కహత యహ బాత్ నయీ హై।**
**మై బౌరీ కీ లోగన్ హీ కీ శ్యామ పుతరియా బదల్ గయీ హై॥**

అనగా: ఎటు చూచినా కనిపించేది కృష్ణుడే
పొదరిళ్లు తోటలు యమున అన్నీ కృష్ణుడే, ఆకాశంలోని నల్లటి మేఘాల్లో కృష్ణుడే
అన్నిరంగులలో కృష్ణుడే నిండి ఉన్నాడు, ప్రజలంటున్నారు ఇది కొత్తగా ఉందని
నాకు పిచ్చిపట్టిందా? లోకులకు కనిపించడం లేదా?

* * * * *

**కహి న జాయ ముఖసోఁ కఛూ శ్యామ-ప్రేమ కీ బాత్।**
**నభ జల థల చర అచర సబ శ్యామహి శ్యామ దిఖాత।**
**బ్రహ్మ నహీఁ, మాయానహీఁ, నహీఁ జీవ, నహీఁకాల।**
**అపనీహూ సుధి నా రహీ, రహ్యో ఏక్ నందలాల్॥**
**కో కాసోఁ కేహి విధి కహా, కహై హృదైకీ బాత్।**
**హరి హేరత్ హియ హరి గయో హరి సర్వత్ర లఖాత్॥**

అనగా: కృష్ణుడి ప్రేమగురించి మాటలలో చెప్పలేము.
ఆకాశం నీరు భూమి చరాచరాల్లో అన్నిటా కృష్ణుడే
బ్రహ్మలేడు మాయలేదు జీవుడులేడు కాలంలేదు
నాకు నాస్పృహ కూడా లేదు ఉన్నది ఒక్క నందకుమారుడే
నా మనసులోని కోరికను ఏవిధంగా చెప్పను?
ఎవరు చెప్పగలరు? ఏమని చెప్పగలరు?
హరిని పొందవచ్చు ననుకున్నాను, హరే నన్ను పొందాడు
అంతటా అన్ని దిక్కులా కనిపించేది కృష్ణుడే.

సంపూర్ణజగత్తు చిత్‌శక్తియొక్క క్రీడాంగణం, పరమాత్మ యొక్క ప్రత్యక్ష రూపం, సిద్ధవిద్యార్థుల స్వస్వరూప వైభవం. శ్రీగురుదేవుడు జగత్తు అంతటా వ్యాపించి ఉన్నాడు. అందుచేతనే శ్రీ గురువును అర్థం చేసుకొనడం గురించి ఈ అధ్యాయంలో విపులంగా వ్రాస్తున్నాను. సిద్ధవిద్యార్థులు ఈ విషయంలో ఎంతో మెలకువగా ఉండడం అవసరం. శ్రీగురుదేవుడి విశ్వరూపమే చిత్‌శక్తివిలాసము. అదేశక్తి సద్గురువై జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. అదే శక్తి శిష్యుడుగా జ్ఞానాన్ని స్వీకరిస్తుంది. అదే అనేక శరీరాలను ధరిస్తుంది. ఆ సద్గురువే అందరిలోనూ ప్రవేశించి ప్రాణంగా సంచరిస్తాడు. అతడే విధాత, విష్ణువు, రుద్రుడుగా మారుతాడు. ఆ సద్గురువే వరుణుడు, ఇంద్రుడు, ఆదిత్యుడు, చంద్రుడు మొదలైన రూపాలను ధరిస్తాడు. నవగ్రహాలు కూడా సద్గురువే.

ఆ గురువే ధృవుడు - సప్త ఋషులు మొదలైన రూపాలను ధరిస్తూకూడా తన ఏకత్వానికి ఎటువంటి భంగము లేకుండా చూచుకుంటాడు. అదే శ్రీగురువు వక్త - వక్తవ్యము, శ్రోత - శ్రోతవ్యము, జ్ఞాత - జ్ఞాతవ్యము కూడా. శ్రీ గురువే వేదము, వేదం తెలిసిన వేద పండితుడుకూడా. శ్రీగురువే సాంఖ్యము, యోగము, యోగక్రియ, యోగేశుడు. ఇవన్నీ అయి ఉండికూడా అతడు ఒకటే. అదే శ్రీగురువు. కర్త - కరణము - కర్మ - భోక్త - భోగ్యము - భోగసముదాయము కూడా. శ్రీగురువే అమృతము, ఔషధము, రోగము మరియు మృత్యువు. అజ్ఞానినుంచి సుజ్ఞాని వరకు, అవివేకి నుంచి సువివేకి వరకు దేవతలు మానవులు అందరిలో ఆయనొక్కడే వ్యాపించి ఉన్నాడు. అదే సద్గురునాథుడి ఆత్మస్ఫూర్తి, అంకము - బీజము - గణితము. అన్ని రాగాలు, రాగిణులు, తాళాలు, స్వరాలు, ఆయన నుంచే ఉద్భవిస్తాయి. ఆయనే నర్తకుడు, సుస్వరంగల గాయకుడు. ఆయనే నృత్యము సంగీతము కూడా. ఆయనే పరిపూర్ణమైన సద్గురువు. పరమ శుద్ధమైన జ్ఞానాన్ని ఉపదేశించగలగురువు. మహాయోగము మరియు సిద్ధ విద్యా ప్రవర్తకుడు. అటువంటి ఆయన గురించి ఆగమాల్లో ఈ విధంగా వర్ణించి ఉంది. **మనుష్య దేహమాస్థాయ ఛన్నాస్తే పరమేశ్వరా:** అనగా స్వయంగా పరమేశ్వరుడే గురురూపంలో మానవ దేహాన్ని ధరించి దాగి ఉంటాడు, అని అర్థం.

మోక్షాభిలాషులైన సిద్ధవిద్యార్థులారా! ఈ ప్రపంచం అంతా శ్రీగురువు యొక్క వైభవమే. ఈ ప్రపంచం, మీ అందరి ఆత్మవికాసం అని సిద్ధజనుల ఆదేశం, శ్రీగురువుయొక్క ఉపదేశం. వేదాంతుల అభిప్రాయం, ఋషులు, మునుల అనుభూతి. ఈ చిద్విలాసంలో మీకు ద్వంద్వం కనిపించినట్టయితే సుఖానికి దూరంగా ఉంటారు, సంతోషాన్ని పొందలేరు. ఆనందం లభించదు. జనన - మరణరూప దుఃఖం నుంచి ఎన్నడూ ముక్తులు కాలేరు. ఆదిశంకరుడు ఈ విధంగా పేర్కొన్నాడు:

**స్వల్పమప్యంతరం కృత్వా జీవాత్మపరమాత్మనో:**

**యః సంతిష్ఠతి మూఢాత్మా భయం తస్యాభిభాషితమ్ 142..**

— అపరోక్షానుభూతి.

అనగా అజ్ఞానం చేత, భేద జ్ఞానం కలిగి ఉండడం చేత, చెడు సాహచర్యం చేత, అసత్యమైన శాస్త్రాల పఠనం చేత, జీవాత్మ - పరమాత్మ మరియు తన మధ్య, కించిత్తు అయినా భేదాన్ని చూచే మూఢుడికి, భేదం ఉన్నట్టు భావించే మూఢుడికి, ఎల్లప్పుడూ

భయం ఉండనే ఉంటుంది. అతడు ఎన్నడూ శాంతిని పొందలేడు. ఉపనిషత్తుల్లో ఈ విధంగా పేర్కొన్నారు : **''ద్వితీయాద్వై భయం భవతి''**. ఈ బ్రహ్మాండమైన ప్రపంచాన్ని తనకు, తనగురువుకు, పరమేశ్వరుడికి, చిత్‌శక్తి కుండలినికి భిన్నమైనదిగా భావించే వ్యక్తి ఎల్లప్పుడు భయభీతుడై ఉంటాడు, శాంతిని పొందలేడు గాక పొందలేడు.

**యథా న్యగ్రోధబీజస్థః శక్తిరూపో మహాద్రుమః.**
**తథా హృదయబీజస్థం విశ్వమేతచ్చరాచరం ॥**

అనగా ''సూక్ష్మాతి సూక్ష్మమైన బీజం మొలకెత్తి, మహావృక్షమైన విధంగానే హృదయంలో బీజ రూపంలో ఉన్న ఆత్మశక్తి వికసించి, ఈ చరాచర విశ్వమౌతుంది.'' అందుచేత ప్రియమైన సిద్ధ విద్యార్థులారా, సదా గుర్తుంచు కొనండి. ''గురుసంతోష మాత్రేణ సిద్ధిర్భవతి శాశ్వతీ''. అన్ని సిద్ధులకు, శాశ్వత శాంతికి మూలమంత్రం శ్రీగురు సంతోషం.

గురువు ఎప్పుడు సంతృప్తి చెందుతాడు? గురువు సమక్షంలో, ఆహా ఎంతగొప్ప గురువు, ఓహో ఎంతగొప్పగురువు! అంటూ ముఖస్తుతి చేయడం వల్ల ఆయన సంతృప్తి చెందగలడని అనుకొనవద్దు. లేదా వారంలో ఒకసారి, గంటసేపు ధ్యానం చేసి, రెండువారాలపాటు సినిమాలు చూచి, ఆహా ఏమి గురువు అని పొగడడం వల్ల గాని, లేదా పదిహేనురోజుల్లో ఒకసారి గంటసేపు ధ్యానం చేసి, ఒకనెలరోజులు సందుగొందుల్లో పనీపాటా లేకుండా తిరిగి, ఆహా ఏమిగురువు! అని పొగడడం వల్లగాని, లేదా నెలలో ఒకసారి ధ్యానం చేసి, మూడునెలలపాటు అవీ ఇవీ తిని కడుపు పాడుచేసుకుని ఎందుకూ పనికిరాకుండా చేసుకుని, ఆహా ఎంత గొప్ప గురువు! అని పొగడినందువల్ల గురువు సంతృప్తి చెందడు. శిష్యుడు పూర్ణత్వాన్ని సాధించినపుడే గురువు సంతృప్తి చెందుతాడు. కళాకారుడు, తన శిష్యులు కళను పూర్తిగా అభ్యసించిన తరువాతనే వారిని మెచ్చుకుని ఆశీర్వదిస్తాడు. మల్లయోధుడు, తన శిష్యులు మల్లయుద్ధంలో ప్రవీణులైన తర్వాతనే వారిని మెచ్చుకుంటాడు. పండితుడు, తన శిష్యులు పాండిత్యాన్ని పొందినపుడే వారిని ఆశీర్వదిస్తాడు. అదే విధంగా శ్రీ గురువు నుంచి శక్తిని పొందిన శిష్యుడు పరిపూర్ణుడైనపుడే గురువు సంతోషిస్తాడు. వస్త్రాలు, ద్రవ్యం, భోజనం, తీర్థం, ముఖస్తుతి, వీటివల్ల గురువుకు సంతోషం కలుగదు.

శిష్యుడు గురువులో లీనమై గురువుగా మారినపుడు, గురువుకు సంతోషం కలుగుతుంది. అందుచేతనే ముక్తానంద అంటున్నాడు: ''శ్రీగురుం శరణం గచ్ఛామి. శ్రీ ధ్యానయోగ శరణం గచ్ఛామి. శ్రీగురు భక్తి ప్రేమ ప్రాప్నోమి. పరస్పర దేవో భవ – ఇతి ధారణం ధారయామి. సతతం శ్రీగురుం స్మరామి. మమ మతిః శ్రీగురుః మమగతిః శ్రీగురుః మమరతిః శ్రీగురుః మమాత్మా శ్రీగురుః ఇతి సత్యం. సత్యం వదామి.'' (శ్రీగురువే నాకు శరణం. ధ్యానయోగమే నాకు శరణం. శ్రీ గురువు పట్ల భక్తి ప్రేమలను కలిగి ఉందునుగాక! ఇతరులలో దైవాన్ని చూడుమన్న సిద్ధాంతాన్ని పాటింతునుగాక! ఎల్లవేళలా శ్రీ గురువును స్మరింతునుగాక! నా మనసు శ్రీగురువు; నా గమనం శ్రీగురువు; నా సంతోషం శ్రీగురువు; నా ఆత్మ శ్రీగురువు; ఇది సత్యం. సత్యమే చెబుతున్నాను)

ఏడు

# సహజావస్థ

ప్రత్యభిజ్ఞాహృదయంలో ఒక సూత్రం ఉంది: **''మధ్యవికాసాత్ చిదానంద లాభః''** అని. అనగా సిద్ధకృపచేత, సిద్ధవిద్యార్థులలో మధ్య నాడి అనగా సుషుమ్నలో కుండలిని వికసించిన వెంటనే, వారికి చిన్మాత భగవతి గురించిన జ్ఞానం కలుగుతుంది. ధ్యానం చేయగా చేయగా మనస్సు సమాధి స్థితిని పొందుతుంది. అంతరంగంలో, సర్వవ్యాపకమైన చిత్‌శక్తి గురించిన సంపూర్ణమైన జ్ఞానం ఉదయి స్తుంది. ఆ తర్వాత, ధ్యానంలో కలిగే అనుభవం, దైనందిన వ్యవహారాలలోకూడా ఉంటుంది. అటువంటి యోగికి ధ్యానంలో పరిపూర్ణమైన శాంతి, దైనందిన వ్యవ హారాలలో కూడా పూర్తి నిశ్చింత ఉంటుంది. నిశ్చింతతో కూడిన ఈ యోగభూమి దృఢపడి, అహర్నిశం ఉండే విక్షేపరహితమైనస్థితి అతి సహజంగా ప్రాప్తిస్తుంది. చిత్‌శక్తి తనంతట తానుగా గురుకృప చేత చేసిన సాధనకు ప్రసాదరూపంలో ఆ యోగిలో ఈ అవస్థను ధరించి ఉంటుంది. ఈ స్థితిని **సహజావస్థ** అంటారు. సహజావస్థ ప్రాప్తించిన పురుషుడు సంసారంలో ఉంటున్నప్పటికీ అతడిని పరమయోగిగా లేదా పరమ శివభక్తుడుగా పరిగణిస్తారు. సహజావస్థ ప్రాప్తించిన పురుషుడు, తను నిర్వహించే పనులన్నిటిలో –పూజ–ధ్యానం – ఇల్లు – పిల్లలు – అన్నం – పానం – పరివారం– అన్ని విషయాలలో చిత్‌శక్తి యొక్క వికాసాన్నే చూస్తాడు.

అతడు తన లోపలా వెలుపలా ప్రతినిత్యము, చిత్‌శక్తి యొక్క విలాసాన్నే చూస్తాడు– **'సబాహ్యాభ్యాంతరః అయం నిత్యోదితసమావేశాత్మా...'** ఆ విధంగా చూడడం వల్ల అతడి మనసులో సంపూర్ణమైన సమదృష్టి ఏర్పడు తుంది. అదే సహజావస్థ. మహామంత్రం యొక్క శక్తితో నిండిన ఈ నిర్వికారస్థితిలో, దేహం– ప్రాణం– ఇంద్రియాలు – ఆదిగా గల విషయాలు, తన స్వస్వరూపానికి భిన్నమైనవన్న భావం ఉండదు. అవన్నీ చిన్మయ రూపాలుగా గోచరిస్తాయి. ఈ విషయాలను తను ఏవిధంగా పరిగణించినా, వాటన్నిటికి మహామహిమోపేతమైన చిత్‌శక్తి ఆధారరూపమై ఉన్నట్టు స్ఫురిస్తుంది.

చిత్‌శక్తి స్ఫురణలేకుండా ఏ విషయమూ గోచరించదు. అన్ని విషయాలను తన శక్తి చేతనే ప్రత్యక్షంగా చూపిస్తుంది. ఈ విధంగా ఒకే ఒక చిత్‌శక్తి, అన్ని స్థితుల్లోనూ విలసిల్లుతూ అన్ని విషయాలలోకి ప్రవేశిస్తూ అన్నిటినీ తనలోనే లీనం చేసుకుంటుంది. పదార్థరూపంలో ప్రకాశించే జాజ్వలమానమైన శక్తి, దేశ – కాల – ఆకారాల రూపాలను కూడ ధరిస్తుంది. ఈ ప్రపంచంలోని పదార్థాలన్నీ, చిత్‌శక్తి చేత ప్రకాశమానమౌతున్నాయి. అంతరంగబహిరంగ విషయాలన్నిటి సృష్టి, స్థితి, లయములు, ఈ శక్తివల్లనే జరుగుతున్నాయి. సిద్ధవిద్యార్థులు అనగా సిద్ధయోగులు, తమ అంతరంగాన్ని, బహిరంగాన్ని, ఈ చిత్‌శక్తి యొక్క కిరణపుంజంగా భావించి ఈశ్వరత్వాన్ని అనుభవిస్తారు. ఆ విధంగా అర్థమైనపుడు, మనస్సుకు సమదృష్టితోకూడిన ప్రశాంతమైన స్థితి ఏర్పడుతుంది. అదే సహజావస్థ. అటువంటి సహజావస్థను ప్రాప్తించుకున్న యోగి సమస్తస్థూల ప్రపంచంలోనూ సర్వజీవాత్మలలోనూ పూర్తిగా వ్యాపించి, ప్రపంచానికి ఆధారమూ అఖండమూ అయి ఉండి కూడా, అనంత రూపాలలో నివసించే పరమాత్మను తెలుసుకుంటాడు. అతడి ఒక్కొక్క పనిలోనూ పరమాత్ముడి ప్రభావము, క్షణక్షణము గోచరిస్తుంటుంది. పండ్లలో, రూపము – రసము – సువాసన మొదలైన విభిన్నగుణాలు ఒకటిగా ఉన్న విధంగానే బాహ్య పదార్థాలు – వాటి జ్ఞానం – వాటిజ్ఞాత – వాటన్నిటికీ ఆధారభూతమై ఉంటున్న, సర్వవ్యాపకుడైన పరమాత్మను సహజావస్థను పొందిన యోగి, వాటన్నిటితోనూ అనుసంధానం చేస్తాడు. ఇటువంటి అనుసంధానం వల్ల సిద్ధ విద్యార్థియొక్క ''అల్పోఽహం'' స్థితి నశిస్తుంది. తను ''పూర్ణోఽహం'' అన్న జ్ఞానం కలుగుతుంది. ఇదే సహజసమాధి.

నిజానికి కనిపిస్తున్న ఈ విశ్వమంతా పూర్తిగా చిత్‌శక్తి మయం. సిద్ధవిద్యార్థులకు దీనిలో చిత్‌శక్తి తప్ప అన్యమైనది ఏదీ లేదు. ఆదిశంకరులన్నారు:

**రజ్జ్వ జ్ఞానాత్ క్షణేనైవ యద్వద్రజ్జుర్హి సర్పిణీ**
**భాతి తద్వచ్చితిః సాక్షాద్విశ్వాకారేణ కేవలా॥ 44॥**

– అపరోక్షానుభూతి.

అనగా మానవుడికి తన భ్రమ వల్ల తాడుకూడా ఒక్క క్షణం సర్పంగా కనిపిస్తుంది. దానితో ఒకరికి మూర్ఛవస్తుంది. ఇంకొకరికి గుండె ఆగిపోయే పరిస్థితికూడా ఏర్పడుతుంది. పరుగెత్తు, పరుగెత్తు అని అరుస్తారు. అప్పుడెవరైనా తెలివున్నవాడు వచ్చి, అదిపాముకాదు, వట్టితాడు మాత్రమే అని తెలుసు కుంటాడు. ''మూఢులారా ఎందుకు అరుస్తున్నారు? ఎందుకు భయపడు తున్నారు? ఇది సర్పం కాదు. తాడు

మాత్రమే.'' అంటాడు. అప్పుడు, అంత వరకు పాముగా కనిపించినది, తాడుగా కనిపిస్తుంది. తాడే పాముగా కనిపించిది వారికి. అదే విధంగా కనిపిస్తున్న ఈ ప్రపంచమంతా సాక్షాత్తు చిత్‌శక్తే.

**బ్రహ్మైవ సర్వనామాని రూపాణి వివిధానిచ**
**కర్మాణ్యపి సమగ్రాణి బిభర్తీతి శృతిర్ జగౌ ॥50॥**

– అపరోక్షానుభూతి.

నిజానికి ప్రపంచంలోని వివిధ రకాల పదార్థాలు, వాటి జాతులకు అనురూపమైన పేర్లు, వాటిపనులు; కనులు చూడడం, చేయి పట్టుకొనడం, నాలుక పలుకడం వంటివి, వీటన్నిటిని పరమాత్మ చేస్తాడు. అంతేకాదు :

**సర్వోపి వ్యవహారస్తు బ్రహ్మణా క్రియతే జనై:**
**అజ్ఞానాన్న విజానంతి మృదేవ హి ఘటాదికం ॥65॥**

– అపరోక్షానుభూతి

అనగా మానవుల ద్వారా జరుగుతున్న వ్యవహారాలన్నీ, బ్రహ్మ యొక్క శక్తివల్లనే జరుగుతున్నాయి. బ్రహ్మలేకుండా ఎటువంటి వ్యవహారము జరుగదు. రేడియో పలుకుతుంది. కాని దాని వెనక విద్యుచ్ఛక్తి ఉంది. అది లేనపుడు రేడియో జడం. అదే విధంగా, ఏదో ఒక పనిచేసే ఇంద్రియాలన్ని చైతన్య ఆత్మ లేదా చిత్‌శక్తి వల్లనే పనిచేస్తున్నాయి. అజ్ఞానులు, శ్రీగురు బోధన పొందనివారు అనుకుంటారు; కనులు చూస్తున్నవని, నాలుక పలుకుతున్నదని, కాళ్లునడుస్తున్నవని, ఇంద్రియాలు తాముగానే పనిచేస్తున్నవని. విద్యుచ్ఛక్తి ప్రవాహం ఆగిపోయినపుడు, రేడియో పలకడం ఆగిపోయే విధంగానే, చైతన్య ఆత్మ శరీరాన్ని విడిచిపెట్టినపుడు కనులు చూడవు, నాలుక పలుకదు. అందుచేతనే ఆదిశంకరులన్నారు: అన్ని వ్యవహారాలు, చేతనాత్మకమైన శక్తివల్లే జరుగుతున్నాయని. చిత్‌శక్తి నాలుకలో నాలుకగా ఉండి పలుకుతుంది, కనుల్లో కనులుగా ఉండి చూస్తుంది, చెవుల్లో చెవులుగా మారి వింటుంది. మనస్సులో మనస్సుగా ఉండి మననం చేస్తుంది. ఈవిధంగా సర్వాంగాల సర్వవ్యవహారాలలో సర్వక్రియలలో లోపల – వెలుపల ఉన్న జగత్తులో ఉన్నది ఒకటే, చిన్మాత విలాసమని అర్థం చేసుకుని భేదాభేద రహితమై శాంతంగా ఉండడమే సహజావస్థ.

మీ ధ్యానం పూర్తిగా పరిశుద్ధంగా ఉన్నపుడు, విషయరహితమౌతుందన్న సంగతిని ధ్యానం చేసే సిద్ధవిద్యార్థులు అనుభవపూర్వకంగా తెలుసుకుని ఉంటారు. ఉదాహరణకు, ధ్యానం నీల బిందువులో స్థిరపడుతూ పడుతూ నీలమయ మౌతుంది.

ఆవిధంగా నీలమై, కొంతసేపు, మీరులేరు, లోపల లేదు, వెలుపల లేదు, అన్నస్థితి అనుభవంలోకి వస్తుంది. చూచేవారులేనపుడు, చూచేందుకు ఏమీ ఉండదు, వినేవారులేనపుడు శబ్దం ఉండదు. ఆ స్థితిలో దుఃఖం లేదు, సుఖంలేదు, మూఢత్వం లేదు, ద్రష్టలేడు, దృశ్యం లేదు. కేవలం పరిశుద్ధమైన పరమాత్మ, తనలో తానై స్ఫురించే పరమాత్మ ఉంటాడు. ఇది నిర్వికల్పమైన, తరంగాలు లేని, ప్రశాంతమైన స్థితి. ఇది మీ ధ్యానానికి లక్ష్యం. మీరు కొన్ని క్షణాలు ఆ స్థితిలో ఉంటారు. ధ్యానం నుంచి బయటికి రావడం ప్రారంభమైనపుడు, తురీయాతీత స్థితినుంచి తురీయాస్థితికి వస్తారు. దానితర్వాత తురీయా స్థితిలో మీకు స్ఫురణ కలిగిన ప్రతిసారి, మీకు, తురీయాతీతం యొక్క సాక్షాత్కారమే కలుగుతుంది. మీరు తురీయా స్థితినుంచి సుషుప్తికి వచ్చినపుడు, తురీయా స్థితిలో కలిగిన అనుభవాలనే తెచ్చుకుంటారు. సుషుప్తిలో కూడా మీరు, దేనినీ మీకు భిన్నమైనదిగా చూడరు. సుషుప్తినుంచి స్వప్నావస్థకు వచ్చినపుడు స్వప్న ప్రపంచంలోని రథాలు – గుఱ్ఱాలు – ఏనుగులు మొదలైనవన్నీ మీరే అవుతారు! సుషుప్తిలో ద్రష్టగా ఉన్నదే స్వప్నంలో కూడా ద్రష్టగా ఉన్నట్టు మీకు అనుభవంలోకి వస్తుంది. స్వప్నావస్థ నుంచి జాగ్రదవస్థలోకి వచ్చినపుడు, జాగ్రదవస్థలో కూడా అదే తురీయాతీతస్థితి ఉన్నట్టు అనుభూతి కలుగుతుంది. ఈ విధంగా తురీయాతీతం నుంచి తురీయానికి, తురీయాస్థితి నుంచి సుషుప్తికి, సుషుప్తినుంచి స్వప్నావస్థకు, స్వప్నావస్థనుంచి జాగృతికి, వచ్చేది, ఒకే ఒకద్రష్ట. ఇక్కడినుంచి అక్కడికి, అక్కడినుంచి ఇక్కడికి వచ్చేది ఒకే ద్రష్ట. నాలుగు అవస్థల్లోను ఆయాస్థానాల స్థితిగతులు భిన్నమైనవి. కాని ద్రష్ట మాత్రం ఒకడే. అన్ని అవస్థల్లోనూ ద్రష్ట ఒకడే అని అర్థం చేసుకుని శాంతపడడం, ముక్తానంద పేర్కొంటున్న సహజావస్థ.

చిత్‌శక్తితో పరిచయంలేనివారి స్థితి ఒకటుంది. ఆ స్థితిలో, ప్రపంచంలో ఎన్ని వస్తువులున్నాయో అవన్నీ వేరువేరుగా కనిపిస్తాయి. వాటి నామరూపాలు, గుణగణాలు, చేసేపనులు, మొదలైనవాటిని చూచి, అవి ఎన్నో ఉన్నట్టు భావిస్తారు. కాని గురుబోధచేత చిత్‌శక్తి గురించిన జ్ఞానం కలిగినపుడు ఆ చిత్‌శక్తి **''స చైకో ద్విరూపస్త్రిమయశ్చతురాత్మా సప్తపంచకస్వభావః''** (ప్రత్యభిజ్ఞా హృదయ సూత్రం – 7.)

అనగా ''ఒకే ఒక పరమ శివుడు, రెండు–మూడు – నాలుగు – ముప్ఫయి అయిదు తత్వ రూపాలతో విశ్వమంతా వ్యాపించి ఉంటాడు. ఆయన ఒక నిర్గుణ – నిరాకార – సచ్చిదానంద రూపము. అదే సచ్చిదానందరూపం, సంకోచస్థితి – వికాసస్థితి అన్న రెండు అవస్థలు కలిగి ఉండడం చేత 'ద్విరూపం' అంటారు. ఆణవ

మాయీయ-కర్మ మలాలతో కూడినది కావడం చేత 'త్రిమయం' అని కూడా అంటారు. శూన్యం- ప్రాణం- పుర్యష్టకం- స్థూలశరీరం- ఈ నాలుగు విభాగాలను కలిగి ఉండడంచేత 'చతురాత్మ' అంటారు. పరమ శివుడినుంచి పృథ్వీ వరకు ముప్ఫయి అయిదు తత్వాలుగా రూపం ధరించి ఉంటుంది. ఈ విధంగా అది ఒకటే. దానికి భిన్నమైనది ఏదీ లేదు.'' 'ప్రత్యభిజ్ఞాహృదయం'లో, మొత్తం ప్రపంచాన్ని చిత్‌శక్తి యొక్క విలాసంగా పేర్కొన్నారు: **చిదాత్మా శివ భట్టారక ఏవ ఏక ఆత్మా న తు అన్యః కశ్చిత్** అనగా 'అంతటా ఒకే ఆత్మ వ్యాపించి ఉంది.' ఆవిధంగా అర్థం చేసుకుని, చిత్తవృత్తి వికారరహితం కావడమే సహజావస్థ. 'విజ్ఞానభైరవం'లో ఈ విధంగా ఉంది:

**గ్రాహ్య గ్రాహక సంవిత్తిః సామాన్య సర్వదేహినామ్**
**యోగినాం తు విశేషోఽయం సంబంధే సావధానతా॥**

ఈ పరాశక్తి చిదంబే, ప్రత్యక్షంగా కనిపిస్తున్న యావత్ ప్రపంచంగాను, ఈ ప్రపంచాన్ని తనకు భిన్నమైనదిగా పరిగణించే జీవుడుగాను రూపాలను ధరిస్తుంది. ఈ ప్రపంచం యావత్తు, అనగా ప్రపంచంలోని అన్నివిషయాలు 'గ్రాహ్యం'. ఈ విషయాలన్నిటిని తెలుసుకునే చిద్రూపి జీవాత్మ 'గ్రాహకము'. జ్ఞానహీనులు లేదా సాధారణ మానవులు, ఈ గ్రాహ్య- గ్రాహకాలను, అనంత రూపాలలో భిన్నభిన్నమైనవిగా చూస్తారు. కాని గురుకృపను పొందిన యోగి, మహాయోగానికి పూజారి అయిన యోగి, చిత్‌శక్తిని సాక్షాత్కారం చేసుకున్న యోగి, గ్రాహ్య- గ్రాహకాలను అనగా చూచేవాడు - కనిపించేదీ, ఈ రెండింటినీ ఒకే ఒక చిన్మాతనుంచి ఉదయించినవిగా అర్థం చేసుకుని, ఈ రెండింటిని సమ దృష్టితో చూస్తాడు. అటువంటి సమదృష్టి కలిగిన యోగిలో నెలకొని ఉండే శాంత భావమే సహజావస్థ.

జ్ఞానం ఉన్నవారు ఈ ప్రపంచాన్ని చిత్‌శక్తి విలాసంగా పరిగణిస్తారు. దాన్ని చిత్‌శక్తియొక్క స్ఫురణ అంటారు. దైనందిన వ్యవహారాలలో కూడా చిత్‌శక్తే ఉన్నట్టు భావిస్తారు. చిత్‌శక్తినుంచి ఉద్భవించిన ప్రపంచం, భిన్న భిన్న రూపాలను ధరించినప్పటికీ అది చిత్‌శక్తే. ఇచ్చిపుచ్చుకోవడం వంటి వ్యవహారాలన్నీ చిత్‌శక్తి యొక్క విలాసమే. చిత్‌శక్తి స్వయంగా అనేక రూపాలను ధరించి, అనేక రూపాలుగా వికసిస్తుంది. ఆవిధంగా అర్థం చేసుకుని భేదరహితుడై శాంత పడడమే ముక్తానంద యొక్క సహజావస్థ.

ఇతి శివమ్

శుభం

# ఆశీర్వచనం

నా ప్రియమైన ఆత్మీయులైన సిద్ధవిద్యార్థులారా!

ఎల్లప్పుడూ మీ మీ పనులను నిర్వర్తించుకుంటూ, సిద్ధవిద్యయొక్క బలం చేత, సిద్ధకృప చేత, మీ ధ్యానం, సిద్ధులు విశ్రమించే స్థానంలో పూర్తిగా స్థిరపడు గాక! ఇది నా ఆశీర్వచనం.

ప్రియమైన సిద్ధవిద్యార్థులారా! మీకు సిద్ధకృప ప్రాప్తించినందువల్ల మీరు సిద్ధపరంపరకు చెందినవారు. మీది సిద్ధలోకం. మీ స్థితి సిద్ధులకు ప్రాప్తించిన స్థితి వంటిదే. సిద్ధలోకవాసులైన అనంత మహాపురుషుల దివ్యాతి దివ్యమైన కృపాశక్తి మీ రక్షణకు సర్వసన్నద్ధంగా ఉంది. ఈ కృపాశక్తి, మిమ్ములను పూర్తిగా రక్షించు గాక! ఇది నా ఆశీర్వచనం.

సిద్ధవిద్యార్థులారా! ఒక చిన్న నిప్పురవ ఒక అరణ్యాన్ని పూర్తిగా దగ్ధం చేసి భస్మంచేస్తుంది. అదేవిధంగా, సిద్ధుల చిత్‌శక్తి కిరణం, చిన్నది చాలు. మీలో ప్రవేశించి మీ దోషాలను దగ్ధం చేసి, మీకు పరిపూర్ణమైన సిద్ధపదాన్ని ప్రసాదించుగాక! ఇది నా ఆశీర్వచనం.

మీరు సిద్ధాత్మల కిరణాలు. మీరు చిత్‌శక్తి విలాసంలో విలసిల్లుతున్నవారు. మీలో చిత్‌శక్తి క్రియాశీలమై ఉంది. చిన్మయమైన మీ ప్రపంచంలో మీరుకూడా చిన్మయులై, చిత్‌శక్తిలో కలిసిపోయి, స్వయంగా చిత్‌శక్తిగా పరిణతి చెందెదరుగాక. మరియు మీ మనస్సు, చిదంబ యొక్క విశ్రాంతి రూపమైన జగత్తులో సంపూర్ణమైన విశ్రాంతిని పొందుగాక! ఇది నా ఆశీర్వచనం.

నా పరమ ఆరాధ్యదైవమైన పరమగురువు, నిత్యానంద స్వాములవారు చిత్‌శక్తిమయం. ఆయన సిద్ధలోకవాసి. ఆయన యొక్క కించిత్తు కృపా మాత్రం చేత, నేను నా అస్తిత్వాన్ని నిర్మూలించి, చిన్మయ కుండలిని యొక్క వికాస స్ఫూర్తిగా

మారాను. గురుదేవులు నా దుఃఖాన్ని బాధను తీసుకుని, దానికి బదులు తమ స్వంత స్వరూపాన్ని నాకిచ్చారు. తను ఇచ్చిన శక్తికి రక్షణకు గాను శక్తిరూపం ధరించి నా అంతరంగంలో ఆత్మరూపంలో కూర్చుని, నా హృదయాధిదేవత అయారు. ఆయనవల్లనే నేనున్నాను. నేను ఆయనవాడిని. ఆయనే నన్ను మనిషిని చేశారు. ఆయన అందరి అంతర్యామి. శక్తిచక్ర ప్రవర్తకుడు. ఎల్లప్పుడూ నా ఆరాధ్య దైవము. అటువంటి భగవాన్, శ్రీగురు నిత్యానంద, నా సిద్ధవిద్యార్థులందరిలో ప్రవేశించి అంతరాత్మరూపంలో నివసిస్తూ వారి జీవితాలను ఆనందమయము చేయుగాక. ఇది నా పరిపూర్ణమైన ఆశీర్వచనం.

**పూజ్యులు శ్రీ నిత్యానందకు**

**మరియు**

**ప్రియమైన శ్రీ సిద్ధవిద్యార్థులకు**

**ఆత్మీయులైన**

**స్వామి ముక్తానంద.**

# పారిభాషిక పదజాలం

అక్రూరుడు : కృష్ణుడి మామ

అజామిళుడు : ఒక స్త్రీ వ్యామోహంలో పడి, నిష్టాభ్రష్టుడైన ఒక బ్రాహ్మణుడు. కాని మరణ సమయంలో భగవంతుడి నామాన్ని జపించడం చేత విష్ణుదూతలు అతడిని స్వర్గలోకానికి తీసుకువెడతారు.

అపరోక్షానుభూతి : ఆదిశంకర విరచిత గ్రంథం. విచారణద్వారా, అంత రాత్మను ప్రత్యక్షంగా వెంటనే అనుభూతిలోకి తెచ్చు కోవడమే భగవద్దర్శనం అని వివరిస్తుంది ఈ గ్రంథం.

అభంగం : మరాఠీ భాషలో భక్తి సంప్రదాయకీర్తన.

అవధూత : శరీరస్పృహను అధిగమించిన మహాపురుషుడు. సాధారణ సామాజిక కట్టుబాట్లకు అతీతుడైన ఆత్మనిష్ఠుడు.

అష్టగంధి : ఒకచెట్టు గింజలను ఎండబెట్టి చూర్ణం చేసి చందనంతో కలిపి, పూజార్చనలకు ముందు, లలాటానికి పూసు కుంటారు.

ఆదిశంకరుడు : (788-820) అద్వైత మార్గాన్ని ప్రబోధించిన గొప్ప ఆచార్యుడు. భారతదేశమంతటా పర్యటించి, తన సిద్ధాంతాన్ని వ్యతిరేకించినవారిని శాస్త్రోక్తంగా ఓడించి హిందూమతాన్ని పునరుద్ధరించి, దేశం నాలుగు మూలలా మఠాలను స్థాపించిన మహాపురుషుడు.

ఆకాశం : పంచతత్వాలలో అతి సూక్ష్మమైనది. మిగతా నాలుగు తత్వాలు ఉద్భవించేది దీని నుంచే. సర్వత్ర వ్యాపించి ఉండేది.

ఆసనం : వివిధ ప్రకారాలైన యోగాసనాలు. యోగశాస్త్రంలో 84

ప్రధాన ఆసనాలను పేర్కొని ఉన్నారు. నాడులను శుభ్ర పరచి శరీరాన్ని శక్తివంతం చేసేందుకు ఉపయోగపడ తాయి; ధ్యానానికి కూర్చునే చిన్నచాప, చిన్న కంబళి.

ఉమ : శివసతి: శక్తి యొక్క పేర్లలో ఒకటి. దీని అర్థం జ్యోతి. ఈ రూపం, శక్తికి లేదా శుద్ధ జ్ఞానానికి ప్రతీక.

ఏక్‌నాథ్‌మహారాజ్ : (1528-1609) జనార్దన స్వామి శిష్యుడు. మహారాష్ట్ర నివాసి. గృహస్థాశ్రమాన్ని నిర్వహిస్తూ తన చివరి రోజుల్లో పౌరాణిక గ్రంథాలకు టీకా తాత్పర్యాలను, ఆధ్యాత్మిక గ్రంథాలను రచించి భక్త కవిగా పేరు ప్రఖ్యాతులను పొందిన మహాపురుషుడు.

ఓం నమః శివాయ : మహామంత్రం, తారక మంత్రం. దీని అర్థం: శివుడికి నమస్కారం. శివుడు, అంతరాత్మకు ప్రతీక. ''నమః శివాయ'' మంత్రంలో అయిదు అక్షరాలుండడంచేత దీన్ని ''పంచాక్షరి మంత్రం'' అంటారు. సాంసారిక సుఖాలతో పాటు మోక్షాన్నికూడా ప్రసాదించగల శక్తి కలిగిన గొప్ప మంత్రం ఇది. సిద్ధుల యొక్క ముఖ్యమైన దీక్షామంత్రం ఇది.

కళ : ఒక చిన్న భాగం (అంశం): ఏ వస్తువులోనైనా 16వ భాగం. మానవ శరీరంలో 16 భాగాలున్నాయి: పంచ జ్ఞానేంద్రియాలు - పంచ కర్మేంద్రియాలు - పంచ ప్రాణాలు - మనస్సు.

కశ్మీరు శైవ మతం : శుద్ధ అద్వైతం. యావత్తు విశ్వం చిన్మయశక్తి యొక్క, చిత్‌శక్తియొక్క రూపమేనన్న సిద్ధాంతం. అరూపమైనది అప్రత్యక్షమైనది, విశ్వంగా ప్రత్యక్షమౌతున్నదన్నది కశ్మీరు శైవ సిద్ధాంతం. 'శివసూత్రాలు' అన్న సంస్కృత గ్రంథం దీనికి మూలం. దీనిలోని డెబ్బయి ఏడు సూత్రాలను శివుడు స్వయంగా ఋషి, వసుగుప్తాచార్యుడికి చెప్పినట్లు కథనం.

కాకభుశుండి : ప్రాచీన కాలపు ఋషి. శివుడి ఆగ్రహానికి గురై కాకిరూపం

ప్రధాన ఆసనాలను పేర్కొని ఉన్నారు. నాడులను శుభ్ర పరచి శరీరాన్ని శక్తివంతం చేసేందుకు ఉపయోగపడతాయి; ధ్యానానికి కూర్చునే చిన్నచాప, చిన్న కంబళి.

ఉమ : శివసతి: శక్తి యొక్క పేర్లలో ఒకటి. దీని అర్థం జ్యోతి. ఈ రూపం, శక్తికి లేదా శుద్ధ జ్ఞానానికి ప్రతీక.

ఏక్‌నాథ్‌మహారాజ్ : (1528-1609) జనార్దన స్వామి శిష్యుడు. మహారాష్ట్ర నివాసి. గృహస్థాశ్రమాన్ని నిర్వహిస్తూ తన చివరి రోజుల్లో పౌరాణిక గ్రంథాలకు టీకా తాత్పర్యాలను, ఆధ్యాత్మిక గ్రంథాలను రచించి భక్త కవిగా పేరు ప్రఖ్యాతులను పొందిన మహాపురుషుడు.

ఓం నమః శివాయ : మహామంత్రం, తారక మంత్రం. దీని అర్థం: శివుడికి నమస్కారం. శివుడు, అంతరాత్మకు ప్రతీక. ''నమః శివాయ'' మంత్రంలో అయిదు అక్షరాలుండడంచేత దీన్ని ''పంచాక్షరి మంత్రం'' అంటారు. సాంసారిక సుఖాలతో పాటు మోక్షాన్నికూడా ప్రసాదించగల శక్తి కలిగిన గొప్ప మంత్రం ఇది. సిద్ధుల యొక్క ముఖ్యమైన దీక్షామంత్రం ఇది.

కళ : ఒక చిన్న భాగం (అంశం): ఏ వస్తువులోనైనా 16వ భాగం. మానవ శరీరంలో 16 భాగాలున్నాయి: పంచ జ్ఞానేంద్రియాలు - పంచ కర్మేంద్రియాలు - పంచప్రాణాలు - మనస్సు.

కశ్మీరు శైవ మతం : శుద్ధ అద్వైతం. యావత్తు విశ్వం చిన్మయశక్తి యొక్క, చిత్‌శక్తియొక్క రూపమేనన్న సిద్ధాంతం. అరూపమైనది అప్రత్యక్షమైనది, విశ్వంగా ప్రత్యక్షమౌతున్నదన్నది కశ్మీరు శైవ సిద్ధాంతం. 'శివసూత్రాలు' అన్న సంస్కృత గ్రంథం దీనికి మూలం. దీనిలోని డెబ్భయి ఏడు సూత్రాలను శివుడు స్వయంగా ఋషి, వసుగుప్తాచార్యుడికి చెప్పినట్టు కథనం.

కాకభుశుండి : ప్రాచీన కాలపు ఋషి. శివుడి ఆగ్రహానికి గురై కాకిరూపం

గురు ఓం : గురుమంత్రం. దీని సహాయంతో అంతరాత్మను గురురూపంలో ధ్యానం చేస్తారు.

గురుకృప : గురువుయొక్క అనుగ్రహం చేత పరమాత్మ యొక్క శక్తి, శిష్యుడికి ప్రాప్తిస్తుంది. అదే గురుకృప.

గురుగీత : శివుడు, పార్వతికి సంవాదరూపంలో బోధించిన గురు తత్వం. గురువు – పరమాత్మ ఒకటే నన్న సిద్ధాంతం దీనిలో ప్రతిపాదితమై ఉంది. గురువు యొక్క భూమిక, గురువు యొక్క స్వరూపం, గురు – శిష్య సంబంధం, గురుధ్యానం – వీటిగురించిన వర్ణన ఉంది.

గురుభావం : గురువులో లీనమైన, గురువులో తన్మయమైన భావం.

గోరఖ్‌నాథ్ : 'నాథ్' సంప్రదాయానికి చెందిన తొమ్మండుగురు యోగులలో ఒకరు. అత్యద్భుతమైన శక్తికలిగిన ఈ సంప్రదాయానికి చెందిన గోరఖ్‌నాథ్, గహినినాథ్‌కు గురువు. జ్ఞానేశ్వర యోగికి అన్నగారు, గురువు కూడా అయిన నివృత్తి నాథుడికి దీక్ష నిచ్చిన గురువు, గహినినాథ్.

ఘృష్ణేశ్వర్ : మధ్య మహారాష్ట్రలో మహారాణి అహల్యాబాయి, 18వ శతాబ్దంలో నిర్మించిన ప్రసిద్ధమైన శివాలయం.

చక్రం : సూక్ష్మ శరీరంలోని శక్తికేంద్రాలు, తామరపువ్వును పోలి ఉంటాయి. సూక్ష్మరూపంలో ఉన్న మధ్యనాడి అయిన సుషుమ్నలో ఆరు చక్రాలున్నాయి. ఇవి జ్ఞాన కేంద్రాలు. శరీరంలోని అన్ని నాడుల్లోను క్రియలను నిర్వహించేది ఈ కేంద్రాలే. సుషుమ్నానాడి దిగువ భాగంలో ఉన్న మూలాధార చక్రంలో, కుండలిని, సర్పాకారంలో సుషుప్తావస్థలో స్థితమై ఉంటుంది. యౌగిక క్రియల వల్ల లేదా గురుకృప వల్ల ఇది జాగృతమైనపుడు, అన్ని చక్రాలను ఛేదిస్తూ సుషుమ్నా నాడిలో ఊర్ధ్వముఖంగా పయనించి చివరకు, అత్యంత ఉత్కృష్టమైన ఆధ్యాత్మిక కేంద్రం – సహస్రారంలోకి ప్రవేశిస్తుంది.

| | | |
|---|---|---|
| చిత్‌శక్తి | : | సర్వత్ర వ్యాపించి ఉన్న, పరమాత్మ యొక్క దివ్యమైన శక్తి, (''చితి''లో కూడా చూడుడు) |
| చితి | : | చిచ్ఛక్తి – కుండలిని శక్తి – కుండలిని – మహామాయ – పరాశక్తి – శక్తి, అని పర్యాయపదాలు. దివ్యమైన చైతన్యశక్తి, జగదంబగా కూడ వర్ణిస్తారు. భగవంతుడి సృజనాత్మక శక్తి. |
| చిదాకాశం | : | సహస్రారంలోను హృదయంలోను, చిచ్ఛక్తి సూక్ష్మ రూపంలో ఉండే స్థానం. దీన్ని 'చిత్తమండలం' అని కూడా వ్యవహరిస్తారు. |
| చిన్ముద్ర | : | బొటనవేలు – చూపుడు వేలు చివరలు ఒకదానితో మరొకటి కలిసి, మిగతా మూడు వ్రేళ్లు నిటారుగా ఉండే ముద్ర. ధ్యానసమయంలో ఆధ్యాత్మిక శక్తి బయటికి ప్రసరించకుండా ఈ ముద్ర ఆపుతుంది. |
| జనార్దనస్వామి | : | (1504-1575) మహారాష్ట్రకు చెందిన యోగి పుంగవుడు. దౌలతాబాద్‌ను పరిపాలించిన మహమ్మదీయరాజు ఒకరు ఆయన్ను తన సైన్యాధిపతిగా నియమించారు. సాంసారిక బాధ్యతలను వ్యవహారాలను నిర్వహిస్తూనే ఆయన భగవద్భక్తిలో లీనమై ఉండేవాడు. మహారాష్ట్రకే చెందిన ప్రముఖ భక్తకవి ఏక్‌నాథ్ మహారాజ్‌కు గురువు. |
| తంత్రం | : | భగవంతుడి ప్రేరణవల్ల ఉద్భవించిన పవిత్రగ్రంథాలు. శివ–పార్వతుల సంభాషణలరూపంలో ఉన్నవి, జ్ఞానం–ధ్యానం – గురుభక్తి – మోక్ష ప్రాప్తి వంటి విషయాల గురించి వివరించే గ్రంథాలు |
| తంత్రం | : | (మంత్ర – తంత్రాలు) ఒక రహస్యమయమైన ఉపాసన పద్ధతి. కర్మకాండ – మంత్రాలు – యంత్రాలతో శక్తిని జగదంబ రూపంలో పూజించే పద్ధతి. ఈ విధంగా ఉపాసన చేయడం వల్ల కుండలిని జాగృతమై శివ శక్తులు ఏకమై, మోక్షం ప్రాప్తించగలదని విశ్వాసం. |

తుకారామ్ : మహారాష్ట్రకు చెందిన ఒక గొప్ప భక్తకవి. సిద్ధలోకంలో నివసించే ఒక మహాపురుషుడు స్వప్నంలో ఈయనకు దీక్షనిస్తాడు. తుకారామ్ వేలాది అభంగాలను రచించారు. తమ సాధన దివ్యమైన అనుభవాలు – దీక్ష – భక్తి – భగవన్నామం గురించి వీటిలో వర్ణించారు.

తురీయాతీత : తురీయావస్థకు అవలి స్థితి. పరమ ఉల్లాసభరితమైన ఈ అవస్థలో ద్వైత భావం (ద్వంద్వం) పూర్తిగా తొలగిపోతుంది. అన్ని ప్రాణుల్లోను ఉన్న ఆత్మ ఒకటేనన్న భావం ఈ అవస్థలో కలుగుతుంది.

దీక్ష : గురువు శిష్యుడికి ఆధ్యాత్మికసాధన ప్రారంభంలో సాధారణంగా మంత్రోపదేశం చేసి ప్రదానం చేసే శిక్ష, లేదా సంకల్పం ద్వారా శిష్యుడికిచ్చే శిక్ష. సిద్ధయోగంలో దీని అర్థం, గురువు, శక్తి పాతం ద్వారా శిష్యుడిలో ఆధ్యాత్మిక శక్తిని మేల్కొల్పుట (సిద్ధయోగం – ''శక్తిపాతం''. కింద కూడా చూడుడు)

దౌలతాబాదుకోట : మధ్య మహారాష్ట్రలోని దక్కను పీఠభూమిలో హిందూ రాజులు 12వ శతాబ్దంలో నిర్మించినది. భక్తకవి ఏకనాథ్ మహారాజ్, గురు జనార్దన స్వామి శిష్యరికం చేసినది ఇక్కడనే.

నామదేవుడు : మహారాష్ట్రలోని పండరీపురానికి చెందిన భక్తకవి. గుడ్డలు కుట్టడం, కులవృత్తి. జ్ఞానేశ్వర మహారాజ్ సమకాలీనుడు. విఠల భగవానుడి భక్తుడు. భగవంతుడిని ప్రత్యక్షంగా చూచినవాడు కాని, విసోబా ఖేచర్ అన్న మహాపురుషుడి శిష్యుడయేవరకు భగవంతుడిని సర్వాంతర్యామి రూప లో చూడలేక పోయినవాడు. భగవన్నామ సంకీర్తన యొక్క మహిమను తెలుపుతూ ఆయన వేలాది భక్తిగీతా లను రచించారు.

పంచ ఆవరణలు : మానవశరీరంలోని ఆత్మయొక్క అయిదు ఆవరణలు : ప్రతి వ్యక్తిలోని చిచ్ఛక్తి యొక్క స్వరూప స్వభావాలకు ఈ అయిదు ఆవరణలే ఆధారం.

ఇవి :

1. అన్నమయకోశం : స్థూల తత్వాలతో నిర్మితమైన స్థూల శరీరానికి ఆధారమైన అన్న ఆవరణం.

2. ప్రాణమయకోశం: పంచ ప్రాణవాయువులు మరియు పంచ కర్మేంద్రియాలు, అనగా వాణి – చేతులు – కాళ్లు – మలద్వారం – యోని.

3. మనోమయకోశం : మనస్సు మరియు పంచ జ్ఞానేంద్రియాలు

4. ముప్ఫయి అరు తత్వాలు : కాశ్మీరు శైవమతాన్ని అనుసరించి అదృశ్యమైన పరమతత్వము ముప్ఫయి ఆరు రకాల అవస్థలను దాటి ప్రపంచంలో దృశ్య గోచరమవుతుంది.

5. విజ్ఞానమయ కోశం : బుద్ధి

6. ఆనందమయ కోశం : ఆనందావరణం

ప్రత్యభిజ్ఞా హృదయం : (అసలు అర్థం : స్మృతుల సహాయంతో కలిగే జ్ఞాన సంబంధమైన మతం యొక్క ముఖ్య అంగం) క్షేమ రాజు రచించిన 20 సూత్రాల గ్రంథం. దీనిలో కశ్మీరు శైవ మతానికి సంబంధించిన ప్రత్యభిజ్ఞ దర్శనం యొక్క సారం ఉంది. మానవుడు తన శరీరాన్నే ఆత్మగా భావించి, తన వాస్తవ స్వరూపాన్ని మరచిపోయినట్టు ఈ సిద్ధాంతం చెబుతుంది. మానవుడు తన నిజమైన స్వరూపాన్ని తెలుసుకోవడమే మోక్షమని అంటారు. స్వామి ముక్తా నంద ఈ సూత్రాలకు వ్యాఖ్యానం వ్రాశారు. ఈ పుస్తకం పేరు ''సిద్ధ మెడిటేషన్'' ('కశ్మీరు శైవమతం' కింద కూడా చూడుడు)

బగ్లాముఖి : (కొంగముఖం) శక్తియొక్క రూపాలలో ఒకటి.

బంధం : (బంధనం) హఠయోగక్రియలలో ఒకటి. ప్రాణాయామంతో పాటు, ప్రాణ అపానాలను సమన్వయ పరచడంలో ఈ క్రియ సహాయపడు తుంది. ఆసనాలను అభ్యాసం చేసే సమయంలో ప్రాణాన్ని శరీరంలోనే బంధించేందుకు కూడా ఈ

క్రియ సహాయ పడుతుంది. జాలంధర– మూల – ఉడ్డియాన అన్నవి మూడు ముఖ్యమైనవి.

బ్రహ్మ : ప్రపంచంలోని మూలతత్వం. ఉపనిషత్తుల్లో వేదాంత గ్రంథాల్లో బ్రహ్మ స్వరూప స్వభావాలగురించిన వర్ణన ఉంది. సత్తు (మూల తత్వము– జీవశక్తి) చిత్తు (పరమ జ్ఞానము) ఆనందము (పరమసంతోషం) ఈ మూటికలయిక బ్రహ్మమని ఉంది. ('సచ్చిదానందం' లో కూడా చూడుడు).

వేదాంతానికి చెందిన
ఆరు సంప్రదాయాలు: వేదాలు ఆధారభూతమైనవి

1. న్యాయ : గౌతమ ముని ప్రారంభించిన పద్ధతి తర్క- వితర్కాలు ఆధారంగా నిర్ణయించే పద్ధతి.

2. వైశేషిక : కణాద మహర్షి ప్రారంభించినది. జీవితానికి ఆధార భూతములైన తొమ్మిది తత్వాలను అర్థం చేసుకున్నపుడే సత్యం గోచరమౌతుందని ఈ పద్ధతి సిద్ధాంతం.

3. సాంఖ్య : కపిలముని ప్రారంభించిన పద్ధతి. యావత్ ప్రపంచం, రెండు పరమసత్యాల మీద ఆధారపడి ఉన్నట్టు చెబుతుంది ఈ పద్ధతి. ఇవి : పురుషుడు – ప్రకృతి.

4. యోగం : పతంజలి, తమ ''యోగసూత్రాలు''లో ప్రతిపాదించినది ఇది. అష్టాంగయోగం ద్వారా చిత్తాన్ని ఏకాగ్రం చేసి ఈశ్వరుడిలో లీనం (బ్రహ్మలీనం) కావడం ఈ పద్ధతి

5. పూర్వమీమాంస : జైమిని ముని రచించినది. వేదాలలో పేర్కొన్న కర్మ కాండను అనుసరించి మోక్షాన్ని పొందే విధానాన్ని దీనిలో ప్రతిపాదించారు.

6. ఉత్తరమీమాంస /
వేదాంతం : బాదరాయణ పరమ ఋషి ప్రతిపాదించిన పద్ధతి. ఆత్మ పరమాత్మ, ఒకటే నన్న సిద్ధాంతం.

భుజంగిని ముద్ర : హఠయోగంలో ఒక క్రియ. దీన్ని ''సర్ప-ముద్ర'' అంటారు. ఈ ముద్రలో శ్వాసను కంఠస్థానం నుంచి తీసు కుంటారు. దీనివల్ల ఉదరసంబంధమైన వ్యాధులు పోతాయి (''ముద్ర'' కింద కూడా చూడుడు)

మంత్రం : జగత్తుకు ఆధారమైన రహస్యమయమైన ధ్వనులు; శబ్దబ్రహ్మ; శక్తిపూరితమైన అక్షర సముదాయం; అటువంటి అక్షరసముదాయాన్ని జపించడం వల్ల లేదా మననం చేయడం వల్ల, ఆత్మదర్శనం లేదా కోరినవస్తువు లేదా కోరిన స్థితి లభిస్తుంది.

మండలేశ్వరుడు : ఒక ఆశ్రమానికి లేక ఒక మఠానికి అధిపతిగా ఉంటున్న గౌరవనీయుడైన సన్యాసికి ఇచ్చే బిరుదు. ఒక ప్రత్యేక ప్రాంతానికి చెందిన సన్యాసుల అధిపతి.

యోగశిక్షా ఉపనిషత్: యోగ సంబంధమైన ఉపనిషత్తుల్లో ఒకటి. దీనిలో జ్ఞాన మార్గం గురించి విపులంగా వర్ణితమై ఉంది. జ్ఞాన ప్రాప్తికి యోగం, ఏ విధంగా సహాయకారి అన్న విషయమై ఈ ఉపనిషత్తులో ఉంది.

ముప్పై ఆరు తత్వాలు : కశ్మీరు శైవ మతాన్ననుసరించి దృశ్యగోచరం కాని పరమ తత్వం, ముప్పై ఆరు మెట్లుగా ప్రపంచ రూపంలో ప్రకట మౌతుంది.

ముద్ర : (1) హఠయోగంలోని భిన్నమైన ప్రక్రియలు. వీటిని అభ్య సించడం వల్ల ప్రాణాన్ని శరీరంలో బంధించవచ్చు. అప్పుడు కుండలిని, సుషుమ్నలో ప్రసరించడం తప్పని సరి అవు తుంది. అప్పుడప్పుడు ఈ క్రియలు, శక్తిపాతంతో పాటే జరుగుతాయి (2) మన అంతరంగంలోని భావాలను వ్యక్తం చేసే హావ-భావాలు. భగవంతుడు ఋషులు మునులు మొదలైన వారు అభయాన్ని సూచించే ముద్ర.

మూలాధార చక్రం : ఈ చక్రం మేరుదండం అడుగు భాగంలో ఉంది. కుండ లిని ఇక్కడనే సర్పాకారంలో చుట్టుకుని ఉంటుంది.

కుండలిని, ఈ స్థానం నుంచే శారీరక క్రియలన్నిటిని, 72 కోట్ల నాడుల సహాయంతో నిర్వహిస్తుంటుంది.

యాజ్ఞవల్క్యముని : జనకమహారాజు గురువు. ''బృహదారణ్యక ఉపనిషత్'' అన్న కావ్యాన్ని రచించాడు.

రుద్రహృదయ ఉపనిషత్ : శైవ ఉపనిషత్తుల్లో ఒకటి. శివుడు - పరమాత్మ అభిన్నమన్న సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తుంది.

వసుగుప్తాచార్యుడు తొమ్మిదవ శతాబ్దంలో శివుడు స్వయంగా శివసూత్రాలను ఆయనకు చెప్పినట్టు ప్రతీతి.

విఠల : (ఇటుకలుండేచోటు) కృష్ణభగవానుడు ఒకసారి పుండలీకుడి ఇంటికి వెళ్లాడు. అప్పుడు పుండలీకుడు, వృద్ధులైన తన తలిదండ్రులకు సేవ చేస్తున్నాడు. కృష్ణుడిని చూచి ఆయనవైపు ఒక ఇటుకరాయిని నెట్టి, దానిమీద నిల్చుని ఉండమన్నాడు. ఇటుకరాయిపైన నిల్చుని ఉండే కృష్ణ భగవానుడిని విఠల నామంతో పిలుస్తారు. మహారాష్ట్రలోని ప్రసిద్ధ తీర్థయాత్రాస్థలమైన పండరి పురంలోని దేవాలయంలో శ్రీకృష్ణుడి విగ్రహం, ఈ రూపంలో ఉంది. మహారాష్ట్ర -కర్నాటకల్లో విఠల భక్తులు చాలా మంది ఉన్నారు

విశుద్ధ చక్రం : 'చక్రం' కింద చూడుడు.

శక్తి : (చితి - కుండలిని - కుండలిని శక్తి) బలం, శక్తి, విశ్వవ్యాప్తంగా ఉన్న దైవీశక్తి, సృష్టి - స్థితి - లయములను నిర్వహించే శక్తి, శివుడి అర్థాంగిని. 'చితి' 'కుండలిని' కింద కూడా చూడుడు.

శక్తిపాతం : గురువు, తన ఆధ్యాత్మిక శక్తిని, శిష్యుడిలోకి ప్రవేశ పెట్టుట: ఆధ్యాత్మిక శక్తిని జాగృతం చేయుట. సిద్ధగురువు తన కృపాకటాక్షం చేత తన శక్తిని శిష్యుడిలోనికి ప్రవేశ పెట్టుట; శిష్యుడిలోని కుండలిని శక్తిని మేల్కొల్పుట. ఈ ప్రక్రియ దృష్టి, స్పర్శ, శబ్దం లేదా సంకల్పంతో జరుగవచ్చు.

శబ్ద బ్రహ్మ : ఆది శబ్దమైన ఓం యావత్ సృష్టికే మూలం.

శరీరంలోని ఏడు
ముఖ్యమైన పదార్థాలు: రంగులేని ద్రవం, మాంసం, ఎముకలు, రక్తం, మజ్జ, వీర్యం, కొవ్వు.

శాండిల్యుడు : ప్రాచీన ఋషి. భక్తి గురించి 'శాండిల్య భక్తి సూత్రాలు' అన్న పుస్తకాన్ని రచించాడు.

శాంభవి ముద్ర : ధ్యానసమయంలో, కనులు, అంతర్ముఖమై, అర్ధ నిమీలితమైన స్థితి. పరమశివుడి స్థితి.

శివకవచం : శివుడికి పూజ్యమైన మంత్రాలు. వీటి మూలంగా శివుడి రక్షణ కలుగుతుంది.

శివదృష్టి : (శివుడి యొక్కచూపు) పదవశతాబ్దంలో సోమానంద శైవ మతం గురించి రచించిన గ్రంథం. ('కశ్మీరు శైవ మతం' కింద కూడ చూడుడు.)

శివ సంహిత : యోగం గురించిన ఒక సంస్కృత గ్రంథం. ప్రపంచానికీ మానవశరీరానికి మధ్య సమన్వయం గురించిన గ్రంథం. కుండలిని జాగృతమయేట్టు చేసే ఆసనాలు-ప్రాణాయామం-వంటివాటి అభ్యాసం గురించి తెలిపేగ్రంథం- ('కశ్మీరు శైవ మతం' కింద కూడా చూడుడు).

శివసూత్రాలు : ఒక సంస్కృత గ్రంథం. వీటిలోని సూత్రాలను శివుడు, స్వయంగా వసుగుప్తాచార్యుడికి బోధించినట్లు ప్రతీతి. ఈ గ్రంథంలో 77 సూత్రాలున్నాయి. కాశ్మీర్‌లో ఒక శిల మీద చెక్కి ఉన్నాయి. కాశ్మీరు శైవమతం గురించిన ప్రామాణిక గ్రంథం. ('కశ్మీరు శైవ మతం' కింద కూడా చూడుడు)

శైవమతం : శివుడిని పరమాత్మరూపంలో పూజించుమతం. సర్వత్ర వ్యాపించి ఉన్న శివుడే సత్యం యొక్క స్వరూపమన్నది ఈ మత సిద్ధాంతం. శుద్ధ అద్వైతం. ఒకే ఒక పరమోత్కృష్టమైన అద్వితీయమైన స్వతంత్రమైన చిచ్ఛక్తి వల్ల ఈ విశ్వం యొక్క

సృష్టి జరుగుతున్నట్టు ఈ మత సిద్ధాంతం. నానా ప్రకారాల రూపాలను ధరించి సృష్టి – స్థితి – లయలను నిర్వహిస్తున్నది ఈ చిచ్ఛక్తే నన్నది ఈ మతసిద్ధాంతం.

షట్‌చక్రాలు : మేరుదండంలోని ఆరు (సూక్ష్మ) శక్తి కేంద్రాలు: మూలాధారం, మణిపురం, స్వాధిష్ఠానం, అనాహతం, విశుద్ధం, ఆజ్ఞ. కుండలిని జాగృతమైనపుడు, ఈ చక్రాలన్నిటిని శుభ్రపరుస్తూ సహస్రారంలో, సహస్రదళ పద్మంలో ఉన్న పరమ శివుడిలో లీనమౌతుంది.

సచ్చిదానందం : పరమసత్యం యొక్క ప్రకృతి. సత్తు, చిత్తు – ఆనందంతో కూడినది; సత్, సర్వత్ర అన్ని వస్తువుల్లోనూ ఎల్లప్పుడూ వ్యాపించి ఉన్నది; చిత్, అన్ని వస్తువులను ప్రకాశింప చేసేది; ఆనందం పరమసుఖం; అనగా పరమాత్మ, ఈశ్వరుడు.

సత్‌సంగ్ : పౌరాణిక గ్రంథాల పఠనాన్ని వినుట; సామూహికంగా భగవన్నామ సంకీర్తన చేయుట; మహాపురుషుల దర్శనానికి సామూహికంగా వెళ్లుట; యోగులు భక్తుల సముదాయం.

సహస్రారం : బ్రహ్మరంధ్రంలో ఉన్న ముఖ్యమైన ఆధ్యాత్మిక కేంద్రం. సహస్రదళ పద్మం. ఇది, పరమగురువైన పరమశివుడి నివాసస్థానం. కుండలిని శక్తి, సహస్రారంలో శివుడిని కలుసుకున్నపుడు, యోగికి, ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది.

సంవిత్తు : జ్ఞానము, ప్రజ్ఞానము, సర్వసృష్టి కారకమైన, సర్వవ్యాపియైన చైతన్యం.

సిద్ధుడు : పూర్ణత్వం ప్రాప్తించిన యోగి. యోగాభ్యాసం లేదా తపః ద్వారా పరమాత్మతో ఐక్యమైన భావాన్ని పొందిన వ్యక్తి. ఆ సాక్షాత్కారాన్ని పొందిన వ్యక్తి.

సిద్ధయోగం : సద్గురువు యొక్క కృపాకటాక్షము చేత, కుండలిని జాగృతమైన తర్వాత స్వతహాగా జరిగే యోగం. మిగతా అన్ని

ప్రకారాల యోగసాధన మార్గాలు దీనిలో ఇమిడి ఉండుట చేత, దీన్ని మహాయోగమని కూడా అంటారు.

సిద్ధారూఢస్వామి : కర్నాటకలోని హుబళిలో నివసించిన మహాపురుషుడు. స్వామి ముక్తానంద, ఆయన ఆశ్రమంలో కొంతకాలం ఉన్నారు.

సిద్ధాసనం : (పూర్ణముద్ర) ధ్యానానికి కూర్చునే భంగిమ. నిటారుగా కూర్చుని ఒక కాలిమడిమను జననేంద్రియమునకును గుదమునకును మధ్య ఉన్న ప్రదేశమున ఆనించి, రెండవ కాలిమడిమను జననేంద్రియ మూలముపైన హత్తించి, కాలి చీలమండ లొకదానిపై మరొకటి ఆనించి ఉంచవలెను.

సిద్ధి : జప – తపాదులచేత లభించే అలౌకికమైన శక్తి. ముఖ్యమైన సిద్ధులు ఎనిమిది:

1. అణిమా – శరీరాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా చేయగల సామర్థ్యం. ఈ సిద్ధివల్ల, సూక్ష్మ జగత్తులో పయనించవచ్చు.

2. మహిమ – శరీరాన్ని పెంచి, పెద్ద ఆకారాన్ని చేసే సామర్థ్యం.

3. లఘిమ – శరీరాన్ని తేలికచేసే సామర్థ్యం

4. గరిమ – శరీరపు బరువును పెంచే సామర్థ్యం

5. ప్రాప్తి – అన్నిటినీ ప్రాప్తించుకో కలిగిన సామర్థ్యం.

6. ప్రాకమ్య – తన కోరికలను సాధించే సామర్థ్యం

7. ఈశత్వ – అన్ని వస్తువుల మీద ఆధిపత్యాన్ని సాధించే సామర్థ్యం.

8. వశిత్వ – అన్నిటినీ ఆకర్షించి, వశం చేసుకునే సామర్థ్యం.

సుతప : బ్రహ్మకు, సృష్టి కార్యంలో సహాయం చేసిన ఒక ప్రజాపతి

సుందరదాసు : (1596–1689) రాజస్థాన్‌లో నివసించిన భక్త – కవి.

సూరదాసు : చూపులేని భక్తకవి. బాలకృష్ణుడి భక్తుడు.

సుషుమ్న : శరీరంలోని 72 కోట్ల నాడుల్లో ముఖ్యమైన నాడి, మధ్య

నాడి. ఇది మేరుదండంలో, కింది నుంచి శిరస్సు వరకు వ్యాపించి ఉంది. ఆరుచక్రాలు, సుషుమ్నలోనే ఉన్నాయి. కుండలిని జాగృతమైన తర్వాత ఊర్ధ్వ ముఖంగా పయనించేది, ఈ చక్రాల ద్వారానే. ('చక్రాలు - కుండలిని' వీటి క్రిందకూడా చూడుడు.)

సోహం : ఆత్మయొక్క ప్రకృతిసిద్ధమైన స్పందనం. ప్రతి శ్వాస - నిశ్వాసలతో సహజంగా జరిగేది. అది అనుభవంలోకి వచ్చిన తర్వాతనే యోగికి జ్ఞానం కలుగుతుంది, ఆత్మ - పరమాత్మ ఒకటేనని. అప్పుడు ఆత్మ, పరమాత్మలో లీనమౌతుంది.

జ్ఞానేశ్వర మహారాజ్ : (1275-1296) మహారాష్ట్రకు చెందిన, శక్తి సంపన్నుడైన బాలయోగి. యోగుల కులంలో జన్మించిన ఈయనకు గురువు ఈయన జ్యేష్ఠసోదరుడైన నివృత్తి నాథుడు. ఈయన భగవద్గీతకు మరాఠీలో వ్యాఖ్యానం వ్రాశారు. జ్ఞానేశ్వరి అన్న ఈ గ్రంథం ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి చెందింది. ''అమృతానుభవం'' అన్న మరొక గ్రంథాన్ని, నూరుకుపైగా అభంగాలను రచించారు. సిద్ధ మార్గంలో కలిగే అనుభవాలను వీటిలో ఉల్లేఖించారు. ఇరవై ఒక్క సంవత్సరాల చిన్న వయసులోనే ఆయన ఆలందిలో జీవసమాధి పొందారు. ఆయన సమాధి మందిరం ఈనాడుకూడా వేలాది ముముక్షువులకు యాత్రాస్థలంగా ఉంది.

జ్ఞానేశ్వరి : (లేదా భావార్థదీపిక) జ్ఞానేశ్వరుడు, పదహారు సంవత్స రాల వయసులో భగవద్గీతకు, మరాఠీ భాషలో వ్రాసిన భాష్యం.

# కొన్ని ఇతర ప్రచురణలు

## ENGLISH

**SWAMI MUKTANANDA**

Play of Consciousness
From the Finite to the Infinite
I Am That
Ashram Dharma
Where Are You Going?
In the Company of a Siddha
I Have Become Alive
Mukteshwari
Reflections of the Self
The Perfect Relationship
Meditate
Light on the Path
Bhagawan Nityananda of Ganeshpuri

**SWAMI CHIDVILASANANDA**

The Yoga of Discipline
Enthusiasm
The Magic of the Heart
Inner Treasures
Kindle My Heart
Ashes at my Guru's Feet
Resonate with Stillness
My Lord Loves a Pure Heart

## హిందీ

చితిశక్తి విలాస్
సత్య్ కీ ఓర్
ధ్యాన్ సోపాన్
కుండలిని
అంతర్ శుద్ధికే సోపాన్
శిద్ధయోగ దీక్షా

వివరాలకు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఇంగ్లీషు భాషల్లోని పుస్తకాల జాబితాలకు ఈ చిరునామకు వ్రాయండి:

Chitshakti Book store,
Gurudev Siddha Peeth
P.O. Ganeshpuri,
District Thane,
Maharashtra - 401 206